# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్

పీయూషవర్షిణీవ్యాఖ్యయా

ఆంధ్రవివరణ సహిత

మానసోల్లాస సమలంకృతమ్

పీయూషవర్షిణీ :

శ్రీ శ్రీ శ్రీ జగద్గురు

శ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు

శ్రీమదభినవోద్దండ విద్యానృసింహ

భారతీస్వామివారు

ప్రకాశకులు :

శ్రీ పుష్పగిరి మహాసంస్థానము,

పుష్పగిరి.

# SRI DAKSHINAMURTY STOTRA PEEYUSHA VARSHINI

కాపీలు 1000

సర్వస్వామ్య సంకలితము

మూల్యము : 60-00



ప్రజాపతి జ్యేష్ఠము

1991

ప్రాప్తిస్థానము :

శ్రీ అక్కపెద్ది బాలగోపాల్ గారు
D. No. 19-3-8
మల్లాదివారి వీధి
ముత్తిశెట్టివారిపాలెం
తెనాలి - 522201

---

ముద్రణ : విజయశ్రీ ప్రింటర్సు, తెనాలి.

# ప్రాస్తావికము

"చిద్ఘనాయ మహేశాయ వటమూలనివాసినే ।
సచ్చిదానన్దరూపాయ దక్షిణామూర్తయే నమః ॥"

శ్రీ శంకర భగవత్పాదులు శంకరావతారపురుషులు. అపౌరుషేయ శ్రుతిప్రతిపాదితములైన కర్మ, ఉపాసనా, జ్ఞానకాండలను సువ్యవస్థిత మొనర్చిన మహామనీషులు, షణ్మత స్థాపనాచార్యవర్యులు. ఔపనిషదమైన యద్వైత సిద్ధాంతమును సర్వశ్రుతిసమన్వయ పురఃసరముగా ప్రతిష్ఠాపించిన బ్రహ్మాత్మైక్యానుభూతినిష్ఠులు.

శ్రీ జగద్గురు శంకర భగవత్పాదులు ప్రస్థానత్రయమునకు భాష్యప్రణయనము చేయుటయే గాక, సనత్సుజాతీయమునకు, విష్ణుసహస్రనామ స్తోత్రమునకు భాష్యరచన గావించి యున్నారు. మంద, మధ్యమాధికారుల ననుగ్రహింపవలయు నను మహాకృపతో నెన్నియో ప్రకరణ గ్రంథములను అనేకానేక స్తోత్రములను రచించి, ముముక్షువులకు మహోపకృతి యొనర్చిరి.

శ్రీ శంకర భగవత్పాదకృతములైన స్తోత్రము లన్నియు నాణిముత్యములే. వానిలో శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము అనర్ఘమైన మణి యనుటలో సందియము లేదు.

శ్రీ ఆదిశంకరులు ఈ స్తోత్రమును గురు-ఈశ్వర-ఆత్మైక్య బోధకముగా రచించి "తత్త్వమసి" మహావాక్యము నందలి 'తత్' 'త్వమ్' పదార్థములను లెస్సగ నిరూపించి, సాధకులకు బ్రహ్మాత్మైక్యానుసంధాన మార్గమును సుగమము చేసిరి. ఈ స్తోత్రము, అద్వయబ్రహ్మాత్మబోధకము, గభీరార్థస్ఫోరకము నగుటచే శ్రీ శంకరుల యంతేవాసివర్యులు, వార్తికకారులునైన శ్రీ సురేశ్వరాచార్యులవారు ప్రత్యేకముగ నీ స్తోత్రరాజమునకు "మానసోల్లాసము" అను పేరుతో నొక చక్కని వార్తికమును రచించి యున్నారు. ఈ మానసోల్లాసమునకు శ్రీరామతీర్థయతి 'వృత్తాన్త' మను పేరుతో మహాగంభీరమైన వ్యాఖ్యను రచించిరి.

శ్రీ ప్రకాశయతి "లఘుతత్త్వసుధ" యను పేరుతో ఏతత్ స్తోత్రశ్లోక భావాభివ్యంజకమైన వ్యాఖ్యను రచించిరి. ఈ స్తోత్రము శ్రీ శంకరాచార్యకృత స్తోత్రములలో శిఖరాయమాణ మగుటచే నేటికిని, వేదాన్తభాష్యప్రవచనమునకు పూర్వము, అనంతరము ఈ దక్షిణామూర్తిస్తోత్రమును పఠించుట అనూచాన సంప్రదాయముగ వచ్చుచున్నది.

శ్రీశ్రీశ్రీ పుష్పగిరి పీఠాధీశ్వరులు శ్రీమదభినవోద్దండ విద్యానృసింహభారతీ శ్రీ చరణులు బహుకాలము క్రిందట పుష్పగిరిలో, చాతుర్మాస్య వ్రత దీక్షితులై యుండిరి. అనుష్ఠాన పూజాదుల యనంతరము అద్వైత బ్రహ్మతత్త్వ మననవ్యాజముతో మానసోల్లాస సహితమైన శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునకు శ్రీ ప్రకాశయతి, శ్రీ రామతీర్థయతికృత వ్యాఖ్యానుసారముగ ఆంధ్ర వివరణమును వ్రాయ మొదలిడిరి. ఆ లేఖన కార్యమును తరువాత కొంతకాలమునకు పూర్తిచేసిరి. కాని, శ్రీవారు సహజ విరాగులు, కార్యాంతరవ్యగ్రులు నగుటచేత ఆ గ్రంథవిషయమును పట్టించు కొనక పోయిరి. వ్రాసి, బహుకాల మగుటచే పత్రములు జీర్ణములై విశీర్ణములైనవి. ఎడనెడ, క్రిమిదష్టములు గూడ నైనవి.

ఇట్టి ప్రాచీన, శిథిల పత్రసంపుటమైన యీ గ్రంథమును తెనాలి వాస్తవ్యులు, జగద్గురువుల ప్రియశిష్యులునైన బ్రహ్మశ్రీ అక్కపెద్ది బాలగోపాల్ గారు, శ్రీవారి యామోదము నొంది, వెలుగులోనికి తీసికొనిరావలయు నని దృఢముగా సంకల్పించిరి. వారి సంకల్పఫలమే యీ గ్రంథరాజము. శ్రీ భవానీచంద్ర మౌళీశ్వరులు సదా శ్రీ బాలగోపాల్‌గారిని యనుగ్రహింతురు గాక.

ఈ జీర్ణ గ్రంథమును పునరుద్ధరింపవలసి యున్నది. క్రిమిదష్ట భాగములను పూరించి సంశోధింపవలసి యున్నది. శ్రీ చరణుల యాదేశముతో ఈ పూరణ, సంశోధన, ముద్రణ భారమును శ్రీ జగద్గురు పుష్పగిరి శ్రీ శంకరుల ప్రియాంతేవాసులు బ్రహ్మశ్రీ

జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నిర్వహింపబూనుకొనిరి. ఈ కార్యమునందు శ్రీ శాస్త్రిగారికి శ్రీ పుష్పగిరి శ్రీ చరణుల ప్రియాంతేవాసులు బ్రహ్మశ్రీ హరివెంకటేశ్వరశర్మ గారు చేదోడు వాదోడుగ నుండి, యీ గ్రంథము సర్వాంగసుందరముగ రూపు దిద్దుకొనుటలో నెంతయో సహకరించిరి. శ్రీ జగద్గురుభక్తవర్యులు, విద్యావినయ సంపన్నులునయిన యీ మహాశయులను మాయాశబలిత చైతన్యము ఆత్మగుణసంపదతో వర్ధిల్లునట్లు అనుగ్రహించుగాక!

శ్రీవారి యంతేవాసివర్యులు, శ్రీ పుష్పగిరి మహాసంస్థాన గౌరవ విద్వాంసులు, సర్వతంత్ర స్వతంత్రులు నగు బ్రహ్మశ్రీ హరి సాంబశివశాస్త్రిగారు ఈ గ్రంథమునకు గీర్వాణభాషలో ప్రజ్ఞా పరిచాయకమైన 'భూమికా' రచన చేసిరి.

'బ్రహ్మవిద్యాలంకార' బ్రహ్మశ్రీ సూరి రామకోటిశాస్త్రిగారు తమ 'శుభాశంసనము'తో శ్రీ పుష్పగిరి శంకరకృత గ్రంథప్రస్తుతిని పైయుష్యస్ఫోరకముగ, స్తోత్రతత్త్వాభివ్యంజకముగ జేసిరి.

శ్రీచరణులకు అత్యంత ప్రేమాస్పదులు, ప్రియాంతేవాసులు, ప్రతిభా సంపన్నులు నైన బ్రహ్మశ్రీ హరి లక్ష్మీనరసింహ శర్మగారు ఈ గ్రంథమును సింహావలోకనముతో నవలోకిత మొనర్చిరి.

ఈ విద్వన్మూర్ధన్యులు శ్రీ శారదా చంద్రమౌళీశ్వరానుగ్రహముచే బ్రాహ్మీశ్రీ సంపన్నులై సదా వెలుగొందుదురుగాక!

ఈ గ్రంథము నింత నయనాభిరామముగ ముద్రించి యిచ్చిన విజయశ్రీ ప్రెంటర్సు తెనాలి, ప్రొప్రయిటరు శ్రీ ఎ. విజయ్‌గారికి, వారి కార్యకర్తలకు-

అట్లే, అందముగా బైండు చేసియిచ్చిన శ్రీ బి. వెంకటేశ్వర్లుగారికి శ్రీ శారదా చంద్రమౌళీశ్వరుల యనుగ్రహము నిరంతరము లభించుగాత !

అధ్యాత్మజిజ్ఞాసువులైన పాఠక మహాశయులు ఏతత్ స్తోత్ర తత్త్వ మనన, ధ్యానాదులచే బ్రహ్మాత్మైక్యానుభూతి నొంది, సర్వదా అద్వయ బ్రహ్మానందమును బడయుదురు గాక !

పుష్పగిరి
1-7-1991

ఇట్లు
శ్రీ పుష్పగిరి మహా సంస్థానము



"ఉపాసతే యం మునయః శుకాద్యాః
నిరాశిషో నిర్మమతాధివాసాః ।

తం దక్షిణామూర్తితనుం మహేశ
ముపాస్మహే మోహమహార్తిశాంత్యై ॥"



H.H. Jagadguru Shankaracharya of Pushpagiri Peetam

Sri Sri Sri VIDYA NRUSIMHA BHARATHI

"ప్రపంచో యది వక్తవ్యః సోఽపి శబ్దవివర్జితః ।
ఇతి వా తద్భవే న్మౌనం సతాం సహజసంజ్ఞితమ్ ॥"

—అపరోక్షానుభూతిః

సదితి వా అసదితి వా సదసదితి వా నిర్వక్తు మశక్యత్వాత్ అనిర్వచనీయః ప్రపంచోఽపి శబ్దవివర్జితః । తత్ర వాచో మూకీభవన్తి - ఏతదపి మౌనం భవేత్- ఏతత్ ఖలు మౌనం సతాం సహజ మిత్యర్థః ।

అత్రాపి వాచో ముఖ్యయా గౌణ్యా వా వృత్త్యా లోకవ్యవహార మనురుధ్య గిరి నదీ సముద్రాదికం బోధయన్త్యః లక్షణయా బ్రహ్మ ప్రతిపాదయన్తి । తత్త్వతః స్పష్ట శ్చాయ మర్థః శ్రీ రుద్రభాష్యాదిషు । ఏవం జగతో బ్రహ్మణ్యధ్యస్తత్వం చ మౌనవ్యాఖ్యా ఇతి స్థితమ్ ।

అత్ర స్తోత్రేఽపి 'విశ్వం దర్పణేతి' ప్రథమ శ్లోకేన విశ్వస్య మాయయా ఆత్మని అధ్యస్తత్వం, తథా సర్వార్థద్రష్టృత్వేనోపలక్షిత శ్చిదాత్మత్వం పదార్థ ఇతి చ వర్ణితమ్ ।

"అసతః స జ్జాయత" ఇతి మాధ్యమికాః, "సతః అస దితి" న్యాయ వైశేషికాః "సతః సది"తి చ సాంఖ్యాః- ఇతి తత్తద్వాద నిరసనాయ ద్వితీయః శ్లోకః ప్రస్తుతః. "అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని అవ్యక్త నిధనాని చ ।" విశ్వం స్వమాయయా విజృంభయన్ సర్వానుస్యూతత్వేన ఉపలక్షిత శ్చిదాత్మా త్వం పదార్థ ఇతి ద్వితీయ శ్లోకార్థః ।

తృతీయే శ్లోకే తత్త్వంపదార్థైక్య వాక్యార్థః ప్రకాశితః । త దేవం తత్త్వంపదార్థ సంశోధనపూర్వక జీవబ్రహ్మైక్యరూపః సర్వవేదాన్త సమన్వయో వాక్యార్థః త్రిభిః శ్లోకైః ప్రదర్శితః ।

అథ పూర్వోక్త మేవార్థం దృఢీకర్తుం తస్మిన్ బ్రహ్మాత్మాద్వైతే వాదివిప్రతిపత్తి నిరాసాయ చ ఉత్తర శ్లోకత్రయం ప్రవృత్తమ్। తత్ర ప్రత్యభిజ్ఞాబలా చాత్మనః స్థాయిత్వం ప్రపంచితమ్ ।

సప్తమే ప్రత్యభిజ్ఞాయాః స్వరూపం ప్రయోజనం ప్రామాణికత్వం చ వ్యవస్థాపితమ్ ।

కార్యకారణ స్వస్వామిభావాది సంబంధాః మాయాకల్పితాః । మాయాయా లక్షణం బంధమోక్షవ్యవస్థా, తథా కార్యకారణభేదాతీతం పురుషోత్తమలక్షణం చేత్యేతే విషయా అష్టమే నిరూపితాః ।

అనుమేయేషు విషయేషు నారోహతి క్షిప్తం మనః । అతః ప్రత్యక్షేణోపలభ్యమానాసు ఈశ్వరస్య అష్టమూర్తిషు సర్వాత్మభావనాం విదధాతి గురు శ్శంకరాచార్యః ।

కించ తస్యాస్య స్తోత్రస్య శ్రవణా న్మననా ద్ధ్యానాత్ సంకీర్తనాచ్చ ఈశ్వరత్వం స్వతో భవతీతి ఫలశ్రుతినిర్దేశా దుపనిషత్కల్ప మిదం స్తోత్ర మితి సూచ్యతే ।

తదేవం పరమపురుషార్థప్రయోజనస్య సవార్తికస్యాస్య స్తోత్రస్య జగద్గురుభిః శ్రీశ్రీశ్రీ పుష్పగిరిపీఠాధీశ్వరైః శ్రీమదభినవోద్దండ విద్యానృసింహభారతీస్వామిభిః ప్రణీతం ఆంధ్రతాత్పర్య వివరణం జిజ్ఞాసూనాం సాధకానాం కరదీపికేవ సమ్యగ్విషయప్రకాశినీ భవతి। యద్యప్యస్య స్తోత్రస్య తాత్పర్యవివరణాని ఆంధ్రేషు తత్ర తత్ర ప్రకాశితాని, తథాపి తానీదానీం ప్రాయశః దుష్ప్రాప్యాని। ప్రసన్నగంభీరం చేదం వివరణం శ్రీ శంకర హృదయం సమ్యగావిష్కరోతి। ధర్మప్రబోధాయ చావిరళం దేశే దేశే పర్యటన్తోఽపి శ్రీ స్వామిచరణాః సాధకానుగ్రహబుద్ధ్యా చేదం వివరణం ఆంధ్ర్యాం ప్రణిన్యు రితి మహా దిదం ప్రమోదస్థానమ్ ।

గ్రంథ మిమం సంశోధ్య పరిష్కృత్య గ్రంథస్యాస్య ముద్రణాది కార్యభారం చ వహన్తః శ్రీచరణాన్తేవాసినః శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్య శాస్త్రిణః నితరా మభినందనీయాః । శాస్త్రేషు కృతశ్రమాః బహుగ్రంథ నిర్మాతార ఏతే ఆంధ్రేషు పాఠకలోకస్య సుపరిచితాః । పితృపరంపరా ప్రాప్త శాస్త్రీయ సంప్రదాయపథే చరన్తః ఏతే శ్రీ సద్గురుచరణానాం కృపయా వర్ధన్తాంతరామ్ ।

ఆత్మేశ్వరో గురుశ్చాపి దక్షిణాశాముఖప్రభుః ।
శేముషీం దక్షిణాం దద్యా దాత్మలాభాయ శాస్త్రయోః ॥

హైదరాబాద్,
28-5-91

హరి సాంబశివ శాస్త్రి

శ్రీ గురుభ్యోనమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# శుభాశంసనమ్

"బ్రహ్మవిద్యాలంకార"
బ్రహ్మశ్రీ సూరి రామకోటిశాస్త్రిగారు

వేదాన్త శాస్త్రము ఉపనిషత్ప్రస్థానము, సూత్రప్రస్థానము, గీతా ప్రస్థానము అను ప్రస్థానత్రయముతో పరిఢవిల్లుచున్నది. శ్రీ శంకర భగవత్పాదులు ఈ మూడు ప్రస్థానములకు తత్త్వజిజ్ఞాసువుల నను గ్రహించుటకై భాష్యములను రచించినారు. మంద మధ్యమాధికారుల నుద్దేశించి కొన్ని ప్రకరణగ్రంథములను, స్తోత్రగ్రంథములను అను గ్రహించిరి. అందు, శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము ఆత్మతత్త్వమును స్పష్ట ముగా తెలియజేయుచు వేదాన్తశాస్త్రసారముగా నొప్పియున్నది. వేదాన్త శాస్త్రమునకు జీవబ్రహ్మైక్యము విషయము. ప్రత్యగాత్మను అనాత్మ పదార్థములనుండి వేఱుచేసి, బ్రహ్మస్వరూపముగా తెలిసికొనుట, సంసార దుఃఖనివృత్తి, నిరతిశయ ఆనందావాప్తి ప్రయోజనము అగుటచే ఈ శ్రీదక్షిణామూర్తి స్తోత్రమునకు గూడ, నవియే విషయ ప్రయోజనములై యున్నవి.

ఇందు "తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా మూర్తయే" యని శ్రీ జగద్గురువు, సర్వవిద్యానిధి, శ్రీ దక్షిణామూర్తి దేవుడు (పరమేశ్వరుడు) స్తుతింపబడుచున్నాడు. శ్రీ దక్షిణామూర్తి పరమేశ్వరావతారము, వటమూలవాసి, మౌనవ్యాఖ్యతో బ్రహ్మనిష్ఠులగు మహర్షులకు బ్రహ్మతత్త్వమును ఉపదేశించి సంశయములను దీర్చిన మహానుభావుడు, నిత్య యౌవనుడు, ఆనందమూర్తి, ఆత్మారాముడు.

శ్రీ శంకరభగవత్పాదులు ఉపనిషత్తులకు అద్వయ ఆత్మ తత్త్వమును ప్రతిపాదించుటయందే తాత్పర్యము అను విషయమును ఇందు వివరించిరి. ప్రత్యగభిన్న నిర్విశేష పరబ్రహ్మయందే శాస్త్రమునకు పరమ తాత్పర్యమనియు ఈశ్వరోపాసన, గురుభక్తి, యోగము ఈ బ్రహ్మ విద్యకు అంగములనియు నుపదేశించిరి.

శ్రీ శంకరులకు పద్మపాదుడు, హస్తామలకుడు, తోటకాచార్యుడు, సురేశ్వరులు అను ముఖ్యశిష్యులు గురుపూజాసందర్భమున ఆచార్య పంచకములో పేర్కొనబడుచున్నారు. వారిలో పద్మపాదుడు నృసింహో పాసకుడు. పంచపాదికాగ్రన్థకర్త. హస్తామలకుడు చేతిలోని ఉసిరిక పండును వలె తత్త్వమును దర్శించినవాడు. శ్రీ హస్తామలకునిచే రచింప బడిన 'హస్తామలకీయము' అను వేదాన్త సంగ్రహగ్రన్థము కలదు. తోటక వృత్తముతో గురుభక్తిని, వేదాన్త తత్త్వమును వెలువరించుచు ఎనిమిది శ్లోకములను 'భవశఙ్కరదేశిక మే శరణమ్' అను మకుటముతో తోటకాచార్యులు రచించిరి. ఇక సురేశ్వరులు వృద్ధులు, వార్తికకార నామ ముతో ప్రసిద్ధులు. అద్వైత తత్త్వమును బోధించుటకు శ్రీ పద్మపాదా చార్యులు బింబప్రతిబింబవాదమును స్వీకరింపగా, శ్రీ సురేశ్వరులు ఆభాస వాదమును స్వీకరించిరి. చిదాభాసుడు జీవుడు, సంసారి, వ్యావహారికుడు కూటస్థుడు ఈ ఆభాసునకు అధిష్ఠానము. కూటస్థుని ద్వారా జీవునకు బ్రహ్మైక్యము, వీరికి అభిమతము.

శ్రీ సురేశ్వరులు కృష్ణయజుర్వేదీయ తైత్తిరీయోపనిషద్ భాష్యము నకును, శుక్లయజుర్వేదీయ బృహదారణ్యకోపనిషద్భాష్యమునకును వార్తిక గ్రంథములను రచించిరి. ఈ వార్తిక గ్రంధములు సమగ్రమైనవి. ఈ సురేశ్వరులే 'మానసోల్లాసము' అను నామముతో శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునకు వార్తికమును రచించినారు. ఈ వార్తికమునందు 'విశ్వం దర్పణ .......' అను మొదటి స్తోత్రపద్యమునకు ముప్పది శ్లోకములు

వ్యాఖ్యానరూపముతో ప్రవృత్తములైనవి. ఇది మొదటి ఉల్లాసము. 'బీజస్యాన్తః' — అను రెండవ స్తోత్రపద్యమునకు నేబదియారు శ్లోకములు వ్యాఖ్యానరూపములు. ఇది రెండవ ఉల్లాసము. 'యస్యైవ స్ఫురణమ్ -' అను మూడవ శ్లోకమునకు ముప్పదితొమ్మిది శ్లోకములు మూడవ ఉల్లాసము. 'నానాచ్ఛిద్రఘట' - యను నాల్గవ స్తోత్రమునకు ముప్పదియారు శ్లోకముల వార్తిక గ్రంథము రచించిరి. 'దేహం ప్రాణమపి-' యను ఐదవ శ్లోకమునకు ముప్పదియైదు శ్లోకములు వ్యాఖ్యానరూప పంచమోల్లాసము. 'రాహుగ్రస్త -' యను ఆరవ స్తోత్రపద్యమునకు ముప్పదిరెండు శ్లోకములు వ్యాఖ్యానరూపము ఆరవ ఉల్లాసము. 'బాల్యాదిష్వపి -' యను ఏడవ శ్లోకమునకు ముప్పదిమూడు శ్లోకములు వార్తిక గ్రంథము. ఇది సప్తమోల్లాసము. తరువాత 'విశ్వంపశ్యతి-' యను స్తోత్రపద్యమునకు ఇరువదితొమ్మిది శ్లోకములు వార్తికము, ఇది అష్టమోల్లాసము. 'భూరంభాంసి -' యను స్తోత్రమునకు నలుబది తొమ్మిది శ్లోకములు వార్తికగ్రంథము. ఇది నవమోల్లాసము. 'సర్వాత్మత్వమ్ -' అను పదవ శ్లోకము ఫలశ్రుతి. ఈ శ్లోకమునకు 'తస్మై శ్రీగురుమూర్తయే -' అను మకుటము లేదు. ఈ స్తోత్రపద్యమునకు ఇరువది[illegible] శ్లోకములు వ్యాఖ్యానరూపముగా ప్రవృత్తములైనవి. ఇది దశమోల్లాసము. ఈ విధముగా శ్రీమచ్ఛంకర భగవత్పాద విరచిత శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునకు శ్రీ సురేశ్వరులు 'మానసోల్లాసము' అను నామముతో పది ఉల్లాసముల వార్తికగ్రంథమును భావార్థస్ఫోరకముగా వేదాన్తశాస్త్రవిషయ సంభరితముగా వివరించిరి.

'అనుక్త దురుక్త చిన్తాకరం వాక్యం వార్తికమ్' అని వార్తిక సామాన్యలక్షణము. కాని యిచట దురుక్తాంశముతో ప్రమేయము లేదు. ఒకవేళ లక్షణములోని ఆ యంశమును గూడ సమన్వయము చేసికొన దలంచినచో కష్టముగా చెప్పబడిన విషయమును సులభముగా గ్రాహ్య

మగునటుల చేయుట దురుక్తచింతగా సరిపెట్టుకొనవచ్చును. అనుక్త చింతలో భాష్యకారులు చెప్పని యనేక విషయములను గైకొని సిద్ధాన్తస్థాపన మొనర్చుట ఇందు స్పష్టముగా కానవగును. భాష్యవచనమే ప్రమాణ భూతముగా శ్రీసురేశ్వరులచే శిరసావహింపబడినది. దోషచింతన ప్రసక్తి లేదు.

ఈ మానసోల్లాస సమలంకృత శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునకు తత్త్వజిజ్ఞాసువులగు ఆంధ్ర మహాజనుల మానసోల్లాసమునకై శ్రీ దక్షిణా మూర్తిదేవానుగ్రహముతో అధ్యాత్మ జ్ఞాన సంపద విస్తరించుటకై ఆంధ్ర వివరణము 'పీయూషవర్షిణి'యను నామముతో ప్రకాశిత మగుచున్నది. ఈ గ్రంథమునందు గల విశేషములు ఈ విధముగా భావనీయములు.

'తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే' ఇది ఈ స్తోత్రమునకు మకుటము. పరమేశ్వరావతారమగు దక్షిణామూర్తి, గురుమూర్తిగా పేర్కొనబడినాడు. తత్త్వోపదేష్ట యగు గురువునకు, దక్షిణామూర్తికి అభేదము వివక్షితము ఇచట 'ఇదం నమః' ఇదిగో, నమస్కారము అని చెప్పబడుచున్నది. ఇచట నమస్కారము ప్రహ్వీ భావముతో ఆత్మసమర్పణరూపము. అనగా అభేదానుసంధానము. ఈ విధముగా పరమేశ్వరునకును,గురువునకును,ఆత్మకును వ్యావహారిక మూర్తి భేదము ఉన్నను, ఏకతత్త్వరూపము ఉగ్గడింపబడినది.

శ్రీ దక్షిణామూర్తి, పరమేశ్వరావతారము. అనిర్వచనీయమగు తన మాయాశక్తిచే స్వప్రకాశ చిదేకతానమగు స్వస్వరూపమునందే స్థావర జఙ్గమాత్మకము అగు సమస్త ప్రపఞ్చమును అద్దమునందు నగరమును వలె చూచుచు ఉపాధినిర్ముక్త స్వరూపప్రబోధసమయమున అద్వయ చిదాత్మగా వెలుగొందుచున్నాడు.

జ్ఞానోపదేష్ట యగు గురువు, మహావాక్యజన్య బ్రహ్మాత్మాపరోక్ష సాక్షాత్కారము వలన, అజ్ఞానము నివర్తింపగా ఉపాధ్యభిమానమును వీడి అద్వయ చిన్మాత్ర-ఆత్మస్వరూపానుభూతిని పొందుచున్నాడు.

స్వప్నద్రష్ట యగు ఆత్మ, నిద్రవలన బాహ్యమువలె ఉన్న ప్రపఞ్చమును చూచుచున్నను, మెలకువ వచ్చినంతనే తాను ఒక్కడే మిగిలి యున్నట్లు కనుగొనుచున్నాడు.

ఆ స్వప్నసాక్షి యగు ఆత్మ, గురువు, ఈశ్వరుడు ఒకే తత్త్వము అను అర్థము ఈ శ్లోకమున ప్రతిపాదింపబడినది.

'విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యమ్' అని చెప్పుట వలన ద్వైతప్రపఞ్చము మిథ్యాభూతము అనియు వర్ణింపబడినది.

వివేచనమున కాదే ఆత్మ తన స్వతఃసత్తాప్రకాశములతో మాయాశక్తి ద్వారా సృష్టి, స్థితి, జగత్సంహారములకు కారణము అగుచున్నాడు.

ఈ దక్షిణామూర్తి స్తోత్రమునందు 'విశ్వందర్పణ'- అను మొదటి శ్లోకము వేదాన్తతత్త్వ ప్రతిపాదకముగా నిబద్ధమైనది. మానసోల్లాసమున ఇట్లు పరమేశ్వరుడు తన మాయాశక్తిచే తనయందు ఈ విశ్వమును తన స్వరూపమునందే వెలుపల ప్రకటమైనట్లు గాంచుచు వ్యవహరించుచున్నను మాయోపాధివినిర్ముక్త స్వస్వరూప ప్రబోధసమయమున ద్వైతప్రపంచము వాస్తవముగా లేని కేవల జ్ఞానానన్దస్వరూపానుభూతిలో నుండును. లోకమున నిద్రించిన పురుషుడు స్వప్నములో వాసనామయ ద్వైతప్రపంచమును తన స్వరూపమునందే బాహ్యముగా ప్రకటమైనట్లు చూచినను మెలకువ వచ్చుట తోడనే, ఆ స్వప్నద్వైతప్రపంచము మటు మాయమై తాను ఒక్కడే మిగిలినట్లు కనుగొనుచున్నాడు కదా! ఇట్లే, వేదాన్తమహావాక్యముల వలన బ్రహ్మాత్మైక్య అపరోక్షసాక్షాత్కారము కలిగినప్పుడు అవిద్యా (అజ్ఞానము) తత్కార్యవ్యావహారిక ద్వైతప్రపంచము బాధితము కాగా, అఖండ సచ్చిదానన్ద

బ్రహ్మాద్వైత అనుభూతి కలుగుచున్నది. ఈ యనుభూతి నుపదేశించు గురువు దక్షిణామూర్తిస్వరూపుడై యున్నాడు అని చెప్పబడినది

విశ్వమ్ అనగా భోగ్యప్రపంచము, మాయాశక్తిచే సుస్ఫురితమైనది యని చెప్పుటవలన వివర్తవాదము నాశ్రయించి జగత్తునకు అసత్యత్వము (మిథ్యాత్వము), కల్పితత్వము ప్రస్థింపబడినవి. ఈశ్వరుడే జగత్తుగా భాసించుచున్నాడు అనుటలో ఈశ్వరుని సత్తాప్రకాశములే జగత్తునందు భాసించుటచే జగత్తు ఉన్నది, ప్రకాశించుచున్నది అను లోకవ్యవహారము సమర్థింపబడినది. దేహేన్ద్రియాద్యుపాధ్యభిమానమువలన ఆత్మయందు జీవత్వము ఏర్పడుచున్నది. చిద్రూపమగు ఆత్మయందే అనిర్వచనీయ మాయోపాధిచే ఈశ్వరత్వము, జీవత్వము ఏర్పడినందున, ఇరువురును ఏకాత్మస్వరూపులేయై యున్నారు. అయినను ఈశ్వరుడు శుద్ధోపాధిచే స్వరూపస్మృతిప్రబోధము కలిగి ఉన్నాడు. జీవుడు స్వరూపవిస్మృతి కలిగినందున, వేదాన్తవాక్యశ్రవణ మనన నిదిధ్యాస సాధనచే స్వరూపప్రబోధమును స్మృతి) గురూపదేశమువలన పొందవలసినవాడై యున్నాడు.

జీవేశ్వరులందు భాసించు కించిజ్ఞత్వాది విరుద్ధ ధర్మములు మాయాంతఃకరణ ఉపాధిధర్మములే గాని, ఆత్మధర్మములు కావు (విరోధము ఆభాసమాత్రమే). కనుక వేదాన్తములందు ప్రతిపాదింపబడిన ఆత్మాద్వైతము గ్రహించుటకు వీలుపడుచున్నది. స్వప్రకాశ అఖణ్డ సదాత్మస్వరూపమే ఈశ్వరుడుగను, జీవుడుగను, భోగ్యప్రపంచముగను, తత్త్వజ్ఞానోపదేశక గురుస్వరూపముగను, సర్వాత్మకము అయినది. ఈ విధముగా అద్వయాత్మ సాక్షాత్కారము వలన కంఠగత స్వర్ణాభరణప్రాప్తి వలె సిద్ధస్వరూప బ్రహ్మప్రాప్తి (బ్రహ్మాత్మస్వరూపావస్థానము) లక్షణమగు మోక్షఫలము సిద్ధించుచున్నది. అనాదియై బలవత్తరమైన యజ్ఞానమును నివర్తింపజేసికొనుటకు సాధనమైన ఆత్మజ్ఞానము విశేషయత్నసాధ్యము. ప్రాప్త ప్రాప్తియే గదా యని చులకనగా భావించరాదు.

శ్రీ దక్షిణామూర్తియే గురువు, ఆత్మస్వరూపుడు. ఆ పరమేశ్వరుడు సాధకులకు అద్వయ ఆత్మానందానుభూతిని అనుగ్రహించుగాక !

'బీజస్యాంతరివాంకురః' అను రెండవ శ్లోకమున (ద్వితీయోల్లాసమున) మాయాశక్తిచే జగత్కారణమగు ఆ పరమేశ్వరుడు నిర్వికల్ప బ్రహ్మతత్త్వమనియు, ఆ పరమేశ్వరుడు ఐంద్రజాలికుని వలెను, మహాయోగివలెను స్వేచ్ఛచే తానొక్కడే జగత్తును దేశ కాల కల్పనతో విచిత్రముగా విజృంభింపజేయుచున్నాడు అని చెప్పబడినది. దీనిచే పరమాణువులు ఉపాదానకారణము, ఈశ్వరుడు తటస్థుడు, నిమిత్తకారణము అను వైశేషిక వాదము, సత్త్వరజస్తమోగుణాత్మకము, జడమునగు ప్రధానమే జగత్కారణము, ఈశ్వరునితో ప్రసక్తి లేదు అను కాపిల సాంఖ్య పరిణామవాదము ఈ రెండు వాదములు త్రోసిపుచ్చబడినవి. 'మాయాం తు ప్రకృతిం విద్యాత్ మాయినం తు మహేశ్వరమ్' 'ఇంద్రో మాయాభిః పురు(బహు) రూప ఈయతే' — మొదలగు శ్రుతిప్రమాణములచేత జగత్తు మాయావిలాసము అని నిరూపించి 'తత్త్వమసి' మహావాక్యములోని 'తత్' పదార్థము వర్ణింపబడినది. పురుషబుద్ధికల్పిత పరమాణు కారణవాదము చేతను, ప్రకృతి పరిణామవాదము చేతను, శ్రుతిప్రతిపాద్యమగు అద్వైతము గ్రహించుటకు శక్యము కాదు గాన, ప్రబల శ్రుతిప్రమాణముచే వివర్తవాదము నాశ్రయించి అద్వైతస్థాపనకై ఆరంభపరిణామవాదములు రెండును నిరాకరింపబడినవి.

'యస్యైవ స్ఫురణమ్' అను మూడవ శ్లోకమున (తృతీయోల్లాసమున) శ్రీ దక్షిణామూర్తి శుద్ధ సత్త్వ జ్ఞాన స్వరూపు డనియు, 'తత్త్వమసి' యను మహావాక్యముచేత ఆశ్రితులగు మహర్షులకు (తత్త్వజిజ్ఞాసువులకు) జీవ బ్రహ్మైక్యబోధ చేయుచున్నాడనియు, అద్వయబ్రహ్మాత్మ సాక్షాత్కారము వలన మోక్షము లభించుననియు చెప్పబడినది. ఆ జీవబ్రహ్మైక్యము, ముఖ్యస్వరూపలక్షణమైనదే గాని, అంశాంశి, వికార వికారి భావములతో

కూడినది కాదనియు, సాదృశ్యపరము కాదనియు వివరించి సచ్చిదానన్ద రూపత్వలక్షణముచే జీవేశ్వరులకు ఉపాధిద్వయము వలన గలిగిన విరుద్ధ ధర్మములను త్రోసిపుచ్చి భేదము లేశమాత్రము లేని బ్రహ్మస్వరూపమే ఆత్మ యని వాక్యార్థము వర్ణింపబడినది. 'బ్రహ్మైవేదం సర్వమ్' అని స్వరూపమును అధిష్ఠానమగు బ్రహ్మమే ధరించుటచేత బ్రహ్మైకత్వముతో సర్వాత్మత్వము అను ఫలము కూడ సిద్ధించినది. ఈ సర్వాత్మభావన పరిపక్వము అగుటతో ఆ మహాత్ముడు సాక్షాత్పరమేశ్వరుడే యగుచున్నాడు.

ఇంతవఱకు మూడు ఉల్లాసములందు 'తత్త్వమసి' మహావాక్యార్థము శాస్త్రార్థము వివరింపబడినది. బ్రహ్మాద్వైత తత్త్వమునందు వేదాన్త సమన్వయము ప్రదర్శింపబడినది.

కొందఱు దార్శనికులు కూడ ప్రత్యక్షాది ప్రమాణానుభవముల నాశ్రయించి ద్వైతమునే పరమార్థముగా విశ్వసించి శ్రుతిసిద్ధమగు అద్వైతమును గ్రహింప నేరకున్నారు. ఆ యా వాదములను అద్వైత సమన్వయ దార్ఢ్యమునకై అనంతర శ్లోకములందు (ఉల్లాసములందు) నిరాకరించుచున్నారు.

'నానాచ్ఛిద్ర' అను శ్లోకమున (నాల్గవ ఉల్లాసమున) దేహమునందు ప్రకాశరూపమగు ఆత్మ, సరంధ్రఘట మధ్యస్థ మహాదీపమువలె ప్రకాశించు చున్నదనియు, ఆ యాత్మప్రకాశమే చక్షురింద్రియముల ద్వారా బహిర్గతమై విషయప్రకాశక మగుచున్నది యనియు. స్వతః భానము (ప్రకాశము) ఆత్మకే గాని, తుదకు సూర్యచంద్రాదులకు గూడ స్వతఃప్రకాశము లేదు అనియు ఆత్మమహిమ వర్ణింపబడినది. ఉపాధికృతమగు అవస్థాత్రయము నందును ఆత్మాధీన ప్రకాశము వలననే జగద్వ్యవహారము నడచుచున్నది. జడమైన పదార్థములకు స్వతఃప్రకాశమే లేదు. జాగ్రదాద్యవస్థలందు దేహేంద్రియాది సంసర్గమువలన శుద్ధము, నిర్వికల్పము నగు ఆత్మయొక్క పరిపూర్ణప్రకాశమును కనుగొనలేకున్నాము. విద్యచే అవిద్యాపరిణామము

నివృత్తమైనపుడు నిర్వికల్ప ప్రత్యగాత్మ స్పష్టముగా ప్రకాశించును. ప్రత్యక్షాది ప్రమాణములు కూడ స్వతః ప్రకాశము కలవి కావు. తత్తత్ప్రమాణాధీన బాహ్య ఘటాదిపదార్థములు అధిష్ఠానసత్తచే సత్త గలవి కాని, స్వతస్సత్త గలవి కావు గాన, స్వతస్సిద్ధప్రకాశము గల ఆత్మవస్తువు ఒక్కటే పరమార్థసత్యము. ఆ యాత్మ స్వరూపమే పరమేశ్వరుడు (దక్షిణామూర్తి).

'దేహం ప్రాణమపి' అను శ్లోకమున (పంచమోల్లాసమున) ఆత్మ తత్త్వమును గురించి విప్రతిపత్తులగు అనేకుల వాదములను పేర్కొని ఆ వాదము లన్నియు మాయాశక్తివిలాసకల్పిత మహావ్యామోహములే కాని ప్రామాణికములు కావు, పరమేశ్వరుడు ఆ వాదవ్యామోహము నుండి తత్త్వజ్ఞానము నొసగి కాపాడుగాక యని శ్రీ శంకరులు ప్రార్థించుచున్నారు.

చార్వాకులు ప్రత్యక్షమొక్కటే ప్రమాణము. పృథివి, జలము, తేజస్సు, వాయువు అను నాలుగు భూతములు, అర్థకామములు పురుషార్థము, మరణమే మోక్షము అని వచింతురు. వీరి మతమున ఈశ్వరుడు లేడు, పరలోకమునను లేదు. పరలోకముల గురించి ప్రసంగము అనవసరము, 'శతం జీవ' నూరేండ్లు సుఖముగా జీవింపుము. అను అనుష్ఠానమే వీరిమతమునకు చెందినది. కనుక, వీరిది దేహాత్మవాదము. ఉచ్ఛ్వాస నిశ్వాసలు జరుగుచున్నను, క్షుత్పిపాసలు కలవాడను, జీవించుచున్నాను అని పలుకుచు ప్రాణమే ఆత్మ యని కొందఱు తలంచిరి. మరి కొందరు వినుచున్నాను, చూచుచున్నాను అను వ్యవహారముచే శ్రోత్ర, చక్షురాది యింద్రియములే ఆత్మ యని భావించిరి. వీరు ఇంద్రియాత్మ వాదులు. తెలిసికొనుచున్నాను అను ప్రత్యయము వలన బుద్ధి, ఆత్మ అని బౌద్ధులు (విజ్ఞానవాదులు) పలికిరి. ఈ వాదము లన్నియు భ్రాంతిమూలకములు. జడములగు దేహాదులు 'నేను' అని చేతనముగా స్ఫురించు ఆత్మ ఎట్లగును? 'ఈ దేహము నాది' అనుచున్నాము. 'దేహము నేను' అని యనుటలేదు కదా? ఇంద్రియములు ఆత్మ కావు. అవి జీవునకుపక

ప్రకాశకములు-కరణములు, కర్త అయినవాడు మఱియొకడు ఉండవలెను. అంధులు, బధిరులు, మూగవారు ఇంద్రియవ్యవహారము లేనివారైనను చేతనులుగా వ్యవహరించుచున్నారు. ప్రాణము శరీరమును రక్షించుచున్నది. కాని, అది జడము. బుద్ధి, క్షణికము. బుద్ధులు మారుచున్నను బుద్ధివృత్తుల రాకపోకలను, అనుసంధానము చేయు ఆత్మ ఒకడు వేఱుగా నుండవలెను. స్థిరమైన ఆత్మలేనిదే దేహవ్యవహారము చక్కగా నడవదు. ఇక, శూన్యవాది, సుషుప్తిసమయములో వ్యవహారము లేకపోవుటచే శూన్యమే తత్త్వ మనును. కాని, ఆ సుషుప్తిసమయమున దేహేంద్రియ వ్యవహారము లేకపోవుటను నిర్ధారించుటకు ఒకడు ఉండవలెను కదా! అతడే సుషుప్తిసాక్షి ఆత్మ. దేహేంద్రియ ప్రాణములు లేనివాడు. దేహేంద్రియ ప్రాణములు లేని పరమాత్మవలెనే స్వయముగా ప్రకాశించువాడు, ప్రత్యక్షాది ప్రమాణాపేక్ష లేనివాడు, జ్ఞానానన్ద స్వరూపుడు శ్రీ దక్షిణామూర్తి. ఈ సుషుప్తాత్మస్వరూపముతోనే పరమాత్మైకత్వము గ్రహించుటకు వీలుపడుచున్నది.

ఇచట, ఇతర వాదములను త్రోసిపుచ్చుట యను మిషతో మాయా మోహమునకు అతీతమగు ఆత్మతత్త్వమును ప్రకాశింపజేసి ఆ యాత్మ, పరమేశ్వర స్వరూపముగా దర్శింపజేయబడినది.

'రాహుగ్రస్తదివాకరేన్దుసదృశో' యను నాల్గవ శ్లోకమున (ఉల్లాసమున) సుషుప్తిసమయమున ఆత్మ ఇంద్రియవ్యాపారముడుగుటచే విశేష విజ్ఞానము లేకపోయినను, రాహువుచే గ్రసింపబడిన సూర్యచంద్రులవలె అజ్ఞానావృతుడై స్వప్రకాశ సన్మాత్రస్వరూపుడై ఆ యావరకమగు అజ్ఞానమును ప్రకాశింపజేయుచు వెలుగొందుచున్నాడు అని చెప్పుటవలన శూన్యవాదము నిరస్తమగుచున్నది. ఏ నేను నిద్రపోయితినో, ఆ నేను, మేలుకొనుచున్నాను అను ననుభవముచే సుషుప్తి, జాగరములందు ప్రత్యభిజ్ఞచే ఏకాత్మ స్థిరముగా గుర్తింపబడినందున 'సర్వం క్షణికమ్' అను క్షణికవాదము కూడ నిరాకరింపబడినది. 'సోఽయం దేవదత్తః' అను జ్ఞానము

ప్రత్యభిజ్ఞకు ఉదాహరణము. 'సోఽహం' (బ్రహ్మైవాహమ్, శివోఽహమ్) అను జ్ఞానము వేదాంతికము ప్రసిద్ధము, ప్రత్యక్షప్రమాణములో చేరినది. ఇచట, మాయా, అవిద్యానామములచే వ్యవహరింపబడునట్టి యజ్ఞానమునకు ప్రకాశకము సాక్షి యగు ఆత్మ గాన, సాక్షిప్రత్యక్షము గ్రాహ్యము.

'బాల్యాదిష్వపి' యను యేడవ శ్లోకములో ప్రత్యక్షాదిప్రమాణములలో ప్రత్యభిజ్ఞ చెప్పబడలేదు గదా ? యను ప్రశ్నకు ప్రత్యుత్తరముగా ప్రత్యభిజ్ఞయే ముఖ్య ప్రత్యక్ష ప్రమాణముగా చూపబడుచున్నది. బాల్య,కౌమార, వార్ధకములందును జాగర, స్వప్నావస్థలందును ఆతుర, స్వస్థ, ధనిక, దరిద్రావస్థలయందును అనువృత్తము, నిరుపాధిక మగు సనాతనస్వరూపము బ్రహ్మస్వరూపమును తాను అనుభవించుచు చిన్ముద్రచే శిష్యులకు అహంతత్త్వమును బోధించుటచే విరుద్ధదేశకాలావస్థాభేదములను అనుసంగముగనైనవానిని త్రోసివుచ్చి అనుస్యూతమగు నిజాత్మానుభవము ప్రత్యభిజ్ఞగా చూపబడినది. ప్రమాణము లన్నియు అవిద్యాపరిణతినివృత్తి చేతనే ప్రమాణము లనిపించునని యు వివరింపబడినది.

బ్రహ్మైకత్వమును 'బ్రహ్మాహమస్మి' యను విద్వదనుభవము ప్రత్యక్షప్రమాణము. 'తత్త్వమసి' యను గురూపదేశము శ్రుతిప్రమాణము. 'జీవస్య న తత్ప్రభోశ్చ ఆత్మస్వరూపత్వే సతి ఉపాధిపరామర్శమంతరేణ అవిశేష్యమాణ భేదవత్త్వాత్ ఆకాశవత్' అను అనుమానప్రమాణము, 'క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత' యను స్మృతిప్రమాణము ప్రత్యభిజ్ఞను సాధకములు.

'విశ్వం పశ్యతి కార్యకారణతయా' యను యెనిమిదవ శ్లోకమున కార్యకారణభావ, స్వస్వామిభావ, శిష్యాచార్య, పితృపుత్రాది వ్యవహారము 'దేహాత్మప్రత్యయో యద్వత్ ప్రమాణత్వేన కల్పితః । లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాత్మనిశ్చయాత్' అను అభియుక్త వచనానుసారము వ్యావహారిక ప్రామాణ్యము కలది. బ్రహ్మైకత్వ అపరోక్ష సాక్షాత్కారము

కలుగుటకు పూర్వము ప్రత్యక్ష అనుమానాది ప్రమాణములు వ్యవహార దశలో ప్రమాణములుగ నంగీకరింపబడినవి. కనుక, కర్మోపాసనలు, యోగాభ్యాసము, బ్రహ్మైకత్వవిద్యకై సాధనములుగా గ్రహించుట యుక్త మగుచున్నది.

'ఘూరంధాంసి' యను తొమ్మిదవ శ్లోకమున తత్త్వజ్ఞానమునకై అష్టమూర్తులందు ఈశ్వరోపాసన సాధనముగా పేర్కొనబడినది. ఇందు సమష్టి వ్యష్టి ఉపాసనలు కూడ చేర్చబడినవి వ్యష్టిదేహములందు ఈశ్వరోపాసనచే సమష్టిబ్రహ్మాండశరీర ఈశ్వరోపాసనము ద్వారా పరిపూర్ణబ్రహ్మాత్మభావము ఫలమై యున్నది. సమనస్క, అమనస్క యోగములు సర్వాత్మభావప్రాప్తికి ఉపయోగపడుచున్నవి. గుర్వనుగ్రహము వలన, ఈశ్వరానుగ్రహము వలన యోగసిద్ధ అఖండ ఆత్మతత్త్వానుభూతి లభించుచున్నది.

ఇంతవఱకు 'తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణా మూర్తయే' యను మకుటముతో నున్న శ్లోకములకు భావము వివరింపబడినది.

'సర్వాత్మత్వమ్' అను ఈ పదవ శ్లోకము ఫలశ్రుతి. సర్వాత్మ భావము ఈ స్తోత్ర శ్రవణ, అర్థమనన, ధ్యానములకు, సంకీర్తనమునకును ఫలము. ఇదికాక, అణిమాది అష్టసిద్ధులు ఆనుషంగికఫలము. ముముక్షువు గాని, అభ్యుదయమును కోరువారు గాని ఈ స్తోత్ర పఠనము వలన మోక్ష ఫలమును, అభీష్టములను పొందగలరు.

ఉపనిషత్తులకు నిర్విశేష ప్రత్యగభిన్న బ్రహ్మను ప్రతిపాదించుట యందే తాత్పర్యము అను విషయము ప్రారంభమున ఉగ్గడింపబడినది ఈ స్తోత్రమునందు మాయావాదము నాశ్రయించి యా విషయము వివరింప బడినది. మాయావాదము వివర్తవాదమునకు ఉపోద్బలకము. బ్రహ్మాత్మాద్వై తమును గ్రహించుటకు మాయాస్వరూపమును గ్రహించుట యావశ్యక మైనది. ఈ స్తోత్రములో పలు తావులందు మాయాశక్తి పేర్కొనబడినది.

'అఘటిత ఘటనాపటీయసీ మాయా' హేతువాదమునకు, బుద్ధికి అందని యనేక విషయములను గూర్చి ప్రదర్శించగల సామర్థ్యము కలది మాయాశక్తి అయియున్నది. లేని వస్తువులను చూపగలదు, ఉన్న వస్తువులను కానరానీయదు, సత్యమగు బ్రహ్మవస్తువును ఆవరించి దృష్టికిగోచరము కాకుండునట్లు చేయుచున్నది. అసత్యమగు(లేని) ప్రపంచమును ఈ మాయాశక్తియే చూపుచున్నది. ఈ మాయాశక్తిచేతనే నిర్గుణమగు బ్రహ్మ, లేదా ఆత్మ సగుణముగా కన్పడుచున్నాడు. ఆ సగుణబ్రహ్మమే జగత్కారణముగా శ్రుతులయందు ఎడనెడ పేర్కొనుట జరిగినది. ఈ జగత్కారణ సగుణబ్రహ్మ నిరూపణమునందే పరమ తాత్పర్యము అను భావమును నిరాకరించుటకై ఈ స్తోత్రమునందు అనేక పర్యాయములు మాయా పదమును శ్రీ శంకరులు ప్రయోగించిరి. 'మాయాం తు ప్రకృతిం విద్యాత్, మాయినం తు మహేశ్వరమ్', 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' మొదలగు శ్రుతులందు జగత్కారణ ఈశ్వరస్వరూపనిరూపణ సందర్భమున మాయాశబ్దము ప్రయుక్తమై యున్నది. దానిని ఆధారముగా చేసికొనియే శ్రీ శంకర భగవత్పాదులు మాయావాదమును స్వీకరించి ఔపనిషదమగు బ్రహ్మాద్వైతమును ప్రబోధించిరి.

"యా చ ప్రాక్ ఆత్మనో మే మా తథాఽన్తే చ తిరస్కృతా ।
బ్రహ్మవాదిభిః ఉద్గీతా సా మాయేతి వివేకతః ॥"

యను శ్రుతి ఆత్మాశ్రితమగు మాయ మొదట జీవేశ్వర జగత్సృష్టి హారమునంతయు నిర్వహించుననియు, చివరకు, నిష్ప్రతియోగిక బ్రహ్మస్వరూప బోధచే తిరస్కృతమై 'యా మా' ఏది లేనిదగునో, దానిని బ్రహ్మవాదులు మాయ యని పేర్కొనిరి అని, పై వచనము మాయాస్వరూపమును వివరించుచున్నది. ఉపనిషత్తులకు అన్నింటికి మాయావినిర్ముక్త సత్యజ్ఞానానన్ద విశుద్ధ బ్రహ్మస్వరూప ప్రతిపాదనమునందే తాత్పర్యము.

iv)

'సర్వప్రపంచోపశమం శాంతం శివమద్వైతమ్' అని మాండూక్యోపనిషత్తు.

"'అనాది మాయయా సుప్తః యదా జీవః ప్రబుద్ధ్యతే ।
అజ మనిద్ర మస్వప్నం అద్వైతం బుద్ధ్యతే తదా ॥"

యని పరమగురువు శ్రీ గౌడపాదాచార్యులు అద్వైతమును పరమార్థముగా గ్రహించి జీవులు మాయానిద్రనుండి మేల్కొని కృతార్థులు అగుచున్నారని బోధించుచున్నారు. శ్రీ శంకర భగవత్పాదులు ఆ ప్రత్యాచార్యవచన ప్రమాణము ననుసరించి శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమునందు అద్వయ ఆత్మప్రబోధము వలన జ్ఞానానన్దావిర్భావముచే బ్రహ్మాత్మస్వరూపావస్థావ ముతో మానవులు కృతార్థులు, ధన్యులు నగుచున్నారని ఉపదేశించిరి. వార్తికమునందు శ్రీ సురేశ్వరులు విపులముగా ఈ విషయమును ఉపపాదించిరి.

సంస్కృత భాషాపరిజ్ఞానము, శాస్త్రపరిచయము అంతగా లేని భక్తులకు, తత్త్వజిజ్ఞాసువులకు 'పీయూషవర్షిణి' యను ఈ యాంధ్ర వివరణ మును శ్రీశ్రీశ్రీ జగద్గురువులు, పుష్పగిరి పీఠాధీశ్వరులు శ్రీమదభినవోద్దణ్డ విద్యానృసింహ భారతీ శ్రీ చరణులు మహానుగ్రహముతో శ్రీ శంకర, సురేశ్వరుల సదుపదేశమును హృదయరంజకముగా, సుగ్రాహ్యముగా ఎడనెడ విశేషవివరణములతో అందించియున్నారు.

ఈ శ్రీ దక్షిణామూర్తి స్తోత్ర పీయూషవర్షిణి ఆంధ్రయోషా మతల్లికకు అపూర్వ భూషణము.

ఓం తత్సత్
శ్రీ దక్షిణామూర్తయే నమః

సూరి రామకోటిశాస్త్రి

హైదరాబాదు,
5-6-91.

# సింహావలోకనము

'ఆర్షవాఙ్మయ తత్త్వజ్ఞ'
వ్యాకరణ విద్యాప్రవీణ
బ్రహ్మశ్రీ హరి లక్ష్మీనరసింహశర్మగారు

వ్యాస వాల్మీకుల తరువాత వేదవాఙ్మయము నుద్ధరించిన మహామనీషి శ్రీశంకరులు. భగవత్పాద బిరుదాంకితుడగు ఆ శంకరుడు తత్త్వతః లోకశంకరుడు. ధర్మమునకు గ్లాని యేర్పడుచున్న యీ కలికరాళకాలమున, ధర్మోద్ధరణమున కవతరించిన అవతారమూర్తి శ్రీశంకరులు.

లోకానుగ్రహదృష్టితో ఆ మహాత్ముడు వేదాంతవిజ్ఞానమును ప్రస్థానత్రయరూపమున, ప్రకరణాది గ్రంథరూపమున రచించెను. వేదాంత విజ్ఞానమునకు సోపానరూపములగు కర్మ, భక్తిమార్గముల నుద్బోధించుటకు స్తోత్రముల రచించెను. ఆ స్తోత్రపరంపరలో చేరినదియే దక్షిణామూర్తి స్తోత్రము.

శ్రీశంకరులు ఒక్కొక్క గ్రంథము నొక్కొక్క లక్ష్యముతో రచించెను. దక్షిణామూర్తి స్తోత్ర లక్ష్యము భారతీయ సంస్కృతి యందు గురుప్రాధాన్యమును గుర్తింపజేయుటయే.

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥"

భారతీయదృష్టిలో గురువు త్రిమూర్తి స్వరూపుడు, తదతీత సాక్షాత్పరతత్త్వ స్వరూపుడు. కనుకనే వేదాధ్యయనారంభమున గురువు పరతత్త్వ స్వరూపుడుగా, ప్రణవాత్మకుడుగా వర్ణింపబడి నమస్కరింపబడుచున్నాడు.

"శ్రీ గురుభ్యోనమః హరిః ఓమ్" అని వేదాధ్యయనారంభమున ధ్యానింపబడు ఈ మహామంత్రరాజ మీ విషయమును గుర్తింపజేయు చున్నది. వేదాధ్యయనారంభమున ధ్యానింపబడు ఈ మహామంత్రమే దక్షిణామూర్తి స్తోత్రరూపమున వేదాంతాధ్యయన సంప్రదాయమున ఆద్యంత ములయందు ధ్యానింపబడుచున్నది. "శ్రీ గురుభ్యోనమః హరిః ఓమ్" అనెడి యీ అనూచాన సాంప్రదాయిక వచనమే దక్షిణామూర్తి స్తోత్రమున-

"తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే" యను మకుటముగా రూపొందినదనవచ్చును. ఈ మకుటమున "శ్రీగురుమూర్తయే నమః" అని యనక శ్రీశంకరులు "శ్రీగురుమూర్తయే ఇదం నమః" అని యనుట ద్వారా యీ మకుటము మంత్రరూపమని సూచించుచున్నారు.

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము నవశ్లోకాత్మకము ఈ నవత్వము ఈ స్తోత్రము యొక్క ప్రణవాత్మకత్వమును, గురువు యొక్క ప్రణవాత్మక త్వోద్బోధకత మును, యీ స్తోత్రము యొక్క ప్రణవార్థకత్వ స్ఫోరక త్వమును సూచించుచున్నది. అంతేగాక "ప్రణవాత్మకుడగు గురువే ముముక్షుజన శరణ్యుడు" అను ప్రధానాతిప్రధాన సందేశప్రబోధకము గూడ నగుచున్నది-

**ఆర్షసంస్కృతి, గురుశిష్య సంప్రదాయము.**

ఈ స్తోత్ర ప్రథమ శ్లోకమున గురుశిష్య స్వరూపము వర్ణింపబడు చున్నది. గురువు శ్రీగురుమూర్తి యగు దక్షిణామూర్తి. ఆతడు వశిష్ఠాంతేవసదృషిగణముతో, బ్రహ్మనిష్ఠులైన మహాత్ములచే పరివేష్టింపబడి పరబ్రహ్మ తత్త్వావగతికై సేవింపబడుచున్నాడు.

"ముముక్షువులగు సాధకులు ఎంత బ్రహ్మనిష్ఠులైనను, ఎంతటి మహాత్ములైనను, వారు గురుపాదము లాశ్రయించి, తదనుగ్రహపాత్రులు

కావలసినదే- అంతేవాసులై గుర్వనుగ్రహ సమయమునకై ప్రతీక్షించ వలసినదే!" యని బ్రహ్మపగతిని కాంక్షించు శిష్యస్వరూపము, శిష్యుని అర్హతలు, ఇట నిర్దేశింపబడుచున్నవి. అట్లే-

"మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం" అను వచనము ద్వారా గురుస్వరూపము నిర్దేశింపబడుచున్నది.

"చిత్రం వటతరోర్మూలే వృద్ధాశ్శిష్యా గురుర్యువా ।
గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః ॥"

ఇచట దేశికుడు యువకుడు. శిష్యులు విద్యావయోవృద్ధులు, బ్రహ్మనిష్ఠులు. గురువు మౌనవ్యాఖ్యతో తత్త్వము నుపదేశించుచున్నాడు. శిష్యుల సందియము తీరినది. ఆత్మసాక్షాత్కారముతో ఆనందమయులైరి.

దీనినిబట్టి "మౌనవ్యాఖ్యతో శిష్యులకు బ్రహ్మతత్త్వము నుపదేశింప గల మహాత్ముడు తత్త్వతః "శ్రీగురుమూర్తి" యని తెలియుచున్నది.

మౌనము - మౌనవ్యాఖ్య

వాగింద్రియ నిగ్రహము 'మౌన' మని లోకసిద్ధ వ్యవహారము. మౌనవిషయమున శాస్త్ర సంప్రదాయము వేరు-

"యతో న వేదా మనసా సహైన
మనుప్రవిశంతి తత స్స మౌనమ్ ।
యత్రోత్థితో వేదశబ్ద స్తథాఽయం
న తన్మయత్వేన విభాతి రాజన్ ॥ —సనత్సుజాతీయ

వాచామగోచరుడైన పరమేశ్వరుడు మౌనస్వరూపుడు. వేదములు సాక్షాత్ ఆ పరతత్త్వమును వర్ణించలేవు- వాచామగోచరుడగు పరమేశ్వరుడు మనోగోచరుడు గూడ కాడు. ముముక్షువులగు సాధకులు బ్రహ్మనిష్ఠులై, గుర్వనుగ్రహసంపన్నులై యాత్మజ్ఞానస్వరూపుని, మౌన

ముద్రాంకితుని అపరోక్షముగ సాక్షాత్కరించుకొనుచున్నారు. ఉత్తమ గురువు ముముక్షువులగు నంతేవాసులకు, నిదిధ్యాసన సమాపన్న చేతస్కులకు మౌనస్వరూపుడై సాక్షాత్కరించును. అట్లు అపరోక్షముగ సాక్షాత్కరించుటయే మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వము. అట్లు సాక్షాత్కరించు శ్రీగురుమూర్తియే శ్రీదక్షిణామూర్తి "యత్సాక్షాదపరోక్షాద్బ్రహ్మ" యను శ్రుతివాక్యనివరణమే మౌనవ్యాఖ్యా శ్లోక ప్రథమ పాదము.

"అవ్యాకృత విహారాయ సర్వవ్యాకృతసిద్ధయే ।
హృషీకేశ నమస్తేఽస్తు మునయే మౌనశీలినే ॥"

భాగవత. 10-16-47

యను భాగవతశ్లోకము మునియొక్క మౌనశీలిత్వమును వివరించుచున్నది-

"మునయే ఆత్మారామాయ- కిం సాధనవశేన, నహి నహి-మౌనశీలినే
మౌన మాత్మారామతా । తత్స్వభావాయ"

—శ్రీధరస్వామి వాఖ్య.

మౌన మనగా ఆత్మారామత, అది మహాత్ములకు స్వభావసిద్ధము. సాధన సాధ్యము కాదు. మహాత్ములు ఆత్మారాములై, మౌనరూపులై, విరాజిల్లుచుందురు. తద్దర్శన సౌభాగ్యము, తత్కృపాకటాక్షము సాధకుల సందేహములను, అధ్యాసాది దోషములను పారద్రోలును. అవిద్యాబంధ వినిర్ముక్తులైన సాధకులు గూడ ఆత్మారాములై విలసిల్లుదురు.

ఆత్మారాముడు మునిపుంగవుడు. అనగా, మౌనస్వరూపుడగు నారద మహర్షి కృపాకటాక్షమున తపస్వియైన వాల్మీకి వాగ్విదాం వరుడై, మౌనియై వరలినట్లు శ్రీమద్రామాయణాదిమ శ్లోకము బోధించుచున్నది.

"తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాంవరమ్ ।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్ ॥"

అనాదిసిద్ధముగ ప్రవర్తిల్లునట్టి యీ గురుశిష్య సంప్రదాయమే శ్రీ శంకరులను శంకరుల గావించినది. జన్మసిద్ధ వైరాగ్యసంపన్నుడైన్న యతడు

బాల్యముననే గోవిందభగవత్పాదుల నాశ్రయించి తన్మౌనవ్యాఖ్యాప్రకటిత బ్రహ్మతత్త్వము నవగతము చేసికొని బ్రహ్మవిద్యాస్వరూపు డాయెను- అతడు మరల తన శిష్యులకు మౌనముద్రాంకితుడై సాక్షాత్కరించి వారల తరింపజేసెను. శ్రీ శంకరులు తోటకాచార్యుల నుద్ధరించిన విధానము "మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం" అను వాక్యమునకు వ్యాఖ్యాన రూపమగుచున్నది. శ్రీ శంకరులు తన యనుభూతినే దక్షిణామూర్తి స్తోత్ర వ్యాజముతో మౌనవ్యాఖ్యా శ్లోకరూపమున నుపపత్తించుకొనిరని భావింప వచ్చును.

## దక్షిణామూర్తి - స్వరూపపరిశీలనము.

దక్షిణామూర్తి స్వరూపపరిశీలన ద్వారా దక్షిణామూర్తియొక్క మౌనముద్రాంకితత్వమును దర్శింపవచ్చును. "సదా దక్షిణాశాభిముఖుడై యుండు మూర్తి దక్షిణామూర్తి" యని పెద్దల మాట. పరమేశ్వరుడు దక్షిణాశాభిముఖుడై యుండుట యన నేమి? "శేముషీ దక్షిణా ప్రోక్తా" యని దక్షిణామూర్త్యుపనిషత్తు దక్షిణాస్వరూపమును వివరించినది. "సంస్కారక్రమసంపన్నమై, బ్రహ్మవిద్యాస్వరూపిణియై, ఉమారూపిణియై విలసిల్లు మహాత్ముల చిత్తవృత్తియే- బుద్ధిసంపదయే దక్షిణ. ఆ చిత్తవృత్తి ఆరాధకులను దక్షుల గావించుచున్నది, "దక్షం కరోతీతి దక్షిణా" అట్టి దక్షిణయందు తద్దక్షిణాఽనన్య రూపమున విరాజిల్లునట్టి దివ్య చైతన్యమే దక్షిణామూర్తి. 'దక్షిణాయాం మూర్తిః - దక్షిణానన్యా మూర్తిః దక్షిణామూర్తిః' ఇట్టి దక్షిణామూర్తి తత్త్వమునే. "దక్షిణాశాభిముఖుడు, దక్షిణామూర్తి" యని పెద్దలు చెప్పుచున్నారు. కనుక ఆత్మారాముడై విరాజిల్లు మహాత్ముడే శ్రీదక్షిణామూర్తి. మౌనరూపుడగు ఆ దక్షిణామూర్తిసాక్షాత్కారమే- తత్త్వావగతియే, మౌనవ్యాఖ్య. శ్రీ గురుమూర్తి యగు ఆ మహాత్ముని కృపాకటాక్షమే- అనుగ్రహదృష్టియే మౌనవ్యాఖ్య.

## శ్రీ పుష్పగిరి జగద్గురువులు - పీయూషవర్షిణీ వ్యాఖ్య :

ఉపనిషత్కల్పమైన దక్షిణామూర్తి స్తోత్ర మహామంత్రరాజని

వ్యాఖ్యానింపదగినవారు మౌనస్వరూపులే. శ్రీగురుమూర్తులే- శ్రీ పుష్పగిరి శంకరులట్టివారు. కనుకనే స్తోత్ర వ్యాఖ్యానరూపములగు వారి వాక్కులు సాధకులు సుస్నాతులగుటకై పీయూషలహరులై ప్రవహించినవి.

ఇంతకుపూర్వ మెన్నియో వ్యాఖ్యలుండవచ్చును. ఇకెన్నియైనను రావచ్చును. దేని విశిష్టత దానిదే. పవిత్రత వాక్శుద్ధి, యోగ్యత వ్యాఖ్యాతకు విశిష్టాలంకారములు. దక్షిణామూర్తి స్తోత్రము ఆదిశంకరాచార్య కృతము. వ్యాఖ్య తద్రూప శంకరాచార్యకృత మగుట విశేషము. శ్రీ పుష్పగిరి శంకరు లిందుకు పూనుకొనుట యాంధ్రుల యదృష్టము.

"పీయూషవర్షిణి" యను నామమే ఆ వ్యాఖ్యావైశిష్ట్యమును సూచించుచున్నది. పాఠకులకు ఈ వ్యాఖ్య కరదీపిక కాగలదు.

శ్రీ జనస్వామి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు శ్రీ జగద్గురువుల యను గ్రహమునకు పాత్రులై ఏతద్గ్రంథ మాతృకా సంశోధనాది భారమును వహించి, యీ విధముగా యీ గ్రంథము వెలుగులోనికి వచ్చుటకు ప్రయత్నించుట శ్రీ జగద్గురువులపట్ల వారికి గల భక్త్యతిశయమును చాటుచున్నది. శ్రీ శాస్త్రిగారి యీ ప్రయత్నము ముదావహము.

పీయూషవర్షిణీ సుస్నాతులై సాధకులు శ్రీ గురువర్యుల మౌన వ్యాఖ్యావగత బ్రహ్మతత్త్వులై నిశ్శ్రేయసముతో వర్ధిల్లగలరని భావించు చున్నాను. శ్రీ దక్షిణామూర్తి దక్షిణాశాదృగంచలములతో లోకమును సుఖ శాంతులతో వర్ధిల్ల జేయుగాత యని యా దేవదేవుని ప్రార్థించుచున్నాను.

నమామ వేదమాతరమ్

హైదరాబాద్-35

10-6-91

హరి లక్ష్మీ నరసింహ శర్మ

శ్రీః

శ్రీ దక్షిణామూర్తయే నమః

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమ్

## పీయూషవర్షిణ్యాఖ్య

### ఆంధ్రవివరణ సహిత మానసోల్లాస సమలంకృతమ్

శ్లో॥ మౌనవ్యాఖ్యాప్రకటిత పరబ్రహ్మతత్త్వంయువానం
వర్షిష్ఠాన్తేవసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః ।
ఆచార్యేన్ద్రం కరకలిత చిన్ముద్ర మానన్దమూర్తిం
స్వాత్మారామం ముదితవదనం శ్రీ దక్షిణామూర్తి మీడే॥

#### పీయూషవర్షిణి

శ్లో॥ బ్రహ్మానన్దం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వన్ద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమల మచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥

శ్లో॥ కైలాసాచలకూటకోటినిలయా త్సౌధా త్సుధాసంభృతాత్
శ్రీమచ్ఛంకరపూజ్యపాదగురుభి ర్భూభాగ మారోపితమ్ ।
తత్సంస్థాపిత దివ్యనిలయం తత్సంప్రదాయోల్లసత్ తం
శ్రీమత్పుష్పగిరీశ సేవితపదం శ్రీచన్ద్రమౌళిం భజే ॥

శ్లో॥ ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే।
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయే నమః॥

శ్లో॥ శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయం।
నమామి భగవత్పాద శంకరం లోకశంకరమ్॥

సచ్చిదానందఘనమైన పరబ్రహ్మతత్త్వము అవాఙ్మానస గోచరము. అయినను, శిష్టజనోద్ధరణనిమిత్తమై ముముక్షువులైన ఋషిసత్తములకు తత్త్వోపదేశము చేసి, వారిని జనన, మరణరూప సంసారబంధము నుండి తరింపజేయుటకై, ఆ పరబ్రహ్మచైతన్యము మహాకృపతో శ్రీ దక్షిణామూర్తి రూపమున నవతరించెను.

శ్రీ దక్షిణామూర్తి, మౌనముద్రతో పరబ్రహ్మ తత్త్వమును వ్యాఖ్యానించునట్టి యాద్యగురువు; నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుడు; జరా, మరణరహితుడు; నిత్యయౌవనుడు; బ్రహ్మానంద రసాస్వాదన కుశలుడు. అట్టి యాచార్యవర్యుడు శమ, దమాది సంపదతో చిరకాలము వైరాగ్యసంపన్నులు, బ్రహ్మతత్త్వచింతనశీలురు, అంతేవాసులు నయిన ఋషిగణములతో పరివేష్టితుడై యుండును. ఆ యాచార్యశ్రేష్ఠుడు అంగుష్ఠతర్జనీయోగముతో చిన్ముద్రాలంకృతుడై విరాజిల్లుచుండును; ఆయన, మూర్తీభవించిన ఆనందస్వరూపము; బాహ్యవిషయముల నుండి సర్వేంద్రియములను అంతర్ముఖ మొనర్చి, స్వాత్మారాముడై ఆనందోల్లసిత వదనుడై వెలుగొందుచుండును. తాదృశ

మహనీయమూర్తి, ఆచార్యవర్యుడు నయిన శ్రీ దక్షిణా మూర్తిని స్తుతింతును.

## విశేష వివరణము

ఈ రీతిగా శ్రీ ఆదిశంకరులు శ్రీ దక్షిణామూర్తి యొక్క స్వరూప స్వభావాదులను వర్ణించి, భక్తి, జ్ఞాన నిర్భర హృదయులై యీ గురుమూర్తిని స్తుతించిరి. శ్రీమత్ శంకర భగవత్పాదులు సాక్షాత్తు శ్రీ శంకరావతార మూర్తియే యని తెలియనగును. శ్రీ ఆచార్యపాదులు లోకానుగ్రహదృష్టితో ప్రసన్న గంభీరార్థస్ఫోరకములైన ప్రస్థానత్రయ భాష్యములను రచించిరి. వేదసంప్రదాయ విరుద్ధము లయిన చార్వాకాది నాస్తిక మతములను శ్రుతి, యుక్తిబలముతో నిరసించి, అద్వైత సంప్రదాయమును సర్వ శ్రుతివాక్య సమన్వయ పురఃసరముగా పునః ప్రతిష్ఠాపించిన యవతారమూర్తి. ఆ యాచార్యేంద్రుడు సర్వవేదాంతసార మనెడి క్షీరసముద్రమును తన యాసిక, న్యాయశాస్త్రరూపమను మంథరపర్వతమును కవ్వముగా జేసి మథించగా, ఒక యమృతకలశము ఆవిర్భవించెను. అదియే శ్రీ దక్షిణా మూర్తిస్తోత్రము. ఈ స్తోత్రము సంసారతాపము నుపశమింప జేయుటలో ఎనలేని సామర్థ్యము కలది. శ్రీశంకరులు భోక్తకు భోగ్యజాతమునకు (జీవ, జగత్తులకు), భోగప్రదాత యగు పరమేశ్వరునకు, నిశ్శ్రేయసకరమయిన జ్ఞానము నుపదేశించు నట్టి గురువర్యునకును అభేదము ప్రతిపాదించుచు శ్రీ దక్షిణా

మూర్తిస్తోత్ర రచనకు బూనుకొనిరి. ఇది పరమ పురుషార్థ ప్రాపక మయిన నవనీతము. సత్కృత్యార, శ్రవణ, మననాదుల వలన, ఈ స్తోత్రము బ్రహ్మానందరసానుభూతిసంధాయకమైన అమృతకలశసదృశము. ఇందలి నవనీతము నాస్వాదించిన జీవుడు "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" యను శ్రుతివచనాను సారము అమృతస్వరూపు డగును.

## అవతారిక

గ్రంథారంభమునకు మునుముందుగా ప్రత్యగాత్మ యే జీవుడే - సకల జగత్తునకు నధిష్ఠానభూతు డయిన పరమేశ్వరు డని ప్రతిపాదింపనెంచి, మంగళాచరణ పురఃసరముగా ఆది శంకరులు "విశ్వం దర్పణదృశ్యమాన నగరీ" యను శ్లోకము నారంభించుచున్నారు.

**విశ్వం దర్పణదృశ్యమాన నగరీతుల్యం నిజాన్తర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మాన మేవాద్వయం**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥౧**

## పీయూషవర్షిణి

నిజాంతర్గతమైన (తనలో నున్న) విశ్వము, దర్పణము నందు గన్పట్టు నగరసదృశమైనది, స్వప్నమునందలి విషయ మును బాహ్యముగ జూచినట్లు మాయచేత ఈ విశ్వమును బాహ్యముగ నుద్భూతమైనదానివలె తనయందు జూచును. ఆవిధముగ జూచువాడు మేల్కాంచినంతనే, సజాతీయ

విజాతీయ, స్వగత భేదశూన్యము, అద్వయము నగు స్వాత్మను
సాక్షాత్కరించుకొనును. తాదృశ మహనీయమూర్తి,
ఆచార్యవర్యుడునైన శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము
చేయుచున్నాను.

## విశేష వివరణము

'విశ్వ' మనగా వివిధప్రత్యయ గోచరమైన ఆకాశాది పృథ్వీపర్యంతము గల యీ నిఖిల జగత్తు. ఆ విశ్వము నిజాంతర్గతము. అనగా, స్వీయ హార్దాకాశమునందు ఉన్న ప్రత్యక్ చైతన్యమునందు ఉన్నదని భావము. నిరవయవము, అతి స్వచ్ఛము, అసంగము, సూక్ష్మము నగు ప్రత్యగాత్మ యందు తద్విపరీత ధర్మములు- సావయవత్వ, మాలిన్య, సంగాదులు గల యీ విశ్వ ముండుట యెట్లు పొసగు? అను శంకకు, 'దర్పణదృశ్యమాన నగరీతుల్యమ్' అని తన్నివృత్తికి మైన దృష్టాంతము చెప్పబడినది. నీరంధ్రము, అసంగము, స్వచ్ఛము, సూక్ష్మము, నిర్వికారము నగు దర్పణమునందు ప్రతిబింబితమై నగరము దృశ్యమాన మగుచుండును. ఆ నగర పదునాలుగు సన్నివేశములు (వ్యాపారస్థానములు), దిగుడు బావులు, నానావిధములైన ఉపవనములు, దక్షిణోత్తరములు యందు ముగ్ధమోహనములైన రెండు మార్గములు, రంగుల మంగళదీపికలు, క్రీడాశిఖరములతో నానావిధ జనసంచారముతో వెలుగొందుచుండును. భారతీతీర్థులు పంచదశి (౧౩-౬-౬) లో నీ రీతిగా వివరించిరి.

"నిశ్ఛిద్రదర్పణే భాతి వస్తుగర్భం బృహజ్జగత్ ।
సచ్చిత్సుఖే తథా నానాజగద్గర్భ మిదం వియత్ ॥"

ఛిద్రరహితమైన దర్పణమునందు బహువిధ వస్తుజాతముతో నిండిన యీ విశాల విశ్వమంతయు ప్రతిఫలించుచుండును. ఆ రీతిగనే, వియదాది నానావిధమైన విశ్వము, స్వచ్ఛమైన ప్రత్యగాత్మ యందు భాసించుచుండును. వాసిష్ఠమునందలి శిలోపాఖ్యానముగూడ నీ విషయము నిట్లు వివరించుచున్నది.

"ద్యౌః క్ష్మా వాయు రథాకాశః పర్వతా స్సరితో దిశః ।
సన్తి తస్యాం శిలా సా చ సుషిరా న మనాగపి ॥
అప్యత్యన్త ఘనా జ్ఞాయా స్సునీరంధ్రాకృతేరపి ।
విద్యతేఽన్తర్జగద్బృన్దం వ్యోమ్నీవ వితతోఽనిలః ॥"

నీరంధ్రమైన దర్పణమునందు సమస్త విశ్వము కన్పడినట్లు. ఛిద్రరహితము, నిశ్చలము, నిర్వికారము నయిన ప్రత్యగాత్మ యందు భూమి, వాయువు, ఆకాశము, గిరులు, నదులు, దిక్కులు నిఖిల విశ్వము భాసించును.

ఈ విధముగా సమస్త విశ్వము ప్రత్యగాత్మ యందు అంతరమున సదా యుండినచో, రాగాదుల వలె అనుభూయమానము కావలయును గదా ? యను నాశంక జేసి సమాధానము చెప్పబడుచున్నది. "ఆత్మని మాయయా బహిరివోద్భూతం" విషయము, ఆశ్రయము నగు స్వయంప్రకాశ

ప్రత్యగాత్మయందు అనాది యగు నవిద్య వలన, తనకంటె బాహ్యదేశమున ఆవిర్భూత మయినట్లుల నగుపడుచుండును. లోపల ఉన్న విశ్వము ప్రత్యగాత్మకంటె బాహ్యముగ నున్నదనెడి యనుభవములో దృష్టాంతము చెప్పబడుచున్నది. 'యథా నిద్రయా'- స్వాప్నిక జగత్తు, సాక్షి యగు తనయందు (ప్రత్యగాత్మయందు) నధ్యస్తమై యున్నను, తనకంటె భిన్నముగ బాహ్యప్రదేశమున నున్నదానివలె ననుభవము పొందుచున్నాడు. ఆరీతిగనే, ప్రత్యక్ చైతన్యమునందు అధ్యస్తమై యున్న, ఈ జాగ్రత్ప్రపంచమును సంఘాతము తన యందు అధ్యస్తమై యున్న దేహ తాదాత్మ్యాధ్యాస వలన తనకంటె బాహ్యమైనదానివలె జూచును. లేనిచో, జడమైన విశ్వమునకు ప్రత్యక్చైతన్యముతో సహావస్థానము అసంభవ మగుటంజేసి, ప్రత్యగాత్మయందు ప్రపంచభానము లేకపోవలసి వచ్చును. కావున, ప్రత్యగాత్మయందు ప్రపంచము అధ్యస్త మనియే తెలియవలయును.

లోకమున, పదార్థములకు గల సంబంధము ఆధారాధేయ, సంయోగ, సమవాయాది సంబంధములలో నేదేని యొక సంబంధమై యుండును. సావయవ పదార్థములకే సంబంధ ముండునుగాని, నిరవయవ పదార్థమునకు సంబంధమును కల్పింపజాలము. ఆత్మవస్తువు నిరవయవము. కావున, జడ జగత్తునకు, ప్రత్యక్చైతన్యమునకు సహావస్థానము

పొసగనేరదు. ప్రత్యక్ చైతన్యము స్వయంప్రకాశము. ప్రత్యగాత్మను గుఱించి శ్రుతి యిట్లు వివరించుచున్నది.

"పురత్రయే క్రీడతి యశ్చ జీవ
స్తతస్తు జాతం సకలం విచిత్రం।
ఆధార మానన్ద మఖండబోధం
యస్మిన్ లయం యాతి పురత్రయం చ ॥"

"ఏతస్మా జ్జాయతే ప్రాణో మన స్సర్వేన్ద్రియాణి చ।
ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ ॥"

"మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్।
మయి సర్వం లయం యాతితద్బ్రహ్మాద్వయ మస్మ్యహమ్॥"

స్థూల, సూక్ష్మ, కారణ శరీరములే త్రిపురములు. జీవుడు పురత్రయమునందు క్రీడించుచుండును. ఆ జీవుని నుండియే విచిత్రమైన సమస్త వస్తుజాతము ఉద్భవించుచున్నది. అతడు సర్వాధారభూతుడు, అఖండ ఆనందస్వరూపుడు. తాదృశు డైన జీవునియందే ఈ పురత్రయము లయ మొందుచున్నది. అతనినుండి ప్రాణ, మనస్సులు, సర్వేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, విశ్వధారిణి యగు పృథివియు నుద్భవించుచున్నవి. నాయందే సకలమ్ము ఉత్పన్న మగుచున్నది. నాయందు సర్వము సుప్రతిష్ఠితమై యున్నది. నాయందు సర్వము లీనమగుచున్నది. కావున, నేను అద్వయ బ్రహ్మాత్మస్వరూపుడనై యున్నా ననుచు కైవల్యోప నిషత్తు బ్రహ్మాత్మైక్యము నుపదేశించుచున్నది.

"యథా స్వప్న ప్రపంచోఽయం మయి మాయావిజృంభితః ।
ఏవం జాగ్రత్ప్రపంచశ్చ మయి మాయావిజృంభితః ॥"

అనుచు పురాణవచనము స్వప్న ప్రపంచము నాయందు మాయాకారణముచే విజృంభించు రీతిగ, జాగ్రత్ప్రపంచము గూడ, పరమేశ్వరుడనైన నాయందు మాయాకల్పిత మని స్పష్టముగా చెప్పుచున్నది. కావున, ప్రత్యగాత్మయందే జాగ్రత్ప్రపంచము అధ్యస్తమై యనుభూయమాన మగు చున్నది. కాని, భ్రాంతిచేత తనకంటె బాహ్యముగ నున్న దానివలె భాసించుచున్నదని భావము.

అయిన, స్వాత్మయందు ప్రపంచము అధ్యస్తమైనచో, బాధితము కావలసియుండును. ఎన్నడును తాదృశమైన బాధ (కన్పడకపోవుట) అనుభవమునకు వచ్చుట లేదు. ('నను స్వాత్మని ప్రపంచోఽధ్యస్తశ్చేద్బాధ్యేత. స చ కదాచిదపి బాధోఽనుభూయతే'.)

కాన, ప్రపంచము ఆత్మయందు అధ్యస్తము కాదు; పరమార్థమున, ప్రపంచము ప్రత్యగాత్మకంటె భిన్నముగా బాహ్య దేశమున నుండనే యున్నది యను ఆశంక యుదయించు చున్నది. తన్నివృత్తికై సమాధానము చెప్పబడుచున్నది- స్వప్న ప్రపంచము అధ్యస్తమయ్యును, సత్యమువలె భాసించు చున్నది. మేల్కాంచినంతనే ఆ స్వప్న ప్రపంచము బాధిత మగుచున్నది. అటులనే, ఈ జాగ్రత్ప్రపంచము కల్పితము, బ్రహ్మతత్త్వ జ్ఞానమునకు ముందు సత్యముగనే భాసించును.

అయినను, పరమ దయాళువు, సాక్షాత్తు పరమేశ్వరావతార మూర్తియు నగు ఆచార్యునిచేత నుపదేశింపబడిన 'తత్త్వమసి' మున్నగు మహావాక్యములచే గలిగిన ప్రత్యగ్బ్రహ్మైక్యానుభూతి సాక్షాత్కరించినంతనే యీ జాగ్రత్ప్రపంచము సమూలముగా బాధిత మగును; అంత, నది ప్రత్యగభిన్న అద్వితీయ బ్రహ్మమాత్రముగా శేషించి యుండు నను అభిప్రాయముతో 'యస్సాక్షాదిత్యాది' గ్రంథము ప్రవృత్తమైనది. యః-అధ్యస్తమైన ప్రపంచమునకు అధిష్ఠానభూతుఁడయిన ప్రత్యగాత్మ, ప్రబోధసమయే - గురువుచే నుపదేశింపబడిన మహావాక్యజన్యమైన జ్ఞానోదయకాలమున, అద్వయం - సర్వప్రపంచము సమూలముగ బాధిత మగుట వలన, ఆకాశాది ద్వైతరహితము; స్వాత్మానమేవ - ఆకాశాదులకు అధిష్ఠానమైన బ్రహ్మకంటె అభిన్నము; సచ్చిదానందాత్మకము నగునది ప్రత్యగాత్మయే; సాక్షాత్కురుతే— "సచ్చిదానందాత్మకమైన బ్రహ్మను నేనయి యున్నాను" అని ప్రతిబంధరహితముగ అవ్యవధానముగ, అనుభవించును; "యత్రత్వస్య సర్వ మాత్మైవాభూత్తత్కేన కం పశ్యేత్" అను బృహదారణ్యక శ్రుతివచనము ఉక్త విషయమునే స్పష్టము చేయుచున్నది. తస్మై - పూర్వోక్త గుణసంపన్నుఁడగున; శ్రీ గురుమూర్తయే - శ్రీ గురువు అనగా, సాక్షాత్కృత బ్రహ్మతత్త్వసంపన్నుఁడు, త్రివిధ పరిచ్ఛేద శూన్యుఁడు, జ్ఞానోపదేష్టయు నగు పురుషుఁడు; తన్మూర్తయే-

తద్రూపమున ఉన్న, (శ్రీ) దక్షిణామూర్తయే - దక్షిణా దిశగానభిముఖుడై యున్న (శ్రీ) దక్షిణామూర్తికి నమః - నమస్కారము.

"పరమాద్వైతవిజ్ఞానం కృపయా వై దదాతి యః ।
సోఽయం గురు ర్గురు స్సాక్షాచ్ఛివ ఏవ న సంశయః ॥"

ఇత్యాది వచనశతముల వలన జ్ఞానోపదేష్ట యగు గురువు, సాక్షాత్తు పరమేశ్వరు డనియే తెలియవలెను. అథవా, సచ్చిదానందాత్మకము, (శ్రీమతే) అతిమహత్తరము (గుర్వే) నగు స్వరూపము (మూర్తిః) తో నొప్పారునట్టి (శ్రీ) గురుమూర్తికి నమస్కార మనియు చెప్పికొనవచ్చును. అథవా, శ్రియా - అనాది, అచింత్యయు నగు మాయాశక్తి చేత, దక్షిణః - సృష్టి, స్థితి, లయ రూప విశిష్ట రచనయందు నిపుణుడు, "అస్థూల మనణు" ఇత్యాది బృహదారణ్యక శ్రుతి వచనానుసారము పరమార్థమున అమూర్తి, అనగా ఆకార విశేష రహితుడు (దక్షిణశ్చాసౌ అమూర్తిశ్చ దక్షిణామూర్తిః). తాదృశ మహిమోపేతుడగు (శ్రీ) దక్షిణామూర్తికి ఇదం నమః - ప్రహ్వీభావము అగు గాక. ప్రహ్వీభావ మనగా, పరమేశ్వరునియందు ఏకత్వభావముతో స్వాత్మసమర్పణము (ప్రహ్వీభావశ్చ స్వాత్మనః పరమేశ్వరే ఏకత్వేన సమర్పణమ్).

ఈ శ్లోక పూర్వార్ధముచేత 'త్వం' పదార్థము చెప్పబడినది; ఉత్తరార్ధమునందు 'శ్రీ గురుమూర్తయే' 'శ్రీ దక్షిణా

మూర్తయే' అను పదద్వయముచేత మూర్తామూర్తరూపము గల 'సత్' పదార్థము ప్రతిపాదింపబడినది. 'స్వాత్మానం' 'అద్వయం' అను పదద్వయ సామానాధికరణ్యముచేతను, 'యత్, తత్' శబ్దముల చేతను ప్రత్యగ్బ్రహ్మైక్యలక్షణ మయిన వాక్యార్థము ప్రతిపాదితము.

"ఈశ్వరో గురు రాత్మేతి మూర్తి భేదా విభాగినే ।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥"

యనుచు వార్తికకారులైన శ్రీ సురేశ్వరులు పూర్వ ప్రతిపాదితార్థమునే చెప్పియున్నారు.

శ్రీ సురేశ్వరాచార్యకృత

# మానసోల్లాసః

## ప్రథమోల్లాసః

వార్త్తికము

మంగళం దిశతు మే వినాయకో
మంగళం దిశతు మే సరస్వతీ ।
మంగళం దిశతు మే మహేశ్వరీ
మంగళం దిశతు మే సదాశివః ॥ ౧

**పీయూషవర్షిణి**

భాష్యకారులైన శ్రీ శంకరభగవత్పాదులు మందమతులైన తత్త్వజిజ్ఞాసువులను అనుగ్రహించుటకై దక్షిణామూర్తి స్తోత్ర వ్యాజముతో సమస్త వేదాంత రహస్యమును పది శ్లోకములలో నావిష్కరించిరి. శ్రీ భగవత్పాదుల శిష్యులగు, శ్రీ సురేశ్వరాచార్యులు శ్రీ దక్షిణామూర్తి స్తోత్ర ప్రతిపాదిత తత్త్వము నావిష్కరించుటకై 'మానసోల్లాస' మను పేరుతో నొప్పారు వార్త్తిక గ్రంథమును పది యుల్లాసములుగా రచించిరి. నిర్విఘ్న పరిసమాప్తి కొఱకు, శిష్టాచార సంరక్షణార్థము 'మంగళం దిశతు' అనుచు మంగళాచరణపూర్వకముగ వార్త్తిక గ్రంథము నారంభించుచున్నారు.

వార్త్తికము

**ఆత్మలాభాత్పరో లాభో నాస్తీతి మునయో విదుః ।**
**తల్లాభార్థం కవి స్స్తౌతి స్వాత్మానం పరమేశ్వరమ్ ॥** ౨

## పీయూషవర్షిణి

శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము వేదాంతశాస్త్రమునకు ప్రకరణ గ్రంథము. అది శాస్త్రైకదేశ సంబద్ధము. తత్ప్రదర్శనమునకై శాస్త్రీయ విషయ ప్రయోజనములను ఈ వార్తికము ద్వారా శ్రీ సురేశ్వరులు నిర్దేశించు చున్నారు.

స్వస్వరూపమైన ఆత్మలాభముకంటె నుత్కృష్టమైన మఱియొక లాభము లేదని తపస్సమాధినిష్ఠులైన ఆపస్తంబాది మునులు ఎఱుంగుదురు. ఆ యాత్మస్వరూపప్రాప్తికై భగవత్పాదశంకరులు స్వాత్మరూపులైన పరమాత్మను స్తుతించుచున్నారని భావము.

ఆత్మరూప మేమి ? తల్లాభమనగా నేమి ? ఈవిషయము నవగతము చేసికొనవలసి యున్నది.

"యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ ।
యచ్చాస్య సన్తతో భావ స్తస్మా దాత్మేతి గీయతే ॥"

అని ఆత్మశబ్ద నిర్వచనము. జాగ్రత్, స్వప్న, సుషుప్తి రూపమైన అవస్థాత్రయమునందు ద్రష్టయగు నిత్యతత్త్వమే ఆత్మ యని భావము.

ఆత్మ, స్వస్వరూపమే యగుటచేత నిత్యప్రాప్తమై యున్నది. ఆత్మప్రాప్తి యనగా, ఆత్మజ్ఞానము. ప్రత్యగాత్మ బ్రహ్మభిన్ననిగా తలపింపజేయునట్టి యజ్ఞానమును నాశ

పొందించుటయే ఆత్మలాభము. ('ఆత్మా ప్రత్యక్షమనః సర్వసాక్షీ, తస్య లాభః పరాగర్థసంభేదనేన ఉద్ధృత్య బ్రహ్మరూపేణ అవగతిః')

"ఆప్తకామ స్స్వాత్మకామః" అను శ్రుతివచనము సారము ఆత్మకాముడు సర్వకామపూర్తియగును. ఇక, ఆత్మవేత్త విషయము చెప్పనేల? కావున, ఆత్మజ్ఞానలాభము సర్వోత్కృష్టమైన లాభము.

"ఆత్మలాభా న్న పరం విద్యతే" (ఆప. ధ. ౧. ౧. ౧) యని ఆపస్తంబాదులు ఆత్మలాభము సర్వోత్కృష్టమని మహోన్నతాశయమును సంకీర్తనము చేసినారు. మననశీలురైన మునులు, పరమహంసలు సర్వశ్రేష్ఠమైన ఆత్మలాభము కొఱకు సర్వపరిత్యాగము చేయుదురు.

కవి యనగా క్రాంతదర్శి. ఈ వార్తికమున ప్రయుక్తమైన 'కవి' శ్రీమచ్ఛంకరభగవత్పాదులను సూచించును. భగవత్పాదులు అంతరాత్మ యగు పరమేశ్వరుని స్తుతించుచున్నారు.

అంతరాత్మ, పరమాత్మల ఐక్యమే వేదాంతశాస్త్ర ప్రతిపాద్య విషయము; ఆత్మప్రాప్తి యీ గ్రంథమునకు ప్రయోజనము. ("నిరస్తాజ్ఞాన తత్కార్య ప్రపంచ బ్రహ్మాత్మనా అవస్థానం ప్రయోజనం 'బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి' ఇత్యాది శాస్త్రసిద్ధముక్తమ్. స్వాత్మానం పరమేశ్వరత్వేన సాక్షాదపరోక్షకరణాత్ తత్త్వంపదార్థైక్యం శాస్త్రవిషయో దర్శితః")

### వా ర్తి క ము

**స్వేచ్ఛయా సృష్ట మావిశ్య విశ్వం యో మనసి స్థితః ॥**
**స్తోత్రేణ స్తూయతేఽనేన స ఏవ పరమేశ్వరః ॥ ౩**

### పీ యూ ష వ ర్షి ణి

శాస్త్రీయ విషయ, ప్రయోజనములను స్వరూపతః, నిర్దేశించి యీ స్తోత్రమునందలి ప్రకరణత్వ లక్షణమును స్పష్టము చేయుచున్నారు.

స్వేచ్ఛ చేత సృష్టమైన విశ్వమునందు ప్రవేశించి అంతఃకరణావస్థితుడైన పరమేశ్వరుడే యీ స్తోత్రముచేత సంకీర్తింపబడు చున్నాడు.

ఈ సృష్టికి మూలకారణము ఆ పరమేశ్వరుని స్వేచ్ఛయే ('స్వేచ్ఛా నామ స్వశక్తి ర్మాయాఽఽఖ్యా'). సమష్టి వ్యష్టి సంసారములు రెంటియందును పరమాత్మ ప్రవేశించును, ఇచట ప్రవేశమనగా, అవస్థానమే- ఉండుటయే. సంసారము తద్భిన్నము కాదని భావము. పరమాత్మ సర్వగతుడయినను, మనస్సునందు (అంతఃకరణమునందు) విశేషముగ భాసించును. అనగా, మనస్సు స్వతః తేజోద్రవ్య మగుటవలన, పరమేశ్వరుడు అచట విశేషముగా నభివ్యక్త మగును. మనస్సు అనగా వృత్తిమదంతఃకరణ మని తెలియవలయును. అట్టి పరమేశ్వరుడు స్తుతింపబడుచున్నాడు. 'ఆభాసద్వారా ప్రవిశ్య యో మనసి వృత్తిమదంతఃకరణే స్థితః, తత్ర విశేషరూపేణ అభివ్యక్తి ముపగతః, స ఏవ పరమేశ్వరః అనేన స్తోత్రేణ స్తూయతే.

స్తుతి యనునది సర్వాతిశాయియైన పరమేశ్వరుని విషయములో నెట్లు పొసగును? అనిన, పరమేశ్వరుని అత్యంత సాన్నిధ్యానుసంధానమును చేయుటయే స్తుతి. అథవా, ప్రపంచస్థితిహేతువయిన పరమేశ్వరుని ప్రకాశమానంగా సర్వాత్మముతో ప్రతిపాదించుట స్తుతి యనబడును. అనగా, పరమేశ్వరుని అజ్ఞానము వలన [illegible]. తదజ్ఞాన నివృత్తికై స్తుతిశబ్దవాచ్య మగు [illegible] నగును. వస్తుతః, పరమేశ్వరుడు దేశకాలపరిచ్ఛేదరహితమగు స్వస్వరూపమునందే యుండును. కాని, ఏ వ్యక్తికి జ్ఞానావరణము ఉండునో, ఆ వ్యక్తికి పరమేశ్వర స్తుతి యావశ్యకర్తవ్యమై యుండునని భావము. ఈవిధముగా శాస్త్రైకదేశత్వము, ఈ స్తోత్రమునకు గలదని ప్రతిపాదనము చేయబడినది.

### వా ర్తి క ము

అస్తి ప్రకాశత ఇతి వ్యవహారః ప్రవర్తతే ।
తచ్చాస్తిత్వం ప్రకాశత్వం కస్మిన్నర్థే ప్రతిష్ఠితమ్ ॥ ౩

### పీ యూ ష ప త్రి కా

"శాస్త్రైకదేశ సంబద్ధం శాస్త్రకార్యాంతరే స్థితమ్" అను ప్రకరణ గ్రంథలక్షణము ననుసరించి, శాస్త్రైకదేశాంతరస్థితత్వ మనెడి లక్షణమును ప్రదర్శించి శాస్త్రార్థ నిరూపణము చేయబడుచున్నది.

అస్తి (ఉన్నది), ప్రకాశతే (ప్రకాశించుచున్నది) అను వ్యవహారము లోకమున ప్రవృత్త మగుచున్నది.

3)

ఆ అస్తిత్వ, ప్రకాశత్వములు, అన్యనిరపేక్షమైన యే పదార్థమునందు పర్యవసితములగు ? నని శిష్యుని ప్రశ్న.

యాదృచ్ఛికములైన అనేక పూర్వ జన్మలలో చేయబడిన సుకృతపుంజ పరిపాకవశము చేత సాధకుడు వివేక వైరాగ్యసంపన్నుడు, శమ దమాది గుణసంపన్ను డగును. ఆపాతజ్ఞానముచేత, వ్యవహార కాలమునందు దృశ్య సర్వ పదార్థముల యందు సత్తాప్రకాశములను గాంచును. కాని, ఆ సత్తాస్ఫురణములు దృశ్యధర్మములు కావు ('ఆపాతాలోచనయా సర్వపదార్థేషు దృశ్యేషు వ్యవహారకాలే అవభాసమాన మస్తిత్వం, ప్రకాశత్వం చ న దృశ్యధర్మౌ'). దృశ్యత్వవ్యావృత్తి యందు సయితము, అస్తిత్వప్రకాశత్వములకు వ్యావృత్తి లేదని తెలిసికొని, సర్వ దృశ్యపదార్థముల యందు అనుగతములై యున్న యీ అస్తిత్వ ప్రకాశత్వముల ధర్మము లేవియో తెలియనివాడై గురూపసదనము చేసి శిష్యుడు ప్రశ్నించునని భావము.

వా ర్తి క ము

**కిం తేషు తేషు వాఽర్థేషు కిం వా సర్వాత్మనీశ్వరే ।**
**ఈశ్వరత్వం చ జీవత్వం సర్వాత్మత్వం చ కీదృశమ్ ॥ ౫**

పీ యూ ష వ ర్షి ణి

అస్తిత్వ ప్రకాశత్వములకు ఆధారమైన యీ వస్తువు అనుభూయమానములగుచున్న పదార్థముల యందు ఉండునా ?

అథవా, సర్వాత్మరూపమైన యీశ్వరుని యందును గలదా? ఈశ్వరభావ, జీవభావ, సర్వాత్మభావముల స్వరూపము లెట్టివి?

## విశేష వివరణము

సత్తాప్రకాశములు రెండును భాసించు పదార్థములో ఆ సత్తాప్రతీతులకు అధిష్ఠానములేవి? యను శంక మొదటిది. విశేషణ నిర్దేశరహితముగా పదార్థస్వరూపమును కంటె నతిరిక్తమైన సత్తాప్రకాశముల యందు భేదము తెలియరాదు. ఆ కారణముచేత సామాన్యము వలె సామాన్య పదార్థముల యందును, సర్వానుస్యూతమును, ఏకమునైన పదార్థము నందును, సత్తాప్రకాశములు రెండును ప్రతిష్ఠితములై యున్నవా? యని ద్వితీయ శంక ('కిం చ విశేషణోల్లేఖ మన్తరేణ అనయోః ప్రతివ్యక్తి స్వరూప భేదానవగమాత్ సామాన్యమివ తత్తద్వ్యక్తిషు సర్వానుస్యూతే ఏకస్మిన్ తదుభయం ప్రతిష్ఠిత మితి ద్వితీయా శఙ్కా').

వార్త్తికమున 'సర్వాత్మనీశ్వరే' యని యీశ్వరునకు విశేషణనిర్దేశము చేయబడినది. 'సర్వాత్మని' యను విశేషణ నిర్దేశము లేక, సర్వవ్యాపక సత్తా, జ్ఞానములకు భేదము అనుభవమునకు రాదు; అనగా, పదార్థస్వరూపాతిరిక్తమైన సత్తాజ్ఞానముల యందు భేదానుభవము కలుగకపోవుటయే గాక, సర్వత్ర, కేవల సత్తాజ్ఞానముల ఏకరూపానుభవమే కలుగును. ఈ ప్రత్యక్షానుభవము, వాని ఏకాశ్రయత్వమునే సూచించును. ఒకే సత్తను, జ్ఞానమును అంగీకరించి,

ఉపాధి భేదము చేత భేదానుభవమును అంగీకరించినప్పుడు లాఘవరూప మనెడి అనుమానము, ప్రత్యక్షమునకు పోషక మగును. ప్రత్యక్ష, అనుమాన ప్రమాణముల వలన, సత్తా జ్ఞానములు సర్వరూపమైన ఒకే యధిష్ఠానమునందు గలవని అంగీకరింపనగును. ఆ సర్వరూపాధిష్ఠానము ఎవరు? అని ప్రశ్న యుదయించును. "ఈశావాస్య మిదగ్ం సర్వమ్", "తస్య లోక స ఉ లోక ఏవం" అను శ్రుతివాక్యములు ఆయన పరమేశ్వరుడని స్పష్టముగా చెప్పుచున్నవి.

కులాలుడు ఘటముకంటె భిన్నుడై ఘటనిర్మాణము చేయునట్లు, ఈశ్వరుడు జగత్తుకంటె భిన్నుడై జగత్తును సృజించునా? లేక తానే జగద్రూపు డగునా? అనగా, ఈశ్వరుడు ఈ జగత్తునకు నిమిత్తకారణమా, లేక ఉపాదాన కారణమా? అథవా, అభిన్న నిమిత్తోపాదాన కారణమా?

ఇంతియేగాక, తంతువు వస్త్రమునకు కారణమైనటుల, ప్రపంచమునకు ఈశ్వరుడు ఆరంభోపాదానకారణ మని నైయాయికుల సిద్ధాంతము. పాలనుండి పెరుగు పరిణామము చెందినట్లు ఈశ్వరుడు విశ్వమునకు పరిణామి ఉపాదానకారణ మని సాంఖ్యుల మతము. శుక్తిరజతము వలె ఈశ్వరుడు అధిష్ఠానరూపముతో సత్తాదుల నొసగి వివర్తపరిణామ కారణ మని అద్వైతవేదాంతుల సిద్ధాంతము. ఇటుకలు, సున్నము మొదలగునవి గృహమునకు సంఘాతోపాదాన కారణమైనట్లు,

జీవత్వం సుషుప్త్యాదేరివ స్వవికారైః ముఖ్యమేవ చ సర్వాత్మత్వం భవేత్, తత్సర్వం జీవస్తత్త్వతః కథం జానీయాత్?)

ఆత్మజ్ఞానఫలము పుణ్యవిశేషమా, లేక బ్రహ్మలోక, వైకుంఠలోకాది లాభమా? లేక లౌకికసుఖసాధనమా? అథవా శోకమోహాదుల వలన గలుగు సమస్త సంసారనివృత్తి రూపమైన పునరావృత్తిరహిత జీవన్ముక్తియా? కైవల్య ముక్తియా?

మఱియు, జ్ఞానఫలము నిత్యమా, లేక అనిత్యమా? స్వర్గాదులవలె అప్రాప్తప్రాప్తియా, లేక కంఠగత చామీకరము (మాల) వలె ప్రాప్తప్రాప్తియా? ('స్వర్గాదివత్ ప్రయత్నసిద్ధం, అప్రయత్నసిద్ధం వా కంఠగత చామీకరవదిత్యర్థః'). జీవేశ్వరులకు ఏకత్వము, తాదాత్మ్యము ఎట్లు కలుగును? విరుద్ధ స్వభావము గల జీవేశ్వరుల యేకత్వము కేవల ప్రతీతి మాత్రమా? ఏదియో యొక యుపాసన కొఱకు సాలిగ్రామమునందు విష్ణుభావన వలె, గుణవిశేషముయొక్క యేకత్వనిమిత్తమై ఏకత్వము ప్రతిపాదింపబడినదా?

వార్తికము

శ్లో॥ సర్వజ్ఞ స్సర్వకర్తాచ కథమాత్మా భవిష్యతి ।
శిష్యం ప్రతీత్థం పృచ్ఛన్తం వక్తు మారభతే గురుః ॥

పీయూషవర్షిణీ

అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడు నయిన జీవుడు, ఏ సాధనముచే నయినను, సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వాది గుణ

సంపన్నుడగుట యెట్లు? సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వ రూపము ఆచ్ఛాదిత మగుటవలన, స్వస్వరూపస్మృతి మాత్రము చేతనే అతని సహజ గుణములు అభివ్యక్తము లగునా? లేక, అతడు స్వరూపము చేత అల్పజ్ఞుడు, అల్పశక్తి మంతుడుగనే యుండునా? కేవలము ప్రశంసామాత్రమున సర్వజ్ఞుడని చెప్పబడెనా? అట్లయిన, పరమేశ్వరుడు జీవుడయి యుండినచో, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుడు ఏ కారణము చేత, ఏ విధముగా, అల్పజ్ఞుడు, అల్పశక్తి మంతు డాయెను? ఇట్లు ప్రశ్నింపగా గురువు చెప్పదొడంగెను.

## విశేష వివరణము

"నాపుత్రాయ నాశిష్యాయ వా దద్యాత్" అను వచనము ననుసరించి పుత్రుడు, శిష్యుడు ఆత్మజ్ఞానోపదేశమునకు అర్హులని తెలియుచున్నది. శిష్యుడు కాక, జ్ఞానోపదేశము నొందినను అది సఫలము కానేరదు. శిష్యుని పరీక్షించి, యుపదేశము చేయుట ఆచార్యుని కర్తవ్యము. శిష్యుడు జిజ్ఞాసువై పరిప్రశ్న చేయుసంతవరకు ఆత్మవిద్యోపదేశ గ్రహణమునకు యోగ్యుడు కానేరడు. తీవ్ర జిజ్ఞాస కలిగి నపుడే యతని చిత్తము సమాహిత మగును.

యోగ్యుడు, అధికారియు నగు శిష్యునకు విద్యోప దేశము చేయుట ఆచార్యుని కర్తవ్య మని శాస్త్రీయ మర్యాద. యోగ్యుడైన శిష్యునకు విద్యోపదేశము చేయుట వలన సంప్రదాయము రక్షింపబడును.

శ్రవణము, జ్ఞానప్రయోజకము; పుస్తకపఠనము కాదు. గురుముఖము ద్వారా శ్రవణము చేసినపుడే జ్ఞాన ప్రయోజకమైన అపూర్వము ఉత్పన్నమగును.

ఈవిధముగా, గ్రంథము గురుయొక్క ప్రయోజనమును ప్రతిపాదించి, శ్రీసురేశ్వరాచార్యులు "విశ్వందర్పణ దృశ్యమాననగరీతుల్యం" అను శ్లోకమునకు వార్తికరచన చేయుచున్నారు.

వా ర్తి క ము

**అన్తరస్మిన్నిమే లోకా అన్తర్విశ్వ మిదం జగత్ ।**
**బహిర్వన్మాయయాఽఽభాతి దర్పణే స్వశరీరవత్॥ ౮**

పీ యూ ష వ ర్షి ణి

సమస్త బ్రహ్మాండములు పరమాత్మకంటె బాహ్యములు, అనగా భిన్నములు. అవి స్వతంత్ర సత్త గలవి కావు. కావున, వానిని అంతరమున, అనగా పరమాత్మసత్తకు అధీనమైన సత్త గలవానినిగా భావింపనగును.

"బ్రహ్మైవ భూతానాం జ్యేష్ఠమ్, తేన కోఽర్హతి స్పర్ధితుమ్, బ్రహ్మన్ దేవా స్త్రయస్త్రింశత్, బ్రహ్మన్నింద్ర ప్రజాపతీ, బ్రహ్మన్ హ విశ్వా భూతాని"

అను తైత్తిరీయ బ్రాహ్మణవచనము చేత ఈ విషయమే యవగత మగుచున్నది.

దర్పణమునందు ప్రతిబింబితమైన నగరము దర్పణము కంటె బాహ్యముగ (భిన్నముగ) ప్రతీతమగుచున్నట్లు, ప్రత్యగాత్మస్థితమైన జగత్తు మాయవలన తద్భిన్నముగ ప్రతీయమానమగుచున్నది. ('ఇదం విశ్వం దర్పణే ప్రతిబింబితమివ, దర్పణాన్తర్గతమివ అన్తఃస్థమేవ విశ్వం మాయయా బహిర్వత్ ఆభాతి')

వా ర్తి క ము

స్వప్నే స్వాన్తర్గతం విశ్వం యథా పృథగవేక్షతే।
తథైవ జాగ్రత్కాలేఽపి ప్రపంచోఽయం వివిచ్యతామ్॥౯

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు స్తోత్రమునందు ఈయబడిన నిద్రాదృష్టాంతము స్పష్టీకరింపబడుచున్నది.

స్వప్నదశలో అనుభూయమానములగు పదార్థములు జీవుని అంతఃకరణము కంటె బాహ్యములును గాదు; భిన్నములును గాదు. ఇది, సర్వసిద్ధాంతవాదులు అంగీకరించిన విషయము. కాని, స్వప్నకాలమునందు బాహ్యముగనే కన్పించును. ఆవిధముగనే జాగ్రద్దశయందు సయితము పదార్థములు బాహ్యముగనే ప్రతీతమగును. అయినను, వాస్తవమున కవి, ఆత్మనిష్ఠములే యని తెలియనగును.

వా ర్తి క ము

స్వప్నే స్వసత్తైవార్థానాం సత్తా నాన్యేతి నిశ్చితా।
కో జాగ్రతి విశేషోఽస్తి జడానామాశునాశినామ్ ॥ ౧౦

పీ యూ ష వ ర్షి ణి

స్వప్న దృష్టాంతముచేతనే సత్తాస్ఫురణములకు ఆత్మై కాశ్రయత్వము సిద్ధమగుచున్నదని ప్రతిపాదింపబడుచున్నది.

స్వప్నమునందు అనుభూతమయిన పదార్థసత్త, ఆత్మ సత్తయే గాని, అన్యసత్త కాదని నిశ్చితమైనది. జాగ్రద్దశ యందలి జడ, క్షణభంగుర పదార్థములయందు అధిక విశేష మేమి కలదు ?

**విశేష వివరణము**

స్వప్నమునందు, ఇంద్రియోపరమము వలన, బాహ్య పదార్థములు అనుభూయమానములు కాకపోవుట ప్రత్యక్షా నుభవసిద్ధము. స్వప్నమునందు అనుభూతమైన దేశ, కాల, వస్తువులు జాగ్రత్కాలమునందలి అనుభవముకంటె విరుద్ధము లగుట రూప, అనుమానాదులచే గూడ సిద్ధము. రాత్రి సమయమున పగటి సూర్యుని జూచుట, మృత వ్యక్తిని జీవించి యున్నట్లు గాంచుట మొదలగు విరోధములు స్పష్టములే. "న తత్ర రథా న రథయోగాః" (బృ.౪-3-౧౦), "స యత్ర ప్రస్వపి త్యస్య లోకస్య సర్వావతో మాత్రా మపాదాయ" ఇత్యాది శ్రుతులు ఇందుకు ప్రమాణములు.

అంతరమున, యోగ్య దేశకాలములు లేకపోవుట స్పష్టమే. కావున, అచట వాస్తవమైన దృశ్య పదార్థములు లేవనునది విస్పష్టము. పదార్థమునకు వాస్తవికతయే లేనపుడు, జాతిరూప సత్త గాని, కార్యరూప సత్త గాని యెట్లు

అంగీకరింపబడును? కావుననే, శ్రుతి, దానిని వాసనను (సంస్కారమును) సృష్టికారణముగా చెప్పుచు, దానికి దర్శనమాత్రము విషయముగా అని చెప్పుచున్నది.

"అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే"(బృ-3-౧౦). కావుననే, స్వప్నమునందు పదార్థముల సత్త, ఆత్మరూపమనియే యంగీకరింపవలసి యుండును.

స్వాప్నములగు పదార్థములు నాశస్వభావము కలవగుటచేత ద్రష్టకంటె భిన్నములు కానట్లు, జాగ్రత్ కాలమునందలి పదార్థములు ద్రష్టయగు సాత్మకంటె భిన్నములు కావు. అయిన, వానిని ద్రష్టకంటె భిన్నములని భావించుట యెట్లు పొసగును? అనినచో, స్వప్నమునందలి పదార్థములు నిద్రాదోషగ్రస్తము లయినట్లునే జాగ్రద్దశయందలి పదార్థములు అవిద్యాదోషజుష్టములు. అందువలననే యవి అంతరమున నున్నను, బాహ్యప్రదేశమునందు భిన్న సత్త గలవిగా నున్నట్లు భాసించును. కనుక, పదార్థముల మిథ్యాత్వము స్పష్టమగుచున్నది.

ఆరోపితమైన సత్త, అధిష్ఠానసత్త కంటె నతిరిక్తము కాదు. సర్పసత్త, రజ్జుసత్త కంటె భిన్నము కానిరీతిగనే, పదార్థసత్త ఆత్మభిన్నము కాదు.

('ఆరోపిత స్వాధిష్ఠాన సత్తావ్యతిరేకేణ సత్తాఽనిరూపణాత్ అధిష్ఠానభూతాత్మసత్తైవ స్వప్నే సర్వస్య సత్తా, న పృథగితి సిద్ధమ్')

ఇచట యీ రీతిగ అనుమానరచన చేయబడును.

1) జాగ్రద్దృష్టార్థాః ఆత్మసత్తయైవ సత్తావన్తః, తస్మిన్నేవా వ్యభిచారేణోపలభ్యమానత్వాత్, స్వాప్నార్థవత్.

2) జాగ్రద్దృష్టార్థాః స్వసత్తారహితాః, జడత్వాత్, స్వాప్నార్థవత్.

3) జాగ్రద్దృష్టార్థాః అన్యసత్తయైవ సత్తావన్తః జడాశ్చ, అవ్యభిచరితేఽర్థే ఉపలభ్యమానత్వే సతి వ్యభిచారిత్వాత్, ఆశుతర వినాశిత్వాద్వా, రజ్జ్వాం సర్ప, ధారా, దండ, మాలాదివత్, స్వాప్నార్థవచ్చ.

### వార్తికము

**స్వప్నే ప్రకాశో భావానాం స్వప్రకాశాన్న హీతరః ।**
**జాగ్రత్యపి తథైవేతి నిశ్చిన్వన్తి విపశ్చితః ॥ ౧౧**

### పీయూషవర్షిణి

స్వప్నావస్థయందు స్వ (ఆత్మ) ప్రకాశము వలన భావముల (పదార్థముల) జ్ఞానము (ప్రకాశము) కలుగును. వలన, అపుడు మఱియొక ప్రకాశము లేనేలేదు. ఆరీతిగనే జాగ్రదవస్థలో సయితము ఆత్మప్రకాశాతిరిక్తమైన ప్రకాశము (జ్ఞానము) లేదని విద్వాంసుల (జ్ఞానుల) నిశ్చయము.

### విశేష వివరణము

ఈవిధముగా స్వప్నదృష్టాంతము ద్వారా సత్తా, స్ఫురణములకు ఆశ్రయము ఆత్మయే యని ప్రతిపాదింప

వాని యపేక్ష యుండరాదు. ఇంద్రియాదులు నిరర్థకములని బౌద్ధులు దక్క అన్యులెవరును అంగీకరింపరు; మఱియు నిది ప్రత్యక్షనిరుద్ధము గూడ. కావున, పై అనుమానరచన నిష్ప్రయోజన మను శంక అపాస్తము, నిర్మూలము. ('నచాప్రయోజకత్వం శంక్యమ్, దృశ్యానా మపి అనన్యాధీన ప్రకాశత్వే సతి ఇంద్రియాద్యనపేక్షణాత్ తత్సంప్లప్తిపై యర్థ్య ప్రసంగాదితి ద్రష్టవ్యమ్')

విద్వాంసులైన జ్ఞానులు అనుమాన ప్రమాణముచేత గాని, ఆత్మ సాక్షాత్కారానుభవముచేత గాని, దృశ్యపదార్థసత్తను అధిష్ఠానసత్తారూపమని, తత్పదార్థజ్ఞానము సయితము తద్రూపమే (అధిష్ఠానసత్తారూపమే) యని నిశ్చయింతురు.

వార్తికము

**నిద్రయా దర్శితా నర్థా న్న పశ్యతి యథోత్థితః ।**
**సమ్యగ్ జ్ఞానోదయా దూర్ధ్వం తథా విశ్వం న పశ్యతి॥౧౨**

పీయూషవర్షిణి

ఇపుడు మూఢదశలోనే ప్రపంచదర్శనమును ప్రతిపాదించి, ఆత్మసత్తానిత్యత్వ, ఆత్మజ్ఞాన నిత్యత్వములను ప్రతిపాదించుచున్నారు.

నిద్రనుండి మేల్కాంచిన పురుషుడు నిద్రాదోషము ద్వారా చూచిన స్వప్న పదార్థములను చూడడు. ఆ రీతిగనే చక్కగ జ్ఞానోదయమైన తరువాత జ్ఞానియైనవాడు విశ్వమును జూడడు.

యున్న చందమున, జ్ఞానిదృష్టి విశ్వమునందు గాక, తదధిష్ఠాన మైన బ్రహ్మవస్తువునందే ఏకాయత్తమై యుండును.

'విశ్వం' అను పదము జాగ్రద్దశాభిమాని యగు జీవునకు గూడ వాచకము. కావున, జ్ఞాని జీవభావముతో తనను చూడడని, బ్రహ్మభావము (అహం బ్రహ్మాస్మి) తోనే చూచు ననియు దీని భావము, అతని జీవభావము గళితమై (కరగి) పోవునని యర్థము.

వార్తికము

**అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే ।**
**అజన్మనిద్ర మస్వప్న మద్వైతం బుధ్యతే తదా ॥ ౧౬**

పీయూషవర్షిణీ

అద్వైతానుభవమును శ్రీ గౌడపాదాచార్యుల మాటలలో చెప్పుచున్నారు.

అనాది మాయావశమున సుప్తుడైన జీవుడు మేల్కొలుప బడినపుడు జాగ్రత్, స్వప్న, సుషుప్తిరహితమైన అద్వయ బ్రహ్మను సాక్షాత్కరించుకొనునని భావము.

'యదా జీవః ప్రబుధ్యతే' అని యనుటచేత బ్రహ్మ జ్ఞానము దుర్లభము అని తెలియవలయును. అనేక జన్మార్జిత సుకృత విశేషము చేతనే జ్ఞానమునందు ప్రవృత్తి కలుగును. "బహూనాం జన్మనా మన్తే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (గీ. ౭-౧౯) "అనేక జన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్" (గీ. ౬-౪౫)

తత్త్వము అద్వైతము. కావున, అధ్యాత్మ జ్ఞానోదయము స్వతంత్రము కాదు; శ్రుతి, గుర్వధీన మని తెలియనగును. శ్రీశంకరభగవత్పాదులు గూడ, ఎంతటి మహాశాస్త్రవేత్త యయినను, స్వబుద్ధిబలముచేత స్వతంత్రముగా బ్రహ్మాన్వేషణము చేయ జనదని నిషేధించి యున్నారు. "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్" (ము. ౧-౨-౧౨) "ఆచార్యాద్ధి ఏవం విద్యా విదితా సాధిష్ఠం ప్రాపయతి" (ఛా. ౪-౯-3) అనుచు శ్రుతులు జ్ఞానము గురుముఖైకవేద్యమని కంఠోక్తిగా చెప్పుచున్నవి.

"తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।

ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥" (గీ.౪-3౪)

అనుచు ఉక్తవిషయమునే సమర్థించుచున్నది.

వా ర్తి క ము

**శ్లో॥ శ్రుత్యాచార్యప్రసాదేన యోగాభ్యాసవశేన చ।**
**ఈశ్వరానుగ్రహేణాపి స్వాత్మబోధో యదా భవేత్॥**
**భుక్తం యథాఽన్నం కుక్షిస్థం స్వాత్మత్వేనైవ పశ్యతి।**
**పూర్ణాహన్తాకవలితం విశ్వం యోగీశ్వర స్తథా॥ ౧౫**

పీ యూ ష వ ర్షి ణి

గౌడపాదకారికావచన తాత్పర్యమునే వార్తికకారులు ప్రతిపాదించుచున్నారు.

శ్రుతి, గురుప్రసాదము వలన యోగాభ్యాస (నిదిధ్యాసన) బలముచేతను, ఈశ్వరానుగ్రహముచేతను స్వస్వరూపసాక్షాత్కార మగును.

అప్పుడు సుషుప్తిస్థమైన భుక్తాన్నమును మనుష్యుడు ఆత్మస్వరూపముగ జూచినట్లుగనే, యోగీశ్వరుడు పూర్ణాహంతచే కబళింపబడిన (పరమేశ్వరవ్యాప్తమైన) విశ్వమును జూచును.

## విశేష వివరణము

శ్రుతిమాతయందు అసాధారణమైన శ్రద్ధ యవసరము. అప్పుడే మహాశక్తిసంపన్నమైన వేదవాణి, సాధకుని అనుగ్రహించును. వేదవచనమే జ్ఞానోత్పాదనసమర్థము. వేదాంత మహావాక్యముల వలన అనాది మాయాపరిచ్ఛిన్నమైన జీవుడు మేల్కాంచి స్వస్వరూపావగతిని పొందును.

ప్రసన్నమైన యాచార్యుడే ఆత్మతత్త్వోపదేశము చేయును. ఆత్మవిద్యోపదేశసమర్థుడైన యాచార్యుడు సాంసారిక విషయములచేత ప్రభావితుడు కాడు. సర్వైషణాత్యాగ మొనర్చిన ఆచార్యుని వలననే ఆత్మజ్ఞానోపదేశము సంభవమగును. అట్టి గురువును సర్వాత్మనా ప్రసన్నుని జేసికొనుట శిష్యుని కర్తవ్యమని శాస్త్రము లుపదేశించుచున్నవి. గురువు శిష్యుని పూర్వజన్మానుగత దుష్టవాసనలను చూచును; ఆ వాసనలు ఉపశమించి శిష్యుని అంతఃకరణము ఈశ్వరాభిముఖమైనపుడే గురువు శిష్యుని ఎడ ప్రసన్నుడై ఆత్మతత్త్వోపదేశము చేయును.

"ఆచినోతి చ శాస్త్రాణి ఆచారే స్థాపయత్యపి।
స్వయ మాచరతే యస్మా దాచార్యః పరిగీయతే॥"

శాస్త్రజ్ఞాన సముపార్జనము చేయువాడు, శిష్యుని సదాచారమునందు నియోగించువాడు, స్వయముగ సదాచార నిష్ఠుడైనవాడు ఆచార్యనామముచే వ్యపదేశ్యుడగును. ఉపాసకుడు, భక్తుడు కానివాడు భక్తినుపదేశించునట్టియుపదేష్ట కానేరడు. గురువు సిద్ధుడయినను, సాధకుని వలె సదాచార పరాయణుడు కావలయునని శాస్త్రములు విధించుచున్నవి. సిద్ధుడయినను, సదాచారనిష్ఠుడు కానిచో, అతడు ఆచార్యత్వ పదమునకు అర్హుడు కాజాలడు. కాన, ఉన్మత్త, పిశాచాదుల వలె సంచరించు జ్ఞానులు ఆచార్యులు కాజాలరు. "ఆచార్యవాన్పురుషో వేద" "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః" ఇత్యాది శ్రుతులు ఆచార్యుని మహిమాతిశయమును సంకీర్తనము చేయుచున్నవి.

చిత్తైకాగ్ర్యమును అభ్యసింపకపోయినచో, వేదాంత జ్ఞానము సుదృఢము కాదు. కాన, యోగాభ్యాసము ఆవశ్యకమని తెలియనగును. యోగమునందు అనంత భేదములు గలవు. కావున, స్వగురూపదిష్టమైన యోగవిధానమునే సాధన చేయనగును.

సమస్త కార్యములయందు సాధారణముగా పరమేశ్వరుని కృప ఆవశ్యకము. విశేషించి, ఆత్మవిద్యమాత్రము పరమేశ్వరుని కృప మీదనే ఆధారపడియున్నది. నిష్కామ కర్మానుష్ఠానము వలననే పరమేశ్వరుని కృప లభించును. పరమేశ్వరుని అనుగ్రహము వలననే సద్గురులాభము

'జానీయాత్ కథం జీవః?' యను ప్రశ్నకు "అద్వైత ప్రత్యగాత్మరూపేణ జానీయాత్"- అద్వయ బ్రహ్మాభిన్న మైన ప్రత్యగాత్మగా తెలిసికొనవలయు నని సమాధానము చెప్పబడినది.

'యోగాభ్యాసవశేన' యనియు చెప్పబడినది. యోగాభ్యాసమనగా, నిదిధ్యాసనము. నిదిధ్యాసన పరుడైన మహాత్ముడే, పరమహంసవర్యుడు. అట్టి మహనీయుడే పరమహంసలకు జ్ఞానమార్గదర్శకు డగును. నిదిధ్యాసనపరుడైన సాధకుడే యోగీశ్వరు డగును. తాదృశ మహిమోపేతుడే గురుశబ్దవాచ్యుడు. కావుననే శాస్త్రములు గురువు దుర్లభు డని ఘంటాపథముగా చెప్పుచున్నవి.

శ్రీ వ్యాసభగవానుడు సూతసంహితాముక్తిఖండము నందు పరశివుడు సంసారమోచకుడనియు, గురువు సంసారమోచకప్రదుడనియు పరశివస్వరూపాభిన్నమైన గురుస్వరూపమును విశదముగా వర్ణించిరి. ఆ వచనములు ఇచట అనుసంధేయములు.

పరశివుడే సంసారమోచకుడు. తద్భిన్నులైన దేవత లందఱును సంసారబంధమోచకులైనను, వారొసగు మోక్షము శాశ్వతము కాదు. ఏలన, వారు జన్మ, నాశవృతులు. వారు సాలోక్య, సారూప్యాది ముక్తులు మాత్రమే యీయగల వారు. స్వస్వరూపావస్థానరూపముక్తినొసంగి సంసారబంధము నుండి ముక్తినను గ్రహింపగల సమర్థుడు పరశివుడు మాత్రమే యని యీ క్రింది వచనముల వలన తెలియును.

('ఆత్మతత్త్వవిషయం యదజ్ఞానం తస్యైవ తత్త్వవిదా ప్రతిబంధక అపస్మారరూపేణ ప్రాప్తస్య పృష్ఠే వామపాద దధానమిత్యర్థః'- తాత్పర్యదీపికా); జ్ఞానముద్రాలంకృతుడు; మునిసంఘ పరివేష్టితుడు; మాయావటవృక్షమూలాశ్రితుడు; స్వాత్మవిద్యాప్రదానముచేత సంసారమోచకుడు; పరమ కారుణికుడు; సర్వప్రాణిహితరతుడు; ఉపాసకుల యభీష్టము నీడేర్చువాడు; దక్షిణామూర్తిదేవు డను పేరుతో నొప్పార నట్టివాడు; జగత్సృష్టి స్థితి లయకర్త.

పై వచనముల వలన శ్రీదక్షిణామూర్తి పరశివాభిన్ను డని స్పష్టముగ విదిత మగుచున్నది. ఇంతియేకాక, యోగ పట్టావృత, జ్ఞానముద్రాధర, మునిసంవృత, మాయావట మూలాశ్రితాది శబ్దములు శ్రీ దక్షిణామూర్తి స్తోత్ర ప్రతిపాదిత దక్షిణామూర్తి స్వరూప స్వభావాది ప్రతిపాదకములుగా నున్నవి.

"రుద్ర యత్తే ముఖం తేన దక్షిణం పాహి మామితి" అను వచనము వలన అఘోరాఖ్య దక్షిణదిశాముఖుడైన పరశివుడే దక్షిణామూర్తిదేవు డని తెలియుచున్నది.

"పునర్దేవో మహాదేవో దక్షిణామూర్తిరీశ్వరః ।
ప్రదత్వా స్వాత్మవిజ్ఞానం తస్మై విప్రాయ సువ్రతాః ॥
తస్య సంసారవిచ్ఛేద మకరో దంబికాపతిః ।
బహవో దక్షిణామూర్తి ప్రసాదాదేవ జన్తవః ।
అనాయాసేన సంసారా ద్విముక్తాః పరమర్షయః ॥"

దక్షిణామూర్తి రూపముతో నున్న పరశివుడు సంసారబంధ మోచకుడనియు, శ్రీదక్షిణామూర్తి ప్రసాదము వలననే, జనన మరణరూప సంసారబంధమున చిక్కుకొనిన జీవులు, అనాయాసముగా సంసారబంధ విముక్తులగుదురనియు నవగత మగుచున్నది.

తాదృశ సచ్చిదానందమూర్తియైన శ్రీదక్షిణామూర్తి దేవుడు గురువులకు గురువు; ఆయన అద్వయ బ్రహ్మాత్మ తత్త్వము నుపదేశించునట్టి అతివర్ణాశ్రమి. గురుస్వరూపమును, అతివర్ణాశ్రమియైన యాచార్యలక్షణములను సూతసంహిత ఇట్లు వర్ణించుచున్నది.

"ఆచార్య ఏవ సంసారమోచకప్రద ఉచ్యతే ।
ఆచార్యో నామ వేదాన్త విచారేణాప్త వేదనః ॥"

ఆచార్యుడే సంసారమోచకప్రదుడని చెప్పబడును. వేదాంత విచారముచేత ఆత్మజ్ఞానము కలవాడే ఆచార్య శబ్ద వ్యపదేశ్యుడు. ఈశ్వరుడు సంసారమోచకుడని శ్రుతి, స్మృతి పురాణేతిహాసముల వలన తెలిసికొనుటకు నవకాశమున్నను, తత్స్వరూపమును ఆచార్యుని వలననే శ్రవణము చేసి తెలిసి కొనవలయును. కావుననే, ఆచార్యుడు సంసారమోచకప్రదు డని చెప్పబడినది.

ఈ గురువులు అయిదు విధములుగా నుందురు.

"బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః ।
అతివర్ణాశ్రమీ చేతి క్రమాత్ శ్రేష్ఠా విచక్షణ ॥"

అను సూతసంహితావచనానుసారము బ్రహ్మచారి, గృహస్థుడు వానప్రస్థుడు, సంన్యాసి, అత్యాశ్రమి యని గురువులు పం: విధములుగా నుందురనియు, వీరిలో నొకరికంటె మఱియొకరు క్రమముగా శ్రేష్ఠులనియు తెలియుచున్నది.

"అతివర్ణాశ్రమీ సాక్షాద్గురూణాంగురు రుచ్యతే ।
తత్సమో నాధికశ్చాస్మిన్ లోకేఽస్త్యేవ న సంశయః ॥
యః శరీరేంద్రియాదిభ్యో విభిన్నం సర్వసాక్షిణమ్ ।
పారమార్థిక విజ్ఞాన సుఖాత్మానం స్వయంప్రభమ్ ॥
పరతత్త్వం విజానాతి సోఽతివర్ణాశ్రమీ భవేత్ ॥"

అతివర్ణాశ్రమి యైనవాడు, అనగా శరీరేంద్రియ సంఘాతాభిమానముచేత కల్పితములైన వర్ణాశ్రమ ధర్మములను అతిక్రమించి, కేవల స్వస్వరూపావస్థానము కలవాడు సాక్షాత్తు గురువులకు గూడ గురువు; ఆయనకంటె నధికుడు గాని, తత్సమానుడు గాని, యీ సమస్త సృష్టిలో లేడనుట నిస్సంశయము.

శరీరేంద్రియాద్యతిరిక్తము, సర్వసాక్షిస్వరూపము, పారమార్థిక విజ్ఞాన సుఖాత్మకము, స్వయంప్రకాశము నగు పరతత్త్వమును అపరోక్షముగా సాక్షాత్కరించుకొనినవాడే యతివర్ణాశ్రమి యనబడును. ఇట్టి అతివర్ణాశ్రమియైన ఆచార్యశ్రేష్ఠుడే పరశివాభిన్న స్వరూపుడైన శ్రీదక్షిణామూర్తి. ఆ శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

వా ర్తి క ము

యథా స్వప్నే నృపో భూత్వా భుక్త్వా భోగా న్యభీప్సితాన్ ।
చతురంగబలోపేత శ్శత్రుం జిత్వా రణాంగణే ॥ ౧౬

పరాత్పరాజితో భూత్వా వనం ప్రాప్య తపశ్చరన్ ।
ముహూర్తమాత్ర మాత్మానం మన్యతే కల్పజీవనమ్ ॥ ౧౭

తథైవ జాగ్రత్కాలేఽపి మనోరాజ్యం కరోత్యసౌ ః
కాల నద్యోఘ యోగేన క్షీణమాయు ర్నపశ్యతి॥ ౧౮

పీ యూ ష వ ర్షి ణీ

ఇంతవఱకు స్తోత్రమునందలి పదములు వ్యాఖ్యాతములు. 'ఉక్త అనుక్త దురుక్త చిన్తాలక్షణం వార్తిక'మ్మని వార్తిక లక్షణము. ఇపుడు అనుక్తచింతారూపమైన వార్తిక లక్షణమును వ్యక్తము చేయును, శ్రీ సురేశ్వరులు స్తోత్రగత భావమును చెప్పబూని, వార్తికగ్రంథము నారంభించు చున్నారు.

స్వప్నమునందు, చతురంగబలోపేతుడైన మహారాజుగ సమరాంగణమునందు శత్రువులను జయించును; మఱియు, అభీష్టభోగముల ననుభవించును.

అనంతరము; ఆ మహారాజు శత్రువులచే పరాజితుడై, వనములకేగి తప మొనర్చుచు (కష్టముల ననుభవించుచు) అల్పకాలమునందే తనను కల్పాంతము జీవించి యున్నట్లు భావించును.

ఆరీతిగనే, ఈ చిదాత్మ, జాగ్రదవస్థయందు గూడ, మనోరాజ్యమును చేయును. కాని, కాలవేగముతో, నదీ వేగముతో గడచుచున్న (క్షీణమగుచున్న) ఆయుస్సును జూడడు.

స్వప్న దృష్టాంతము ద్వారా ఏకము, అఖండము నయిన చిదాత్మయందు ఈశ్వరభావము, జీవభావము రెండును మాయవలన కలుగుచున్నవని స్పష్టముచేసి, 'ఈశ్వరత్వం చ జీవత్వం సర్వాత్మత్వం చ కీదృశమ్?' అను ప్రశ్నలకు సమాధానము చెప్పుచున్నారు.

రాజు స్వప్నావస్థయందు స్వాతంత్ర్యమును అనుభవించును; ఆవిధముగనే, ఈశ్వరభావమునందు స్వాతంత్ర్యము ఆప్తకామత్వము ఉండును. రాజ్యము అపహరింపబడినపుడు స్వప్నమును జూచు మహారాజు పారతంత్ర్యము వలన సంతాప మనుభవించును. అదేవిధముగ, జీవభావములో గూడ పారతంత్ర్యము, అనాప్తకామత్వము ఉండును.

వస్తుతః, అఖండ చిదాత్మయే, సమస్త పదార్థములు తన యధీనములో నున్నట్లు, కోరికలన్నియు నీడేరినట్లు అనుభవము పొందినపుడు ఈశ్వరశబ్దవాచ్యు డగును. తాను, పరాధీనుడ నని యనుభవము కలిగినపుడు, అప్రాప్త విషయముల నభిలషించినపుడు జీవశబ్ద వ్యపదేశ్యు డగును.

ముహూర్తకాలము కన్పించు స్వప్నమునందు దీర్ఘకాలానుభవము ('ముహూర్తమాత్రం కల్పజీవనమ్') ప్రత్యక్ష సిద్ధము.

సాధారణముగ, జాగ్రద్దశనందలి అనుభవము యొక్క నైరంతర్యమును చెప్పుకొనుట అనుభవసిద్ధము. వస్తుతః, స్వప్నకాలమునందలి అనుభవము యొక్క సాతత్యము అనాదికాలమునకు సంబంధించినదయినను యుండును. స్వప్నమునందు భ్రమ యున్నరీతిగనే, జాగ్రద్దశ యందు సయితము మాయాదోషవశమున భ్రమ యుదయించుచున్నది. స్వప్నము ఎప్పుడు చెదిరిపోవునో తెలియనట్లుగనే, ఈ శరీరము ఎప్పుడు నష్టమగునో తెలియదు. కాని, భవిష్యత్తును గుఱించి, మనసులో ఎన్నో గాలిమేడలు కట్టుచునుండును; ఆయుస్సు క్షయమగుచున్నదను అనుభవము పొందడు. జీవునకు ఆయుఃక్షయాజ్ఞానమే యీశ్వర విపరీత లక్షణము.

### వార్తికము

**మేఘచ్ఛన్నోఽంశుమాలీవ మాయయా మోహితోఽధికమ్ ।**
**కించిత్కర్తా చ కించిజ్జ్ఞో లక్ష్యతే పరమేశ్వరః ॥ ౧౫**

### పీయూషవర్షిణీ

ఈశ్వరుడే, అవిద్యా (మాయా) వశుడై జీవభావమును పొందుచున్నాడనియు, జీవుడనువాడు స్వతంత్రముగా లేడనియు ప్రతిపాదించుచున్నారు.

మేఘాచ్ఛన్నుడైన సూర్యుని వలె, పరమేశ్వరుడు మాయావృతుడై, అధిక మోహముతో కించిత్కరుడుగను, అల్పజ్ఞుడుగను ప్రతీతుడగుచుండును.

## విశేష వివరణము

మేఘాచ్ఛన్నమైన సూర్యుని ప్రతిబింబము కన్పడదు; అయినను, సామాన్యప్రకాశము మాత్రము ఉండుట సర్వానుభవసిద్ధము. అదేరీతిగ, ఈశ్వరుని సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వములు మాయచేత ఆచ్ఛన్నములై యున్నను, అల్పజ్ఞత్వ, అల్పశక్తిమత్త్వములు తప్పక యుండును. అంశుమాలి యనగా, కిరణజాతము కలవాడని యర్థము. సూర్యకిరణములే ప్రకాశము; సూర్యుడు, కిరణములు భిన్నములు కావు. కిరణసమూహమే, సూర్యుడు, ఈ విషయములను వ్యంజితము చేయుచు, ఈశ్వరవికాసమే జ్ఞానక్రియలని, జ్ఞానక్రియలు ఈశ్వరాభిన్నములని సమస్త జ్ఞానక్రియాసమూహమే యీశ్వరుడని చెప్పబడినది. సామాన్య ప్రకాశరూపముతో సూర్యుడే కిరణరూపమున, భాసించురీతిగనే, జీవుని సామాన్యక్రియ, జ్ఞానము గూడ, పరమేశ్వరుడే చేయుచున్నాడు. అచట జరుగునది కేవలము ఈశ్వరభానము కాదు.

పర్యాలోచన చేసి చూచినచో, మేఘము సూర్యుని కంటె అభిన్నము. జలరాశి, సూర్యుని ఔష్ణ్యసంయోగ రూపమే మేఘము. జలము తేజోజన్యమగుటచేత, మేఘము తేజోరూపమే యని తెలియవలయును. కనుక, తేజస్స్వరూపమైన మేఘము సూర్యాభిన్నము. సూర్యుడు తననుతానే ఆచ్ఛాదితము చేసికొనుచున్నాడు. ఇదేవిధముగా శక్తి,

శివస్వరూపమైనను, శివుని ఆచ్ఛాదితుని చేయును. సూర్యుని ఔష్ణ్యము వలన వాయుఘాతముయందు భేదము ఉదయించి మేఘము చెల్లాచెదరగును; ఆరీతిగనే, పరమేశ్వరుడే స్వయముగా మాయను దూరాపాస్త మొనర్చును. వేదాంత శాస్త్రమునందు మాయకు బ్రహ్మసత్తాతిరిక్తమైన సత్త లేదు; మాయ, బ్రహ్మరూపమే. కానిచో, అద్వైత సిద్ధాంతమునకు భంగము వాటిల్లును.

ఆ జ్ఞానక్రియలలో సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వములు సయితము కల్పితములే. కావున, అచటగూడ, మాయావరణము ఉండనే యున్నది. కాని, అది అల్పాచ్ఛాదనము. కావుననే, శుద్ధసత్త్వప్రధాన మాయోపాధికుడు ఈశ్వరుడని చెప్పబడినది. శుద్ధసత్త్వప్రధానమైన మాయ కంటె, మలిన సత్త్వప్రధానమైన మాయ, యెక్కువ ఆచ్ఛాదనశీలమై యుండును. కాన, జీవుడు మలినసత్త్వప్రధాన మాయోపాధికుడని వేదాంతశాస్త్ర నిర్ణయము. జీవోపాధిగతమైన మాలిన్యతారతమ్యము వలననే జీవులలో వైచిత్ర్యము కన్పట్టును. దీనివలననే జీవులలో జ్ఞానక్రియాతారతమ్యము గోచరమగుచున్నది.

ఈశ్వరుడు మాయోపాధికుడయినను, ఆయనకు అజ్ఞానము లేదు. ఆయన, ఆ మాయను వాస్తవికరూపముతోనే అనగా, స్వశక్తిరూపముగనే తెలిసికొనును. కావున, ఈశ్వరునకు మోహమనునది యుండదు. 'మోహో నామ

వివేకాభావః' – వివేకము లేకపోవుటయే మోహము. జీవుడు మలిన సత్త్వ ప్రధాన మాయోపాధికు డగుటచే నజ్ఞానావృతుడై యుండును. అందువలన జీవుడు మోహితుడని చెప్పబడినది.

వస్తుతః, జీవన కాలమునందు సయితము అతడు పరమేశ్వరుడే; కాని, పరమేశ్వరుడుగ మాత్రము ప్రతీయమానుడగుటలేదు; అల్పజ్ఞునివలె ప్రతీతు డగుచున్నాడు. దీనివలన, పరమేశ్వరునకు వాస్తవిక పరిణామము లేదని చెప్పుటకయియే వార్తికమున 'కించిజ్జ్ఞో లక్ష్యతే పరమేశ్వరః' యని చెప్పబడినదని గుర్తింపనగును.

వార్తికము

**యద్యత్కరోతి జానాతి తస్మిం స్తస్మిన్పరమేశ్వరః ।**
**రాజా విద్వాన్ స్వసామర్థ్యా దీశ్వరోఽయ మితీర్యతే॥**

పీయూషవర్షిణి

స్వప్నదృష్టాంతముచేత జీవభావ స్వరూపము ప్రదర్శితము. ఇపుడు పరమేశ్వర స్వరూపమును చెప్పుచున్నారు.

స్వశక్తిచేత పరమేశ్వరుడు ఏపనిని చేయునో, దానియందు అతడు ఈశ్వరుడు (ప్రభువు) అని వ్యవహరింపబడును. స్వీయ సామర్థ్యము చేత దేనిని పరమేశ్వరుడు తెలిసికొనునో, దాని యందు అతడు ఈశ్వరు డని చెప్పబడును.

## విశేష వివరణము

పరమేశ్వరుడే సర్వజ్ఞుడు, సర్వకర్త. కావున, జ్ఞాన క్రియలు ఉన్న స్థానమున, పరమేశ్వరుడే యున్నాడని భావింప వలయును. లోకమున గూడ, స్వసామర్థ్యముచే శాసనము చేయు శాసకుని, ఈశ్వరుడని యందురు. సర్వతంత్రస్వతంత్రు డగుట విద్వాంసుని గూర్చి, లోకులు ఈశ్వరుడనుట యనుభవ సిద్ధము. ఈవిధముగా స్వతంత్ర కర్తను, సర్వజ్ఞుని ఈశ్వరుడని పిలుతురు. పరతంత్రుడైనవాడు ఈశ్వరుడు కాజాలడు. కావున, సర్వజ్ఞత్వ, సర్వకర్తృత్వములు పరమేశ్వరునకే సంబంధించినవని తెలియవలయును.

### వార్తికము

జ్ఞానక్రియే శివేనైక్యాత్ సంక్రాంతే సర్వజన్తుషు ।
ఈశ్వరత్వం చ జీవానాం సిద్ధం తచ్ఛక్తిసఙ్గమాత్ ॥

### పీయూష వర్షిణీ

ఇపుడు, పరమాత్మ సర్వాత్మకుడని నిరూపించు చున్నారు.

సర్వప్రాణులయందు జ్ఞానక్రియలు శివునితోడి ఐక్యమువలననే (శివాభిన్నము లగుట వలన) సంక్రమించి యున్నవి. కావున, ఆ పారమేశ్వర శక్తితో సంయుక్తమై యుండుట వలన జీవులకు ఈశ్వరత్వము సిద్ధముగుచున్నదని భావము.

7)

**విశేష వివరణము**

శివునితో ఏకత్వము వలననే, సర్వప్రాణులయందు స్వతంత్ర జ్ఞాన, క్రియలు ఉద్భవించినవి. ఏలన, జ్ఞానక్రియలు శివాభిన్నములు. అయఃపిండమునందు ఔష్ణ్య మున్నచో, దానియందు అగ్నియుండును. ఆవిధముగనే, జ్ఞానక్రియలు జీవులయందు ఉన్నవనిన, వారిలో తప్పక యీశ్వరుడున్నాడనియే తెలియవలయును. అయోగోళము దహింపజేయుచున్నదనిన, ఆ లోహపిండమునందున్న యగ్నియే దహింపజేయుచున్నదని యర్థము. రెంటియొక్క యేకత్వమును అంగీకరించియే 'అయో దహతి' అను ప్రయోగము ఉపపన్నము. ఇటులనే, 'జీవుడు స్వతంత్రముగా తెలిసికొనుచున్నాడు, కర్మ చేయుచున్నాడు' అను వచనమునకు ప్రాణిస్థిత శివుడే తెలిసికొనుచున్నాడు, కర్మ చేయుచున్నాడని యర్థము. జీవేశ్వరులకు అభేదము నంగీకరించియే యిటువంటి ప్రయోగము సంభవము.

శక్తి, శక్తిమంతుని యందే యుండును. జీవుడు ఈశ్వరుడయినపుడే, యీశ్వరశక్తి జీవునియందుండుట పొసగును. ఆకారణముచేత, జీవులకు ఈశ్వరత్వము సిద్ధించును. ('అతః ఈశ్వరశక్తి యోగాత్ జీవానా మీశ్వరత్వం సిద్ధమ్') ఈవిధముగా పరమేశ్వరుని సర్వాత్మకత్వము ప్రదర్శితము.

**వార్తికము**

**అయం ఘటోఽయం పట ఇత్యేవం నానాప్రతీతిషు ।**
**అర్కప్రభేవ స్వజ్ఞానం స్వయమేవ ప్రకాశతే ॥ ౨౨**

## పీయూషవర్షిణి

ఇపుడు, జ్ఞానము స్వయంప్రకాశము, ఏకము అని ప్రతిపాదించుచున్నారు.

సూర్యప్రకాశమువలె స్వజ్ఞానము (ద్రష్టయొక్క-స్వరూపభూతమైన జ్ఞానము) స్వయముగనే, ఇది ఘటము (అయం ఘటః), ఇది వస్త్రము (అయం పటః) అని నానా విధములైన ప్రతీతుల యందు (అనుభవముల యందు) ప్రకాశించుచుండును.

## విశేష వివరణము

సర్వపదార్థముల యందు సూర్యప్రకాశమే దృష్టి గోచరమగును. ప్రకాశభాస్యము లయిన పదార్థముల యందు పదార్థముల యాకారవిశేషముతోనే ప్రకాశభావ ముండును. కావున, సూర్యప్రభయే నిఖిలపదార్థజాతముగ రూపుదాల్చి, దృగ్గోచర మగుచుండును. ప్రకాశము లేక, ఏ పదార్థము భాసింపనేరదు. ఈరీతిగనే, ఆత్మజ్ఞానము లేక, ఏ వస్తుజ్ఞానము కలుగదు. కావున, సర్వానుభవములు జ్ఞానభాస్యములు. అందుచేత, జ్ఞానమే సర్వరూపములను ధరించి అనుభూయమాన మగుచుండుట నిస్సంశయము. సూర్యకాంతి స్వయం ప్రకాశము, ఏకము నయిన రీతిగనే, జ్ఞానము స్వయం ప్రకాశము, ఏకము అని తెలియదగును.

"స్వస్య ద్రష్టుః స్వరూపభూతం జ్ఞానం స్వజ్ఞానమ్." జ్ఞానము ద్రష్టృస్వరూపమని చెప్పబడినది. జ్ఞానము గుణ

మని యంగీకరించినచో, ఆత్మయందు జడత్వాది అనే
దోషములు సంభవించును.

జ్ఞానమునకు పరిణామము లేదు; దేనితోను, సంయోగ
సంబంధమును లేదు. జ్ఞానము స్వయముగా ఏకరూపముతో
నుండి, అనేకరూపములతో ప్రతీయమాన మగును. జ్ఞానము
నకు సహకారి కారణాపేక్ష లేదని భావము.

వస్తుప్రతీతులలో నానాత్వ ముండుగాక; నానాత్వ
ప్రకాశకము మాత్రము ఏక మని గుర్తింపవలయును.

వా ర్తి క ము

**జ్ఞానం న చేత్ స్వయం సిద్ధం జగదన్ధం తమో భవేత్ ।**
**నచే దస్య క్రియా కాచిత్ వ్యవహారః కథం భవేత్ ॥౨౩**

పీ యూ ష వ ర్షి ణి

జ్ఞానము స్వయంసిద్ధ ప్రకాశము కానిచో, జగత్తు
అంధకార మగును. పరమేశ్వరునియందు ఏ క్రియయు
లేనిచో సంసార వ్యవహారము ఎట్లు సిద్ధించును?

**విశేష వివరణము**

జ్ఞానము పరప్రకాశ్య మని యంగీకరించినచో, నది
మఱియొక యజ్ఞానరూపమగును. అజ్ఞానము ఎట్లు జ్ఞానోత్పాదక
మగును? జ్ఞానరూపమని భావించినచో, ఆ జ్ఞానము ఈ జ్ఞానము
కంటె భిన్నమా, లేక అభిన్నమా? అభిన్నమని యంగీకరింప
బడదు. భిన్నమని యంగీకరించినచో, ఆ జ్ఞానము స్వయం

ప్రకాశమా కాదా ? స్వయంప్రకాశ మనగా భావించు పక్షమున, పూర్వజ్ఞానమును స్వయం ప్రకాశ మనగా, ఏల భావింపరాదు ? కానిచో, అనవస్థా, చక్రికా, అన్యోన్యాశ్రయాది దోషములు తప్పనిసరిగా వచ్చును. కావున, జ్ఞానము స్వయంప్రకాశ మని యవశ్యము అంగీకరించి తీరవలయును.

జ్ఞానము స్వయంప్రకాశము కాకపోయినచో, జగత్తు అంధకారమయ మగును. జ్ఞానము వలననే సర్వ ప్రత్యక్షము కలుగుచున్నది. ఘటజ్ఞానము కలిగినపుడే, ఘటప్రత్యక్షము కలుగుచున్నది. జ్ఞానము ప్రకాశస్వరూపమే కానిచో, ఏ పదార్థ మయినను ప్రత్యక్షసిద్ధము కాదు.

ఘట విషయమున, ఘటజ్ఞానము ప్రమాణము. ఘటజ్ఞానమునందు ఏది ప్రమాణము ? అనిన, స్వయం సిద్ధత్వమే యని తెలియవలయును. ఘటజ్ఞానము అసిద్ధము, అప్రమాణ మనినచో, ఘటము స్వతః సిద్ధింపనేరదు. కావున, జ్ఞానము ప్రమ కానిమ్ము, భ్రాంతి కానిమ్ము, స్వయంసిద్ధము, స్వతఃప్రమాణము.

ఈశ్వరుడు జ్ఞానస్వరూపుడని సిద్ధమైనను; నిరాకారుని యందు క్రియ యెట్లు సంగత మగును ? అను ఆశంక బయలు దేరుచున్నది. 'న చేదస్య క్రియా కాచిత్' అనుచు సమాధానము చెప్పుచున్నారు. పరమేశ్వరునియందు ఏ క్రియయు లేనిచో, లోకవ్యవహారము ఎట్లు జరుగును ? జరుగనేరదని భావము.

పరమేశ్వరుని విషయములో సృష్టి, స్థితి, లయాది క్రియలు శాస్త్రసిద్ధములే కాక, లోకప్రసిద్ధములు గూడ. ఈ వ్యవహారసిద్ధికై పరమేశ్వరునియందు క్రియను అంగీకరింప వలసి యుండును.

వాస్తవమునకు, పరమేశ్వరునియందు క్రియను అంగీకరించకపోయినచో, లోకవ్యవహారము భంగ మగును. ఈ ప్రపంచములో సర్వాంతర్యామి యగుటవలన నీశ్వరుడే కర్మఫలప్రదాత యగును. ఈ ప్రపంచములో క్రియారంభకుడు ఈశ్వరుడు దక్క, మఱియొకడు కాజాలడు. ఈశ్వరుడు, సంసారనిర్యామకుడు గూడ. ఈశ్వరుని యందు క్రియ కలదని యంగీకరింపవలయును. ఆలోచనాత్మక దృష్టితో జూచిన, జ్ఞాన, క్రియలు ఏకాశ్రయము లని తెలియును. కావున, జ్ఞానస్వరూపము సిద్ధించినంతనే, క్రియాస్వరూపము స్వతః సిద్ధ మగును.

అమూర్త పదార్థమునందు క్రియ యుండజాలదని యనినచో, అమూర్తమగు వాయువు యొక్క క్రియ అనుభవ సిద్ధము గాన, పై యాశంక పరిహరింపబడును. నిరవయవ పదార్థమునందు క్రియ అసంభవమని యాశంక బయలుదేరు చున్నది. మాయాకల్పితమైన సావయవత్వము చేత పై శంక నిరాకరింపబడును. కావున, సర్వథా పరమేశ్వరుని యందు క్రియను అంగీకరింపవలయును. అద్వైతదర్శనము నందు సైద్ధాంతికముగా జ్ఞానక్రియలు సమన్వితములు,

సుసంగతములు. (‘ఈశ్వరస్య కర్తృత్వ వ్యవహారః సిద్ధ్యతి క్రియాఽపి [illegible]’)

వార్తికము

క్రియా నామ పరిస్పంద పరిణామస్వరూపిణీ ।
స్పన్దమానే బహిర్ జ్ఞానే తదంకురవదుద్భవేత్ ॥ ౨౪

పీయూషపత్రికా

ఇపుడు, క్రియాస్వరూపము నిరూపింపబడుచున్నది.

క్రియ యనగా, పరిస్పందము(చలనము), పరిణామము స్వరూపముగా గలది. జ్ఞానము బయటకు స్పందించినపుడు ఆ జ్ఞానముయొక్క - యంకురము వలె క్రియ యుదయించును.

విశేష వివరణము

‘క్రియా నామ పరిస్పంద పరిణామస్వరూపిణీ’- పరిస్పందమనగా, చలనము; పరిణామమనగా అవస్థాంతరోత్పత్తి. చలనము, అవస్థాంతరావాప్తి స్వరూపముగా గలది క్రియ. స్పందము (చలనము) జ్ఞానస్వరూపము; కావున, జ్ఞానము, స్పందము ఒకదానితో నొకటి యుండును. దీనియందు దేశకాలముల పరివర్తనము ఉండును గాని, పదార్థము పరివర్తనము చెందదు. పరిణామమునందు పదార్థము పరివర్తనము చెందును. ఈ దృష్టితో భేదము కన్పడును గాని పరివర్తనమే క్రియయొక్క రూపము. ఒక దేశమునందు స్పందము గోచరమైనచో, కాలములో పరివర్తనము కలిగినపుడే యా స్పందము కలుగునని తెలియనగును.

ఆ క్రియ, అమూర్త పదార్థముల యందు గూ భాసించునని చెప్పబడుచున్నది. "స్పందమానే బహిర్ జ్ఞా జ్ఞానము ఇంద్రియముల ద్వారా, మనోవృత్తి ద్వారా స్పం మానము కాగా, 'తదంకురవ దుద్భవేత్' - ఆ జ్ఞానముయొక అంకురమువలె క్రియ యుద్భవించును.

జ్ఞానమునందు ఉపాధివలన చలనము ఏర్పడుట మనస్సు అనెడి ఉపాధితో సంబద్ధమై ఇంద్రియము ద్వారమున మానసికవృత్తితోనే జ్ఞానము బహిర్గత మగున అచట, విషయసంబంధము కలిగినపుడే, స్పష్టముగ జ్ఞానవ కలుగును. కావున, అమూర్తము, నిరవయవము నగు జ్ఞానవ నందు క్రియ స్పష్టముగ గోచరించునని తెలియనగును.

జ్ఞానాంకురమే క్రియ. అనగా, క్రియ, జ్ఞానము వలన కలుగును. మనః ప్రాణములు నిత్యసంబంధులు. కావున మనస్సునందు చలన మేర్పడినపుడు, ప్రాణమునంద అవశ్యము స్పందము కలుగును. జ్ఞానము విషయముతో సంబద్ధమైనపుడే, ప్రాణక్రియ జరుగును. అనగా, స్థూ జ్ఞానము పదార్థజ్ఞానాధీనమే యని గుర్తింపనగును. జ్ఞాతమైన పదార్థమునందు, అనగా జ్ఞానవ్యాప్తమైన పదార్థమునంద ఒక విశేషమును సంపాదించుట కయినే క్రియ జరుగును. కనుక, జ్ఞానమునకు ఆశ్రయమైన మనస్సునందున్న ప్రాణము వలననే సమస్త క్రియలు జరుగును. ('జ్ఞానవ్యాప్తేఽర్థే అతిశయ హేతుక్రియా జ్ఞానాశ్రయాయత్త ప్రాణాధిష్ఠిత స్థూలోపాధి

నిబంధనా భవేత్'). కావున, జ్ఞానము వలన క్రియోత్పత్తి జరుగునని యంగీకరింపవలయును.

వేదాంతశాస్త్రమునందు జ్ఞానాంశమే క్రియ యని యంగీకరింపబడినది గాని, క్రియయొక్క యంశము జ్ఞానమని యంగీకరింపబడలేదు. జ్ఞానానంతరమే క్రియ జరుగుట అనుభవసిద్ధము. కావుననే, శ్రీ సురేశ్వరులు బహిర్విషయక జ్ఞానమునే (స్పందమానే బహిర్జ్ఞానే) క్రియ యని ముక్తకంఠముగా చాటినారు.

అంతర్యామి యగు పరమేశ్వరుని సన్నిధానవశముననే ప్రాణక్రియ జరుగునని సిద్ధించుచున్నది. కావున, ఎచట నయినను, ఏ జీవునియందైనను దృశ్యమానమగు నా క్రియ, అంతర్యామి యయిన ఆ పరమేశ్వరునిదే యని యంగీకరింపనగును.('అంతర్యామీశ్వర సన్నిధానాయత్తత్వాత్ ప్రాణాది చేష్టాయాః సర్వజంతుషు ప్రతీయమానా చేష్టాఽపి ఈశ్వరస్యైవేత్యర్థః').

## వార్తికము

**ఉత్పాద్యప్రాప్యసంస్కార్యవికార్యోపాశ్రయా క్రియా**
**కరోతి గచ్ఛత్యశ్నాతి ఛినత్తీతి ప్రతీయతే ॥ ౨౩**

## పీయూషవర్షిణీ

పరిస్పందస్వరూపమును ప్రదర్శించి, క్రియాకార్యమును నిరూపించుచు పరిణామరూపము గల వ్యక్తక్రియను సోదాహరణముగా ప్రదర్శించుచున్నారు.

## విశేష వివరణము

క్రియ, ఉత్పాద్యము (కరోతి), ప్రాప్యము (గచ్ఛతి), సంస్కార్యము (ఉన్మార్ష్టి), వికార్యము (ఛినత్తి) అని నాలుగు విధములుగ నుండును. కర్మకారక ఆశ్రయము వలననే పరిణామరూప క్రియ ప్రతీయమాన మగును. సమస్త క్రియలు ఈ చతుర్విధ క్రియలయందే అంతర్భావములు (కర్మకారకవ్యాపారాశ్రయముగా పరిణామక్రియగా ప్రతీయతే)

### వార్తికము

**శివో బ్రహ్మాది దేహేషు సర్వజ్ఞ ఇతి భాసతే ।**
**దేవ తిర్యఙ్మనుష్యేషు కించిజ్జ్ఞ స్తారతమ్యతః ॥ ౨౬**

### పీయూషవర్షిణి

ఈ విధముగా జ్ఞానక్రియలు ఈశ్వరాశ్రితములని ప్రతిపాదించి, ఆ యీశ్వరుడు ఉపాధిభేదము వలన అల్పజ్ఞుడుగ, సర్వజ్ఞుడుగ ప్రతీయమాను డగుచున్నాడని ప్రదర్శించుచు, ఆయనకు సజాతీయ, విజాతీయ, స్వగత భేదమును నిరాకరించి ఏకత్వమును సిద్ధాంతీకరించుచున్నారు.

శివుడే బ్రహ్మ, విష్ణు, రుద్రాది శరీరములయందు సర్వజ్ఞుడుగా భాసించుచున్నాడు. దేవ, తిర్యక్, మనుష్యాది ఉపాధులయందు తరతమ భేదముతో నల్పజ్ఞుడుగా ప్రతీయమాను డగుచున్నాడు. ఒకే యీశ్వరుడు ఉపాధి

భేదము ననుసరించి, సర్వజ్ఞునిగా, అల్పజ్ఞునిగా వ్యవహరింప బడుచున్నది గాని, ఆయన నొక్కడే యని తెలియ వలయును.

**వా ర్తి క ము**

**జరాయుజోఽండజశ్చైవం స్వేదజః పున రుద్భిజః ।**
**ఏతే చతుర్విధాః పూర్వక్రమశో న్యూనవృత్తయః ॥ ౪౨**

**పీ యూ ష వ ర్షి ణి**

ఇప్పుడు భూలోకము నందలి జ్ఞానతారతమ్యమును నిర్దేశించుచున్నారు.

జరాయుజములు (పశువులు), అండజములు (పక్షులు), స్వేదజములు (పురుగులు), ఉద్భిజములు (భూమిని చీల్చుకొని వచ్చు వృక్షములు)- ఈ నాలుగు విధములయిన ప్రాణులు ఉత్తరోత్తరము అల్పజ్ఞానవృత్తులు కలవై యున్నవి. ఇచటగూడ 'పురుషత్వేవావిస్తరాం' అను శ్రుతి ననుసరించి జరాయుజములందు గూడ జ్ఞానాది తారతమ్యము ద్రష్టవ్యము.

**వా ర్తి క ము**

**బ్రహ్మాదిస్తంబపర్యన్తా స్వప్నకల్పైవ కల్పనా ॥**
**సాక్షాత్కృతేఽనవచ్ఛిన్నప్రకాశే పరమాత్మని ॥ ౪౩**

**పీ యూ ష వ ర్షి ణి**

ఇపుడు ఈ వార్తికమునందు ఉపాధికృత భేదము యొక్క వాస్తవికతను నిరాకరించుచున్నారు.

త్రివిధ పరిచ్ఛేద శూన్యమైన పరమాత్మ యొక్క అపరోక్షసాక్షాత్కారము కాగా, బ్రహ్మాది స్తంబపర్యంతమ స్వప్నమువలె కేవల కల్పనామాత్ర మగునని భావము.

## విశేష వివరణము

ఈ ప్రపంచములోని సర్వపదార్థములు దేశ, కాల, వస్తు పరిచ్ఛిన్నములై యుండును.

పరమేశ్వరుడు త్రివిధపరిచ్ఛేదరహితుడు. అనగా ఆయన సార్వదేశికుడు, సార్వకాలికుడు, సర్వవ్యాపకుడు.

నిర్వికల్పసమాధి సాధన వలన, వేదాంతవాక్యజన్య జ్ఞానము పరిపక్వమైనపుడు సహజస్థితి లభించిన కాలమునందే బ్రహ్మపరోక్షానుభూతి కలుగును.

వ్యష్టిదోషము, తూలాజ్ఞానము యొక్క పరిణామమే స్వప్నము; శివశక్తి, మూలాజ్ఞాన పరిణామము. కావున వైదిక సిద్ధాంతానుసారము జాగ్రద్దశ, స్వప్న సదృశము. మెలకువ వచ్చినంతనే, స్వప్నము అదృశ్యమైపోవును. ఆరీతిగనే, జ్ఞానోదయమయినంతనే జాగ్రత్ప్రపంచము గూడ వినష్టమైపోవును. ('అనవచ్ఛిన్న ప్రకాశే పరమాత్మని సాక్షాత్కృతే సతి సర్వకల్పనా జాగ్రతి ప్రబోధే విలీయమాన స్వప్నవత్ సహైవ విలీయమానత్వాత్ స్వప్నతుల్యై వేత్యర్థః')

కల్పన, జ్ఞానస్వరూప మయిన చందమున, జగత్తు సయితము, జ్ఞానస్వరూపము. జ్ఞానభిన్నమైన దేదియు నిచట

లేదు. కావున, సమస్తము కల్పన యని భావించుట యుచితమే యగును. కాని, ఇది జీవకల్పన కాదు; శివజ్ఞానాత్మకమైన కల్పన యని తెలియవలయును.

### వార్తికము

అణోరణీయా న్మహతో మహీయానితి వేదవాక్ ।
రుద్రోపనిషదప్యేవం స్తౌతి సర్వాత్మకం శివమ్ ॥ ౨౯

### పీయూషవర్షిణీ

పరమేశ్వరుడు అణువుకంటె అణువనియు, వ్యాపకమైన సమస్తతత్త్వముకంటె బృహద్రూపమనియు వేదవాణి, మఱియు రుద్రోపనిషత్తు స్తుతి చేయుచున్నవి.

### విశేషవివరణము

పరమేశ్వరుడు సర్వాత్మకుడని చెప్పుటకొఱకే 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అని శ్రుతి యుద్ఘోషించినది.

### వార్తికము

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే ।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥ ౩౦

### పీయూషవర్షిణీ

ఈశ్వరుడు, గురువు, ఆత్మ అను మూర్తిత్రయరూపముతో తనను విభజించుకొనిన వాడు, ఆకాశమువలె

వ్యాపకమైన దేహము గలవాడు నగు శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.

## విశేష వివరణము

'గురుమూర్తయే, దక్షిణామూర్తయే' అను పదద్వయము నకు ఇందు అర్థము చెప్పబడినది. 'ఇదం నమః' యనగా ఆత్మసమర్పణ మని యర్థము. ఈ ప్రహ్వీభావమును చెప్పదలచి 'ఆత్మేతి మూర్తి భేదవిభాగినే' యని వార్తికమున పేర్కొనబడినది. మూర్తిత్రయకృతమైన పరిచ్ఛేదభావ శంకను నివారించుటకై 'వ్యోమవద్వ్యాప్తదేహాయ' అని చెప్పబడినదని తెలియవలయును.

'మూర్తిత్రయవిభేదినే' యను పాఠాంతరము ననుసరించి మూర్తిత్రయభేదమును నాశము చేయువాడని యర్థము చెప్పికొననగును.

### వార్తికము

ఇతి శ్రీ దక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకే ।
ప్రబంధే మానసోల్లాసే ప్రథమోల్లాస సంగ్రహః ॥ ౩౧

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరుతో నొప్పారు నట్టి
ప్రబంధము యొక్క ప్రథమోల్లాస సంగ్రహము
సంపూర్ణము.



బీజస్యాన్తరివాఙ్కురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పున
ర్మాయాకల్పిత దేశకాలకలనావైచిత్ర్య చిత్రీకృతమ్ ।
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥౨

పీ యూ ష వ ర్షి ణీ

పరిదృశ్యమానమగు ఈ ప్రపంచము బీజమునందు అంకుర, పత్ర, పుష్ప, ఫలాదులు అవ్యక్తముగ నున్న రీతిగ, జాతిగుణక్రియాది భేదరహితమై సద్రూపమున నుండెను. తిరిగి, సృష్ట్యారంభమున మాయాకల్పిత దేశకాలసంబంధము వలన నేర్పడు వైచిత్ర్యములతో ఈ ప్రపంచమును పరమేశ్వరుడు ఇంద్రజాలికునివలె, యోగివలె స్వేచ్ఛామాత్రముచేత విశేషముగా సానిర్భవింప జేయుచున్నాడు. తాదృశ శక్తి సంపన్నుడగునట్టి యీశ్వరుడు, గురుమూర్తియు నగు శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.

## విశేష వివరణము

కార్యము, కారణము నందుండుట అనుభవసిద్ధము. మృత్కార్యము ఘటము; కటక కుండలాదులు స్వర్ణ కార్యములు. ఈ జగత్తు కార్యము. దీనికి అభిన్న నిమిత్తోపాదానకారణము ఆత్మ. కారణగుణములు కార్యము నందు సంక్రమించును. ఆత్మ సత్య, జ్ఞాన, నిత్యత్వాది లక్షణము. కాని, తద్విరుద్ధముగ విశ్వము అనృత, అజ్ఞాన, అనిత్యత్వాది లక్షణము. కావున, ఈ విశ్వమునకు ఆత్మ

అభిన్న నిమిత్తోపాదానకారణ మెట్లగును? అను నాశంకతో పలువురు పలురీతులుగ జగత్కారణమును వర్ణించుచున్నారు. ఆ యా వాదములు ఈ శ్లోకమున నిరాకరింపబడుచున్నవి.

ఆత్మయందు ప్రపంచావస్థానము పొసగ నేరదు. ఏలన, ఆత్మ, కారణము కాదు. కారణము కానపుడు ఆత్మ జగదారంభకుడా, లేక జగదాకారముగా పరిణామము చెందెనా? యని యాశంక. ఆత్మ ఏకము, విభువు, చిద్రూపము. అట్టి ఆత్మను జడప్రపంచమునకు ఆరంభకమని చెప్పజనదు. జగదాకారమున పరిణామము చెందెననియు చెప్పుటకు వలను పడదు. ఏలన, నిరవయవ, నిర్వికార, చిద్రూపమునకు పరిణామము అసంభవము. కాణాదులు నిత్యములు, చతుర్విధములునైన పరమాణువులు జగదారంభకము లని చెప్పుదురు. కాని, యీ పరమాణువులు జడములు. కావున, అవి స్వతంత్రశక్తి గలవి కావు. ఇట్టి పరమాణువుల వలన ఈ సమస్త బ్రహ్మాండసృష్టి యెట్లు జరుగును?

కావున, పరమాణువులు జగదారంభకము లనుట సంగతము కాదు. నిరవయవములగు పరమాణువులకు సంయోగము సర్వథా అనుపపన్నము. భిన్నములైన గో, అశ్వముల వలె, కార్యకారణభావము నిరవయవములైన పరమాణువులకు, జడ జగత్తునకు చెప్పుట కుదరదు. పూర్వము లేని కార్యప్రపంచము శశవిషాణము వలె (కుందేటికొమ్ము వలె) అనుపపన్నము. అదియును గాక, పరమాణువు లున్న వనుటకు ప్రమాణము లేదు.

ఇక, సాంఖ్యుల పరిణామవాదము సంగతము కాదు. వారు ప్రకృతి, స్వతంత్ర యని యందురు. ఈ జగత్తు ప్రకృతిపరిణామ మనుచున్నారు. అయిన, ప్రకృతి జడమా? లేక, చేతనమా? జడమైనచో, జగత్సర్జన క్షమమైన స్వతంత్రశక్తి ప్రకృతికి లేదు. చేతన మందు లేని, పరిణామిత్వము అసంభవము. చేతనాధిష్ఠితమైన రథాదులకు లోకమున ప్రవృత్తి కానవచ్చుచున్నది. స్వతంత్ర ప్రకృతిసద్భావము నకు ప్రమాణము లేదు. కావున, ప్రధాన కారణవాదము సంగతము కానేరదు.

"సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" (తై-ఉ-౨-౧)
"తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః"
(తై. ఉ. ౨-౧)
"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" (ఛాం. ౬-౨)
"తదైక్షత బహు స్యాం ప్రజాయేయ ఇతి" (ఛాం. ౬-౨)
"యతో వా ఇమాని భూతాని జాయన్తే" (తై. ఉ. 3-౧)
"య స్సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః
తస్మా దేతద్ బ్రహ్మ నామరూప మన్నం చ జాయతే"
(ముం. ఉ. ౧-౧-౯)

ఇత్యాది శ్రుతిసహస్రము వలన చేతనుడైన పరమాత్మ వలననే జగదుత్పత్తి శ్రూయమాణ మగుచున్నది. విలక్షణము లయినను, గోమయ, వృశ్చిక, పురుష కేశ,

లోమాదులయందు కార్యకారణభావము కన్పడుచు
కావున, అద్వైత సిద్ధాంతమునందు వివర్తపరిణామవ
వివక్షిత మగుచున్నది.

"సర్వం తం పరాదాత్ యోఽన్యత్ర ఆత్మనః
వేద" (బృ. ౨-౪-౬).

ఇత్యాది శ్రుతులు ఆత్మాతిరిక్తముగ జగద్వేదన
నిరసించుచున్నవి. 'ఘటోఽస్తి, పటోఽస్తి, ఘటః స్ఫు
పటః స్ఫురతి' యని సత్తాస్ఫురణానువిద్ధముగా
భాయమాన మగుచున్న విశ్వము మృదనువిద్ధమైన ఘ
వలన సత్తాస్ఫురణాత్మక కార్యత్వము అని చె
యుక్తము.

కావున, ఆత్మయే ప్రపంచ సృష్టి, స్థితి, లయ
కారణమని చెప్పుట సంగత మను నుద్దేశ్యముతో 'బీజస్యా
రివాంకురః' అను శ్లోకము ఆరబ్ధమైనది. పరిదృశ్యమాన
నట్టి యీ సమస్తప్రపంచము సృష్టికి పూర్వము నిర్వి
ముగా నుండెను. అనగా, భోక్తృ, భోగ్యాది వికల్ప
మైన కేవల ఆత్మరూపముగనే యుండెను. ('జాతి
క్రియాది వికల్పాదిరహితం సన్మాత్ర మాసీదితి'

"ఆత్మా వా ఇద మేక అగ్ర ఆసీత్" (ఐత. ౧-౧-
"సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్" (ఛాం. ౬-౨-౧)

ఇత్యాది శ్రుతుల వలన పై విషయమే స్పష్ట
చున్నది. 'బీజస్య' యని దృష్టాంతము చెప్పబ
బీజములోపల అంకురము వలె సృష్టికి పూర్వము ఈ వి

అవ్యక్తముగా నున్నది. అంకురశబ్దము పల్లవ, పత్ర, పుష్ప, ఫల, శాఖాదులకు ఉపలక్షణము. ('బీజావయవానామేవ బీజ సంస్థాన పరిత్యాగేన అంకురాపత్తిరితి అస్మాభి రంగీక్రియతే' రామతీర్థః). తిరిగి సృష్టిసమయములో ఈశ్వరాధిష్ఠితమైన మాయచేత కల్పితములయిన దేశకాలముల యొక్క సంబంధ వైచిత్ర్యము వలన ఈ విశ్వము నానావిధభేదములతో విభక్తమైనది. "తన్నామరూపాభ్యామేవ వ్యాక్రియతే"(బృ.౧-౪-౭) అను శ్రుతిచే ఈ విషయమే ప్రతిపాదింపబడినది.

లోకమున, బాహ్యసాధనములు గల కులాలాదులకు కార్యోత్పాదన సామర్థ్యము కనబడుచున్నది. అట్టితఱి అద్వితీయుడు, బాహ్యసాధననిరపేక్షుడు నయిన యీశ్వరునకు జగదుత్పాదకత్వము ఎటుల చెప్పనగును? అను ఆశంక బయలుదేరుచున్నది. ఈశ్వరుడు అనాది, అనిర్వచనీయ మాయాశక్తిచే నుపహితమైన చైతన్యము. అట్టి యీశ్వరుని యందు, స్వసంకల్పమాత్రము చేతనే ఐంద్రజాలికునివలె దేవర్షులు, పిత్రాదులు, యోగులవలె, జగదుత్పాదకత్వము ఉపపన్నమగునని "మాయావీవ" యని చెప్పబడినది. పరమేశ్వరుడు మాయావి వలె, లోకప్రసిద్ధమైన ఐంద్రజాలికునివలె, విశ్వామిత్రాది మహాయోగులవలె స్వసంకల్ప మాత్రముచేతనే యీ జగత్సర్జనము చేయును.

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"(బృ. ౨-౫-౧౯)
"తదాత్మానగ్ం స్వయ మకురుత" (తై. ౨-౭),
"సచ్చ త్యచ్చాభవత్" (తై. ౨-౬).

ఇత్యాది శ్రుతులు ఈవిషయమునే ముక్తకంఠముతో చెప్పుచున్నవి.

మాయావశమున, పరమేశ్వరునకు సద్వితీయత్వప్రసక్తము కాదు. ఏలన, ఆ మాయ సంబంధము కల్పితము గాని, వాస్తవికము కాదు. ఆ యీశ్వరుడు జగత్కారణమగుటచే ఆయనకు వికారిత్వము చెప్పరాదు. జగత్కారణత్వము అనాది, అనిర్వచనీయ మాయాఘటితముగా కల్పితమగుటవలన, ఉపలక్షణత్వముచేత గూడ, ఆయనయందు వికారము ఆపాదింపబడదు. ('విశేష్యధర్మానశ్రయత్వే సతి పరంపరయా వ్యావర్తక ముపలక్షణమ్')

కావున, ఏ దోషము లేకపోవుట వలన, ప్రత్యగాత్మాభిన్నమైన బ్రహ్మయే ప్రపంచ సృష్టి, స్థితి, లయ హేతువని భావము. 'తస్మై నమః' ఆ బ్రహ్మకు నమస్కారము. ("జగదిదం స్వాన్తర్గతం యో విజృంభయతి తస్మై నమః ఇత్యన్వయః").

శ్రీ సురేశ్వరాచార్యకృత

# మానసోల్లాసః

## ద్వితీయోల్లాసః

### అవతారిక

ప్రథమోల్లాసమునందు ఆత్మయే యీ జగత్తునకు ఏకైక అభిన్న నిమిత్తోపాదాన కారణ మని ప్రతిపాదింపబడినది. ఇప్పుడు ఈ వైదికసిద్ధాంతమును నిరసించునట్టివారు, ఆత్మభిన్నములైన తత్త్వములను సత్య మని, జగత్కారణ మనియు ప్రతిపాదించునట్టివారు, జగత్సత్యత్వ వాదులు నగు ద్వైతవాదుల సిద్ధాంతఖండనము చేయుచున్నారు. ప్రప్రథమముగా కణాదమహర్షి ప్రతిపాదించిన వైశేషిక సిద్ధాంతమును చెప్పుచున్నారు.

### వార్తికము

**ఉపాదాన ప్రపంచస్య సంయుక్తాః పరమాణవః ।**
**మృదన్వితో ఘట స్తస్మాద్భాసతే నేశ్వరాన్వితః ॥ ౧**

### పీయూషవర్షిణీ

సంయుక్తములయిన పరమాణువులు ప్రపంచమునకు ఉపాదానకారణము. కావుననే, ఘటము మృదన్వితముగ గోచరించును గాని, యీశ్వరాన్వితముగా గోచరింపదు.

## విశేష వివరణము

పరమ సూక్ష్మములు, నిరవయవములు నయిన ద్రవ్య విశేషములే (పరమాణువులే) పరస్పరము సంయుక్తములై సావయవ కార్యములైన సమస్త జాగతిక పదార్థములన ఉత్పన్నము చేయును. ద్రవ్య, గుణ, కర్మ, సమవాయ సామాన్య, విశేషములని వైశేషికదర్శనము పదార్థషట్కమున అంగీకరించినది. వీనిలో నిత్యద్రవ్యములు (పరమాణు ఆకాశాదులు), నిత్యగుణములు. సామాన్యము, విశేషము సమవాయము, కారణము వలన జనించినవి కావు. అనిత్య ద్రవ్యములు పరమాణువుల వలన ఉత్పన్నములు. అనిత్య గుణము కూడ అనిత్య ద్రవ్యములో చేరినదే. అందువల గుణము ద్రవ్యకారణాధీనము. క్రియ గూడ ద్రవ్యములో నంతర్భూత మగుట వలన తదధీనమే యని, భావిం వలయును. కావున, పరమాణువులే పరస్పరము సంయోగమ చెంది జగత్కారణ మగునని తెలియవలయును.

స్వయముగా కార్యరూపమున పరిణామము చెందున ఉపాదానకారణ మనబడును. కనుక, మృత్తు ఘటమున ఉపాదానకారణము. న్యాయ, వైశేషిక దర్శనానుసారమ పరమాణువులే జగదాకృతిని పొందును.

కార్యమునందు ఉపాదానకారణము సదా అను స్యూతమై యుండును; ఆ కారణము స్పష్టముగా ప్రతీయ మాన మగుచుండును. ఘటమునందు మృత్తువలె, పటవ

నందు తంతువులవలె ప్రతీత మగుచుండును. ప్రపంచము నందలి సర్వ పదార్థములు అచేతనములుగా గోచరించు చుండును. కావున, వాని ఉపాదానకారణము ఒకానొక అచేతన తత్త్వమే అయి యుండవలయును; చేతనుడైన యీశ్వరుడు కాజాలడు. ఏ పదార్థమైనను ఈశ్వరయుక్తమై, అనగా ఆత్మసమన్వితమై కన్పట్టదు. ఇచట ఈవిధముగా అనుమాన నిరూపణము చేయబడును.

"వివాదాః అచేతనోపాదానకాః అచేతనాన్వితతయా భాసమానత్వాత్; యః స్వసత్తాయాం యదన్వితో నియమేన భాసతే స తదుపాదానకో దృష్టః యథా మృదన్వితతయాఽవభాసమానో ఘటో మృదుపాదానకః, తథాచేమే, తస్మాత్తథేతి".

వా ర్తి క ము

**పరమాణుగతా ఏవ గుణా రూప రసాదయః ।**
**కార్యే సమాన జాతీయ మారభంతే గుణాన్తరమ్ ॥ ౨**

పీ యూ ష వ ర్షి ణీ

ద్రవ్యమునకు కారణము అచేతన మయిన పరమాణు వని యంగీకరించినను, గుణమునకు కారణము ఈశ్వరుడు కావచ్చును గదా! యను శంక నిరాకరింపబడుచున్నది.

పరమాణుగతములైన రూప రసాది గుణములే ఉత్పన్నము కాబోవు పదార్థమునందు సమాన జాతీయమైన గుణాంతరము లను (భిన్న గుణములను) ఆరంభించునని భావము.

## విశేష వివరణము

కారణ పరమాణువులలో నున్న గుణములే, కార్యము నందు తాదృశగుణములనే ఉత్పన్నము చేయును. తంతుగత మైన వర్ణమే (రంగే) పటగతమైన వర్ణమునకు (రంగుకు) హేతువు. పరమాణువులు నిర్గుణము లయినచో, కార్యము నందు గుణోత్పాదనమునకు కారణాంతరమును అంగీకరింప వలసియుండును. కాని, పరమాణువులు సగుణములు. ఆ సగుణత్వము అవ్యక్త మనునది వేఱే సంగతి. పరమాణువుల సంయోగము వలన ఆ సగుణత్వము వ్యక్త మగును.

సమానజాతీయ గుణములనే ఉత్పనము చేయు నను వచనము విశేషగుణముల నుద్దేశించి చెప్పబడినది. ఏలన, వీరి సిద్ధాంతమునందు సయితము పరమాణ్వాదులలో నుండు సంఖ్యకారణముగా ద్వ్యణుకాది పరిణామము కలదు. ఆరీతిగనే, పరత్వ, అపరత్వముల యొక్క, దిక్కాలముల యొక్క పదార్థముతోటి సంయోగము కారణముగా నంగీ కరింపబడినది.

కణాద సిద్ధాంతమునందు పటగతమైన వర్ణము, తంతు గత వర్ణము భిన్న గుణములు. ఆ రెండింటికి జన్య జనక భావ సంబంధము చెప్పబడును. ఈ దృష్టితో వార్తికమున 'గుణాన్తరమ్' అని చెప్పబడినది. అత్యంత భిన్నమైన రూపము రసమునకు కారణము కాజాలదు. అందువలన 'సమాన జాతీయమ్' అని చెప్పబడినదని గ్రహింపనగును.

రామతీర్థ వచనము. వేదాంత సిద్ధాంతమునందు దీనిని ఉపాద
కారణ మందురు. మృత్తునందే సర్వదా ఘటము ఉంద
దీనికి నుదాహరణము. "యత్ సమవాయేతర సంబ
సంబద్ధం కార్యోత్పత్తికారణం తత్ నిమిత్తమ్" అను
రామతీర్థుడు నిమిత్తకారణ నిర్వచనము చెప్పియున్నా
సమవాయి కారణము కానిది అసమవాయి కారణవ
అసమవాయి కారణమే నిమిత్తకారణమని భావింపబడిన
నిమిత్త కారణములయిన చక్ర, దండాదులు ఘటముకం
భిన్నములు. కార్యోత్పత్తికి నిమిత్తకారణము ఆవశ్యక
గాని, కార్యస్థితికి (ఘటాది కార్యము యొక్క యునికి
ఆవశ్యకము కాదు.

వా ర్తి క ము

**సమవాయిని తిష్ఠే ద్యత్ సమవాయ్యాశ్రయే తథా ।**
**కార్యేఽవధృతసామర్థ్యం కల్ప్యతే అసమవాయి తత్॥**

పీ యూ ష వ ర్షి ణి

సమవాయి కారణమునందు, లేక సమవాయి కార
శ్రయమునందు ఏది యుండునో, మఱియు కార్యోత్పాదనవ
నందు అత్యంతము ఏది యావశ్యకమో, ('అవధృతసామర్థ్య
అనన్యథాసిద్ధమ్'), అది అసమవాయికారణ మని భావిం
బడును.

**విశేష వివరణము**

"స్వకార్యస్య సమవాయో యస్మిన్ తత్ సమవాయి
తస్మిన్ యత్తిష్ఠేత్ తదసమవాయి." పటమున

(వస్త్రమునకు) సమవాయి కారణమైన తంతువులయందు, తంతుసంయోగము ఉండును. కావున, తంతుసంయోగము అసమవాయి కారణము.

("స్వకార్య సమవాయి కారణప్రత్యాసన్నే సతి యత్ తిష్ఠేత్ తత్ అసమవాయి.")

తంతుగతవర్ణము పటగతమైన వర్ణమునకు అసమవాయి కారణము. ఏలన, తంతుగతమైన వర్ణము వస్త్రమునందలి వర్ణమును ఉత్పన్నము చేయును. పటమునకు సమవాయి కారణమైన తంతువులనందు ఆ రంగు ఉండును.

పటము పటగత వర్ణమునకు సమవాయి కారణము. పటగతమైన వర్ణము పటమునందు సర్వదా యుండును.

వా ర్తి క ము

**నిమిత్తం కారణం తేషా మీశ్వరశ్చ కులాలవత్ ।**

పీ యూ ష వ ర్షి ణీ

ఈవిధముగా కారణత్రైవిధ్యమును వివరించి యీశ్వరుని కారణత్వమును చెప్పుచున్నారు.

కారణత్రయము కార్యాశ్రితమని స్వరూపతః నిర్దేశించి, యీశ్వరుడు సర్వకార్యోత్పత్తికి నిమిత్తకారణమని చెప్పుచున్నారు (నైయాయికులు, వైశేషికులు). అన్యనిమిత్తకారణము లున్నను, సర్వకార్యజాతమునకు ఈశ్వరుడు కూడ నిమిత్తకారణమని వారు చెప్పుదురు. ఏలన, చేతనాధిష్ఠాత

లేక, అచేతనప్రవృత్తి సంగతము కాదు. చక్ర, దండాదు లున్నను, కులాలుడు లేకపోయినచో, ఘట, శరావాది కార్యోత్పత్తి యసంభవము. ఇచట, అనుమానప్రయోగము ఈరీతిగ నుండును. "విమతం చేతనాధిష్ఠితాచేతనకారణకం, కార్యత్వాత్, ఘటాదివత్".

వార్తికము

యత్ కార్యం జాయతే యస్మా త్తస్మిన్ ప్రతితిష్ఠతి ॥ ౫
మృత్తికాయాం ఘట స్తన్తౌ పట స్స్వర్ణేఽఙ్గుళీయకమ్ ॥
ఇతి వైశేషికాః ప్రాహు స్తథా నైయాయికా అపి ॥ ౬

పీయూషవర్షిణీ

ఏ కార్యము ఏ యుపాదానకారణము వలన జనించునో, ఆ కార్యము ఆ ఉపాదానకారణమునందు సర్వదా యుండును. ఉదా :- మృత్తికయందు ఘటము, తంతువునందు పటము, సువర్ణమునందు అంగుళీయకము. ఈవిధముగా వైశేషికులు, నైయాయికులు గూడ చెప్పుదురు.

వార్తికము

రజస్సత్త్వం తమశ్చేతి ప్రధానస్య గుణా స్త్రయః ।
రజో రక్తం చలం తేషు సత్త్వం శుక్లం ప్రకాశకమ్ ॥ ౭
తమః కృష్ణం చావరకం సృష్టి స్థిత్యన్తహేతవః ।
ఇతి సాంఖ్యాశ్చ భాషన్తే తేషాం దూషణ ముచ్యతే ॥ ౮

## పీ యూ ష వ ర్షి ణి

చేతనమును సృష్టికారణముగా నంగీకరించని నిరీశ్వర సాంఖ్యమతమును ప్రతిపాదించుచున్నది.

ప్రధానము యొక్క గుణములు మూడు. అవి రజస్సత్త్వ తమోగుణములు. అవి సృష్టి, స్థితి, లయములకు కారణములు. వానిలో రజోగుణము ఎఱ్ఱని వర్ణము కలది, గతిశీలమైనది. సత్త్వగుణము ధవళవర్ణము కలది; జ్ఞానప్రకాశకమైనది. తమోగుణము నల్లని రంగు కలది; ఆవరకము (ఆచ్ఛాదకము). ఈరీతిగా సాంఖ్యమతానుయాయులు వక్కాణింతురు. ఈ శ్లోకమునందు సాంఖ్యమతానుయాయుల దోషము చెప్పబడుచున్నది.

### విశేష వివరణము

ప్రకృతికి, ప్రధానమని సాంఖ్యుల పరిభాష. బంధ, మోక్ష, భోగాదు లన్నింటియందు ఈ ప్రకృతి ముఖ్యమగుటం జేసి, యిది 'ప్రధాన' మను నామముతో వ్యవహరింపబడును.

సృష్టి, స్థితి, లయ హేతువులు రజస్సత్త్వ తమోగుణములని యంగీకరించుట వలన, వీరి సిద్ధాంతమునందు ఈశ్వరుని యావశ్యకత లేదు.

గుణత్రయ సామ్యావస్థలో నిది ప్రధాన మనబడును. అయినను, సత్త్వ, రజ, స్తమోగుణములు సదా తోడుగనే యుండును. ఈ గుణత్రయము యొక్క కార్యములు భిన్నములు

గనే యుండును. ఈ గుణముల వలన జనించు కార్యములతో తాదాత్మ్యానుభూతియే భోగము, బంధము.

రజోగుణము విషయాసక్తిని కలిగించును, ఈ గుణము చలనస్వభావము కలది; మిగిలిన రెండు గుణములకు నుపష్టంభకముగ నుండును. "అజా మేకాం లోహిత శుక్ల కృష్ణామ్" అను శ్వేతాశ్వతర శ్రుతివాక్యమును ఆధారముగా గైకొని, సాంఖ్యశాస్త్రము ఈ గుణత్రయమునకు మూడు వర్ణములను (రంగులను) నిరూపించినది. సత్త్వగుణము సూక్ష్మతమము, లఘువు నయినది. దీనివలన బాహ్యజగద్విషయకమైన జ్ఞానము కలుగును. తమోగుణము స్థూలము, మలినము నయినది. ఇది సత్యమునకు ఆవరకము, అవివేక హేతువు.

ఈ స్తోత్రమునందు సాంఖ్య, వైశేషిక, నైయాయిక సిద్ధాంతములను, స్వభావవాద, శూన్యవాద, శైవ, యోగాది వాదముల నన్నింటిని ఖండించి, అద్వైతసిద్ధాంత ప్రతిష్ఠాపనము చేయబడినది.

మునుముందుగా, వైశేషికమత నిరాకరణము చేయబడుచున్నది.

వార్తికము

**అంకురాది ఫలాన్తేషు కార్యేష్వస్తిత్వ మిష్యతే ।**
**కుత ఆగత్య సంబద్ధా వటబీజేషు తే కణాః ॥ ౯**

పీయూషవర్షిణి

అంకురాది ఫలపర్యంతము గల సర్వకార్యములయందు సత్త యంగీకరింపబడును. వటబీజమునందు ఆ పరమాణువులు ఎచటనుండి వచ్చి సంబద్ధములయినవి ? అని భావము.

## విశేష వివరణము

"యదన్వితం కార్యం సదా స్యాత్తత్ తదుపాదానమ్" ఏది కార్యమునందు సర్వదా అన్వితమై యుండునో, అది ఉపాదానకారణ మనబడును. ఇది సర్వవాదిసమ్మతమైన సిద్ధాంతము. అంతేకాదు సర్వకార్యములయందును సర్వత్ర ఉపలభ్యమాన మగుచుండును. కావున, సర్వానుస్యూత బ్రహ్మయే సర్వకార్యములకు ఉపాదానకారణము. పరమాణువులు ఎచటను సమన్వితములై కన్పించుట లేదు. కావున, పరమాణువులను కారణ మనుట పొసగదు. ద్వ్యణుకమునకు మాత్రము అవి (పరమాణువులు) కారణము కావచ్చును గాని, సర్వకార్యములకు కారణము కావు. ("తేషాం ద్వ్యణుకమాత్రే అన్వయసంభవేఽపి సర్వకార్యాన్వయాభావాత్") కావున, పరమాణువులు ఉపాదానకారణ మనుట చెల్లనేరదు. ద్వ్యణుకాదులు క్రొత్తగా ఏర్పడుటయందు సమన్వితములగు ననుటకు ప్రమాణము లేదు. అట్లయినచో, పిండాన్వితమైన ఘటము లభింపవలసి యుండును. శకలములయందు ఘటము గాని, కపాలములయందు పిండముగాని యుండుట యసంభవము. ఏలన, పూర్వస్థితి (దశ) నష్టము కాక, ఉత్తరదశాలాభము అసంభవము. నష్టమైనది ఉపాదానము కానేరదు. నశించునట్టి పూర్వదశాపన్నవస్తువులకు ఉత్తరావస్థయందు ఉపాదానత్వము చెప్పినచో, నూతన కార్యమునకు సయితము పరమాణువులే ఉపాదానకారణ మగుట ప్రసక్తమగును. పరమాణువులు

అతీంద్రియము లగుటవలన, తదాశ్రితమైన కార్యము ఇంద్రియ గోచరము కాదు. కావున, సమస్త కార్యములయందు అన్వితమై యుండు వస్తువునకే ఉపాదానకారణత్వము చెప్ప వలయును. తాదృశమైన వస్తువు సన్మాత్రమైన బ్రహ్మయే.

కార్యార్థియైన వ్యక్తి దేనిని గ్రహించునో, అది ఉపాదానకారణము అని యంగీకరించినను, ఫలార్థి బీజమును గ్రహించునుగాని, పరమాణువులను గ్రహించడు. పరంపరయా కారణరూపముతో పరమాణువులను గ్రహించునని యందు రేని, బ్రహ్మవివర్తమైన బీజగ్రహణమునందు బ్రహ్మకూడ గ్రహింపబడును. సద్రూపమైన బ్రహ్మ, బీజమునందు సమన్వితమై యుండును గాని, పరమాణువులు ఉండవు. ("సతస్తు బీజేఽప్యన్వయ దర్శనమస్తి, న పరమాణూనామ్"). కావున, పరమాణు కారణవాదము దుర్బలమని తెలియ వలయును.

వా ర్తి క ము

**కారణాన్తర్గతం కార్య మితి సర్వైశ్చ సమ్మతమ్ ।**
**తస్మాత్సత్తా స్ఫురత్తా చ సర్వత్రాప్యనువర్తతే ॥ ౧౦**

పీ యూ ష వ ర్షి ణి

ప్రతి కార్యము ఉపాదాన కారణాంతర్గత మను విషయము అందఱకు సమ్మతమే. కావున, సత్తాస్ఫురత్తలు (సత్తాప్రకాశములు) సర్వత్ర అనువర్తించును. అందువలన,

సత్తాస్ఫురత్తలు ఉపాదానకారణ మని భావింపబడును. ('ప్రకాశమానా సత్తా సర్వత్ర కార్యమాత్రే అనువర్తత ఇతి సైవోపాదానం సిద్ధమ్'.)

వా ర్తి క ము

**పుష్పే ఫలత్వ మాపన్నే క్షీరేచ దధితాం గతే।**
**విజాతీయాః ప్రవర్తన్తే గుణా రూప రసాదయః ॥ ౧౧**

పీ యూ ష వ ర్షి ణి

పరమాణువును ఉపాదానకారణ మని యంగీకరించక పోవచ్చుగాక. కాని, పూర్వకార్యము ఉత్తర (అనంతర) కార్యమునకు ఉపాదానకారణ మని యేల భావింపరాదు? బ్రహ్మను అంతిమ ఉపాదానకారణ మని యంగీకరించినను, బ్రహ్మకు సర్వకార్యములయందు ఉపాదానత్వము పొసగదు అను ఆక్షేపమునకు సమాధానము చెప్పబడుచున్నది.

పుష్పమునకు ఫలత్వము సిద్ధించినపుడు, క్షీరము దధిరూపమున పరిణమించినపుడు విజాతీయములైన రూప రసాది గుణములు ప్రవృత్తము లగును. పుష్ప, ఫలములకు, క్షీరదధులకు సమాన స్వభావము గల ఉపాదాన, ఉపధేయ భావములు కనబడుట లేదు.

**విశేష వివరణము**

ఉపాదానకారణము యొక్క గుణములు, కార్యమునందు సమానజాతీయగుణోత్పాదకము లగును. పుష్పగుణములు, ఫలగుణములు అత్యంత భిన్నములు. కావున, పూర్వ

కార్యము ఉత్తరకార్యమునకు ఉపాదానకారణ మని చెప్పుట యుక్తము కాదు. "ఆత్మన ఆకాశ స్సంభూతః, ఆకాశా ద్వాయుః" ఇత్యాది శ్రుతివాక్యములకు సృష్టిక్రమమును చెప్పుటయందే తాత్పర్యము గాని, ఉపాదానకారణత్వము చెప్పుటకై యీ వాక్యములు ప్రవృత్తములైనవి కావు. ఆకాశాదులయందు పౌర్వాపర్యము ఉన్నదిగాని, పూర్వ పూర్వకార్యములు ఉత్తరోత్తర కార్యములకు ఉపాదాన కారణములు కావు. ఏలన, అవి సమానజాతీయగుణములు గలవి కావు. బ్రహ్మయే ఉపాదానకారణమని తెలియ వలయును.

## వా ర్తి క ము

**కారణం కార్య మంశోఽంశీ జాతి వ్యక్తీ గుణీ గుణః ।**
**క్రియా క్రియావా నిత్యాద్యాః ప్రకాశస్యైవ కల్పనా॥౧౨**

## పీ యూ ష వ ర్షి ణి

ఆకాశమువలె అమూర్తమైన ప్రకాశ సన్మాత్రమునకు కార్యారంభకత్వము ఎటుల యుపపన్నము ? అనిన, ఏరీతిగను కాదని చెప్పుదుము. అయిన, కారణత్వము ఎట్లు ఉపపన్నము? అనిన, సర్వకల్పనలకు బ్రహ్మ, వివర్తాధిష్ఠానము. సర్ప ధారాదులకు కారణము రజ్జువు రీతిగా అని చెప్పిన, సన్మాత్రము సర్వకార్యములకు వివర్తకారణమని తెలియ నగును.

## విశేష వివరణము

కారణము (బీజము), కార్యము (అంకురము), అంశ (తంతువు), అంశి (పటము), జాతి (గోత్వము), వ్యక్తి (గోవు), గుణము (ఎరుపు), గుణి (ఎఱ్ఱని కమలము), క్రియ (చలనము), క్రియాశ్రయము (చలనము గలది) మొదలగునవి (విశేషాదులు) అన్నియు, ప్రకాశము (జ్ఞానము) యొక్క కల్పనలే. అనగా, రూపాంతరములు, వ్యవహారములు మాత్రమే యని భావము.

వార్తికమందలి 'ఆది' శబ్దము వలన విశేషము, విశేషి, సమవాయము, సమవాయి, విశేష్యము, సదృశము, సాదృశ్యము మొదలయినవానిని గ్రహింపనగును. ఈ కల్పనలు వ్యవహారములు, ప్రకాశము యొక్క సన్మాత్ర స్ఫురణ వివర్తరూపములే యని గ్రహింపవలయును.

ఆరంభవాదమునందు గాని, పరిణామవాదమునందు గాని, పరమార్థతః, కార్యకారణభావ నిరూపణము అసంభవము. వాదాంతరము అతి తుచ్ఛమయిన దగుటం జేసి, స్వప్రకాశ చిద్రూపమునందు (చిదాత్మయందు) ఈ విశ్వము మాయా విజృంభితమని భావము.

### వా ర్తి క ము

చైతన్యం పరమాణూనాం ప్రధానస్యాపి నేష్యతే।
జ్ఞాతే క్రియే జగత్ క్లృప్తౌ దృశ్యతే చేతనాశ్రయే॥ ౧౩

### పీ యూ ష వ ర్షి ణి

"స ఏషోఽణిమైతదాత్మ్య మిదగ్ం సర్వమ్"(ఛాం.౬-౭)
"తమ ఆసీ త్తమసా గూఢ మగ్రమ్" (ఋ. ౧౦) ఇత్యాది

శ్రుతి వచనములు పరమాణువులకు, ప్రధానమునకు జగత్కారణత్వమును చెప్పుచున్నవి గదా; కావున, అనుమాన సిద్ధమైన ప్రకాశరూపత్వము వానికి గూడ నంగీకరింపవచ్చును గదా ? అను ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది.

పరమాణువులకు, ప్రధానమునకు చైతన్యము ఆశ్రయమని చెప్పుట అంగీకార్యము కాదు. సమస్త విశ్వమునందు జ్ఞాన క్రియలు చేతనాశ్రయములై కన్పట్టుచున్నవి.

**విశేష వివరణము**

వైశేషికులు పరమాణువులను, సాంఖ్యులు ప్రధానమును జడరూపములని భావింతురు. వైశేషికుల దృష్టిలో ఆత్మ గూడ, జడము. ఆత్మమనస్సంయోగము వలన జ్ఞానము ఉత్పన్నమగునని వారందురు. సాంఖ్యుల దృష్టిలో పురుషుడు చేతనుడే గాని, ప్రకృతి కంటె సర్వథా భిన్నుడు.

'తదైక్షత' అను శ్రుతివచనము వలన, ప్రధాన, పరమాణువులకు చేతనత్వము, జగత్కారణత్వము సిద్ధించదని తెలియుచున్నది. 'బహు స్యాం ప్రజాయేయ' యని చెప్పుటవలన, ఆత్మకు ఈక్షణము (ఆలోచన), బహుభవనము ఒకేమారు సిద్ధించుచున్నవి. కావున, ఆత్మకు నిమిత్తకారణత్వము చెప్పజనదు (న చ తటస్థేశ్వరస్య కర్తుః నిమిత్తభూతస్యేతి యుక్తమ్').

చేతనసంబంధరహితముగా, అచేతన ద్రవ్యమునందు జ్ఞానక్రియలు సంభవింపనేరవు. కావున, జగత్కారణమైన సద్రూపమే జ్ఞానక్రియలకు ఆశ్రయమని యంగీకరింపనగును.

కూటస్థుడైన యీశ్వరునకు జ్ఞాతృత్వ, కర్తృత్వములు ఎట్లు కలుగుచున్నవి? అని శంకింపరాదు. ఆ జ్ఞాతృత్వ, కర్తృత్వములు గూడ మాయాశక్తి యోగము వలననే కలుగుచున్నవి గాని, మఱియొకదానివలన కలుగుటలేదు. మాయాశక్తివలననే, అవ్యయుడు, పరిణామరహితుడు, విక్రియుడు, అసంగుడు నయిన పరమేశ్వరుడు ఈక్షణ, సృజనాదులను చేసి, సర్వజ్ఞుడు, సర్వక్రియావంతుడని భావింపబడును. ఆ మాయాశక్తియందే, కార్యకారణాత్మకమైన సమస్త విశ్వము అవ్యక్తరూపముతో నున్నది. మాయాశబలితుడైన యీశ్వరుని, యీ ప్రపంచమునకు అభిన్ననిమిత్తోపాదాన కారణమని శ్రుతి వర్ణించుచున్నది. అచేతనమునందు జ్ఞానక్రియలు ఎచటను కన్పడుటలేదు. కార్యకారణరూపమైన ఉపాధ్యావేశము చేతనే కులాలుని యందు జ్ఞానక్రియలు కన్పడుచున్నవి. ఆరీతిగనే, కార్యకారణరూపము, తత్సంస్కార రూపము నయిన ఉపాధియొక్క ఆవేశము వలననే, పరమేశ్వరుని యందు సయితము జ్ఞానక్రియారూపమైన శక్తిని అంగీకరింపనగును. ('తథాచ జగత్కారణస్య ఈశ్వరస్య కార్యకారణోపాధ్యావేశాత్ కులాలజీవస్యేవ కార్య కారణ తత్సంస్కారాత్మక మాయోపాధ్యావేశాత్ జ్ఞాన క్రియే శక్తీ భవిష్యత ఇత్యుక్తమ్').

"యథా చ తక్ష్ణోభయథా" (బ్ర. సూ. ౨-౩-౪౦) అను సూత్రము ఈవిషయమునే స్పష్టము చేయుచున్నది.

వార్తికము

**కాలరూప క్రియాశక్త్యా క్షీరాత్పరిణమే ద్దధి ।**
**జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయరూపం జ్ఞానశక్త్యా భవే జ్జగత్ ॥ ౧౪**

పీయూషవర్షిణీ

పాలు, స్వయముగనే దధిరూపమున పరిణామము పొందుట అనుభవసిద్ధము. కావున, చేతనాపేక్ష లేకయే కార్యము జనించుట సంభవము అని సాంఖ్యులు చేయు శంక నిరాకరింపబడుచున్నది.

కాలరూపమైన క్రియాశక్తి వలననే క్షీరము దధిరూపమున పరిణమించుచున్నది. అటులనే, జ్ఞానశక్తి చేత జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయరూపమైన విశ్వము ఏర్పడు చున్నది. "యస్సర్వేషు భూతేషు తిష్ఠన్" అనును బృహదారణ్యక శ్రుతి కాల మను క్రియాశక్తిసర్వగతుడు, అంతర్యామియు నయిన యీశ్వరుని శక్తి యనియు, తదధిష్ఠితమైన క్షీరము వలన దధిరూపమున పరిణామము చెందుచున్న దనియు చెప్పుచున్నది. ఇది క్షీరము యొక్క స్వభావ మునినచో, ఎల్లప్పుడు దధిరూప పరిణామము ప్రసక్తము కావలసివచ్చును. అట్లగుట అనుభవ సిద్ధము కాదు. దీనివలన, కాలము గూడ పరమేశ్వరుని శక్తి

యొక్క ఆకారభేదమును నిర్దేశించుచున్నది. "పరాஸ్య శక్తిర్వివిధైవ శ్రూయతే" యని శ్వేతాశ్వతర శ్రుతి చెప్పుచున్నది. ఇప్పుడు జ్ఞానరూపశక్తిని వివరించి, ఆ జ్ఞానశక్తియే జగత్కారణమని వివరించుచున్నారు.

జ్ఞానస్వరూపుడైన యీశ్వరుని యందలి శక్తియే జ్ఞానశక్తి, ఆ జ్ఞానశక్తిచేతనే పరమేశ్వరుడు ఈక్షణావ్యవహారము చేయును. ("జ్ఞానం నామ జగత్కర్తురీక్షణవ్యవహారప్రవర్తికా మాయాగావృత్తిః, సా ఆభాస ఇత్యుచ్యతే") ఆ మాయాశక్తి, స్వాశ్రయుడు, మాయాశబలితుడు నయిన యీశ్వరునకు జ్ఞాతృత్వసంపాదిక యగును; స్వరూపతః, జ్ఞానరూపముతో నుండును. జ్ఞేయము, సృజ్యమునయి జగత్తును భాసింప జేయుచు, తదాకారాకారితమై జ్ఞేయరూపము దాల్చును. ఈరీతిగ, జ్ఞానశక్తి వలన, జగత్తు ఏర్పడుచున్నదని గుర్తింపనగును.

వార్తికము

**జ్ఞానం ద్విధా వస్తుమాత్రద్యోతకం నిర్వికల్పకమ్।**
**సవికల్పంతు సంజ్ఞాదిద్యోతకత్వా దనేకధా॥ ౧౩**

పీయూషవర్షిణీ

పూర్వోక్తమైన జ్ఞానశక్తి సామాన్యశక్తి, విశేష శక్తిరూపముతో ద్వివిధమని విభజించి చెప్పబడుచున్నది.

జ్ఞానము ద్వివిధము. ఒకటి, వస్తుమాత్రద్యోతక జ్ఞానము. అనగా, సామాన్యరూపముతో సృజ్యమానము

లయిన సమస్త పదార్థములను ద్యోతనము చేయు జ్ఞానము. ఇది నిర్వికల్పక జ్ఞాన మని వ్యవహరింపబడును. రెండు అనేక ప్రకారజ్ఞానము. అనగా, నామము మొదలగు విశేషరూప ములను భాసింపజేయు జ్ఞానము. ఈ జ్ఞానమును సవికల్పక జ్ఞాన మందురు.

"ఏకోఽహం బహు స్యాం ప్రజాయేయ" యని, యీ విధముగా సృష్టియొక్క మొట్టమొదటి వృత్తిని సామాన్యా కారేణ విషయముగా జేసికొనిన జ్ఞానము నిర్వికల్పక జ్ఞానము. ఆ నిర్వికల్పక జ్ఞానమే మరల ఆకాశాది భూత భౌతిక ప్రకారముతో అనేకవిధములయిన ప్రస్తవ్యార్థ విశేష ములను ద్యోతనము చేయుటవలన సవికల్పకజ్ఞాన మని వ్యవహృత మగును.

వార్తికము

**సంకల్ప సంశయ భ్రాంతి స్మృతి సాదృశ్య నిశ్చయాః।**
**ఊహోఽనధ్యవసాయశ్చ తథాఽన్యేఽనుభవా అపి॥ ౧౬**

పీయూషవర్షిణీ

జ్ఞానమునకు స్వరూపతః, భేదము లేకపోయినను, జ్ఞేయ పదార్థము యొక్క ఆకార భేదము వలన భేద మున్నటుల భాసించును. పూర్వశ్లోకమునందు చెప్పబడిన అనేక వృత్తులు లోకానుభవము ద్వారా వివరింపబడుచున్నవి.

'ఇపుడు దీనిని చేసెదను' అను మానసికవృత్తియే సంకల్పశబ్దముచే నభిహిత మగును. ("ఇదం ఇదానీం కరిష్య

ఇత్యేవమాకారా మనోవృత్తిః సంకల్పః'). అనిర్ధారితమైన అనేకవిధ జ్ఞానము సంశయము. ('అనిర్ధారితానేకకోటికం జ్ఞానం సంశయః').

అది కానిదానిని అది యని తలంచుట భ్రాంతి. భూత కాలమునకు సంబంధించిన అనుభవము వర్తమానకాలము నందు భాసించుట స్మృతి. ఇది దీనితో సదృశమైనదను వృత్తియే సాదృశ్యము ('సాదృశ్య మిద మనేన సదృశ మిత్యేవ మాకారా వృత్తిః'). ఇది యిదియే యను వృత్తిజ్ఞానము నిశ్చయము. దృష్టమగు సాధర్మ్యము చేత గాని, వైధర్మ్యము చేత గాని, అన్యమును ఊహించుట ఊహ. ('ఊహో దృష్ట సాధర్మ్యేణ వైధర్మ్యేణ వాఽన్యస్యోత్ప్రేక్షా'). పరిదృశ్య మానమగు వస్తువునందు సగుణతము అనిశ్చయాత్మక వృత్తి జ్ఞానమే అనధ్యవసాయము. ('అనధ్యవసాయో దృశ్య మానేఽపి వస్తుని అనిశ్చయమాత్రరూపా వృత్తిః'). ఇదే విధముగా, ఇతరములగు లోకప్రసిద్ధములయిన విశేషాను భవములు ప్రత్యక్షాది భేదముతో ఆ జ్ఞానశక్తియే అనేక విధములుగా నగుచున్నది.

## వార్తికము

**ప్రత్యక్ష మేకం చార్వాకాః కణాద సుగతౌ పునః ।**
**అనుమానం చ తచ్చాపి సాంఖ్యాః శబ్దం చ తే అపి॥ ౧౨**
**న్యాయైకదేశినోఽప్యేవ ముపమానం చ కేచన ।**
**అర్థాపత్త్యా సహైతాని చత్వార్యాహ ప్రభాకరః ॥ ౧౩**

**అభావ షష్ఠాన్యేతాని భాట్టా వేదాన్తిన స్తథా।**
**సంభవైతిహ్యయుక్తాని తాని పౌరాణికా జగుః ॥ ౧౯**

పీ యూ ష వ ర్షి ణి

చార్వాకులు ఇంద్రియములు, పదార్థముల సంయోగము వలన జనించు జ్ఞానమునే ఏకైక ప్రమ యని యందురు. అనగా, ఇంద్రియ ప్రత్యక్షజ్ఞానము నొక్కదానినే ప్రమాణముగా భావింతురు. వైశేషికదర్శనాచార్యుడైన కణాదుడు, ఆత్మను క్షణికవిజ్ఞానాతిరిక్తమైన స్వాతంత్ర సత్త కలదానినిగా భావింపని గౌతమబుద్ధుడు- ఈ యిరువురును ప్రత్యక్ష, అనుమానము లనెడి రెండు ప్రమాణములను అంగీకరింతురు. కణాదుడు షట్పదార్థతత్త్వవాది; గౌతమబుద్ధుడు, క్షణిక జ్ఞానాత్మవాది. "వ్యాప్తి పక్ష ధర్మతా విశిష్ట లింగ జ్ఞాన లక్షణం అనుమానమ్" అని అనుమానలక్షణము. ధూమము గల పర్వతమును జూచినపుడు, ధూమ, అగ్ని వ్యాప్తిజ్ఞానము కలవానికి 'పర్వతో వహ్నిమాన్' అను జ్ఞానము కలుగును. అదియే అనుమానము. సాంఖ్యులు ప్రత్యక్ష, అనుమానములతో బాటు శబ్దమును (ఆప్తవాక్యమ్) గూడ ప్రమాణ కోటిలో జేర్చి, మూడు ప్రమాణములను అంగీకరింతురు. కాపిల ప్రవర్తిత సాంఖ్యమే కాక, సేశ్వరసాంఖ్యవాదియైన పాతంజలదర్శనము గూడ ప్రమాణ త్రయమును అంగీకరించినది.

ప్రాచీన నైయాయికులు (న్యాయైకదేశినః) గూడ పై మూడు ప్రమాణములను అంగీకరింతురు. కొందఱు

నైయాయికులు (సర్వ నైయాయికు లయిన గౌతమీయులు) పూర్వోక్త ప్రమాణములతో బాటు 'ఉపమాన' మను నాల్గవ ప్రమాణమును గూడ నంగీకరింతురు. "అతిదేశవాక్యార్థజ్ఞాన సహకృత సాదృశ్యవిశిష్ట పిండజ్ఞానలక్షణం ఉపమానమ్" అని ఉపమానలక్షణము. 'గవయ' మను మృగము గోవువలె నుండును, (గోసదృశో గవయః) అని ఒక ఆటవికుడు చెప్పగా, విని యుందుము. తరువాత, అరణ్యములో గవయమును జూచినంతనే (గోసాదృశ్యము వలన) ఇది 'గవయ' మని గుర్తింతుము. ఆజ్ఞానమే ఉపమానము. మీమాంసకులలో నేకదేశీయుడైన ప్రభాకరుడు (ఈయన కుమారిలభట్టు శిష్యుడు; ఈయన మతమునకు 'గురుమత' మను పేరు కలదు) పై నాలుగు ప్రమాణములతో బాటు 'అర్థాపత్తి' యను నయిదవ ప్రమాణమును ప్రతిపాదించెను. "అనుపపద్యమానార్థదర్శనేన తదుపపాదక మర్థాంతర కల్పన మర్థాపత్తిః"- ఉపపత్తి లభించని పదార్థము అనుభవము లోనికి వచ్చినపుడు, తదుపపాదకమైన అర్థాంతరకల్పన చేయుటయే 'అర్థాపత్తి' యనబడును. 'అతడు బాగా బలిసి యున్నాడు; పగలు భోజనము చేయడు'- ఈ వాక్యమునందు ఆ వ్యక్తి బలిసియుండుటకు ఉపపత్తి లభించుటలేదు. అప్పుడు 'రాత్రిపూట భోజనము చేయును' అనునట్టి యర్థాంతర కల్పన చేయవలసి యుండును. దీనినే అర్థాపత్తిప్రమాణ మందురు.

భాట్టమతానుయాయులైన పూర్వమీమాంసకులు (వీరు మీమాంసక శ్రేష్ఠుడైన కుమారిలభట్టుయొక్క మతము ననుసరించువారు), అద్వైతవేదాంతులు అనుపలబ్ధిలక్షణ మైన 'అభావ' మను నాలవ ప్రమాణమును అంగీకరింతురు ('వేదాంతినోఽపి వ్యవహారకాలే ఆహుః'). పౌరాణికులు సంభవము, ఐతిహ్యము అను రెండు ప్రమాణములతో కలపి మొత్తము ఎనిమిది ప్రమాణములను చెప్పుదురు. అంశి యొక్క అస్తిత్వజ్ఞానము చేత అంశల (భాగముల) సత్తా జ్ఞానము 'సంభవ' శబ్దముచే నభిహిత మగును. 'ఉపదేశ పరంపరామాత్రజన్యం జ్ఞానం ఐతిహ్యమ్'- నిరంతరము జన శ్రుతివలన కలిగెడి జ్ఞానము 'ఐతిహ్య' మనబడును. ఈ ఉపదేశ పరంపరకు మూలము తెలియదు. కావున, ఈ జ్ఞానము, ఆప్తవాక్యజ్ఞానము కంటె భిన్నము ('అస్మిన్ వటవృక్షే యక్షోఽస్తీ త్యుపదేశపరంపరామాత్రజన్యం జ్ఞానమ్').

ప్రత్యక్ష, అనుమాన, శబ్ద, ఉపమాన, అర్థాపత్తి, అభావ, సంభవ, ఐతిహ్యములు- ఈ యెనిమిది ప్రమాణము లును, యథార్థజ్ఞానమునే కాక, యథార్థజ్ఞాన సాధనములను గూడ చెప్పును. సర్వమతవాదులు (చార్వాకులు దక్క) ఈ యెనిమిది ప్రమాణములను స్వాభిప్రేతము లయిన ప్రమాణములలో నంతర్భూతము చేసికొందురు.

వా ర్తి క ము

ద్రవ్యం గుణ స్తథా కర్మ సామాన్యం సవిశేషకమ్ ।
సమవాయం చ కాణాదాః పదార్థాన్ షట్ ప్రచక్షతే ॥౨౨

## పీయూషపత్రికీ

ప్రమాణముల విషయములో విభిన్నవాదముల తత్త్వభేదము నందలి విప్రతిపత్తి ప్రదర్శింపబడినది. ఇపుడు ప్రమేయతత్త్వవిప్రతిపత్తిని ప్రదర్శించుచు, మొదట, వైశేషిక సిద్ధాంతమును ప్రదర్శించుచున్నారు.

ద్రవ్యము ('గుణవచ్చ ద్రవ్యమ్'), గుణము ('జాతిమాత్రాయత్రశ్చ్యే సతి అస్పందాత్మా గుణః'- జాతిమాత్రనిష్ఠమై చలనరహితమైనది గుణము), కర్మ ('చలనాత్మకం కర్మ'), సామాన్యము, అనగా, అనేకమునందు అనుగతమై యుండి నిత్యమైనది సామాన్యము (జాతి) ('నిత్య మనేకానువృత్తి సామాన్యమ్'), విశేషము ('నిత్యద్రవ్యమాత్రాశ్రితా విశేషాః'), సమవాయము అనగా, జాతి, వ్యక్తి మొదలగువాని నిత్యసంబంధము('నిత్యసంబంధః సమవాయః'). కణాదమతానుయాయులు (వైశేషికులు) ఈ యారు పదార్థములను చెప్పుదురు.

### వార్తికము

నవ ద్రవ్యాణి భూతాని దిక్కాలాత్మ మనాంసి చ ।
చతుర్వింశతి రేవ స్యు ర్గుణాః శబ్దాది పంచకమ్ ॥ ౨౧
పరిమాణం చ సంఖ్యా చ ద్వౌ సంయోగ విభాగకౌ ।
స్వభావతః పృథక్త్వం చ గురుత్వం ద్రవతా పునః॥౨౨
పరత్వం చాపరత్వం చ స్నేహః సంస్కార ఇత్యపి ।
ధీర్ద్వేష సుఖదుఃఖేచ్ఛా ధర్మా ధర్మప్రయత్నకాః ॥ ౨౩

పీయూషవర్షిణి

కాణాదులు నవద్రవ్యములను చెప్పుదురు. పృథివ్యప్తేజోవాయురాకాశాది పంచభూతములు, దిక్, కాల, ఆత్మ, మనస్సులు మొత్తము నవ ద్రవ్యములు.

వీరు ఇరువది నాలుగు గుణములను అంగీకరించిరి. అవి యివి- శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాదులు అయిదు; పరిమాణము- ఇది అణుపరిమాణము, హ్రస్వపరిమాణము, మహత్పరిమాణము, దీర్ఘపరిమాణమని నాలుగు విధములు; సంఖ్య, ఏకత్వాదిలక్షణము గలది; సంయోగ, విభాగములు రెండు; పృథక్త్వము ఒకటి, ('పృథక్త్వం 'పృథగ్వ్యవహారాసాధారణకారణం ద్రవ్యగతమ్') గురుత్వ, ద్రవత్వములు రెండు, పరత్వ, అపరత్వములు రెండు గుణములు, స్నేహమనునది ఒక గుణము. ('స్నేహోఽపా మసాధారణో గుణః') సంస్కార మనునది ఒక గుణము. బుద్ధి, ద్వేషము ('ద్వేషోఽసహిష్ణుతాలక్షణ ఆత్మగుణ విశేషః'); సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ధర్మము ('ధర్మో విహితక్రియాజన్యోఽతీంద్రియో గుణః',; అధర్మము ('అధర్మః ప్రతిషిద్ధక్రియాజన్యః అతీంద్రియో గుణః'), ప్రయత్నము ('ప్రయత్న ఉత్సాహః') అనునవి చతుర్వింశతి గుణములు.

వార్తికము

**సంస్కారస్త్రివిధో వేగ ఇష్వాదేర్గతికారణమ్ ।**
**దృష్టశ్రుతానుభూతార్థ స్మృతిహేతుశ్చ భావనా ॥ ౨౪**

వార్తికము

సామాన్యం ద్వివిధం ప్రోక్తం పరం చాపర మేవచ ।
పరం సత్తైవ సర్వత్ర తదనుస్యూతవర్తనమ్ ॥ ౨౭

ద్రవ్యత్వం చ గుణత్వాద్యం సామాన్య మపరం తథా ।
విశేషా స్స్యు రనన్తా స్తే వ్యావృత్తిజ్ఞానహేతవః ॥ ౨౮

ద్రవ్య, గుణ, కర్మల భేదమును నిరూపించిన తరువాత సామాన్యమును వివరించుచున్నారు.

పరము, అపరము అని సామాన్యము (జాతి) ద్వివిధము. సత్తయే పరము (సామాన్యము); అది సర్వదేశ, కాల, వస్తువులలో అనుస్యూతమై (వ్యాప్తమై) యుండును. ద్రవ్యత్వ, గుణత్వాదులు అపర సామాన్యము లనబడును. ప్రతి పదార్థమును వివిక్తముగా తెలియజేయునట్టి 'విశేష ములు' అనంతములు.

వార్తికము

రూపస్యేవ ఘటే నిత్యః సంబంధస్సమవాయకః ।
కాలాకాశ దిగాత్మానో నిత్యాశ్చ విభవశ్చ తే ॥ ౨౯

చతుర్విధాః పరిచ్ఛిన్నా నిత్యాశ్చ పరమాణవః ।
ఇతి వైశేషికమతే పదార్థా షట్ ప్రకీర్తితాః ॥ ౩౦

పీయూషవర్షిణీ

ఘటమునకు, దానిరూపమునకు నిత్యసంబంధము ఉండును. ఆ నిత్యసంబంధము సమవాయ సంబంధ మని

చెప్పబడును. కాలము, ఆకాశము, దిక్కులు, ఆత్మ నిత్యములు; అవి విభువులు (వ్యాపకములు). నాలుగు విధములైన పరమాణువులు (పృథివి, జలము, అగ్ని, వాయువు), పరిచ్ఛిన్నములు, నిత్యములు. వైశేషిక దర్శనమునందు పై రీతిగా, ఆఱు పదార్థములు పేర్కొనబడినవి.

తొమ్మిది పదార్థములలో పరమాణువులు, కాలము, ఆకాశము, దిక్కులు, ఆత్మ నిత్య పదార్థములు; మిగిలిన ద్రవ్యములు అనిత్యము లని గ్రహింపనగును. వీనిలో పరమాణువులు అతి సూక్ష్మములు, నిత్యములు; మిగిలిన వన్నియు వ్యాపకములు, నిత్యములని తెలియవలయును. వీనికి, అన్నిటితో నిత్యసంబంధము ఉండునని భావము.

వా ర్తి క ము

**మాయా ప్రధాన మవ్యక్త మవిద్యాఽజ్ఞాన మక్షరమ్ ।**
**అవ్యాకృతం చ ప్రకృతిః తమ ఇత్యభిధీయతే ॥ ౩౧**
**మాయాయాం బ్రహ్మచైతన్య ప్రతిబింబానుషంగతః ॥**
**మహత్కాల పుమాంసః స్యుః మహత్తత్త్వా దహంకృతిః॥3౨**
**తామసాత్స్వ్య రహంకారాత్ ఖానిలాగ్న్యంబుభూమయః ।**
**శబ్దః స్పర్శశ్చ రూపం చ రసో గంధోఽప్యనుక్రమాత్ ॥ 33**
**ఇంద్రియాణాం చ విషయా భూతానామపి తే గుణాః ।**
**దేవాః సదాశివశ్చేశో రుద్రో విష్ణుశ్చతుర్ముఖః ॥ ౩౪**

పీ యూ ష వ ర్షి ణీ

వైశేషికమతప్రదర్శనానంతరము, వార్తికకారులు సేశ్వర సాంఖ్యమతమును వివరించుచున్నారు.

మాయ, ప్రధానము, అవ్యక్తము, అవిద్య, అజ్ఞానము, అక్షరము, అవ్యాకృతము, ప్రకృతి, తమస్సు - ఈ శబ్దములతో, శ్రుతి, స్మృతి, పురాణములయందు మూలప్రకృతి చెప్ప బడినది. ఈ మూలప్రకృతియే జగత్కారణము.

మాయయందు, మాయకు అధిష్ఠానమైన యీశ్వర చైతన్యము యొక్క ప్రతిబింబ సంబంధము వలన, అనగా, తత్సంసర్గమహిమ వలన మహత్తత్త్వము, కాలము, పురుషుడు అను పదార్థత్రయము ఉత్పన్నమగును.

## విశేష వివరణము

జీవవ్యావృత్తి కొఱకు వార్తికమునందు 'బ్రహ్మ చైతన్య' శబ్దము ఉపయోగింపబడినది. సాంఖ్యదర్శనము నందు జీవచైతన్యనానాత్వము అంగీకరింపబడును. జడమైన మూలప్రకృతి యందు చైతన్యస్వరూపుడైన యీశ్వరుని సంబంధమే సృష్టివికాసమునకు హేతువని సాంఖ్యులు చెప్పుదురు.

కాలము, త్రిగుణాత్మిక ప్రకృతియందు ఉత్కర్ష, అపకర్ష రూపమైన క్షోభను కలిగించును. దానివలన సృష్టి వికాసము జరుగును. గుణత్రయ సామ్యావస్థయందు మూల ప్రకృతి సృజనసమర్థము కాదు. కావున, గుణక్షోభకమైన కాలము అపేక్షితము ('కాలో గుణక్షోభకః'). ప్రకృతి సంబంధము వలన కలుగునట్టి పరమేశ్వర సంబంధమైన యవస్థావిశేషమే కాలము ('కాలో బ్రహ్మ చైతన్యస్య

అవస్థావిశేషః (ప్రకృతి సమావేశ కృతః'). అంతఃకరణాది కార్యోపాధి గల జీవుడే యిచట పురుషశబ్ద వాచ్యుడు. ('కార్యోపాధిర్జీవః'). అతడు సంసారి, పురుషుడు, స్వతంత్రుడు, అనాది. మహత్తత్త్వము ప్రకృతి యొక్క ప్రథమ వికారము. ఈ ప్రకృతిసహాయము చేతనే జీవుడు భోక్తృరూపము నొందుచున్నాడు ('జీవః సంసారీ పుమాన్ స్వతంత్రోఽనాదిరపి, మహత్తత్త్వం ప్రకృతేః ప్రథమ వికార మవష్టభ్య భోక్తృత్వేన ఉత్థితః'). మహత్తత్త్వమునుండి యహంకారము ఉదయించును. ఆ యహంకారము తామస, సాత్త్విక, రాజసాహంకార భేదముతో త్రివిధము. ఇపుడు తామసాహంకార కార్యములు చెప్పబడుచున్నవి.

పీయూషవర్షిణీ

తమోగుణప్రధానమైన అహంకారము వలన ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథ్వులు, మఱియు, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఏర్పడుచున్నవి. ఆ శబ్దాదులు శ్రవణేంద్రియ, త్వగింద్రియ, చక్షురింద్రియ, రసనేంద్రియ, ఘ్రాణేంద్రియములకు విషయము లగుచున్నవి; ఇంతియే కాదు; పృథివి, అప్, తేజో, వాయురాకాశ భూతములకు గుణములు గూడ నగుచున్నవి.

పైన పేర్కొనబడిన భూతపంచకమునకు అధిష్ఠాతృదైవములను చెప్పుచున్నారు. పంచభూతనియామకు లయిన దేవతలలో ఆకాశమునకు అధిష్ఠాన దైవతము సదాశివుడు;

వాయుభూతమునకు అధిష్ఠాత యీశుడు; అగ్నికి అధిష్ఠానదేవత రుద్రుడు; జలాధిష్ఠానదైవము విష్ణువు; పృథివికి అధిష్ఠాన దేవత చతుర్ముఖ బ్రహ్మ.

## విశేష వివరణము

ఇచట, ఒక విషయము గమనింపనగును. మహాభూతములు జడములు. జడ పదార్థములయందు స్వయంప్రవృత్తి యసంభవము. అధిష్ఠాతృ చైతన్యాంశసంసర్గము లేనిదే, ఆ జడభూతములు కార్యక్షమములు కాజాలవు. అందుచేతనే, ఒక్కొక్క దేవతను, ఒక్కొక్క భూతమునకు అధిష్ఠాతృ దైవముగా నిర్ధారించినారని గ్రహింపనగును.

## వా ర్తి క ము

**సాత్త్వికాత్ స్యా దహంకారా దన్తఃకరణ ధీన్ద్రియమ్ ।**
**మనోబుద్ధి రహంకార శ్చిత్తం కరణ మాన్తరమ్ ॥ 37**

## పీ యూ ష వ ర్షి ణీ

సత్త్వగుణప్రధానమైన అహంకారము వలన అంతః కరణము, జ్ఞానేంద్రియములు ఉత్పన్నము లగును. అంతః కరణము మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము అను భేదముతో చతుర్విధముగా నుండును.

## వా ర్తి క ము

**సంశయో నిశ్చయో గర్వ స్స్మరణం విషయా అమీ ।**
**చన్ద్రః ప్రజాపతీ రుద్రః క్షేత్రజ్ఞ ఇతి దేవతాః ॥ 38**

## పీ యూ ష వ ర్షి ణి

ఈ వార్త్తికమునందు అంతఃకరణవిభాగములు, కార్యములను, తదధిష్ఠాతృదైవతములను వివరించుచున్నారు.

సంశయ, నిశ్చయ, గర్వ, స్మరణములు మనస్, బుద్ధి, అహంకార, చిత్తములకు క్రమముగా విషయములు; చంద్ర, ప్రజాపతి, రుద్ర, క్షేత్రజ్ఞులు క్రమముగా వీనికి అధిష్ఠాన దేవతలని తెలియనగును.

## వా ర్త్తి క ము

**శ్రోత్ర త్వక్చక్షుషీ జిహ్వా ఘ్రాణం జ్ఞానేన్ద్రియం విదుః ।**
**దిగ్వాత సూర్య వరుణ నాసత్యా ఇతి దేవతాః ॥ ౩౮**

## పీ యూ ష వ ర్షి ణి

శ్రోత్రేంద్రియము, త్వగింద్రియము, చక్షురింద్రియము, రసనేంద్రియము, ఘ్రాణేంద్రియము— ఇవి జ్ఞానేంద్రియములని తెలియవలయును. దిక్, వాయు, సూర్య, వరుణులు, అశ్వినీదేవతలు పైన చెప్పిన జ్ఞానేంద్రియములకు అధిష్ఠాన దేవతలని స్మృతులు పేర్కొనుచున్నవి.

## వా ర్తి క ము

**రాజసాత్త్వహంకారా త్కర్మేంద్రియ సమీరణాః ।**
**కర్మేంద్రియాణి వాక్ పాణిః పాదః పాయు రుపస్థకమ్॥ ౩౯**

## పీ యూ ష వ ర్షి ణి

రాజసాహంకారము వలన కర్మేంద్రియములు, ప్రాణములు

ఉదయించును. వాక్, పాణి, పాద, పాయూపస్థ కర్మేంద్రియము లనబడును.

వార్తికము

వచనాదాన గమన విసర్గానంద సంజ్ఞకాః ।
విషయా దేవతా స్తేషాం వహ్నీంద్రోపేంద్ర మృత్యుకాః ॥౩౯

పీయూషవర్షిణీ

మాట్లాడుట, గ్రహించుట, నడచుట, విసర్జించుట సుఖ మనుభవించుట- ఇవి క్రమముగా కర్మేంద్రియములకు విషయములని తెలియనగును. అగ్ని, ఇంద్ర, విష్ణు, యమ ప్రజాపతులు, ఈ కర్మేంద్రియములకు క్రమముగా అధిష్ఠాన దేవతలు.

వార్తికము

ప్రాణోఽపాన స్సమాన శ్చోదాన వ్యానౌ చ వాయవః ।
భూతై స్తు పంచభిః ప్రాణై శ్చతుర్దశభి రింద్రియైః ॥ ౪౦
చతుర్వింశతి తత్త్వాని సాంఖ్యశాస్త్రవిదో విదుః ॥ ౪౧

పీయూషవర్షిణీ

ఆంతర వాయువు ప్రాణ, అపాన, సమాన, వ్యాన, ఉదాన భేదముతో అయిదు విధములు. పంచమహాభూతములు పంచ ప్రాణములు, పదునాలుగు ఇంద్రియములు (పంచ కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములు, మనోబుద్ధి చిత్తాహంకార ములు) కలసి చతుర్వింశతి (24) తత్త్వములని సాంఖ్యశాస్త్ర వేత్తలు చెప్పుదురు.

## విశేష వివరణము

సేశ్వర సాంఖ్యమునందు పైన పేర్కొనబడిన చతుర్వింశతి తత్త్వములు అంగీకరింపబడినవి. బ్రహ్మ, మాయ, మహత్తత్త్వము, కాలము, పురుషుడు, అహంకారము, పంచభూత, తన్మాత్రలు కారణరూపముతో ఈ చతుర్వింశతి తత్త్వములలో సంతర్భూతములై యున్నవి. అందువలన, వానిని వేఱుగా పరిగణన చేయలేదని తెలియవలయును. ('అస్య మతే మాయాబ్రహ్మాదీనాం తన్మాత్రాన్తానాం కారణత్వేన అనుగమాత్ న పృథక్త్వేన గణనేతి ద్రష్టవ్యమ్') అనీశ్వర సాంఖ్యము గూడ ఈ యిరువదినాలుగు తత్త్వములను అంగీకరించును. కాని, ఆ నిరీశ్వర సాంఖ్యము నందు ఈ విశేషము గమనింపనగును. మూలప్రకృతి స్వతంత్ర. ('మూలప్రకృతిః స్వతంత్రా'). మహత్తత్త్వము, అహంకారము, పంచభూత తన్మాత్రలు ఏడును, ప్రకృతి వికృతులు. పురుషులు అనంతసంఖ్యలో నుందురు. వారు ప్రకృతియు గాదు, వికృతియు గాదు. అనగా, వారు దేనికిని కారణము కాదు, కార్యమును గాదు. మూలప్రకృతి మాత్రమే సమస్తమునకు కారణము. పంచమహాభూతములు, దశేంద్రియములు, అంతఃకరణము మొత్తము పదునారు వికృతులు. సాత్త్వికాహంకారము వలన అంతఃకరణము, జ్ఞానేంద్రియములు, రాజసాహంకారము వలన కర్మేంద్రియములు, తామసాహంకారము వలన పంచ తన్మాత్రలు, ఆ

తన్మాత్రల వలన పంచ మహాభూతములు నుదయించును ప్రాణములు ఇంద్రియముల సాధారణ వృత్తులే గాని తత్త్వాంతరములు కావని వీరి సిద్ధాంతము.

వా ర్తి క ము

**మహాన్ కాలః ప్రధానం చ మాయాఽవిద్యే చ పూరుషః**
**ఇతి పౌరాణికాః ప్రాహు స్త్రింశత్తత్త్వాని తై స్సహ॥ ४॥**

పీ యూ ష వ ర్షి ణి

సాంఖ్యతత్త్వ ప్రతిపాదనము చేసిన తరువాత, పౌరాణిక దృష్టితో తత్త్వనిరూపణము చేయుచున్నారు.

పైన ప్రదర్శించిన చతుర్వింశతి తత్త్వములతో బాటు పౌరాణికమతము మఱి యాఱు తత్త్వములను అంగీకరించినది. మహత్ - ప్రకృతియొక్క ప్రథమవికారము; ప్రధానము (మూలప్రకృతిః); మాయ ('స్వాశ్రయ మవ్యామోహయన్తీ కర్తు రిచ్ఛా మనుసరన్తీ మాయా'), అవిద్య ('తద్విపరీతా అవిద్యా'), కాలము, పురుషుడు.

**విశేష వివరణము**

కాల మనగా, అవ్యక్తముతోటి యీశ్వరచేష్టయే.

"యోఽయం కాల స్తస్య తేఽవ్యక్తబన్ధో ।
చేష్టా మాహు శ్చేష్టతే యేన విశ్వమ్॥"

ప్రధానమును ప్రవర్తింపజేయువాడు అవ్యక్తబంధు వనబడును. ('అవ్యక్తం ప్రధానం, తస్య, బంధుః ప్రవర్తకః

అవ్యక్తబంధుః, తస్య సంబుద్ధిః అవ్యక్తబంధో). పురుషుడనగా, పరమాత్మాంశ ('పురుషః పరమాత్మనోఽంశః'), అనగా జీవుడు.

"ఏకస్యైవ మమాంశస్య జీవస్యైవ మహామతే"
"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః"

అను వచనములు పురుషుడు (జీవుడు), పరమాత్మాంశ యని చెప్పుచున్నవి. ఈవిధముగా ముప్పది తత్త్వములను పౌరాణికులు చెప్పుదురు. పౌరాణికమతమును ప్రమాణ భూతముగా అంగీకరించునట్టి వైష్ణవసంప్రదాయజ్ఞులు ఈ త్రింశత్తత్త్వములను అంగీకరించుదురు.

**వా ర్తి క ము**

**బిందునాదౌ శక్తిశివౌ శాన్తాతీతౌ తతః పరమ్ ।**
**షట్త్రింశ త్తత్త్వ మిత్యుక్తం శైవాగమవిశారదైః ॥ ४३**

**పీ యూ ష వ ర్షి ణీ**

పైన చెప్పబడిన ముప్పది తత్త్వముల కంటె నధికముగా శైవాగమవిశారదులు మఱి యాఱు తత్త్వములను చెప్పిరి. అవి యివి- బిందునాదములు, శక్తిశివతత్త్వములు, శాంత అతీత తత్త్వములు. మొత్తము, శైవాగమమునందు ముప్పది యాఱు తత్త్వములు అంగీకరింపబడినవి.

**విశేష వివరణము**

బిందుతత్త్వ మనగా, సదాశివ తత్త్వము. సదాశివ తత్త్వము సర్వనియామకము, సర్వాధిష్ఠానము నయిన నిర్గుణ

తత్త్వము. ('బిందుః సర్వాధిష్ఠానం సదాశివాఖ్యం నిర్గుణ తత్త్వమ్'). నాద మనగా, సదాశివునికి సంబంధించినదే యయిన సర్వపదార్థ ప్రకాశక స్వరూపముతో అభివ్యక్తము, ప్రణవాత్మకము నయిన స్వరూపాంతరము ('నాదః తస్యైవ ప్రణవాత్మనా సర్వార్థస్ఫోరకత్వేన అభివ్యక్తం స్వరూపాన్తరమ్').

మాయ, అవిద్యల కంటె భిన్న, సర్వనియామిక, సర్వాధిష్ఠాత్రియగు పారమేశ్వర సామర్థ్యమే శక్తి ('శక్తి ర్మాయాఽవిద్యాభ్యా మన్యా సర్వాధిష్ఠాన సామర్థ్యమ్'). భక్తుల యానందము కొఱకు స్వేచ్ఛతో లీలావిగ్రహమును ధరించువాడు శివుడు ('ఈశ్వరో లీలావిగ్రహధారీ').

శాంతాతీతములు ఆ శివుని యవస్థావిశేషములు. శాంత రూపము, ఘోరరూప మను పేరుతో శివునికి అవస్థాద్వయము కలదు. ('శాంతాతీతౌ తస్యైవ అవస్థావిశేషౌ'). "తస్యైతే తనువౌ ఘోరాఽన్యా శివాఽన్యా" అని తైత్తిరీయసంహితా వచనము (౫-౭-౩) చెప్పుచున్నది.

వా ర్తి క ము

**సర్వే వికల్పాః ప్రాగాసన్ బీజేఽంకుర ఇవాత్మని**
**ఇచ్ఛా జ్ఞాన క్రియారూప మాయయా తే విజృంభితాః॥ ౪౪**

పీ యూ ష వ ర్షి ణి

సృష్టికి పూర్వము పైన పేర్కొనబడిన సర్వవికల్పములు (తత్త్వములు) ఉన్నవి. ఆ తత్త్వములు ఇచ్ఛా,

జ్ఞాన, క్రియారూపిణి యగు మాయచేత నభివ్యక్తము లయినవి.

## విశేష వివరణము

ఈ వార్తికమునందు శ్రుతిసంమతమైన తత్త్వమును ప్రతిపాదించుచున్నారు. పై వికల్పము లన్నియు అద్వితీయ పరబ్రహ్మ మొక్క మాయావిలాసములు మాత్రమే గాని, పారమార్థికములు కావనుచు, శ్రీశంకరభగవత్పాదులు 'బీజస్యాంత రివాంకురః' యను శ్లోకమున ప్రతిపాదించుచున్నారు.

ఇచ్ఛా జ్ఞాన క్రియావిలాసమే యీ సమస్త ప్రపంచము. లోకములో నొక కవికి కావ్యనిర్మాణము చేయవలయు ననెడి యిచ్ఛ కలిగినపుడు, ప్రమేయజ్ఞానమును కల్పన చేసి, ఆలోచన చేయును. అట్లులనే, యీశ్వరుడు ఆ యా ఋషుల రూపమున నుండి ఆ యా ఆగమములను రచించును. జ్ఞానము వలన యథాదృష్టమైన విషయమును లోకమునందు, వేదము నందు అనుసంధానము చేసి, వేదవ్యాసాదిరూపముతో మహా భారతాది గ్రంథరచన చేసిన రీతిగ చేయును; మహా రాజాదులు మహానగర దుర్గాదులను నిర్మించినట్లు నిర్మాణము చేయును. ఆ యీశ్వరుడే అనిర్వచనీయ, సహజశక్తిస్వరూపిణి యయిన మాయాశక్తిసహాకారముతో జగన్నిర్మాణము చేయును.

పూర్వోక్తము లయిన వికల్పములు ఆ యీశ్వరుని చేతనే అభివ్యక్తము లయినవే. అనగా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా

శక్తిరూపిణి యైన మాయ, చైతన్య (ఈశ్వర) సంపర్కము చేతనే ప్రపంచనిర్మాణ సమర్థ యగుచున్నది. ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు మూడును పరమేశ్వరునికి సంబంధించినవే. కావున, ఈ వికల్పములు వ్యావహారికములే గాని, పరమార్థములు కావు. విభిన్న దార్శనికులు వర్ణించిన రీతిగ, జగత్తత్త్వము పారమార్థికమైనచో, విభిన్న దార్శనికుల మధ్య వివాదమునకు అవకాశమే యుండెడిది కాదు. వివాదము కన్పడుచున్నది గాన, పరమార్థము కల్పన కాదని తెలియవలయును. ఇచట అనుమానరచన యీ విధముగా నుండును.

"విమతం, ప్రాగుత్పత్తేః నేశ్వరాత్ పరమార్థతః పృథక్ సత్, తతోఽత్యన్తావివిక్త లక్షణత్వాత్, యదేవం తదేవం, బీజావస్థోఽఙ్కుర ఇతి".

వార్తికము

ఇచ్ఛాజ్ఞానక్రియా పూర్వా యస్మాత్సర్వాః ప్రవృత్తయః ।
సర్వేఽపి జన్తవ స్తస్మా దీశ్వరా ఇతి నిశ్చితాః ॥ ౪౫

పీయూషవర్షిణి

సృష్టికి పూర్వము ఈ విశ్వము ఈశ్వరునికంటె భిన్నముకాదని ప్రతిపాదింపబడినది. ఇపుడు స్థితికాలమునందు సంయుతము జగత్తు ఈశ్వరభిన్నము కాదని ఉపపాదనము చేయబడుచున్నది.

సర్వ ప్రవృత్తులు ఇచ్ఛా, జ్ఞాన, క్రియాపూర్వకములు. అనగా, సమస్తప్రవృత్తులు ఇచ్ఛ, జ్ఞానము, క్రియ- వీని

వలననే కలుగును. కావున, సర్వప్రాణులును ఈశ్వర స్వరూపులే యని నిశ్చయము.

## విశేష వివరణము

ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు (త్రిపుటులు) మాయా శబలిత చైతన్య రూపుడైన ఈశ్వరుని కంటె, అన్యత్ర అచేతనమున నుండుట అసంభవము. సర్వోపాధిరహిత పరమాత్మకు లేక, స్వతః చేతనత్వమును చెప్పుటకు ప్రమాణము లేదు. కావున, సర్వప్రాణులు ఈశ్వరుని కంటె అభిన్నులని స్పష్టమగుచున్నది. అయినను కాని, ఈశ్వరగతము లయిన ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు మాయామయాత్మకములు. కావున, తన్నిమిత్తమైన (ఈశ్వరసృష్టమైన) సమస్త ప్రపంచము సంయుతము మాయామయము (మాయాకార్యము) అని చెప్పుట యుక్తి సహమే. వస్తుతః, కేవల పరమాత్మయే ఏకైక సత్త యని గ్రహింపవలయును.

## వార్తికము

బీజా దప్యుత్థిత స్తరోర్బీజం పారంపర్యేణ జాయతే ।
ఇతి శంకానివృత్త్యర్థం యోగిదృష్టాన్తకీర్తనమ్ ॥ ౪౭

విశ్వామిత్రాదయః పూర్వే పరిపక్వసమాధయః ।
ఉపాదానోపకరణ ప్రయోజన వివర్జితాః ।
స్వేచ్ఛయా ససృజుః సర్వం సర్వభోగోపబృంహితమ్ ॥ ౪౮

## పీయూషవర్షిణి

(శ్రీ) శంకరభగవత్పాదులు "బీజస్యాన్తరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పమ్" అను శ్లోకమున, బీజాంకుర

దృష్టాంతము నిచ్చి యున్నారు. అయిన, బీజ, వృక్షములు వ్యక్తిరూపముతో పరస్పరము కార్యకారణము లగుచున్నవి. అనగా, బీజమునుండి వృక్షము, మరల ఆ వృక్షము నుండి బీజము- ఈవిధముగా అనంత వ్యక్తులు ఏర్పడుట అనుభవ సిద్ధము. అదేవిధముగా, ఈశ్వరునివలన జగత్తు, జగత్తువలన ఈశ్వరుడు- అనంతవ్యక్తులు కావలసివచ్చును గదా ? ('నను బీజాంకురయోరివ జగదీశ్వరయోః యది కార్యకారణతా, తదా వృక్ష బీజ వ్యక్త్యానంత్యవత్ ఈశ్వర జగద్వ్యక్త్యానన్త్యం భవేత్') దీనివలన అజుడు, అవికారియు నైన పరమేశ్వరునకు ఉత్పత్తివినాశములు చెప్పవలసియుండును. అపుడు-

"న జాయతే మ్రియతే వా విపశ్చిత్"

"అవికార్యోఽయ ముచ్యతే"

అను శ్రుతి, స్మృతి వచనములకు విరోధము వచ్చును. ఈ విరోధమును పరిహరించుటకయియే యోగిదృష్టాంత మీయ బడినది.

ప్రాచీనకాలమునందు సమాధినిష్ఠులైన విశ్వామిత్రాది మహర్షులు ఏ యుపాదానకారణము గాని, సాధనము గాని, ఉద్దేశము గాని లేకయే, స్వేచ్ఛామాత్రముచేతనే, సర్వ సుఖ భోగ సమృద్ధమైన స్వర్గాది లోకములను సృష్టించినట్లు పురాణాదుల వలన తెలియుచున్నది.

వార్తికము

ఈశ్వరోఽనన్తశక్తిత్వాత్ స్వతన్త్రోఽన్యానపేక్షతః ।
స్వేచ్ఛామాత్రేణ సకలం సృజత్యవతి హన్తి చ॥ ౪౭

పీయూషవర్షిణీ

స్వతంత్రుఁడైన యీశ్వరుఁడు అన్యాపేక్ష లేకయే స్వసంకల్పమాత్రముచేతనే సమస్త ప్రపంచమును సృజించుచున్నాఁడు, రక్షించుచున్నాఁడు, సంహారము చేయుచున్నాఁడు. ఈశ్వరాధీనులయిన ఋష్యాదులే స్వర్గాదిసృష్టి చేసినపుడు, స్వతంత్రుఁడగు నీశ్వరుఁడు సంకల్పమాత్రముచేత జగత్సర్జనము చేసెననుట అసంగతము కాదు; సంగతమే యని తెలియనగును.

వార్తికము

న కారకాణాం వ్యాపారాత్కర్తా స్యాన్నిత్య ఈశ్వరః ।
నాపి ప్రమాణవ్యాపారాద్ జ్ఞాతాఽసౌ స్వప్రకాశకః॥ ౪౮

పీయూషవర్షిణీ

పరమేశ్వరుఁడు సర్వక్రియారహితుఁడని శ్రుతులు ముక్తకంఠముతో చెప్పుచున్నవి కదా! అట్టితఁడి, ఆయనకు సృష్టి, స్థితి, లయ కర్తృత్వము ఎట్లు ఉపపన్నము? అను శంకకు సమాధానము చెప్పఁబడుచున్నది.

నిత్యుఁడయిన యీశ్వరుఁడు కారక వ్యాపారము వలన కర్త కాఁడు. కారక వ్యాపారయితృత్వము వికారము.

ఈశ్వరుడు నిత్యుడగుట వలన కారక వ్యాపారయితృత్వము లేదు (కారకవ్యాపారయితృత్వం హి వికారః, స ఈశ్వరే నాస్తి, వికారిణోఽనిత్యత్వాత్, ఈశ్వరస్య చ నిత్యత్వాత్). కాని, సన్నిధిసత్తామాత్రముచేత, రాజువలె, అయస్కాంతము వలె క్రియారహితుడయియే యుండును. కారకప్రయోక్త కర్త యనబడును. అనగా, కర్మ, కరణ, సంప్రదాన, అపాదాన, అధికరణముల నుపయోగించి క్రియ చేయువాడే కర్త యనబడును. ఏవంవిధమయిన కారక వ్యాపారము వలన ఈశ్వరుడు కర్త కాడు.

ఆ యీశ్వరుని జ్ఞాతృత్వము సయితము, విలక్షణము, వ్యాపారాపేక్షారహితము. ఆయన స్వయంప్రకాశకుడు, జ్ఞానసాధనముల ద్వారా (ప్రమాణవ్యాపారాత్) జ్ఞాతయు కాడు. సాధనపరాపేక్షుడగుట వలన కర్త కానికతిగనే, మనస్సు, ఇంద్రియముల సహాయము లేకయే స్వసత్తామాత్రముచేత స్వయంప్రకాశుడగుటవలన, ఆయన జ్ఞాతయు కాడు. జ్ఞాత, ఈ సాధనములతో పరమాత్మ ప్రకాశము వలన ప్రతిబింబము పొంది జ్ఞాత యగును. పరమేశ్వరుడు జ్ఞానస్వరూపుడు; జ్ఞాత కాడని తెలియనగును.

వార్తికము

**జ్ఞాతృత్వమపి కర్తృత్వం స్వాతంత్ర్యం తస్య కేవలమ్ ॥**
**యా చేచ్ఛాశక్తివైచిత్రీ సాఽస్య స్వచ్ఛన్దకారితా ॥ ౩౦**

## పీ యూ ష వ ర్షి ణీ

ఆ పరమేశ్వరుని జ్ఞాతృత్వ, కర్తృత్వములు కేవల స్వాతంత్ర్యము వలననే యని తెలియవలయును. అవి, పరమేశ్వరుని స్వతంత్ర భావములని భావము. ఇచట, కేవల మనగా, ఆంతరమైన వికారము లేకపోవుటయే ('స్వగత వికారానపేక్షత్వం కేవలమ్'). "స్వాతంత్ర్యం పరానపేక్షమ్" మనకు వలె, అన్యసాధనాపేక్ష లేకపోవుటయే స్వాతంత్ర్యము. ఆ పరమేశ్వరుని ఇచ్ఛాశక్తి వైచిత్ర్యము ఆయనయొక్క అప్రతిహతమైన పరానపేక్ష(సాధనాంతరాపేక్షారాహిత్యము) యని గ్రహింపనగును.

### వా ర్తి క ము

యయా కర్తుం నవాఽకర్తు మన్యథాకర్తు మర్హతి ।
స్వతంత్రా మీశ్వరేచ్ఛాం కే పరిచ్ఛేత్తు మిహేశతే ॥ ౨౧

### పీ యూ ష వ ర్షి ణీ

పరమేశ్వరుని స్వాచ్ఛందకారిత్వమును ప్రస్ఫుటీకరించుచున్నారు.

పరమేశ్వరుడు స్వీయ స్వాచ్ఛందకారిత్వము వలన కర్తుం (చేయుటకు), అకర్తుం (చేయకుండుటకు), అన్యథా కర్తుం (మఱియొక విధముగా చేయుటకు) సమర్థుడు. స్వతంత్రమైన ఆ యీశ్వరేచ్ఛను నిరోధించుటకు ఎవరును సమర్థులు కారు.

## విశేష వివరణము

పరమేశ్వరుడు కర్మఫలప్రదాతగా, సమస్త జగన్నియామకుడుగా స్వయంప్రవృత్తి కలవాడు గాని, పరతంత్రుడు కాడు. అన్యసాధనాపేక్షారహితు డయియే ఆయన స్వాతంత్ర్యశక్తితో జగత్తును సృజించును. ఆయన, కర్తు మకర్తు మన్యథాకర్తుం సమర్థుడు. అన్యథాకరణశక్తి వలననే అమూర్త ఆకాశమునుండి మూర్తజగత్సృష్టి సంభవమైనది. ఉష్ణద్రవ్యమైన అగ్నినుండి శీతజలము, ద్రవపదార్థమైన జలమునుండి ఘనద్రవ్యమైన పృథివి ఉత్పన్నమగుట సంభవమయ్యెను.

శ్రుతులు సర్వస్వతంత్రుడని కంఠోక్తిగా పరమేశ్వరుని గుణసంకీర్తనము చేయుచున్నవి. దార్శనికులు ఏ ప్రమాణము చేత నయినను, ఈశ్వరుని స్వాతంత్ర్యశక్తిని ఆయనకంటె పరిచ్ఛిన్నురాలని చెప్పుటకు పూనుకొనుట వ్యర్థప్రయత్నమే యగును.

### వార్తికము

**శ్రుతిశ్చ సోఽకామయతేతీచ్ఛయా సృష్టి మీశితుః ।**
**తస్మా దాత్మన ఆకాశ స్సంభూత ఇతి చాబ్రవీత్ ॥ ౫౨**

### పీయూషవర్షిణీ

ప్రపంచసృష్టివ్యాపారము ఈశ్వరేచ్ఛాపూర్వకముగనే జరుగుచున్నదనుటకు శ్రుతిప్రమాణము నిచ్చుచున్నారు.

"సో౽కామయత"- ఆ పరమేశ్వరుడు సంకల్పించె ననియు, "తస్మా ద్వాత్మ న ఆకాశ స్సంభూతః"- ఆ పరమాత్మ నుండి ఆకాశము ఉద్భవించె ననియు శ్రుతిచూత పరమేశ్వరుని యిచ్ఛవలన సృష్టి జరిగినదని చెప్పుచున్నది. ఈ విధముగా "సో౽కామయత, బహుస్యాం ప్రజాయేయ" అను శ్రుతి వచనము పరమేశ్వరుని అభిన్ననిమిత్తోపాదానకారణత్వమును స్పష్టము చేయుచున్నది.

వా ర్తి క ము

**నిమిత్తం చే ద్భవే దస్య జగతః పరమేశ్వరః ।**
**వికారిత్వం వినాశిత్వం భవే దస్య కులాలవత్ ॥ ౨౩**

పీ యూ ష వ ర్షి ణీ

ఇంతవఱకు, ఈశ్వరుడు స్వాత్మస్థితుడై తత్త్వాంతరముల కంటె ననిర్వచనీయమైన నామరూపాత్మక జగత్తును స్వమాయావేశవశము వలన సృష్టించుచు, వికారరహితుడై జగత్తునకు ఉపాదానకారణము గాని, నిమిత్తకారణము గాని, యగుచున్నాడని 'మాయావీవ' (మాయావివలె) 'మహాయోగీవ' (మహాయోగివలె) అను దృష్టాంతముల చేత స్వమతము ఉపన్యసింపబడినది. ఇపుడు కేవల నిమిత్తకారణ వాదమునందలి దోషము ప్రదర్శింపబడుచున్నది.

పరమేశ్వరుడు ఈ ప్రపంచమునకు కేవల నిమిత్త కారణ మని యంగీకరించినచో, ఈయనకు కులాలునికి వలె వికారిత్వ, వినాశిత్వములను అంగీకరింపవలసివచ్చును. కేవల

నిమిత్త కారణవాది అనుమానప్రమాణముచేత సిద్ధమైన యీశ్వరుని యంగీకరించును.

### విశేష వివరణము

పరమాణువులు ఉపాదానముగా గల యీ ప్రపంచమునకు నిమిత్తము (కర్త) అయినచో, ఈశ్వరుడు కులాలుని వంటివాడు కావలసివచ్చును. ('అస్య జగతః పరమాణూపాదానకస్య నిమిత్తం కర్తా చేత్ ఈశ్వరః కులాలవత్ భవేత్'). అపుడు వాస్తవముగా ఈశ్వరునకు వికారిత్వము, క్రియావత్త్వము ప్రసక్తము కావలసియుండును. క్రియాశూన్యుడయినవాడు అన్య వస్తువును పరిణమింపజేయుటకు సమర్థుడు కాడు. క్రియావంతుడు శరీరి యగుటవలన అతనికి వినాశిత్వము తప్పక సంభవించును. విక్రియమాణము నిత్యమని చెప్పుటయందు ప్రత్యుదాహరణము లేదు. కావున, పరమార్థతః, కర్తృత్వమునందు వికారిత్వాది దోషములు ప్రసక్తమగుట అనివార్యమని భావము.

### వార్తికము

**బుద్ధ్యాదయో నవ గుణా నిత్యా ఏవేశ్వరస్య చేత్ ।**
**నిత్యేచ్ఛావాన్ జగత్స్రష్టా ప్రవర్తేతైవ సర్వదా ॥ ౩౪**

### పీయూషవర్షిణి

నిత్య జ్ఞానేచ్ఛాదులు గల యీశ్వరుడు ధర్మిగ్రాహక ప్రమాణముచేత సిద్ధించునట్టివాడు. ఆ కారణముచేత శరీర

వైలక్షణ్యము సిద్ధించుటయందు పైన పేర్కొనబడిన దోషము నకు అవకాశము లేదనిన, సమాధానము చెప్పబడుచున్నది.

ఈశ్వరునకు బుద్ధి, సంస్కారము, ద్వేషము, సుఖము, దుఃఖము, ఇచ్ఛ, ధర్మము, అధర్మము, ప్రయత్నము అను తొమ్మిది గుణములు నిత్యములే యని యంగీకరించినచో, నిత్యేచ్ఛ గలవాడు సంసారసృష్టియందు సదా ప్రవర్తించును.

## విశేష వివరణము

న్యాయదర్శనమునందు ఈశ్వరునకు బుద్ధ్యాది నవ గుణములు అంగీకరింపబడినవి. జీవాత్మయందు ఈ నవవిధ గుణము లున్నచందముననే సృష్ట్యాదిన, పరమాత్మ యందు గూడ నుండును ('నవగుణా ఇతి జీవాత్మాభిప్రాయమ్. తేషా మపి ఈశ్వరేణ జగత్సర్గాదా ఉపాదీయమానత్వాత్ ఈశ్వరస్యే త్యుక్తమ్').

## వార్తికము

**ప్రవృత్త్యుపరమాభావాత్ సంసారో నైవ నశ్యతి ।**
**మోక్షోపదేశో వ్యర్థ స్స్యా దాగమోఽపి నిరర్థకః ॥ ౨౨**

## పీయూషవర్షిణీ

జగత్సర్జనప్రవృత్తి సదా యుండిన నుండుగాక! అపుడు ఏమి జరుగును? అను శంకకు సమాధానము చెప్పబడు చున్నది.

ప్రవృత్తి యుపశమించకపోవుట వలన, సంసారనాశమే జరుగును. మోక్షశాస్త్రము వ్యర్థమగును. వేదము గూడ నిరర్థక మగును.

వార్తికము

**తస్మాన్మాయావిలాసోఽయం జగత్కర్తృత్వ మీశితుః।**
**బంధమోక్షోపదేశాది వ్యవహారోఽపి మాయయా ॥ ౩౬**

పీయూషవర్షిణీ

పరమతము దోషదుష్ట మగుట వలన, స్వమతము అబాధిత మని ఋజువైన దనుచు ద్వితీయోల్లాసమును ఉపసంహరించు చున్నారు.

కావున, ఈశ్వరునియొక్క సృష్టికర్తృత్వము ఏతన్మాయా విలాసమే. బంధమోక్షోపదేశాది వ్యవహారము సయితము మాయవలననే యని తెలియవలయును.

**విశేష వివరణము**

మహామాయావి, మహాయోగియందు వలె పరమేశ్వరుని యందు సమస్త వ్యవహారము ఆరోపితము. ఇదియే ఔపనిషద సిద్ధాంతము. పరమేశ్వరుడు సదసద్విలక్షణుడు. అనిర్వచనీయ మైన, నామరూపాత్మకమైన జగత్తునకు స్వీయ మాయాశక్తి ద్వారా ఈశ్వరుడు అభిన్న నిమిత్తోపాదాన కారణము. ఆయన అవికారి.

బంధము సైతము ఆరోపితమేగాని, వాస్తవికము కాదు. బంధనివృత్తిరూపమైన మోక్షము గాని, మోక్ష

మార్గోపదేశము గాని, మిథ్యాభూతమే ('అస్మన్మతే బంధాదేరపి మాయికత్వాత్ మోక్షోపదేశో౽పి మాయిక ఏవాభ్యుపగమ్యతే'). కాని, ఉపదేశవిషయము వాస్తవికమే. విషయదృష్టితో మోక్షశాస్త్రమునందు పారమార్థికత యంగీకరింపబడినది. వర్ణములయందు దీర్ఘత్వ, ప్లుతత్వ ఉదాత్తత్వాదులు కల్పితములు గాని, వర్ణములు వాస్తవికమైనరీతిగా, మోక్షోపదేశ విషయము పారమార్థికము.

"న నిరోధో నచోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః।
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా॥"

యను గౌడపాద కారికావచనము పైన చెప్పిన ఉపనిష త్సిద్ధాంతమునకు ఉపోద్బలకముగా నున్నది.

వా ర్తి క ము

ఇతి శ్రీదక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకే
ప్రబన్ధే మానసోల్లాసే ద్వితీయోల్లాస సంగ్రహః॥ ౨౦

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరుగల ప్రబంధము యొక్క
ద్వితీయోల్లాస సంగ్రహము
స ం పూ ర్ణ ము.



యస్యైవ స్ఫురణం సదాత్మకమసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్॥
యత్సాక్షాత్కరణాద్భవే న్న పునరావృత్తి ర్భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

పీయూషవర్షిణీ

ప్రత్యగాత్మాభిన్నమైన పరమాత్మయొక్క సద్రూ
స్ఫురణమే, చైతన్యమే స్వతః సత్తారహితమైన వియదా
పదార్థములను జేరి సద్రూపముగ ప్రకాశించుచున్నది
దక్షిణామూర్తిస్వరూపమైన యా పరమేశ్వరచైతన్యమే
'తత్త్వమసి' యను శ్రుతివాక్యముచేత ఆశ్రితులంగు
భక్తులకు ప్రత్యగ్బ్రహ్మైక్య జ్ఞానమును సాక్షాత్తుగ
బోధించుచుండును. ఆ చిదాత్మసాక్షాత్కారము వలన
సంసారసాగరమునందు పునరావృత్తి యుండదు. తాదృశ
మహత్త్వ సంపన్నమూర్తి, గురుమూర్తియు నగు శ్రీదక్షిణా
మూర్తికి నమస్కారము.

విశేష వివరణము

జగత్కారణము అసద్వస్తువే యయినచో, 'ఘటోఽసన్'
'పటోఽసన్' ఇది ఘటము కాదు, ఇది పటము కాదు అని
అసత్తే సర్వత్ర అనుగత మగును. కాని, కార్యమైన
జగత్తు సదనువిద్ధ మగుచునే ప్రకాశించుచున్నది. కావున,

స్వతః సత్తాశూన్యము, స్వయంప్రకాశరహితము నయిన జగత్తు తదధిష్ఠానభూతము లయిన సత్తాప్రకాశముల చేతనే సత్తా, ప్రకాశములు కలదై వర్తిలుచున్నది. ఆ సద్రూపమైన బ్రహ్మయందు జగత్తు అధ్యస్త మగుటచే, జగత్కారణము సద్రూపమే. మృత్పిండాది నాశము ఘటాదులకు కారణము కాదు; మృదాదులకే కారణత్వము చెప్పనగును. జాగరాది కాలమునందలి కార్యము అసత్పూర్వకమని చెప్పబూనుట మాకు సమ్మతమైన విషయము కాదు. సుషుప్తికాలము నందలి సద్రూపమైన ఆత్మకే కారణత్వము చెప్పుట మాకు సంమతము. సుషుప్తియందు ఆత్మ సద్రూపమని ముందు చెప్పబోవుచున్నాము. "అసద్వా ఇద మగ్ర ఆసీత్" అను శ్రుతియు అనభివ్యక్త సత్కారణపరమే. "కథ మసతః సజ్జాయతే" అను ఛాందోగ్యశ్రుతి చేతనే అసద్వాదము ప్రతిషేధింపబడినది.

'ఘటస్సన్', 'పటస్సన్' అని సద్రూపముగ పరిదృశ్యమాన మగుచున్న జగత్తు అసత్కల్పము, అధ్యస్త మని యెట్లు చెప్పనగును ? అని యాశంక చేసికొని 'యస్యైవ స్ఫురణం సదాత్మకమ్' అని సమాధానము చెప్పబడు చున్నది. సద్రూపము, ప్రకాశరూపము నయిన అధిష్ఠానాత్మ సత్తయే ఆరోపిత జగన్నిష్ఠమై ప్రతీయమాన మగుచున్నదే గాని, ఆ జగత్తునకు స్వయంసత్త లేదు. ('సత్ప్రకాశ రూపాధిష్ఠానాత్మసత్తైవారోపిత జగన్నిష్ఠతయా ప్రతీయతే,

నతు తస్య స్వతస్సత్త్వమ్').సర్వజగదధిష్ఠానమైన ప్రత్యగాత్మా
భిన్నమైన పరమేశ్వర చైతన్యమే, అధ్యస్తమైన ప్రపంచమ
నందు ప్రకాశించుచున్నదని పిండితార్థము. "అథాత ఆదేశో
నేతి నేతి" (బృ. ౪ - ౩ - ౬) "నేహ నానాఽస్తి కించన
(బృ.౬-౪-౧౯) ఇత్యాది శ్రుతులు సర్వాత్మనా ప్రపం
నిషేధము చేయుచున్నవి. భ్రాంతిచేత నయినను, ప్రపంచమ
ప్రతీయమాన మగుచున్నది. కావున, అసిద్ధలక్షణత్వమున
అంగీకరించుట వలన అది శశవిషాణసదృశము (కుందేట
కొమ్ము వంటిది) కాదు. కావున, అపరోక్ష ప్రతీతియ
నుపపన్నమే యని తాత్పర్యము.

మిథ్యాభూతమైన యీ ప్రపంచమునందు సత్యత్వ
బుద్ధి, అనాత్మలగు దేహాదులయందు ఆత్మబుద్ధి- ఇదియే
సకల సంసారమునకు కారణము ('యేయ మసత్యే ప్రపంచే
సత్యత్వబుద్ధిః అనాత్మని దేహాదౌ చ ఆత్మత్వబుద్ధిః ఇయమేవ
సకల సంసారనిదానమ్'). సద్గురూపదిష్టమైన తత్త్వమస్యాది
మహావాక్యముల చేత కలిగిన అపరోక్ష జ్ఞానముచేతనే,
మూలాజ్ఞాన నివృత్తిచేతనే యీ సంసారనివృత్తికలుగు నను
అభిప్రాయముతో "సాక్షాత్తత్త్వమసీతి" యను గ్రంథము
ఆరంభ మయినది. గురురూపముతో నున్న పరమేశ్వరుడు
గురూపసదనవిధితో నుపదేశము నొందుటకై యేతెంచిన
శిష్యులకు, 'తత్త్వమసి'- జగత్కారణము, సద్రూపము,
అద్వితీయము నగు బ్రహ్మ నీవే; తద్భిన్నుడవు కావు అను

శ్రుతివాక్యము ద్వారా అపరోక్ష తత్త్వమును జ్ఞాపకము చేయును.

అయిన, కించిజ్జ్ఞత్వ, సర్వజ్ఞత్వాది విరుద్ధ ధర్మములు గల జీవేశ్వరులకు అసంగతమైన అభేదమును వేదము ఎట్లు బోధించును ? అను ఆశంకకు సమాధానము ఈరీతిగ చెప్పికొనవలయును- 'సోఽయం దేవదత్తః-' అతడే యీ దేవదత్తుడు- అను వాక్యము ఏతద్దేశాది విరుద్ధాంశమును వదలిపెట్టి, అవిరుద్ధాంశమైన వ్యక్తిని మాత్రమే గ్రహించి భాగత్యాగ లక్షణచేత అభేదమును బోధించును. అదేరీతిగ, తత్త్వమస్యాది మహావాక్యములు గూడ జీవేశ్వరుల మాయాంతఃకరణోపాధులను (ఈశ్వరుడు మాయోపాధికుడు, జీవుడు అంతఃకరణోపాధికుడు), ఆ ఉపాధుల వలన కలిగిన కించిజ్జ్ఞత్వ, సర్వజ్ఞత్వాది రూపమైన విరుద్ధాంశములను వదలిపెట్టి ఉభయత్ర అనుగతము, అవిరుద్ధము నగు కేవల చిన్మాత్రమును గ్రహించుట ద్వారా అభేదమును బోధించును. ఇచట మహావాక్యార్థనిశ్చయములో అన్య వాదులు లేవనెత్తిన అనుపపత్తులను [illegible]నుండి గురువాచార్యులు పూనికతో నిరసించియున్నారు.

సుషుప్తి, ప్రళయములవలె ఈ సంసారము మరల యెప్పుడైనను ఉద్భవింపవచ్చును గదా! యని యాశంక జేసి 'యత్సాక్షాత్కరణాత్' ఇత్యాది గ్రంథముచే సమాధానము చెప్పబడుచున్నది. స్వప్రకాశ, నిష్ప్రపంచ, సచ్చిదానంద

స్వరూప బ్రహ్మ యొక్క అపరోక్ష సాక్షాత్కారము వలన, అనగా, 'సోఽహ మస్మి' యనెడి జ్ఞానము వలన సంసార సాగరమునందు పునరాగమన మనునది యుండదు.

"తరతి శోక మాత్మవిత్"
"బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"
"న స పున రావర్తతే"

ఇత్యాది శ్రుతిశతములు బ్రహ్మవేత్తకు పునరావృత్తి లేదని కంఠరవేణ యుద్ఘోషించు చున్నవి. సుషుప్తి, ప్రలయముల యందు మూలాజ్ఞానము ఉండును. కావున, వానికి పునరుత్థానము చెప్పబడును. బ్రహ్మవేత్త విషయములో మహావాక్యజన్య జ్ఞానము వలన మూలాజ్ఞానము సమూలముగా నశించును. ఆకారణముచేత జీవన్ముక్తునకు పునరావృత్తి యుండదని భావము.

శ్రీవ్యాసమునీంద్రులు సూతసంహితా ముక్తిఖండము నందు ఆత్మాస్తిత్వమును, తత్స్వరూప ప్రమాణ విశేషములను ఈ విధముగా వివరించిరి.

"ఆత్మా తావత్సురా అస్తి స్వసంవేద్యో నిరాస్పదః।
ఆనన్దః పూర్ణచైతన్యః సదా సోఽహం న సంశయః॥
తస్య కాచిత్సురాః శక్తి మాయాఽఽఖ్యాఽస్తి విమోహినీ।
విచారవేలాయాం సాఽఽత్మా భవత్యేవ నచాన్యథా॥"

శ్రీ విద్యారణ్యులు తాత్పర్యదీపిక యందు ఈ వచనముల భావమును ఇట్లు నిరూపించిరి.

దేహేంద్రియాది సంఘాతాతిరిక్తమైన ఆత్మసద్భావమునందు అనేకులు సందేహమున్నవారై యున్నారు. కనుకనే, నచికేతుడు -

"యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే౽స్తీత్యేకే నాయమస్తీతి చైకే। ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం ॥"

అని యమధర్మరాజుముందు దేహేంద్రియాది వ్యతిరిక్తమైన ఆత్మ సద్భావ సంశయమును ఉదాహరించెను. అంత, యముడు "దేవైరత్రాపి విచికిత్సితం పురా నహి సువిజ్ఞేయమణురేష ధర్మః" అనుచు, ఆత్మసద్భావము దుర్బోధమని మొదట చెప్పెను. తైత్తిరీయ శ్రుతియు-

"అస్తి బ్రహ్మేతి చేద్వేద, సన్తమేనం తతో విదుః"

అనుచు ఆత్మాస్తిత్వమే ముందుగా జ్ఞాతవ్యమని చెప్పుచున్నది.

"అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి"

అనుచు కాఠకశ్రుతి ఆత్మాస్తిత్వము తెలిసినవానికి బ్రహ్మాత్మైక్యరూప తత్త్వభావము కలుగునని చెప్పుచున్నది.

కావుననే, పరిశిష్టమున 'ఆత్మ తావత్' అను వచనముతో ఆత్మసద్భావమును చెప్పెను. స్వతంత్రమైన ఆత్మకు అస్తిత్వము

ఉన్నది. ఆత్మ స్వరూపముయొక్క ప్రమాణ ప్రకార విశేషములు చెప్పుటయే 'తావత్' శబ్దము యొక్క తాత్పర్యము. అనగా, ఆత్మాస్తిత్వము ప్రమాణ లక్షణ సంగత మని భావము.

'నిరాస్పదః' యని ఆత్మస్వరూపము యొక్క అసాధారణ రూపము ప్రతిపాదితము. మాయ, తత్కార్య మైన సమస్తము ఆత్మాస్పదము; అనగా ఆత్మయే యాధారముగ గలది, ఆత్మయనినను-

"స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వే మహిమ్ని"

యను శ్రుతివచనానుసారము పరమేశ్వరుడు స్వమహిమ (శక్తి) యందే ప్రతిష్ఠితుడై యుండునని తెలియుచున్నది. కావున, ఆత్మ నిరాస్పదుడు. అనగా అనన్యాస్పదుడు. అదియే ఆత్మయొక్క అసాధారణ రూపమని భావము ('స్వమహిమప్రతిష్ఠితత్వాత్ అనన్యాస్పద ఇతి తదేవ తస్య అసాధారణం రూప మిత్యర్థః'- తాత్పర్యదీపిక).

ఆ ఆత్మ స్వసంవేద్యము. "యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ" యనుచు, వాఙ్మనో విషయములకు అతీతుడైన ఆ పరమేశ్వరుని విషయములో, స్వభావభూతమైన ప్రకాశమే ముఖ్య ప్రమాణ మని 'స్వసంవేద్యః' యను శబ్దముచే సూచితము.

ఆత్మ, పూర్ణచైతన్య స్వరూపుడు. జ్ఞానాతిరిక్త మైనది జడము; జ్ఞానము స్వయంప్రకాశము; అది క్షణికము

అనంతత్వము 'ఆనందః' యనుటచేత సుఖత్వము, 'సోఽహమ్' అనుటచేత ప్రత్యక్త్వము— ఈవిధముగా ఆత్మయొక్క రూప పంచకము ప్రపంచితము. సత్య, జ్ఞాన, అనంత, ఆనందాత్మత్వ లక్షణమైన రూపపంచకముచేత అనృత, జడ, అంతవత్త్వ, దుఃఖ, అనాత్మత్వ భ్రమ నిరాసము ద్వారా అఖండైకరస స్వరూపము ఉపదేశింపబడిన దని తెలియవలయును. ఈ రీతిగ, బాదరాయణుడు పూర్వోదాహృత శ్లోకము ద్వారా ఆత్మ స్వరూప, ప్రమాణ నిరూపణము చేసి, ఆత్మ, ప్రత్యగాత్మాభిన్నమని యుపదేశించెను.

ఈ విధముగా నేకరసమైన ఆత్మ వస్తువునందు దేహాభాస, జగదవభాసములు ఎట్లు కలుగుచున్నవి ? యను ప్రశ్నకు సమాధానము ఈరీతిగ చెప్పికొనవగును. మోహినీ మాయాశక్తి ఆత్మాశ్రితమై యున్నది. ఆత్మతత్త్వ విచార వేళయందు ఆ మాయాశక్తి ఆత్మయే యగును; ఆ మాయ ఆత్మాతిరిక్తము కాదు. ఆత్మాశ్రిత, మోహాకరియు నగు మాయవలన ఆత్మయందు దేహావభాస, జగదవభాసములు కలుగుచున్నవే గాని, వాస్తవికములు కావు. వేదాంత విచార జనిత జ్ఞానముచే నవి నివర్తించు నని భావము.



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## తృతీయోల్లాసః

### వార్త్తికము

సత్తాస్ఫురత్తే భావేషు కుత ఆగత్య సంగతే ।
బింబాది దర్పణన్యాయా దిత్థం పృచ్ఛన్ ప్రబోధ్యతే ॥ ౧

### పీయూషవర్షిణి

సర్వపదార్థద్రష్టగా నుపలక్షితుడగు చిదాత్మ (జీవుడు) 'త్వం' పదార్థమని ప్రథమ శ్లోకమున వివరింపబడినది. సమస్త ప్రపంచమును స్వాత్మయందు విలీనము చేసికొని, స్వీయ మాయాశక్తితో స్వయముగనే జగత్తును అభివ్యక్తము చేయుచు సర్వానుస్యూతమైన (సర్వాంతర్యామియైన) సదాత్మగా నుపలక్షితుడగు చిదాత్మ 'తత్' పదార్థమని ద్వితీయశ్లోకమున ప్రతిపాదింపబడినది. పదార్థద్వయము ఒకటే యని ప్రకటించుటకొఱకై తృతీయ శ్లోకము ప్రారంభింపబడుచున్నది. వార్త్తికకారులైన శ్రీ సురేశ్వరులు ప్రథమశ్లోకహృదయమును ప్రథమోల్లాసమునందు, ద్వితీయ శ్లోక ప్రతిపాదితార్థమును ద్వితీయోల్లాసమునందు వివరించిరి. ఇపుడు తృతీయశ్లోక ప్రతిపాద్య విషయమును ప్రతిపాదింప

నెంచి, యీ ఈ తృతీయ ఉల్లాసమును 'సత్తాస్ఫురత్తే' అ
వార్తికముతో నారంభించు చున్నారు.

దర్పణమునందు బింబము వలె, పదార్థములలో సత్త
ప్రకాశములు ఎట్లు వచ్చి కలసినవి? అని ప్రశ్నించినవా
సమాధానము చెప్పబడుచున్నది.

సత్తాస్ఫురణములు దృశ్య ధర్మములు కావని, ద్ర
యొక్క ధర్మములని పూర్వము చెప్పబడినది. ఇచట ప్రశ్న
యొకటి యుదయించు చున్నది. అది యేమన, సత్త
ప్రకాశములు దృశ్య పదార్థజాతమునందు లేకపోయినచో, వా
యందు అని యెట్లు కన్పడును? మఱియొక ప్రశ్న యేమనగా
ద్రష్టృనిష్ఠములయియే (ద్రష్టయందు ఉండియే) భాసించు
చున్న వనినచో, దర్పణాదులయందు వలె ముఖాదిదృశ్య
పదార్థములయందు ప్రతిబింబభావమును ఆచరించుచున్నవా
ఇదియు నుపపన్నము కాదు. మొదటి పక్షమున సత్త
స్ఫురత్తల సర్వవ్యాపకత్వ, నిరవయవత్వములకు భంగము
వాటిల్లును. ('అయఃపిండాదౌ అగ్నేరివ సంక్రమోఽపి
అనుపపన్నః). ద్వితీయపక్షమునందు అమూర్తములయిన
సత్తాప్రకాశములకు ప్రతిబింబభావము అనుపపన్నము
('అమూర్తయో స్తయోః ప్రతిబింబభావానుపపత్తేః').
కావున, సర్వసత్తాస్ఫురణరూపమైన బ్రహ్మ యెట్లు ఆత్మ
యగును? అని శిష్యుని ప్రశ్నకు 'యస్యైవ స్ఫురణమ్' అనుచు
సమాధానము చెప్పుచున్నారు.

వార్తికము

అసత్కల్పేషు భావేషు జడేషు క్షణనాశిషు ।
అస్తిత్వం చ ప్రకాశత్వం నిత్యాత్సంక్రామతీశ్వరాత్ ॥ ౨

పీయూషవర్షిణీ

ఇదమత్ర ఆకూతమ్- ఇచట యిది యభిప్రేతము.

పదార్థముల యందు (భావేషు) ఆత్మయొక్క సత్తా ప్రకాశములు ఎక్కడనుంచి వచ్చి కలసినవని ప్రశ్నించితివి గదా? అచట వేఱుగా చెప్పెదను, అనగ పిండాదులవలె విద్యమానములైన పదార్థములయందు సత్తాప్రకాశములు ఎట్లు కలసినవని ప్రశ్నించుచుంటివా, అథవా, ఆత్మ సత్తాస్ఫురణ సంబంధముచేత పదార్థములకే స్వతః సత్తాస్ఫురణములు సంభవించినవా? యని ప్రశ్నించుచుంటివా? యనెడి వికల్పములలో మొదటి ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నారు.

ప్రతిక్షణము నశించునట్టి (సర్వే పదార్థాః క్షణపరిణామినః) జడములైన మిథ్యాపదార్థముల యందు, నిత్యుడైన యీశ్వరునివలన సత్తాప్రకాశత్వములు సంక్రమించుచున్నవి.

పదార్థములు జడములు. కావుననే, యని క్షణ కాలములో నశించునట్టివి. శుక్తి, రజతమువలె జడము లగుటవలన వితథమైన క్షణపరిణామస్వభావము అనిర్వచనీయము, సద్విలక్షణము ('వితథం, అనిర్వచనీయం సద్విలక్షణమ్). క్షణపరిణామి పదార్థముల యందు సత్తను

అంగీకరించినచో, మందాంధకారములో రజ్జువునందు సర
సత్తను, స్వప్నదృష్ట పదార్థసత్తను సయితము అంగీకరిం
వలసిన యావశ్యకత కలుగును. కావున, దృష్ట న
స్వభావము గల రజతమునందు శుక్తిరూపమైన అధిష్ఠా
సత్త సంక్రమించినటులనే, జాగతిక పదార్థములయందు నిత
మైన యీశ్వరసత్త సంక్రమించినదని తెలియవలయున
('విప్రతిపన్నం జడం దృష్టనష్టస్వరూపత్వాత్, శుక్తిరజ
వదిత్యర్థః'). దీనివలన, క్షణనాశిత్వమే జడత్వమునకు హేతువ
తెలియనగును. ఏవంవిధములయిన పదార్థములకు ప్రకాశవ
ఆత్మప్రకాశము వలననే కలుగుచున్నది. జడ పదార్థము
పరప్రకాశ్యములు. ('ఏవంవిధేషు భావేషు నిత్యాదీశ్వరాత్
అస్తిత్వంచ ప్రకాశత్వం చ సంక్రామ ద్విషయస్థమి
విషయాకార మవభాసేతే రజతాత్మనేన శుక్తిసత్తాస్ఫుర
ఇత్యర్థః').

"నిత్యాత్ ఈశ్వరాత్ సంక్రామతి" యను స్థలము
సంక్రమణ శబ్దతాత్పర్యము విశేషాకారము యొక్క
అవభాసనపరమే గాని, ప్రవేశపరము కాదు ('అత్రసంక్రమ
శబ్దో విశేషాకారావభాసాభిప్రాయః, న ప్రవేశాభిప్రాయః'
ఈశ్వరునికంటె భిన్నమైన పదార్థము లేదు గావు
ప్రవేశము అసంగతము. ఆరోపితమైన రజతమునందు శు
సత్త సంక్రమించదు ('సమారోపితస్య అధిష్ఠాన వ్యతిరేకే
స్వరూపాభావాత్, తద్వ దిదమపీతి భావః'). కావున, ఆత

సత్తా ప్రకాశములు సంసారమునందు ప్రవేశించుట యనగా, పదార్థములకు ఆత్మసత్తా ప్రకాశములకంటె భిన్నమైన సత్తా స్ఫురణములు లేకపోవుట యని గ్రహింపవలయును.

వార్తికము

ఆత్మసత్తైవ సత్తైషాం భావానాం న తతోఽధికా ।
తథైవ స్ఫురణం చైషాం నాత్మస్ఫురణతోఽధికమ్ ॥ 8

పీయూషవర్షిణీ

పైన చెప్పబడిన పదార్థములయొక్క మిథ్యాత్వము విస్పష్టముగా చెప్పబడుచున్నది.

ఈ పదార్థముల అస్తిత్వము ఆత్మసత్తయే కాని, దానికంటె నధికమేమియు కాదు. ఆ రీతిగనే, ఈ పదార్థముల ప్రతీతియు (స్ఫురణము, ప్రకాశము) ఆత్మప్రకాశాతిరిక్తము కాదు.

దర్పణాదులువలె పదార్థములు వేఱుగా నున్నచో, ఆత్మసత్తాస్ఫురణముల ప్రతిబింబముగాని, సంక్రమణముగాని యుండవచ్చును. అపుడు ప్రతిబింబరహితమైన దర్పణమువలె, అగ్నిరహితమైన అయోగోళమువలె పదార్థములు భాసింపవలయును. కాని, పదార్థములు అట్లు భాసించుట లేదు. కావున, ఆత్మసత్తాస్ఫురత్తలే పదార్థములుగా ప్రతీయమానము

లగుచున్న వని భావింపవలయును. ఈవిధముగా ఆత్మ సత్త, ప్రతీత మగుటయే, దాని సంక్రమణము. కావున, భిన్న మైన సత్త లేనివగుట చేతనే పదార్థములు మిథ్యాభూతములు ('అతః, ఆత్మసత్తాస్ఫురణాధిక సత్తాస్ఫురణాభావాత్ పార్థగర్థ్యాభావే సతి న ప్రతిబింబః, సంక్రమో వా కస్యచిత్క్వాపీత్యభిప్రాయః').

వా ర్తి క ము

జ్ఞానాని బహురూపాణి తేషాం చ విషయా అపి ।
అహంకారేఽనుషజ్యన్తే సూత్రే మణిగణా ఇవ ॥ ४

పీ యూ ష వ ర్షి ణి

పదార్థములకే స్వతః సత్తాప్రకాశములు కలవు గదా ; అట్లైనచో, ఆత్మసత్తాస్ఫురణముల సంబంధముయొక్క యావశ్యకత యేల? అను రెండవ ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది.

అహంకారమునందు, అనగా చిదాభాసయుక్తమైన అంతఃకరణమునందు, అనేకవిధజ్ఞానములు, తద్విషయములు సయితము సూత్రమునందు అనేకమణులు గ్రుచ్చబడినట్లు, గ్రథితములై (గుచ్చబడి) యుండును.

సచ్చిద్రూపమైన ఆత్మయందు తాదాత్మ్యాధ్యాసచేత జనించిన అంతఃకరణవ్యాప్తిచేతనే పదార్థములకు సత్తాప్రకాశములు కలుగును గాని, స్వతంత్రముగా కలుగనేరవు. అనగా,

అంతఃకరణము ఇంద్రియముల ద్వారా విషయసాన్నిధ్యము చేత తదాకారాకారితమైనపుడు, దానియందు చైతన్యప్రతిఫలనము జరిగినపుడు మాత్రమే, పదార్థజ్ఞానము అనుభూయమాన మగును. కావున, పదార్థములకు స్వయంప్రకాశత్వము లేదు. స్వయంప్రకాశత్వమే యుండిన, సాభాస- అంతఃకరణము యొక్క- యావశ్యకత యుండదు. ఇంతకు ముందు పారమార్థికదృష్టితో ఆత్మసత్తాసంబంధమే గాని, తదతిరిక్తమైన విషయములే లేవని చెప్పబడినది. ఇపుడు వ్యవహారదృష్టి నాశ్రయించి సాభాసాంతఃకరణ ప్రణాళికతో ఆత్మసత్తాప్రకాశములు అనుగతమందక, బాహ్యవిషయములయందు ఆత్మ యొక్క- సత్తాస్ఫురణములు లేవని చెప్పబడినది. ('వ్యవహారదృష్టి మాశ్రిత్య సాభాసాన్తఃకరణ ప్రణాళికయా ఆత్మసత్తాద్యనుగమ మన్తరేణ న బాహ్యవిషయేషు సత్తాదిర స్తీత్యుక్తమితి విశేషో ద్రష్టవ్యః'). ఈ విధముగా రెంటికి గల భేదమును గుర్తింపనగును.

వా ర్తి క ము

ప్రకాశాభిన్న మేవైత ద్విశ్వం సర్వస్య భాసతే ।
లహరీ బుద్బుదాదీనాం సలిలా న్న పృథక్ స్థితిః ॥ ౫

పీ యూ ష వ ర్షి ణీ

సమస్త పదార్థజాతము వ్యవహారదశయందు గూడ ప్రకాశాభిన్నము (జ్ఞానాభిన్నము) అని చెప్పబడుచున్నది.

తరంగ, బుద్బుదాదులు జలముకంటె భిన్నములు కావని తెలియుచున్నది. అటులనే, సమస్త ప్రాణిజాతమునకు,

అనుభూయమాన మగుచున్న యీ విశ్వము జ్ఞానాభి
మనియే ప్రతీయమాన మగుచున్నది.

పదార్థప్రతీతి జ్ఞానాధీనమనుట యనుభవసిద్ధము.
దేని యధీనమున నుండునో, అది తద్భిన్నము కాదు. ఘ
ప్రతీతి ఘటజ్ఞానభిన్నము కాదు ('యద్యదధీన స
స్ఫూర్తిమత్ తత్తస్మిన్ పరికల్పితమ్'). జలాధీనమైన స
స్ఫూర్తులు గల తరంగ, ఫేన బుద్బుదాదులు జలమునం
కల్పితమైనట్లు, ఈ పదార్థము లన్నియు సచ్చిదాత్మాధీ
సత్తా స్ఫూర్తులు గల వగుటంజేసి ఆ సచ్చిదాత్మయం
కల్పితములని తెలియవలయును. కావున, సచ్చిదాత్మలక
తత్త్వంపదార్థములకు (జీవేశ్వరులకు) అద్వితీయత్వ
పరమార్థము ('ఇమే భావాః సచ్చిదాత్మాధీన సత్తా
స్ఫూర్తికాః, తస్మిన్ పరికల్పితా ఇతి సిద్ధమ్; సచ్చిదాత్మని
స్తత్త్వంపదార్థయో రద్వితీయత్వం పరమార్థమ్').

వా ర్తి క ము

**జానామీత్యేవ యద్ జ్ఞానం భావా నావిశ్య వర్తతే ।**
**జ్ఞాతం మయేతి తత్పశ్చా ద్విభ్రామ్య త్యన్తరాత్మని ॥**

పీ యూ ష వ ర్షి ణీ

విషయస్ఫురణము ఆత్మధర్మమే గాని, విషయధర్మము
కాదని ప్రతిపాదింపబడుచున్నది.

అహం జానామి'- నేను ఎఱుగుదును అని పదార్థముల
నాశ్రయించి యున్న జ్ఞానమే అనంతరము, అంతరాత్మ

యందు 'మయా జ్ఞాతం' నాచే తెలియబడినదని పర్యవసించును.

### వా ర్తి క ము

ఘటాదికాని కార్యాణి విశ్రామ్యన్తి మృదాదిషు।
విశ్వం ప్రకాశాభిన్నత్వా ద్విశ్రామ్యే త్పరమేశ్వరే ॥ ౩

### పీ యూ ష వ ర్షి ణీ

ఘట శరావాది కార్యములు మృదాది కారణముల యందు పర్యవసితములగు రీతిగనే, జ్ఞానాభిన్నమగుట వలన ఈ విశ్వము పరమేశ్వరునియందు పర్యవసానము నొందును.

పూర్వవార్తిక ప్రతిపాదిత భావమునకు ఈ వార్తికము నందు 'ఘటాదికాని కార్యాణి' అని దృష్టాంతము చెప్పబడినది. 'విశ్వం ప్రకాశాభిన్నత్వాత్' అని దార్ష్టాంతికము చెప్పబడినది. 'ఇద మహం జనామి' 'విజ్ఞాత మిదం మయా'- అని సవిషయజ్ఞానమే భావింపబడుట చేత రెండు జ్ఞానములు సమానముగా ప్రతీయమాన మగును. కాని, మొదటి ప్రయోగమునందు (ఇద మహం జానామి) క్రియతో కర్తకు కర్మవ్యాప్తిమాత్రమే వివక్షితము (ప్రథమ ప్రయోగే కర్తుః క్రియయా కర్మవ్యాప్తిమాత్రం వివక్షితమ్'). అందు వలన 'భావా నావిశ్య'- పదార్థములను వ్యాపించి అని చెప్పబడినది. ద్వితీయ ప్రయోగమునందు సకర్మకక్రియకు స్వసమవేత రూపముగా అనుసంధానము చెప్పబడినది, అందు

వలన, 'పరమాత్మని విశ్రామ్యేత్' అని చెప్పబడినది. దీ
భావ మేమన, ఏది, దేని కార్యమో, అది రెండవదానితో
రంజితమై గోచరించుచున్నను, తన కారణమునందే పర్యవసి
మగును. కార్యకారణములు అభిన్నములని దృష్టాం
దార్ష్టాంతికముల యభిప్రాయము ('యస్య యత్కార్యం
తదన్యోపరక్తతయా భాసమానమపి స్వకారణ ఏవ విశ్రామ్యతి
కార్యం చ కారణా న్నాత్యంతభిన్న మితి దృష్టాం
దార్ష్టాంతికయో రభిప్రాయః').

అథవా, విషయగత ప్రకాశము ఆత్మైకమాత్రము
ప్రకాశ్య (జ్ఞేయ) విషయము నియమపూర్వకముగా జ్ఞా
ప్రకాశానువిద్ధమై యుండుట యనుభవసిద్ధము. కావున
జ్ఞేయము జ్ఞానాభిన్నము. ప్రకాశాత్మయందు అధ్యస్త
మగుట వలననే విషయములు ప్రకాశవైశిష్ట్యముచేత
భాసమానము లగుచున్నవి అనెడి యుద్దేశముతో దార్ష్టాం
తికపూర్వకముగా దృష్టాంతము చెప్పబడినది. ('ప్రకాశ్యస్య
విషయస్యాపి జ్ఞానప్రకాశానువిద్ధతయైవ నియమేన ఉప
లంభాత్ తదేకాత్మత్వమితి ప్రకాశాత్మ న్యధ్యస్తత్వాదేవ
ప్రకాశవైశిష్ట్యేన భానం విషయాణామ్').

పై రెండు వార్తికములయందు జగత్ప్రకాశము
ఆత్మప్రకాశాధీన మనియు, విశ్వసత్త ఆత్మసత్తాధీనమనియు
(శ్రీ) సురేశ్వరులు యుక్తిసహముగా ప్రతిపాదించినారు.

కావున, ఆత్మ సత్తాస్ఫురణములే ప్రపంచసత్తకు, ప్రకాశము నకు హేతుభూతములని చక్కగా తెలియవలయును.

వా ర్తి క ము

స్వగతేనైవ కాలిమ్నా దర్పణం మలినం యథా ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః ॥ ౮

పీ యూ ష వ ర్షి ణి

ఈవిధముగా, అద్వితీయమే తత్త్వము అయినచో, సమస్త లోకము ఎందుకు తెలిసికొనలేకపోవుచున్నది ? యని ఆశంక చేసికొని, సహజదోషము వలననే, తెలిసికొనలేకపోవుచున్నదని సోదాహరణముగా ప్రతిపాదించుచున్నారు.

దర్పణగత మాలిన్యముచేతనే, దర్పణస్వభావము మలిన మగుచున్నది. అటులనే, ఆత్మజ్ఞానము (స్వరూపము) స్వగతమైన అనాది, అనిర్వచనీయ అవిద్యచేత నావృత మగుటచే ప్రాణులు (జీవులు) భ్రాంతి నొందుచున్నారు. మోహ మనగా మిథ్యాజ్ఞానము. ద్రష్ట, దృశ్య, కార్య, కారణాది భేదములయందు వాస్తవికతా భ్రాంతియే మోహము. ఈ మోహము వలననే, జీవులు అద్వైత ఆత్మతత్త్వజ్ఞానమును పొందలేకపోవుచున్నారు. ఈ మోహము అవిద్యామూలకము. కావుననే, శ్రీ సర్వజ్ఞాత్మముని సంక్షేప శారీరకము నందు "ఆశ్రయత్వ విషయత్వ విభాగినీ నిర్విభాగ చితి రేవ కేవలా" యనుచు అవిద్య భేదజనయిత్రి యని అవిద్యా

స్వరూపమును నిర్వచించినారు. 'మోహం మిథ్యాజ్ఞాన
ద్రష్టృ దృశ్య కార్యకారణాది విభాగం పరమార్థవిషయక
ప్రాప్నువంతి' అనుచు "తేనాచ్ఛాదనేన జన్తవో ముహ్యన్తి'
యను తాత్పర్యమును శ్రీరామతీర్థయతి వివరించినారు
కావున, అవిద్యావరణమే మోహమునకు, స్థూల, సూక్ష్మ
దేహతాదాత్మ్యాభిమానమునకు, సర్వానర్థములకు మూలము
నిఖిల జగదధిష్ఠానమైన అద్వైతబ్రహ్మ యందు సమస్త
భేదములు కల్పితములే గాని, వాస్తవికములు కావని తెలియ
వలయును.

### వార్తికము

**ఘటాకాశో మహాకాశో ఘటోపాధికృతో యథా ।**
**దేహోపాధికృతో భేదో జీవాత్మ పరమాత్మనోః ॥ ౯**

### పీయూషవర్షిణి

సర్వభేదవ్యవహారమునకు మూలము అజ్ఞాన మని
చెప్పబడినది. ఇపుడు జీవేశ్వర భేదము భాసింపకపోవుటకు
ప్రధాన కారణము దృష్టాంతపూర్వకముగా చెప్పబడు
చున్నది.

ఘటముచే పరిచ్ఛిన్నమైన ఆకాశము, అపరిచ్ఛిన్నమైన
మహాకాశము (ఘటాకాశః, మహాకాశః) అను వ్యవహార
భేదము ఘటోపాధికృతమే గాని, వాస్తవికము కాదు
ఆ రీతిగనే, జీవాత్మ, పరమాత్మ లనెడి భేదము దేహోపాధి
కృతము; పారమార్థికము కాదు.

ఆకాశము సహజముగా అమూర్తము, అపరిచ్ఛిన్నము అయినను, ఘటోపాధిని నిమిత్తముగా జేసికొని, ఘటాకాశమని, ఘటాకాశమునకు బయట నున్న, ఉపాధిరహితమైన ఆకాశమునకు మహాకాశమని భేదవ్యవహారము కల్పింపబడినది. వస్తుతః, ఆకాశము నిరవయవము, అపరిచ్ఛిన్నము, అఖండము. కావున, ఆకాశము సదా అపరిచ్ఛిన్నమై యుండును ('న పరమార్థతః ఆకాశస్య అమూర్తస్య కేనచిత్ పరిచ్ఛేదః సంభవతి'). ఇదేవిధముగా, పరమార్థతః, నిరంశుడు అపరిచ్ఛిన్నుడు నగుచు చిదాత్మయందు దేహోపాధికృతమైన జీవభావము, దేహముచే నపరిచ్ఛిన్నమైన తత్త్వమునందు పరమాత్మభావము అధ్యస్తము. జీవాత్మ పరమాత్మలకు ఉపాధికృతమైన భేదమే గాని, పరమార్థమున, భేదము లేదు. 'దేహేనాహం మనుష్య ఇత్యాది ప్రకారేణ స ఏవ చిదాత్మా జీవాత్మేత్యుచ్యతే'- దేహము వలన 'నేను మనుష్యుడను' ఇత్యాది విధముగా విశేష్యమాణుడైన యా చిదాత్మయే జీవాత్మనామముచేత వ్యపదేశ్యు డగును. 'స ఏవ తేన అవిశేష్యమాణ ఈశ్వర ఇతి'- ఆ చిదాత్మయే దేహాద్యుపాధులచే అవిశేష్యమాణుడై యీశ్వర శబ్ద వాచ్యు డగును. చిదాత్మయందు ఉపాధికృతమైన అధ్యాస వలననే జీవేశ్వరులకు భేదము కల్పితమే గాని, వాస్తవము కాదు ('దేహాదేశ్చోపాధేః చిదాత్మన్యధ్యాస మన్తరేణ సంబంధానిరూపణాత్ న జీవేశ్వరయోః వాస్తవో భేదః సంభవతి').

## విశేష వివరణము

జీవేశ్వర భేదము ఉపాధి ప్రయుక్తమే కాని, యథా
కాదు; అది అజ్ఞానముచే కల్పింపబడిన ఉపాధితాదాత్మ్యము
కలిగినది. ఆత్మస్వరూపావగతి, జ్ఞానము వలననే కలు
ఇత్యాదిగా శ్రీవ్యాసమునీంద్రులు సూతసంహితా
యోగఖండము, పదియవ అధ్యాయమున ఇట్లు వివరించి

"జ్ఞానేనైవ నివృత్తిః స్యాదజ్ఞానస్య న కర్మణా ।
యద్యాత్మా మలినః కర్తా భోక్తా చ స్యాత్స్వభావ
నాస్తి తస్య వినిర్మోక్షః సంసారాజ్జన్మకోటిభిః ।
ఆత్మాఽయం కేవలః స్వచ్ఛః శాన్తః సూక్ష్మః సనా
అస్తి సర్వాన్తరః సాక్షీ చిన్మాత్రః సుఖవిగ్రహః ।
అయం స భగవానీశః స్వయంజ్యోతిః సనాతనః ॥"

మలిన సత్త్వప్రధానమైన మాయోపాధికత్వము,
యందు ఆరోపితమైన మాలిన్యము; తత్కల్పితమై
'అహం కర్తా' 'అహం భోక్తా' యను అనుభవము.
సత్త్వ ప్రధానమైన మాయోపాధికత్వము, కర్తృ
భోక్తృత్వములు, జీవత్వము ఆత్మకు సహజమే యై
కోటిజన్మలకైనను ముక్తి సిద్ధింపనేరదు. ఈ య
కేవలుడు, నిర్మలమైనవాడు, శాంతుడు, సూక్ష్మమైన
('అణోరణీయాన్'), సనాతనుడు, సర్వాంతరుడు,
స్వరూపుడు, చిన్మాత్ర సుఖవిగ్రహుడు. "స బ్రహ్మా స
స హరిః సేన్ద్రః సోఽక్షరః పరమః స్వరాట్" అనుచు

జీవునకు తత్పదార్థ తాత్పర్యగూపమైన 'తత్త్వమసి' మహా వాక్యార్థమును ఉపదేశించుచున్నది.

వా ర్తి క ము

**తత్త్వమస్యాది వాక్యైస్తు తయోరైక్యం ప్రదర్శ్యతే ।**
**సోఽయంఽపురుష ఇత్యుక్తే పుమానేకో హి దృశ్యతే ॥ ౧౦**

పీ యూ ష వ ర్షి ణీ

ఆరోపితము లయిన దేహాద్యుపాధులచే భేదప్రతీతి కలుగును. కావుననే, జీవాత్మ, పరమాత్మల భేదాంశ బాధకములైన తత్త్వమస్యాది శ్రుతివాక్యములు జీవ, పర మాత్మా భేదమును ప్రతిపాదించుచున్న వని చెప్పబడు చున్నది.

లోకము 'సోఽయం పురుషః' అతడే (ఎప్పుడో చూడ బడిన వ్యక్తియే) ఈ పురుషుడు' అను ప్రయోగమునందు ఒకే వ్యక్తి తెలియబడుచున్నాడు. ఆవిధముగనే 'తత్త్వమసి' ఇత్యాది వేదాంత మహావాక్యములచేత జీవాత్మ పరమాత్మ లకు ఏకత్వము చెప్పబడును.

వేదాన్త మహావాక్యములు జ్ఞాపకములు గాని, విధాయకములు కావు. విరుద్ధాంశములను తొలగించి సిద్ధమై యున్న యేకత్వమునే అభివ్యక్తము చేయును ('ప్రదర్శ్యతే, జ్ఞాప్యతే న తు విధీయతే అన్యస్య అన్యాత్మత్వ విధానా యోగాత్ సిద్ధమేవైక్యం విరుద్ధాంశాపోహేన ప్రకటీక్రియత ఇత్యర్థః').

వార్తికము

**యజ్జగత్కారణం తత్త్వం తత్పదార్థ స్స ఉచ్యతే।**
**దేహాదిభిః పరిచ్ఛిన్నో జీవస్తు త్వంపదాభిధః ॥ ౧౧**

పీయూషవర్షిణి

వేదాంత మహావాక్యార్థ జ్ఞానము యొక్క ఉత్పత్తి ప్రక్రియను నిరూపించుటకై, మొదట తత్, త్వం పదముల వాచ్యార్థ, లక్ష్యార్థభేదమును చెప్పుచున్నారు.

జగత్తునకు కారణమైన తత్త్వము 'తత్' పదమునకు వాచ్యార్థముగా చెప్పబడును; దేహాదులచే పరిచ్ఛిన్న భావముతో నుండు జీవుడు 'త్వం' పదమునకు వాచ్యార్థము.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే" "తజ్జలానితి" యిత్యాది శ్రుతి వచనములు, పరమేశ్వరుడు జగత్కారణ మని చెప్పుచున్నవి. ఆయనయందు పరోక్షత్వ, సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వ, సత్యసంకల్పత్వాది ధర్మములు సదా యుండును. ఆయన 'తత్' పదవాచ్యుడు ('అధిదైవావస్థ విక్షేపశక్తి ప్రధాన మాయాదిశబ్దవాచ్య అజ్ఞాన తత్కార్య భూత భౌతిక ప్రపంచోపహితతయా పరోక్షత్వాది ధర్మ విశిష్టః చిదాత్మా తత్పదవాచ్యార్థః").

అపరోక్షత్వాదిధర్మ విశిష్టుడైన చిదాత్మయే (జీవాత్మయే) 'త్వం' పదముచే వ్యపదేశ్యుడు. అల్పజ్ఞుడుగా, అల్పశక్తి మంతుడుగా అనుభూతి నొందుటయే జీవుని పరిచ్ఛిన్నత్వము.

ఆయన ఆవరణశక్తిచే నావృతుడై యుండుటచేత యథార్థ తత్త్వము నెఱుంగడు. అజ్ఞాన, తత్కార్యములగు స్థూల, సూక్ష్మ దేహములచే నుపహితుడై యుండును. ఈ జీవుడు 'త్వం' పదవాచ్యుడు ('అధ్యాత్మావస్థ ఆవరణశక్తిప్రధాన అవిద్యాది శబ్దవాచ్య అజ్ఞాన తత్కార్య దేహద్వయ ప్రపంచోపహితతయా అపరోక్షత్వాది ధర్మవిశిష్టః చిదాత్మా త్వం పద వాచ్యార్థః).

వార్తికము

'తద్దేశ కాలావస్థాదౌ దృష్టః స ఇతి కథ్యతే ।
తథైతద్దేశకాలాదౌ దృష్టోఽయ మితి కీర్త్యతే ॥ ౧౨

పీయూషవర్షిణీ

పరోపాధివిశిష్టమైన వ్యక్తియొక్క (పదార్థముయొక్క) వాచ్యార్థమునందు దృష్టాంతము చెప్పబడుచున్నది.

పరోక్ష (తత్) దేశ, కాలావస్థలయందు 'అతడు' (సః) అని చెప్పబడును. ఆ రీతిగనే, అపరోక్ష (ఏతత్) దేశ కాలాదులయందు 'ఇతడు' (అయం) అని చెప్పబడును.

వార్తికము

ముఖ్యం తదేతద్వైశిష్ట్యం విసృజ్య పదయో ర్ద్వయోః ।
పుమ్మాత్రం లక్షయత్యేకం యథా సోఽయం పుమానృచః॥౧౩

పీయూషవర్షిణీ

వాచ్యాంశమునందు విరుద్ధాంశమును పరిత్యజించుట చేత రెండింటియందు (ఇరువురియందు) ననుగత మగు

అవిరుద్ధాంశమునకు లక్షణావృత్తి ద్వారా, యే అఖండ వాక్యార్థము చెప్పబడునో, అదియే లక్ష్యార్థ మని దృష్టాంత సహితముగా చెప్పుచున్నారు.

"సోఽయం పుమాన్"- అతడే, యీ పురుషుడు అనెడి వాక్యము రెండు శబ్దముల యొక్క ముఖ్యార్థమును (వాచ్యార్థమును) అతడు (సః), ఇతడు (అయం) అను పరోక్ష, అపరోక్ష రూపమైన విశేషమును పరిత్యజించి అనుగతుడయిన ఒకే పురుషుని పరిలక్షితుని జేయును. ('తద్వైశిష్ట్యం స ఇతి పదనిర్దిష్టం పరోక్షకాలాది నైశిష్ట్యం, ఏతద్వైశిష్ట్యం అయమితి పదనిర్దిష్టం అపరోక్ష దేశకాలాదినైశిష్ట్యం ముఖ్యం వాచ్యం విసృజ్య అనుగత ముభయత్ర పుమ్మాత్రమ్').

వార్తికము

**ప్రత్యక్త్వం చ పరాక్త్వం చ త్యక్త్వా తత్త్వమసీతి వాక్ ।**
**తథైవ లక్షయత్యైక్యం జీవాత్మ పరమాత్మనోః ॥ ౧౪**

పీయూషవర్షిణి

ఆరీతిగనే, "తత్త్వమసి" (అతడే నీవు) అను వాక్యము అపరోక్షభావమును (ప్రత్యక్త్వం చ), పరోక్షభావమును (పరాక్త్వం చ) రెంటెని వదలిపెట్టి జీవేశ్వరుల ఏకత్వమునే బోధించును. అనగా, అనుగతమగు కేవల చిన్మాత్రాంశమునే గ్రహించి అఖండ తత్త్వమును బోధించును. ('తత్త్వమసి వాక్యమపి స్వపదార్థగత విరుద్ధాంశ ప్రహాణేన

అనుగత చిన్మాత్రాంశ మాదాయ అఖండం తత్త్వం లక్షయేదిత్యాహ").

వా ర్తి క ము

**సమానాధికరణాఖ్య స్సంబన్ధః పదయో రిహ ।**
**విశేషణ విశేష్యత్వం సంబంధః స్యాత్ పదార్థయోః ॥ ౧౫**

పీ యూ ష వ ర్షి ణి

పద, పదార్థములకు గల సంబంధనిరూపణము చేయు చున్నారు.

ప్రస్తుత ప్రసంగమునందు సమానమైన విభక్తులు అంతమందు గల శబ్దములకు సామానాధికరణ్యసంబంధము ఉండును. పదములచే చెప్పబడు అర్థములకు విశేషణ విశేష్య భావసంబంధము ఉండును. "నీలో ఘటః" నీలవర్ణము గల ఘటము. 'నీలః, ఘటః' అను రెండు పదములును సమాన విభక్త్యంతములు. కావున, ఆ పదములకు గల సంబంధము సామానాధికరణ్యసంబంధము. ఆపదద్వయము చేత చెప్పబడు అర్థములకు (విషయములకు) గల సంబంధము విశేషణవిశేష్య భావ సంబంధము. 'నీల' శబ్దము విశేషణము. 'ఘట' శబ్దము విశేష్యము. ('పదయోః సామానాధికరణ్యః సంబంధః; సామానాధికరణ్యలక్షణం వక్ష్యతి, పదార్థయో ర్వాచ్యయోః విశేషణ విశేష్యత్వం సంబంధః. యథా 'సోఽయ మయం సః' ఇతి భేదభ్రమ వ్యుదాసాయ విశేషణ విశేష్యభావః, తథా తత్త్వంపదార్థయో రపీత్యర్థః).

### వా ర్తి క ము

**లక్ష్యలక్షణసంయోగా ద్వాక్య మైక్యం చ బోధయేత్ ।**
**గంగాయాం ఘోష ఇతివ న్న జహల్లక్షణా భవేత్ ॥ ౧౬**

### పీ యూ ష వ ర్షి ణి

వాక్యము లక్ష్యలక్షణభావ సంబంధము ద్వారా ఐక్యమును బోధించును. ఒక పదము వాచ్యార్థమును బోధించును. వాక్యము లక్ష్యలక్షణ సంబంధము ద్వారా అఖండార్థమును బోధించునని భావము. గంగయందు గొల్ల పల్లె (గంగాయాః ఘోషః) యను వాక్యము వలె ప్రస్తుత ప్రసంగమునందు జహల్లక్షణ చెప్పుటకు వలనుపడదు.

### విశేష వివరణము

జీవ, చైతన్యములకు లక్ష్యలక్షణభావ సంబంధము చెప్పనగును. లక్షణ మనగా, శక్యసంబంధము (శక్యసంబంధో హి లక్షణా). జీవశబ్దము యొక్క వాచ్యార్థము పంచకోశా వచ్ఛిన్న చైతన్యము; లక్ష్యార్థము నిర్విశేష చైతన్యము. కావున, రెంటికి లక్షణయా సంబంధము చెప్పవలయును. ('ప్రత్యక్ చైతన్యపదయోః లక్ష్యలక్షణభావః సంబంధః లక్ష్యలక్షణసంయోగ శబ్దార్థః').

జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ యని లక్షణ మూడు విధములు. పదము యొక్క వాచ్యార్థమును పూర్తిగా త్యజించి, లక్షణావృత్తిచేత తత్సంబంధియైన

యన్యార్థమును చెప్పుట జహల్లక్షణ యనబడును ('వాచ్యార్థ మశేషతః పరిత్యజ్య తత్సంబంధి న్యర్థాన్తరే వృత్తిః జహల్లక్షణోచ్యతే'). 'గంగాయాం ఘోషః' యను వాక్యము నందలి 'గంగా' పదము స్వవాచ్యార్థమైన ప్రవాహమును పూర్తిగా త్యజించి తత్సంబద్ధమైన తీరమును పరిలక్షిత మొనర్చును. అదేరీతిగ, తత్, త్వం పదముల విషయములో జహల్లక్షణ చెప్పుట యసంగతము. జడాజడాత్మకమైన సమస్త వాచ్యార్థమును పరిత్యజించుటవలన తత్సంబధి, లక్షణీయము నగు పదార్థాంతరము సిద్ధింపనేరదు. కావున, వాక్యము శూన్యపర్యవసాయి యగును. అది సంమతము కాదు. 'అసి' పదము చేత సత్ పదార్థము బోధింపబడును. కావున, శూన్యవాదము 'తత్త్వమసి' వాక్యమునకు అభిప్రేతము కాదు.

### వా ర్తి క ము

**నాజహల్లక్షణాఽపి స్యాత్ శ్వేతో ధావతి వాక్యవత్॥ ౧౬**

### పీ యూ ష వ ర్షి ణీ

'శ్వేతో ధావతి'- 'తెల్లనిది పరుగిడుచున్నది' అను వాక్యము వలె అజహల్లక్షణ గూడ ప్రస్తుత ప్రసంగమున పొసగదు.

### విశేష వివరణము

వాచ్యార్థమును పరిత్యజింపకయే, లక్ష్యస్వరూప బోధ కలిగినచో, అచట అజహల్లక్షణ యని తెలియవలయును.

'శ్వేతో ధావతి' అను వాక్యమునందలి గుణవాచకమై
శ్వేతశబ్దము వాచ్యార్థ గుణ పరిత్యాగము చేయకయే, శ్వే
వృషభమును బోధించుటయే అజహల్లక్షణ ('యథా శ్వేత
ధావతీత్యుక్తే గుణవాచినా శ్వేతశబ్దేన తదాశ్రయద్రవ్య
వాచ్యార్థగుణాపరిత్యాగేన లక్ష్యతే'). శ్వేతవర్ణము గుణమ
అందువలన క్రియాశ్రయము యొక్క అసంభావన
లక్షణకు ప్రయోజకము. ఇచట సర్వథా పరిత్యాగము లేద
విశిష్టచైతన్యమునందు సర్వథా పరిత్యాగము లేనిచో, శు
చైతన్యము సిద్ధింపజాలదు. విరుద్ధాంశము యథాతథముగ
నున్నచో, సామానాధికరణ్యము బాధిత మగును. వాక్యమ
నకు ఏకార్థత్వము పొసగదు. కావున, అజహల్లక్షణ మహ
వాక్యవిషయమున సర్వథా యసంగతము. ('విరోధస
తాదవస్థ్యాత్, ఐక్యవాక్యార్థాసిద్ధా సామానాధికరణ్యబా
ప్రసంగాచ్చేత్యభిప్రేత్య ఆహ- నాజహల్లక్షణాఽపి స్యాదితి'

## వార్తికము

**తత్త్వమస్యాది వాక్యానాం లక్షణా భాగలక్షణా ।**
**సోఽయం పురుష ఇత్యాదివాక్యానామివ కీర్తితా॥ ౧౩**

## పీయూషవర్షిణి

పరిశేషన్యాయము చేత నిచట 'జహదజహల్లక్షణ' యే
యుచితమని దృష్టాంతపూర్వకముగా చెప్పుచున్నారు.

'సోఽయం పురుషః'- 'అతడే యితడు' మున్నగ
వాక్యములకు వలె, తత్త్వమస్యాది వాక్యములకు భాగ

త్యాగ లక్షణయే చెప్పనగును. దీనినే 'జహ దజహ ల్లక్షణ' యందురు.

### విశేష వివరణము

విరుద్ధాంశమును వదలిపెట్టి అవిరుద్ధాంశమును గ్రహించుటయే భాగలక్షణ, విశిష్టచైతన్యమునందు జడాంశ మును పరిహరించి సర్వానుగతమైన చైతన్యాంశమును గ్రహించి, 'తత్త్వమసి' యను వాక్యము అఖండార్థమును బోధించును ('ఉభయోః పదార్థయోః జడాంశపరిత్యాగేన సర్వానుగత చిన్మాత్రం లక్షణయా సమాదాయ అఖండ వాక్యార్థం బోధయతి తత్త్వమసీతి వాక్యమ్').

అరీతిగనే, 'సోఽయం పురుషః' అను వాక్యము తత్, ఏతత్ కాల శబలితాంశమును పరిత్యజించి ఉభయస్థితుల యందు అనుగతమై యున్న పురుషస్వరూపమాత్రమును గ్రహించి అఖండార్థమును బోధించును. అరీతిగనే, 'తత్త్వమసి' యను మహావాక్యము జీవబ్రహ్మైకత్వరూపమైన యఖండార్థ మును బోధించునని భావము.

### వా ర్తి క ము

**భిన్నవృత్తినిమిత్తానాం శబ్దానా మేకవస్తుని ।**
**ప్రవృత్తిస్తు సమానాధికరణత్వ మిహోచ్యతే ॥ ౧౮**

### పీ యూ ష వ ర్షి ణీ

సామానాధికరణ్యము, పదముల సంబంధ మని పూర్వము చెప్పబడినది. ('సామానాధికరణ్యాఖ్యః సంబంధః పదయో

రిహా'- 3-౧౫). ఇపుడు తత్స్వరూపము ప్రతిపాదింప చున్నది.

భిన్న ప్రవృత్తినిమిత్తములైన శబ్దములకు, పదార్థమునందు ప్రవృత్తి, సామానాధికరణ్య మనబడు

పర్యాయ శబ్దముల వ్యావృత్తి కొఱకై 'భిన్నప్ర నిమిత్తానామ్' అని చెప్పబడినది. వృత్తి యనగా ప్రవ ఘట పటాది రూపమైన అనేకార్థబోధక శబ్దవ్యావృత్తి కొ 'ఏకవస్తుని' యని చెప్పబడినది.

## విశేష వివరణము

'తత్త్వమసి' యను మహావాక్యమునందు 'తత్, అను రెండు పర్యాయ వాచక శబ్దము లేల? యనిన, ' త్వం' పదములు సమష్టి చైతన్య, వ్యష్టిచైతన్య వాచకవ జీవునియందు అపరోక్షత్వ మున్నను, అతడు పరిచ్ఛిన్న నియమ్యుడునయి యుండును. ఈశ్వరునియందు పరో మున్నను, అపరిచ్ఛిన్నత్వము, నియామకత్వము మొద గుణములు ఉండును. కావున, అపరిచ్ఛిన్న, స్వత అపరోక్ష ఆత్మతత్త్వమును ప్రతిపాదించుటకై పదద్వం (తత్, త్వమ్) ఆవశ్యకము. ఈవిధముగా జీవేశ యందలి అపరోక్షత్వ, పరోక్షత్వములను పరిచ్ఛిన్న అపరిచ్ఛిన్నత్వములను నివర్తింపజేసి జీవేశ్వరుల ఐక్య బోధించుటయే "తత్త్వమసి" మహావాక్యము యె

తాత్పర్యము. నిర్విశేష, అఖండ చైతన్యరూపమైన ఒకే యధికరణము (అధిష్ఠానము) నందు జీవేశ్వరుల అభేదస్థితియే వారివురికి గల సామానాధికరణ్య మని తెలియనగును.

వా ర్తి క ము

**పర్యసాంశో వికారో వా జీవో వాక్యేన నోచ్యతే ॥ ౧౯**

**జీవాత్మనా ప్రవిష్టత్వాత్ స్వమాయా సృష్టమూర్తిషు ।**
**నిరంశో నిర్వికారోఽసౌ శ్రుత్యా యుక్త్యా చ గమ్యతే॥ ౨౦**

**ఘటాకాశో వికారో వా నాంశో వా నియతో యథా**
**త్వమిన్ద్రోఽసీతివద్వాక్యం న ఖలు స్తుతితత్పరమ్ ॥ ౨౧**

పీ యూ ష వ ర్షి ణీ

ఆత్మ, మాయాశక్తి చేత సృష్టమైన మూర్తులలో (ఉపాధులలో) జీవభావముతో ప్రవేశించుట వలన జీవుడు తత్త్వమస్యాది మహావాక్యములచేత పరమేశ్వరుని అంశ యని గాని, వికారమని గాని చెప్పబడడు.

ఇచట శ్రీరామానుజాదులు 'తత్, త్వం' పదములకు సంసృష్టార్థపరముగా గూడ సామానాధికరణ్యము కుదురును; కావున, అప్రసిద్ధమైన అఖండార్థపరత్వము ఏల వచ్చును? అని ఆశంక చేయుదురు. ఇప్పట్టున, వారు ఈ ప్రశ్నలకు సమాధానము చెప్పదగియున్నది. తత్త్వంపదార్థములకు హస్తాంగుళుల వలె అంశాంశిభావ సంబంధమా? లేక ఊషర భూమివలె వికారవికారిత్వమా? అథవా, అత్యంత భేదభావ

మున్నగు స్తోతృ, స్తుత్యభావమా? అటులగాక, సాదృశ్య
యోగమైన కార్యకారణభావమా? జాతి వ్యక్తి భావమా
గుణ గుణిత్వ లక్షణమా? ఉపాసకగతమైన ఉపాసన
కర్మత్వమా? లేక, అన్యతరమైనదానికి అన్యతర భా
కల్పనావిషయత్వమా? ఇచట మొదటివి ప్రసక్తముల
కావనుచు 'పరస్యాంశో వికారో వా' అని శ్రీ సురేశ్వరుల
చెప్పుచున్నారు. అయిన,

"మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః" అన
భగవద్గీతావచనము వలన జీవుడు, పరమాత్మ యొక్క యం
యని తెలియుచున్నది. అటులనే, "సర్వ ఏత ఆత్మాన
వ్యుచ్చరన్తి" యను బృహదారణ్యక వచనము వల
వికారత్వము అవగత మగుచున్నది. కావున, జీవుడు పరమా
యొక్క యంశ గాని, వికారముగాని యేల కారాదు? అనిన
ప్రవేశ శ్రుతివిరోధము వచ్చును. అందువలన ఆరీతిగ చెప్ప
వలనుపడదు.

"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" (తై. ఉ. ౨-౬)
"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య" (ఛాం. ౬-3-౨)
"స ఏష ఇహ ప్రవిష్టో ఆనఖాగ్రేభ్యః" (బృ. 3-౪-౭)
"స ఏతమేనం సీమానం విదార్య ఏతయా ద్వారా
ప్రాపద్యత" (ఐతరేయ. ౧-3-౧౨)
"అన్తః ప్రవిష్టా శాస్తా జనానామ్"
అన్తః ప్రవిష్టః కర్తార మేతమ్" (తై. ఆ. 3-౧౧)

ఇత్యాద్యనేక శ్రుతులయందు సృష్టికర్తయగు నీశ్వరుడు స్వసృష్ట పదార్థ జాతమునందు వికార రహితు డయియే ప్రవేశించె నని శ్రూయమాణ మగుచున్నది. కావున, ఈ ప్రవేశశ్రుతివాక్యములతో విరోధము లేకుండుటకై మాయ, తత్కార్యమైన ఉపాధిచే కల్పితమైన భేదము నాశ్రయించి అంశస్మరణము గాని, వికారాపత్తిశ్రవణము గాని ఔపచారిక మని వ్యాఖ్యానింపదగును.

ఘటాకాశము, సర్వవ్యాపకమైన ఆకాశము యొక్క వికారము కాదు, అంశయు కాదు. ఆరీతిగనే, సర్వవ్యాపకుడైన యీ యీశ్వరుడు శ్రుతిచేతగాని, యుక్తిచేత గాని నిరంశుడు, నిర్వికారుడుగనే తెలియబడుచున్నాడు.

'తత్త్వమసి' యను వాక్యము "త్వమింద్రోఽసి" యను వాక్యము వలె స్తుతిపరము కాదు.

## విశేష వివరణము

ఘటమునందు మృత్సంబంధమైన రేణువుల వలె, ఫలమునందు బీజము వలె, స్వసృష్టమైన కార్యములయందు ఈశ్వరప్రవేశమును అంగీకరింపవచ్చును గదా! యనుటయు నసంగతము. ఏలన,

"నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం
నిరంజనమ్" (శ్వే. ఉ. 6-19)

"నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
తదవ్యయమ్" (ముండక. ౧-౧-౬)

మొదలగు శ్రుతులచేతను,

"అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మవికార్యోఽయ
ముచ్యతే" (భగవద్గీత ౨-౨౪)

మున్నగు స్మృతివచనములచేతను ఈశ్వరుడు నిరంశుడు, నిర్వికారుడని తెలియుచున్నది.

పరమేశ్వరుడు సావయవుడని యంగీకరించినచో, ఆయనకు మఱియొక కర్తను అంగీకరింపవలసియుండును. సావయవ పదార్థములు, సదా సకర్తృకములై యుండును. పరమేశ్వరునకు మఱియొక కర్తను అంగీకరించినచో, ఆయన సృష్ట సంసారకోటిలో జేరును. అపుడు ఈశ్వరుడు ప్రపంచ సృష్టికర్త కానేరడు. ఈశ్వరుని, సావయవుడనినచో, మఱి యొక కర్తను అంగీకరింపవలసివచ్చును. అపుడు అనవస్థా దోషము సంభవించును. ఇంతియేకాదు. ఆయన సృష్ట జగత్కోటిలోనివాడని యనినచో, సర్వజగత్కర్తృత్వము వ్యాహత మగును. ఆకారణమువలన, ఆయనకు సర్వజ్ఞత్వ, సర్వశక్తిమత్త్వాదులు ఉండవు. దానివలన, అనీశ్వరత్వము ప్రాప్త మగును. కావున, పరమేశ్వరుని, నిరవయవుడనియే యంగీకరింపవలయును.

"సకారణం కారణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా నచాధిపః"

యను శ్వేతాశ్వతర శ్రుతి, యీశ్వరుడు అకర్తృకుడని ఘంటాపథముగా చెప్పుచున్నది. కావున, ఈశ్వరవిషయమై వికారమని చెప్పుట యుక్తిసహము కాదు, శ్రుతిసంగతమును కాదు. వికార మనగా, పరిణామము, లేక పరిస్పందము. అథవా, పరస్పర సంబంధకృతమైన అతిశయ యోగము- వీనిలో నేదియు యుపపన్నము కాదు. అమూర్తము, నిరవయవము నయిన సన్మాత్రమునందు ఏవిధమైన వికారము గాని జనించుట యసంభవము. సర్వవ్యాపకమైన విభు పదార్థమునకు అంశగాని, వికారము గాని యుండుట యసంభవ మనుటకు 'ఘటాకాశో వికారో వా నాంశో వా వియతో యథా' యని దృష్టాంతము చెప్పబడినది.

జీవేశ్వర భేదమును అంగీకరించువారు (విశిష్టాద్వైతులు) 'తత్త్వమసి' యను మహావాక్యము స్తుతిపరమని చెప్పుదురు. ఇంద్రుడు కాని మహారాజును, ఆయనయందు ఇంద్రత్వమును ఆరోపించి 'త్వమింద్రోఽసి' యని ప్రశంసించుట లోకప్రసిద్ధము. ఆ రీతిగనే, అనీశ్వరుడైన (ఈశ్వరుడు కాని) జీవునియందు ఈశ్వరత్వము నారోపించి 'తత్త్వమసి' యని జీవుడు స్తుతింప బడుచున్నాడు. కావున, 'తత్త్వమసి' వాక్యము జీవప్రశంసా పరమే గాని, జీవేశ్వరైక్యబోధకము కాదని వారు చెప్పుదురు. కాని, యిది శ్రుతిసంగతము కాదు. ఇది స్తుతిపరమైన వాక్యము కాదు. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమేవా ద్వితీయమ్" (ఛాందోగ్య. ౬-౨-౧), "ఐతదాత్మ్యమిదగ్ం

సర్వమ్" (ఛాందోగ్య. ౬-౮-౭) అనుచు ఉపక్రమో
సంహారములు నిరంకుశమైన అద్వితీయతత్త్వమును బోధిం
చున్నవి. అట్టితతి, జీవేశ్వరులకు భేదము కల్పించుట శ్రు
తాత్పర్యవిరుద్ధము; స్తుతిపరమని కల్పించుటకు నవకాశమ
లేదు.

ఇట్లు కల్పింపబూనుట వాక్యశాస్త్రమర్యాద కాద
వాక్యతాత్పర్యార్థమును నిర్ణయించుటలో షడ్విధలింగమ
లను వాక్యశాస్త్రము (పూర్వమీమాంసాశాస్త్రము
ప్రమాణముగా పేర్కొనినది.

"ఉపక్రమోపసంహారా వభ్యాసోఽపూర్వతా ఫలమ్।
అర్థవాదోపపత్తిశ్చ లిఙ్గం తాత్పర్యనిర్ణయే॥"

'తత్త్వమసి' ప్రకరణము అఖండసామరస్యము
ప్రతిపాదించుటకై ప్రవృత్తమైనది. ఇది ఛాందోగ్యమునం
ప్రతిపాదింపబడినది. ఇట, షడ్విధలింగములు ఇట్లు భా
నీయములు.

ఉపక్రమము :- "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద
తీయమ్" అని యీ ప్రకరణము ఆరంభమైన

ఉపసంహారము :- "ఐతదాత్మ్య మిదగ్ం సర్వమ్" అ
వాక్యముతో నుపసంహారము చే
బడినది. ఈ రెండు వాక్యములు అఖ
అద్వయ తత్త్వబోధకములు.

అభ్యాసము :- ప్రతిపాద్య విషయమును పౌనఃపున్యము
చెప్పుట. ఈ ప్రకరణమునందు 'తత్త్వమ
యను వాక్యము తొమ్మిదిమార్లు చెప్పబడిన

అపూర్వత : ప్రమాణాంతరముచేత గతార్థము కాకపోవుట. "అత్ర వావ కిల సత్ సౌమ్య" అను వాక్యము ద్వారా గురూపదేశము లేక, బ్రహ్మతత్త్వము అజ్ఞాత మనుచు 'అపూర్వత' యను తాత్పర్య లింగము ప్రదర్శింపబడినది.

ఫలము :- "అథ సంపత్స్య" యను వాక్యముచేత సర్వానర్థ నివృత్తిపూర్వకమైన అఖండానందరూప మోక్ష ప్రాప్తి ఫలముగా ప్రతిపాదింపబడినది.

అర్థవాదము :- ప్రతిపాద్య వస్తువు యొక్క ప్రశంస, తద్భిన్న వస్తునింద 'అర్థవాద' మనబడును. శ్వేతకేతువు యొక్క ఆఖ్యాయిక ద్వారా యీ అర్థ తాత్పర్యార్థలింగము నిర్వహింపబడినది.

ఉపపత్తి :- యుక్తిదృష్టాంతపురస్సరముగా ప్రతిపాద్య విషయ సమర్థనము 'ఉపపత్తి' యనబడును. "యథా సౌమ్య ఏకేన మృత్పిండేన" ఇత్యాది వాక్యముల ద్వారా ప్రతిపాద్య వస్తువు సమర్థింపబడినది.

ఈవిధముగా షడ్విధలింగముల చేత "తత్త్వమసి" వాక్యము జీవేశ్వరాభేదప్రతిపాదకమే గాని, జీవప్రశంసా పరము కాదని తెలియుట వాక్యశాస్త్రమర్యాద యని గ్రహింపనగును.

వార్తికము

**న సాదృశ్యపరం వాక్య మగ్నిర్మాణవకాదివత్ ।**
**న కార్యకారణత్వస్య సాధనం మృద్ఘటాదివత్ ॥ ౨౨**

## పీయూషవర్షిణి

'తత్త్వమసి' వాక్యము 'అగ్నిర్మాణవకః' అను వాక్యము వలె సాదృశ్యపరము కాదు. సాదృశ్య మనగా గుణావయవక్రియలలో నొకదాని యొక్క అధిక సమానత్వము ('గుణావయవక్రియాణా మన్యతమభూయస్త్వ సామాన్య సాదృశ్యమ్'). ఆ సాదృశ్యము నిర్గుణుడు, నిరవయవుడు నిష్క్రియుడు నగున యీశ్వరునియందు ఎట్లు సంగత మగును? కావున, 'తత్త్వమసి' వాక్యము 'అగ్నిర్మాణవకాదివత్' అను వాక్యము వలె సాదృశ్యపరము కాదు.

## విశేష వివరణము

మృద్ఘటములకు వలె జీవేశ్వరులకు కార్యకారణభావపరమైన సామానాధికరణ్యము (సాధనమ్) ఇచట లేదు. కార్యకారణములకు (మృద్ఘటములకు) ఔపచారికమైన అభేదము ఉండును. జీవేశ్వరులకు ఏతాదృశమైన అభేదము చెప్పెదమనిన, అనేక దోషములు సంభవించును. ఈశ్వరుడు నిరవయవుడు, ఏకద్రవ్యము నగుటచే అయనకు ఆరంభకారణత్వము చెప్పుట యనుపపన్నము ('నిరవయత్వా దేకద్రవ్యత్వాచ్చ ఆరంభకత్వానుపపత్తేః'). కృత్స్నదేశ పరిణామము, ఏకదేశపరిణామము అను వికల్పములు అసంభవము. అందువలన ఈశ్వరునకు పరిణామకారణత్వము చెప్పుట సంగతము కాదు ('కార్త్స్న్యైకదేశ వికల్పాసహత్వాచ్చ పరిణామానుపపత్తే'). సంఘాతాదికారణత్వము

దూరాపాస్తము గావున, మృద్ఘటములకు వలె కార్యకారణ భావము జీవేశ్వరులకు చెప్పఁబూనుట సర్వథా అసంగతము. కావున, అభేదపరమైన సామానాధికారణ్యము ఇచట చెప్పుటకు వలనుపడదు ('న తత్పరత్వం సామానాధికరణస్య ఇహేంతి').

వార్తికము

**న జాతి వ్యక్తిగమకం గౌః ఖండ ఇతివద్వచః ।**
**గుణగుణ్యాత్మకం వాక్యం నైత న్నీలోత్పలాదివత్ ॥౨౩**

పీయూషవర్షిణీ

'తత్త్వమసి' వాక్యము 'గౌః ఖండః' (ఆవు కుంటిది) అను వాక్యము వంటిది కాదు. అనగా, ఈ వాక్యము జాతి వ్యక్తిపరము కాదు. జీవరూప వ్యక్తులయందు ఈశ్వరుడు జాతి యని కల్పన చేసినచో, ఈశ్వరరూపజాతి, గోత్వజాతి వలె అచేతనము కావలసి యుండును. అపుడు ఈశ్వరునకు అచేతనత్వము సంప్రాప్త మగును. (జాతి అచేతనమై యుండును; కావున, ఈశ్వరరూపజాతి గూడ నచేతన మగును.) ('జీవరూపవ్యక్తిషు ఈశ్వరో జాతిరితి కల్పనాయాం ఈశ్వరస్య గోత్వాదివత్ అచేతనత్వే సతి అనీశ్వరత్వాపత్తేః'). ఈశ్వరు డనిన, సకల విషయజ్ఞానేచ్ఛాప్రయత్నములు గలవాడని, ధర్మిగ్రాహక ప్రమాణము వలన స్పష్టముగా తెలియుచున్నాడు. కావున, ఈ వాక్యము (తత్త్వమసి) జాతివ్యక్తి పరము కాదని తెలియవలయును.

మఱియు ఈ 'తత్త్వమసి' వాక్యము నీల కమలము మున్నగు వాక్యముల వలె గుణాగుణిసంబంధ ప్రతిపాదక వాక్యము కాదు.

### విశేష వివరణము

జీవేశ్వరులకు గుణగుణ్యాత్మక సంబంధము చెప్పినచో, వారిలో నెవరి గుణము ఎవరికి వచ్చినట్లు? ఈశ్వరుడు జీవ గుణము కలవాడని చెప్పినచో, ఆ జీవునివలె సంసారిత్వము వచ్చును. దానివలన ఈశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడని చెప్పునట్టి ప్రమాణవాక్యములకు భంగము కలుగును. అటులగాక, జీవుడే ఈశ్వరగుణములు కలవాడని చెప్పినచో, జీవునకు గల సంసారిత్వము బాధిత మగును. అపుడు జీవునకు నిత్య ముక్తత్వము సిద్ధించును. అట్లు సిద్ధించినచో, జీవుని శ్రేయస్సాధనమునకై విహితమైన శాస్త్రమునకు వైయర్థ్యము సంభవించును ('జీవస్య వా ఈశ్వరగుణకత్వే సంసారిత్వబాధాత్ నిత్యముక్తత్వాపత్తౌ తస్య శ్రేయస్సాధనవిధాయి శాస్త్రం మనర్థక మాపద్యేతేత్యర్థః'). కావున, 'తత్త్వమసి' వాక్యము జాతివ్యక్తి బోధకమని గాని, గుణగుణ్యాత్మక సంబంధపరమని గాని చెప్పరాదు.

### వార్తికము

నోపాసనాపరం వాక్యం ప్రతిమా స్వీశబుద్ధివత్ ।
న చౌపచారికం వాక్యం రాజవద్రాజపూరుషే ॥
జీవాత్మనా ప్రవిష్టోఽసా వీశ్వరః శ్రూయతే యతః ॥ ౨౪

## పీ యూ ష వ ర్షి ణి

ప్రతిమల యందు (విగ్రహముల యందు) ఈశ్వర బుద్ధివలె 'తత్త్వమసి' వాక్యము ఉపాసనాపరము కాదు. రాజపురుషునియందు రాజు అను బుద్ధి వలె ఈమహావాక్యము ఔపచారికవాక్యమును (గౌణవాక్యమును) గాదు. ఏలన, ఈ యీశ్వరుడు జీవాత్మగా ప్రవేశించెనని శ్రుతులయందు ప్రత్యయమాణ మగుచున్నది.

### విశేష వివరణము

'తత్త్వమసి' యను మహావాక్యమునందు 'ఉపాసీత' ఉపాసింపవలయును అను క్రియాన్వయము లేదు; ఈ మహావాక్యము ఉపాసనాప్రకరణమునందు పఠింపబడలేదు. 'అసి' యను పదము ప్రయుక్త మగుటచే నిది స్పష్టముగా స్వరూపమాత్ర పర్యవసాయియై యున్నది. ఈ పదము (అసి) ఉండగా, క్రియాంతరమును (మతిమొక క్రియను) అధ్యాహారము చేసికొనుట సర్వథా అనుపపన్నము. పైన పేర్కొనిన కారణములచేత ఈ మహావాక్యము ఉపాసనాపరము సంయుతము కాదని తెలియవలయును. ("అసీతి పదసమభివ్యాహారేణ స్వరూపమాత్ర పర్యవసాన నిశ్చయాత్, క్రియాన్తరాధ్యాహారానుపపత్తేశ్చ నోపాసనాపర మపీదం వాక్య మిత్యర్థః").

ఇది ఔపచారిక (గౌణ) వాక్యము గూడ కాదు. ఇది ఔపచారికవాక్య మందు రేని, ఛాందోగ్యశ్రుతి ప్రచోదనా

పూర్వకముగా పునః పునః యీ'తత్త్వమసి' మహావాక్యము తొమ్మిదిమార్లు చెప్పుట (అభ్యాసము) ఔపచారిక పక్షము నందు అసంగతము ('పునః పునః పరిచోదినాపూర్వకం నవకృత్వోఽభ్యాసస్య ఉపచారపక్షే అసంగతేః'). కావున, ఈ మహావాక్యము ఔపచారిక వాక్య మని చెప్పుట యనుపపన్నము.

దేహ, ఇంద్రియ, మనో, బుద్ధి, ప్రాణ, అహంకార సంఘాతమునందు ఈశ్వర ప్రవేశ ప్రతిపాదక శ్రుతు లనేకములు శ్రూయమాణము లగుచున్నవి. తాదృశ ప్రవేశము వలన నీశ్వరుడు జీవ నామముతో వ్యపదేశ్యు డగుచున్నాడు గాని, జీవుడు ఈశ్వరునికంటె భిన్నుడు కాడు ('ఈశ్వరస్యైవ సంఘాత ప్రవేశవశాత్ జీవత్వ వ్యపదేశ భాక్త్వమ్, న తతోఽర్థాన్తరం జీవః'). ఈశ్వరునికంటె జీవుడు అర్థాన్తరము కాదు అని నిశ్చయము కలిగినంతనే, స్తోత, స్తోతవ్యుడు అనెడి భేదము కల్పించుటకు అవకాశము లేదు; ప్రకారాంతరము గూడ నసంభవము. 'నేను జీవుడను' అని భావించునట్టి యాత్మకు ఉపాధికృతమైన జీవత్వము తొలగించుట ద్వారా, యీ మహావాక్యము స్వాభావికమైన బ్రహ్మత్వమును బోధించునట్టిదియే యని గ్రహింపవలయును. ('న తతోఽర్థాన్తరం జీవ ఇతి నిశ్చయే సతి స్తోతృ స్తోతవ్యత్వాది భేద కల్పనాఽనవకాశాత్ ప్రకారాన్తరాసంభవే సతి జీవత్వాభి

మతస్యాత్మనః ఉపాధికృత జీవత్వాపోహేన తస్య స్వాభావిక బ్రహ్మత్వబోధక మేవేదం వాక్య మిత్యర్థః').

వా ర్తి క ము

దేహేంద్రియ మనోబుద్ధి ప్రాణాహంకారసంహతౌ।
ఆత్మసంకలనా దజ్ఞైః ఆత్మత్వం ప్రతిపాద్యతే।
వహ్నిధీః కాష్ఠలోహాదౌ వహ్నిసంకలనాదివ॥ ౨౬

పీ యూ ష వ ర్షి ణి

సర్వజనులు యాత్మస్వరూపము బ్రహ్మయే యని చెప్పబడినది. అయిన, కొందఱరు 'అహం బ్రహ్మాస్మి' యను భావము సర్వదా కలుగవలయును. కాని, అట్లు కలుగుట లేదు. 'అహం మనుష్యః'- నేను మనుష్యుడను' మున్నగు రీతిగనే యేల భాసమాన మగుచున్నది? అని యాశంక చేసి, ఉపాధియొక్క- యవివేకము చేత జనించిన భ్రమ వలన 'నేను మనుష్యుడను' అను రీతిగా భాసమాన మగుచున్నదని చెప్పబడినది.

శరీరేంద్రియ, మనోబుద్ధి ప్రాణాహంకార సంఘాతము నందు పరమేశ్వరుడు జీవాత్మరూపమున ప్రవేశించె నని వేదమునందు శ్రూయమాణ మగుచున్నది. కాష్ఠ, లోహాదుల యందు అగ్ని ప్రవేశము వలన వహ్నిబుద్ధి కలిగినచందమున, ఆ దేహాదులయందు ఆత్మప్రవేశము వలన, ఆత్మతత్త్వము అజ్ఞానావృత మగుట వలన అజ్ఞానులచేత దేహాదుల యందు

ఆత్మత్వము చెప్పబడుచున్నది. దేహేంద్రియ సంఘాతమే ఆత్మ యని తలచుదురు గాని, దేహాతిరిక్తమైన ఆత్మ, బ్రహ్మ యని తెలియలేక పోవుచున్నారు.

వా ర్తి క ము

**దేహ మన్నమయంకోశ మావిశ్యాత్మా ప్రకాశతే ॥**
**బాలః కృశః కృష్ణో వర్ణాశ్రమవికల్పవాన్ ॥ ౨౩**

పీ యూ ష వ ర్షి ణి

ఇపుడు స్థూలారుంధతీన్యాయము చేత, ముంజాదిషీకా గ్రహణ న్యాయము చేతను సూక్ష్మమయిన అంతరాత్మ యొక్క ఉద్ధరణ (వేఱుచేసి ఆవిష్కరించు) విధానము చెప్ప బడుచున్నది.

ఆత్మ, అన్నమయకోశమైన శరీరమునందు ప్రవేశించి, నేను స్థూలరూపుడను (అహం స్థూలః), నేను దుర్బలుడను (అహం కృశః), నేను బాలుడను (అహం బాలః), నేను నల్లనివాడను (అహం కృష్ణః), వర్ణాశ్రమ భేదము గలవాడను (వర్ణాశ్రమ వికల్పవా నహమ్) అని ప్రతీయమానుడగు చున్నాడు.

**విశేష వివరణము**

'అహం' అను అనుభూతి యందు ప్రత్యగాత్మ యొక్క భానము కలుగుచున్నదను విషయము నిర్వివాదము ('అహ మవభాసో హి ప్రత్యగాత్మాన మవగాహత ఇత్యవివాదమ్').

అది స్థూలత్వాది దృశ్యధర్మవిశిష్టమైన ఆత్మను విషయముగా చేసికొనుటవలన శుద్ధ ఆత్మ కాదు. కావున, విశిష్టధర్మములు గల జీవాత్మ (ప్రత్యగాత్మ) పరమాత్మ యెన్నడు కాజాలడు. కావున, శుద్ధ ఆత్మను ఉద్ధరించి గ్రహించుట యావశ్యకము. ఇదం (ఇది) రూపము, దృశ్యధర్మవిశిష్టము నయిన అహంకారము యొక్క అనుభాగములో ఇదమంశము తొలగించుట వలన, అహంకారనిరపేక్షుడు, స్వయంప్రకాశమానుడు నయిన ఆత్మ శుద్ధుడు, పరిపూర్ణుడు నగు పరమాత్మ గానే యని తెలియగలము ('ఇదమంశప్రహాణేన ఉద్ధరణే సతి అహంకారనిరపేక్షః స్వయంప్రకాశమానః ఆత్మా శుద్ధః పరిపూర్ణః పరమాత్మైవేతి జ్ఞాతుం శక్యతే').

వా ర్తి క ము

ప్రాణకోశేఽపి జీవామి క్షుధితోఽస్మి పిపాసితః ।
సంశితో నిశ్చితో మన్యే ఇతి కోశే మనోమయే ॥ ౨౮

విజ్ఞానమయకోశస్థో విజానామీతి తిష్ఠతి ।
ఆనన్దమయకోశాఖ్యే త్వహంకారే పురాకృతైః ॥ ౨౯
పుణ్యై రుపాసనాభిశ్చ సుఖితోఽస్మీతి మోదతే ।

పీ యూ ష వ ర్షి ణి

అన్నమయ కోశమునకు అభ్యంతరము లయిన కోశములను నిరూపించుచున్నారు.

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశము లని పంచకోశములు ప్రసిద్ధములు.

వానికంటె నన్యుడు, తత్సాక్షి, ప్రత్యగాత్మరూపమున నిర్విశేషము, శుద్ధము నగునన ఆత్మ సిద్ధించును.

అన్నమయ కోశమునందువలె ప్రాణమయ కోశము నందు గూడ నేను జీవించుచున్నాను (అహం జీవామి), ఆకలిగొని యున్నాను (క్షుధితోఽస్మి)- దప్పిక గొని యున్నాను (పిపాసితోఽస్మి). ఈవిధముగా ప్రాణతాదాత్మ్యా పన్నుడైన జీవుడు అనుభూతి నొందుచుండును.

ఆ విధముగనే 'సంశితోఽహం'- నేను సంశయము గల వాడను, 'నిశ్చితోఽహం' నిశ్చయము కలవాడను అని తలచును.

మనోమయ కోశమునందు 'అహ మిదం జానామి, అహమిదం కరోమి' అను రీతిగా మనస్సు కంటె నాంతరమైన విజ్ఞానమయ కోశమునందు ఉండి ఆత్మ వ్యవహరించుచుండును.

ఆత్మచైతన్యము ఏ యహంకారమునందు ప్రతిఫలించునో, ఆ యహంకారము చేత అన్య కోశములు ప్రకాశించును. అట్టి యహంకారమే ఆనందమయకోశ మను పేర వ్యవహృతము ('యేనాహంకారేణ ఆత్మచైతన్యఖచితేన ఇతర కోశా అవభాస్యన్తే సోఽహంకారః ఆనందమయకోశః'). ఆనందమయకోశ మను పేరుతో నొప్పారునట్టి యహంకారము నందు పూర్వజన్మార్జితములైన సుకృతముల చేత 'సుఖితోఽస్మి' యని యానందించుచుండును. ఇచట గుర్తింప

దగిన యంశ మేమన, అన్నమయాది విజ్ఞానమయ కోశాంతము ఆత్మప్రకాశము పరోక్షముగా లభించును. ఆనందమయ కోశమునందు మాత్రమే ఆత్మప్రకాశము అపరోక్షముగా లభించును. ఇదియే ఆనందకోశ వైలక్షణ్యము.

వా ర్తి క ము

**ఏవం కంచుకితః కోశైః కంచుకై రివ పంచభిః ।**
**పరిచ్ఛిన్న ఇవాభాతి వ్యాప్తోఽపి పరమేశ్వరః ॥**
**యథా సలిల మావిశ్య బహుధా భాతి భాస్కరః ॥ ౩౧**
**తథా శరీరాణ్యావిశ్య. బహుధా స్ఫురతీశ్వరః ।**

పీ యూ ష వ ర్షి ణీ

ఈవిధముగా కోశపంచకము ననువదించి, వానిచే గలిగిన పరిచ్ఛేదమును తొలగించుట ద్వారా వానియందు ననుస్యూతముగా నున్న సాక్షిరూపుడైన ఆత్మ, స్వయం పరిపూర్ణ మగుటవలన నా యాత్మతత్త్వము ఈశ్వరుడే యని చెప్పబడుచున్నది.

ఈవిధముగా పంచకోశముల చేత ఆచ్ఛాదితుడైన పరమేశ్వరుడు సర్వవ్యాపకుడైనను, కంచుక (కవచ) పంచకముచేత నాచ్ఛాదితుడైనవానివలె భాసించును.

ఆత్మ, ఉపాధివశమున పరిచ్ఛిన్నుడుగ భాసించును గాని, స్వతః అపరిచ్ఛిన్నుడే యని ప్రతిపాదింపబడినది. ప్రతి శరీరమునందు పరమాత్మయొక్క ప్రతిభానము గూడ ఉపాధి

భేదకృతమే గాని, స్వతః సిద్ధము కాదని దృష్టాంతపురఃసరము
ప్రతిపాదింపబడుచున్నది.

అనేక వర్ణములు గల జలమునందు ప్రతిబింబించి
సూర్యుడు అనేక విధములుగ భాసించును. ఆరీతిగనే
పరమేశ్వరుడు భిన్నభిన్న శరీరములయందు ప్రవేశిం
బహువిధములుగ ప్రతీతు డగును.

## విశేష వివరణము

జలోపాధులను పరామర్శింపక, జలమునందు ప్రతిబింబించ
సూర్యునియందు భేదనిరూపణము చేయుట యసంభవము
అటులనే, అనేక శరీరములయందు భాసించునట్టి ఆత్మ
బింబమునందు గూడ దేహోపాధి పరామర్శరహితముగ నాత్మ
భేదము నిరూపించుట యసంభవము. కావున, సర్వ శరీరము
యందు పరమార్థతః, ఒకే యాత్మ సిద్ధించును.

ఏకాత్మపక్షమునందు ఒకడు సుఖముగాని, దుఃఖమ
గాని, అనుభవించినచో, అందఱు సుఖదుఃఖముల ననుభవింతు
రని చెప్పుదురు. ఆ వాదము గూడ, దీనివలన పరిహృతమైనది

జలగతమైన సూర్యప్రతిబింబము ఒక స్థలమున, చలించు
చున్నట్లు, మఱియొకచోటున నిశ్చలముగ నున్నట్లు
కన్పట్టును. ఇటువంటి ధర్మవ్యవస్థయే జీవులయందును
ఉపపన్న మగును. జీవేశ్వరుల యేకత్వమునందును ధర్మభే
వ్యవస్థకు సూర్యదృష్టాంతమే సమాదరణీయము. ప్రతిబింబవ

చలించు చున్నట్లుతోచినను, సూర్యుడు చలనాదిమంతుడు కాడు. ఆరీతిగనే, జీవుడు కర్తృత్వాది సంసారధర్మములు కలవాడుగ భాసించుచున్నను, పరమాత్మ, సంసారధర్మస్పర్శ లేకయే యుండును. ("జీవేశ్వరయో రేకత్వేఽపి ధర్మభేద వ్యవస్థాయా అయమేవ దృష్టాన్తః, యథా ప్రతిబింబే చలనాదిమతి న భాను శ్చలనాదిమాన్ భవతి, ఏవం జీవ కర్తృత్వాది సంసారధర్మవత్తయా భాసమానేఽపి న పరమాత్మా తద్ధర్మవాన్భవతి").

వార్తికము

**కారణత్వం చ కార్యత్వం తటస్థం లక్షణం తయోః ।**
**శాఖాయాం చంద్రవత్ నైవ ముఖ్యమిదం మతమ్ ॥ ౩-౨**

పీయూషవర్షిణీ

ఆత్మకు పరిచ్ఛిన్నత్వము, అనేకత్వము, ఈశ్వరుని కంటె అన్యత్వము ఉపాధివశమున భాసించు చున్నవి గాని, వస్తుతః లేవని ప్రతిపాదించి, ఇపుడు జీవేశ్వరులకు తటస్థ, స్వరూపలక్షణప్రదర్శనము ద్వారా వారిరువురి యేకత్వము నకు గల వాక్యార్థయోగ్యతను ప్రదర్శించుచున్నారు.

తయోః = తత్, త్వం పదార్థములైన జీవేశ్వరులకు కారణత్వము 'తత్' పదార్థము యొక్క తటస్థ లక్షణము; కార్యత్వము 'త్వం' పదార్థము యొక్క తటస్థ లక్షణము. "కార్యోపాధిరయం జీవః, కారణోపాధి రీశ్వరః"-కార్యోపాధి కుడు జీవుడనియు, కారణోపాధి గలవాడు ఈశ్వరుడనియు

నారాయణోపనిషత్తు చెప్పుచున్నది. అనగా, భూత భ
ప్రపంచకారణత్వము 'తత్' పదార్థముచే నుపలక్షిత
దేహేంద్రియ సంఘాతరూప కార్యముయొక్క యధ్యక్షత
"త్వం" పదార్థము వలన విదిత మగును.

ఈ చెప్పిన లక్షణము జీవేశ్వరుల సద్భావ సంభా
మాత్రమునకు హేతువు గాని, సద్భావ పర్యవస
కాదనుచు 'శాఖాయాం చంద్ర ఇతివత్' అని దృష్టా
మీాయబడినది. కోట్ల మైళ్ళ దూరములో నున్న చం
చూపుచు, అదుగో, ఆ కొమ్మమీాద చంద్రుడు ఉన్నా
చెప్పుట యనుభవసిద్ధము. కాని, యిది యసంభవము క
అటులనే, పుట్టుక లేని పరమేశ్వరునియందు కార్యక
భావరూప సంబంధము అసంభవము. కాని,

"యతో వా ఇమాని భూతాని జాయన్తే,
యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి"

యను శ్రుతివచనము వలన పరమేశ్వరునకు జగత్కారణత
కలదని తెలియుచున్నది. పరమేశ్వరునకు గల యీ
లక్షణము వ్యావహారికము గాని, వస్తుసిద్ధము కాదు.

వా ర్తి క ము

మహాప్రకాశ మిత్యుక్తం స్వరూపం చంద్రలక్షణమ్।
సచ్చిదానందరూపత్వం స్వరూపం లక్షణం తయోః।

## పీ యూ ష వ ర్షి ణీ

స్వరూప పర్యవసాయియైన లక్షణమును దృష్టాంత పురఃసరముగా చెప్పుచున్నారు. పూర్ణిమనాటి అధిక ప్రకాశము 'చంద్రుడు' అని చంద్రలక్షణము చెప్పబడును. అందువలన, చంద్రుని స్వరూపలక్షణము జ్ఞాత మగును. ఇది స్వరూపలక్షణముగాని, విశిష్టార్థపరము అని భావింపరాదు. ఏలన, చంద్రపదము యొక్క అర్థమును మాత్రము తెలిసికొనగోరినవానికి నింతకంటె నధికముగా చెప్పుట యుపపన్నము కాదు ('చంద్రప్రాతిపదికార్థ బుభుత్సయా కృత ప్రశ్న స్యోత్తరత్వేనాస్య ప్రవృత్తేః, వైశిష్ట్యపరత్వే అబుభుత్సితార్థ విషయపరత్వే నానవధేయ వచనతాపత్తేః'). ప్రకృష్టమైన ప్రకాశము చంద్రుడు ('యః ప్రకృష్ట ప్రకాశః సః చంద్రః') అని నిర్దేశింపబడినది. ఇందు 'యత్' 'తత్' శబ్దములకు సామానాధికరణ్యము వలన ఏకార్థత్వము చెప్పవలయును. ఈ నియమము వలన 'ప్రకృష్ట ప్రకాశము' 'చంద్రుడు' అను పదములు తప్పనిసరిగా స్వరూపమాత్ర పర్యవసన్నములు. కావున, చంద్రస్వరూపలక్షణము అఖండ చంద్రపదార్థమును బోధించుననుట యుక్తిసహమే యగును. కాగా, 'తత్' 'త్వం' పదార్థములకు సచ్చిదానంద రూపత్వము స్వరూపలక్షణ మని చెప్పవలయును. అనృత, జడ, దుఃఖ, పరిచ్ఛేదములు లేని సత్, చిత్, ఆనందము, అనంతత్వము 'తత్', 'త్వం' పదార్థస్వరూప మని భావము.

వార్తికము

ఏకలక్షణయో రైక్యం వాక్యేన ప్రతిపాద్యతే॥ ౩౪

పీయూషవర్షిణి

మహావాక్యముచేత ('తత్త్వమసి' యను మహావాక్యముచేత) ఒకే లక్షణములు గల జీవేశ్వరులకు ఐక్యము ప్రతిపాదింపబడును. అనగా, కార్యకారణలక్షణమైన ఉపాధిద్వయము పోగా, విరోధాభాసము బాధిత మగును. ఆరీతిగ ఉపాధిద్వయము బాధితము కాగా, సచ్చిదానంద అనంత స్వభావమాత్రమునందు లేశమాత్రమైనను భేదము ఉండదు. అందువలన ఒకే లక్షణములు కలిగియుండుట వలన ఈ జీవేశ్వరులకు ఏకవాక్యార్థ ప్రతిపత్తియోగ్యత యుక్తిసంగత మని భావము.

విశేష వివరణము

సచ్చిదానందరూపము వీరికి విశేషణ మని భావింపజనదు. సత్, చిత్, ఆనంద పదములలో నే నొక పదమును గ్రహించినను, అన్యపదములు సయితము అనుస్యూతముగనే యుండును. వానిని వేఱుచేయుటకు వలనుపడదు. అయినను, ఈ పదములు ప్రతిపాదించునట్టి యర్థమును వేఱు వేఱుగ తెలిసికొనుట యావశ్యకము. 'సత్' అనగా, త్రికాలాబాధితమైన సత్యము; 'చిత్'అనగా జ్ఞానము; ఆజ్ఞానము స్వప్రకాశరూపము, అన్యప్రకాశనిరపేక్షము; 'ఆనంద' మనగా, నిత్యప్రేమాస్పదత్వము, లేక నిరపేక్ష సుఖరూపము. శ్రుతియీ సత్, చిత్, ఆనందములకు ఈశ్వరరూపత్వమును

ప్రతిపాదించుచున్నది. ప్రత్యగాత్మరూపత్వము అనుభవ సిద్ధము. కావున, సచ్చిదానందరూపత్వము జీవేశ్వరుల కిరువురకును లక్షణమని తెలియవలయును.

ఇచట లక్షణాశబ్దముచేత స్వరూపలక్షణమునే గ్రహింప వలయును గాని, తటస్థలక్షణ మని భావింపరాదు. ఏలన, తటస్థలక్షణము యొక్క యేకత్వము పారమార్థికము కాదు, పరివర్తనీయము. స్వరూపలక్షణము స్వస్వరూపభూతమే యగుట వలన అపరివర్తనీయము.

వా ర్తి క ము

**తస్మాదేక ప్రకాశత్వం సర్వాత్మత్వ మితి స్థితమ్ ।**
**దేవ తిర్యఙ్మనుష్యాణాం ప్రకాశా న్న పృథక్ స్థితిః॥ 37**

ఆ కారణముచేత ఏకరూపమైన ప్రకాశము సర్వాత్మ భావ మని సిద్ధమైనది. దేవ, పశు, మనుష్య జ్ఞానము కంటె దానికి భిన్న స్థితి లేదు. అనగా, దేవ, మనుష్యాది భేద మున్నను, పూర్వము ప్రతిపాదింపబడిన జ్ఞానాధీన సత్తను జ్ఞాపకము చేయుచు అభేదము చెప్పబడినది.

వా ర్తి క ము

**జీవః ప్రకాశాభిన్నత్వాత్ సర్వాత్మే త్యభిధీయతే ।**
**ఏవం ప్రకాశరూపత్వపరిజ్ఞానే దృఢీకృతే ॥ 38**
**పునరావృత్తిరహితం కైవల్యం పద మశ్నుతే ।**
**సకృత్రప్రసక్తమాత్రోఽపి సర్వాత్మత్వే యదృచ్ఛయా ।**
**సర్వపాపవినిర్ముక్తః శివలోకే మహీయతే॥ 39**

పీయూషవర్షిణి

జీవుడు పరమేశ్వరుని ప్రకాశాత్మస్వరూపము కంటె భిన్న స్వరూపము కలవాడు కాడు. కావున, జీవుడు గూడ సర్వాత్మకుడని చెప్పబడును.

ప్రకాశరూపత్వ పరిజ్ఞానము దృఢపడినపుడు పునరావృత్తిరహితమైన కైవల్యపదమును, అనగా బ్రహ్మాత్మావస్థానమును పొందును.

పురాకృత పుణ్యవిశేషముచేత ఆకస్మికముగ నయినను సర్వాత్మభావమునందు ఒక్కమారైనను చక్కగా లగ్నమైన జీవుడు సమస్త పాపముల నుండి వినిర్ముక్తుడై శివలోకము నందు పూజనీయుడగును. సదాశివునివలె లోకమున ఆరాధింపబడును. ('శివవత్పూజ్యో భవతీత్యర్థః'). 'సర్వభావవినిర్ముక్తః' అను పాఠాంతరము కలదు. అపుడు సర్వవిషయ భావనావినిర్ముక్తుడగు నని చెప్పికొననగును.

వార్తికము

**సర్వాత్మభావనా యస్య పరిపక్వా మహాత్మనః ।**
**సంసారతారక స్సాక్షాత్ స ఏవ పరమేశ్వరః ॥ ౭౮**

పీయూషవర్షిణి

ఏ మహాత్ముని యొక్క సార్వాత్మ్య భావము సంపూర్ణముగా పరిపక్వమగునో, ఆ మహనీయుడు సాక్షాత్తు సంసారసాగరమును తరింపజేయునట్టి పరమేశ్వరుడే యని భావింపవలయును.

## విశేష వివరణము

బ్రహ్మనిష్ఠుడైన మహాత్మునియొక్క సంకీర్తనము ఇట చేయబడినది. బ్రహ్మజ్ఞానము ఏకరూపమే. అయినను, ఏ సాధకుడు ఉపరతిని, సమాధిస్థితిని సాధించునో, ఆ సాధకుని బ్రహ్మజ్ఞానము ఎక్కువ పరిపక్వ మగును. పరమేశ్వరుడు ప్రత్యక్షవిషయము కాడు. ఈ బ్రహ్మనిష్ఠుడో సర్వ గోచరుడుగ నుండును. "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" యను శ్రుతివచనానుసారము ఈ బ్రహ్మజ్ఞాని సాక్షాత్తు పరమేశ్వరుడని చెప్పబడినాడు. జనన మరణరూప సంసార సాగరమునుండి తరింపజేయువాడు బ్రహ్మవేత్తయైన యాచార్యుడే. ఆ యాచార్యుడు పరమేశ్వరాభిన్నుడు. తాదృశ మహత్త్వసంపన్నుడైన సద్గురుమూర్తికి నమస్కారము.

### వార్తికము

ఇతి శ్రీదక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకే
ప్రబన్ధే మానసోల్లాసే తృతీయోల్లాస సంగ్రహః ॥

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము యొక్క
తృతీయోల్లాస సంగ్రహము
సంపూర్ణము.



నానాచ్ఛిద్ర ఘటోదరస్థిత మహాదీప ప్రభాభాస్వరం
జ్ఞానం యస్య తు చక్షురాదికరణద్వారా బహిస్స్పన్దతే।
జానామీతి తమేవ భాన్త మనుభాత్యేతత్సమస్తం జగత్
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ ४

పీ యూ ష వ ర్షి ణి

ఆత్మయొక్క సత్తాప్రకాశములచేత జగత్తునకు సత్తాస్ఫురణములు ఏల ఉండరాదు? ఆత్మవలె స్వతః సత్తాప్రకాశములు జగత్తునకు ఉండవచ్చును గదా? యని యాశంక చేయుదురేని, ఆత్మవలె జగత్తు స్వతః సత్తావంతమైనచో, ఆ యాత్మకు ఉత్పత్తి వినాశములు లేనిరీతిగ జగత్తునకు సయితము ఉత్పత్తి, వినాశములు లేకపోవలసి వచ్చును. ఆత్మకు వలెనే ఇంద్రియాదుల యపేక్ష లేకయే సర్వదా విషయభానము ప్రసక్తము కావలసివచ్చును. కాని, జగద్విషయమున నిది యనుభవ విరుద్ధము. కావున, జగత్తునకు స్వతః సత్తాప్రకాశములు లేవు; ఆత్మయొక్క సత్తాస్ఫురణముల చేతనే ప్రపంచమునకు గూడ సత్తాప్రకాశములు కలుగుచున్నవి. అటులయినచో, మీ సిద్ధాంతమునందు సకల జగత్తు ఆత్మయందు అధ్యస్తము గదా! అట్టితతి కరణాదుల (ఇంద్రియాదుల) అపేక్ష యేల? ప్రకాశరూపమైన ఆత్మయొక్క సంబంధము వలననే, ఎల్లవేళల సమస్తము ఏల భాసించదు? సర్వగత చైతన్యమునకు అవిరోధముగనే అజ్ఞానముచే నావరింపబడినదానియందు జగత్తు కాదాచిత్కము

గనే (ఒకానొకప్పుడు మాత్రమే) యేల భాసించును ? ఇట్టి యాశంకలకు సమాధానముగా శ్రీశంకరభగవత్పాదులు 'నానాచ్ఛిద్ర ఘటోదర' యను శ్లోకము నారంభించినారు.

నానాచ్ఛిద్ర (రంధ్ర) బహుళమైన ఘటము యొక్క మధ్య నున్న మహాదీపప్రకాశము వలె పరమాత్మజ్ఞానము (ప్రకాశము) అంతఃకరణమునందు ప్రకాశించుచుండును. పరమాత్మప్రకాశము దీపమువలె తమోవిరోధిలక్షణ స్వభావము గలది. అనేకచ్ఛిద్రయుక్తమైన ఘటమువంటి దేహమునందు-అంతఃకరణమునందు ప్రతిబింబించువాడు,సాక్షి రూపుడుగ నున్నవాడు నగు పరమేశ్వరునకు స్వరూపభూత మైనది జ్ఞానము. ఆ జ్ఞానము (చైతన్యము) విషయోపలబ్ధి సాధనము లయిన చక్షుశ్శ్రోత్రాది కరణముల ద్వారా బాహ్యవిషయ ప్రదేశములకు పోవును. ఇంద్రియములకు విషయములతో సంబంధము కలిగినంతనే, వాని ద్వారా చైతన్యోపాధి యగు నంతఃకరణము విషయప్రదేశములను చేరును, దానితోబాటు అంతఃకరణప్రతిఫలిత చైతన్యము గూడ పోవును. అంతఃకరణ ప్రతిఫలిత చైతన్యము విషయ దేశమునకు పోయి, ఆ విషయమును ప్రకాశింపజేయును. చైతన్యము స్వతః జ్ఞానమునకు అవిరోధియే యైనను, చైతన్యము అంతఃకరణమునందు ప్రతిఫలించినదై తద్విరోధి యగును. కావుననే, అంతఃకరణ ధర్మములైన రాగాదులు స్వసత్తయందు సర్వదా భాసించుచుండును. ఘట పటాది

విషయములు బింబచైతన్య మయిన బ్రహ్మయందే యధ్యస్తములై యుండును. చక్షురాదికరణముల ద్వారా విషయదేశమునకు పోయిన యంతఃకరణము చేత ఘటపటాదులకు అధిష్ఠానభూతమైన బింబచైతన్యము ఉపహిత మగును. అట్లు కాగా, ఒకే ఉపాధిసంబంధము వలన అంతఃకరణమునందు ప్రతిఫలించి యున్న సాక్షిచైతన్యముతో (ప్రత్యక్ చైతన్యముతో) ఘటాదులకు అధిష్ఠానభూతమైన చైతన్యము ఏకీభూత మగును. దానివలన సాక్షిచైతన్యము చేత ఘటపటాదుల నావరించియున్న యజ్ఞానము నాశ మగును. అపుడు ఘట పటాది విషయములు భాసించును గాని, ఎల్లప్పుడు భాసింపనేరవు. కావున, అజ్ఞానము యొక్క ఆవరణభంగము నిమిత్తమై చక్షురాదికరణాపేక్ష యావశ్యక మనుటలో దోషప్రసక్తి యేమియు లేదు.

కొందఱు అచిద్రూపమైన (జడమైన) ఆత్మనిష్ఠజ్ఞానము చేత ఘటపటాది విషయములు భాసించునని చెప్పుచున్నారు. అది యుక్తము కాదు. ఏలన, జడమైన ఆత్మనిష్ఠజ్ఞానమునకు గాని, స్వప్రకాశమైనదానికి గాని ఘటపటాది విషయములతో సంయోగ, సమవాయాది సంబంధములు లేవు; స్వరూప సంబంధము చెప్పెద మనిన, అది యతిప్రసంగ మగును. మఱికొందఱు విషయనిష్ఠమైన ప్రకాశము చేతనే ఘటాదులు భాసమానము లగుచున్నవని చెప్పుచున్నారు. అదియును సంగతము కాదు. విషయనిష్ఠప్రకాశమునకు ఆత్మతో

సంబంధము లేకపోవుట వలన 'అహం జానామి'-'నేను తెలిసి కొనుచున్నాను' అని సంబంధప్రత్యయము (జ్ఞానము) అనుపపన్నము. కావున, మేము చెప్పినరీతిగనే స్వయం ప్రకాశ సాక్షిస్థైతస్యసంబంధము వలననే, ఘటాది విషయముల భానము కలుగు ననుచు శంకరభగవత్పాదులు 'జానామీతి' యని చెప్పుచున్నారు. 'ఘటాదిక మహం జానామి'-'నేను ఘటపటాదులను తెలిసికొనుచున్నాను' అని ఘటాదివిషయములతో సంబద్ధమై భాన్తం - ప్రకాశించు నట్టి, తమేవ - సాక్షిరూపముగ నున్న, యా పరమేశ్వరు ననుసరించియే, వివిధ శబ్దప్రత్యయ గమ్యమైన యీ సకల జగత్తు ప్రకాశించుచున్నది. ఈ అనుభానము గూడ జగత్తు నకు స్వగతమైనది కాదు. అగ్ని దహించుచుండ, దాని ననుసరించి 'అయో దహతి' - 'ఇనుము మండుచున్నది' యనునట్లు అధ్యాస వలననే జగత్తునకు అనుభానమని తెలియ వలయును. "తమేవ భాన్త మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" యను శ్రుతి ఉక్తార్థమునే ప్రతిపాదించు చున్నది. సర్వప్రకాశ స్థైతస్యస్వరూపుడు, గురువర్యుడు నయిన శ్రీదక్షిణామూర్తికి నిదియే సప్రశ్రయ నమస్కారము.



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## చతుర్థోల్లాసః

### అవతారిక

జీవేశ్వరాభేదమును ప్రతిపాదించుటయందే సర
వేదాంతవాక్యములకు తాత్పర్యమని చెప్పబడినది. పూర
ప్రతిపాదితమైన వేదాంతవాక్య సమన్వయార్థమై
బ్రహ్మాత్మాద్వైత తత్త్వమునందు విరోధుల నాక్షేపమున
ప్రత్యక్షాది ప్రమాణాభాసలను ప్రతివాదిబుద్ధికల్పితములై
విరోధములను పరిహరించి శ్రీసురేశ్వరులు తమ వార్తికవ
నందు మూడు శ్లోకములతో విరోధరహితమైన సమన్వం
మును విస్పష్టము చేయుచున్నారు.

"ఆత్మసత్తైవ సత్తైషాం భావానాం న తతోఽధికా।
తథైవ స్ఫురణం చైషాం నాత్మస్ఫురణతోఽధికమ్॥"

అనుచు, సర్వభావములకు (పదార్థములకు) ఆత్మసత్తకంటె
భిన్నమైన సత్త లేదనియు, అటులనే, ఆత్మస్ఫురణమ
(ప్రకాశము)కంటెవేఱయినస్ఫురణము లేదనియు చెప్పబడినది
కాని, 'ఘటోఽస్తి', 'ఘటః స్ఫురతి' అనునట్టి యనుభవమ
వలన, సర్వపదార్థములకు స్వతః సత్తాస్ఫురణములు లేవ

చెప్పుట యనుభవవిరుద్ధ మని శంక బయలుదేరుచున్నది. ఈ విషయమును (శ్రీ) పరమేశ్వరులు ఇట్లు చెప్పుచున్నారు.

### వా ర్తి క ము

స్వతః స న్తః ప్రకాశ న్తే భావా ఘటపటాదయః ।
నేశ్వరస్య సమావేశా దిత్యస్యోత్తర ముచ్యతే ॥ ౧

### పీ యూ ష ప ఙ్క్తి కి

ఘటపటాది పదార్థములు స్వయముగ సత్తావంతములైయుండియే ప్రతీయమానము లగుచున్నవి; పరమేశ్వరుని సమావేశము వలన ప్రకాశించుట లేదు అను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

### వా ర్తి క ము

అహమిత్యనుసన్ధాతా జానామీతి న చేత్ స్ఫురేత్ ।
కస్య కో వా ప్రకాశేత జగచ్చ స్యా త్సుషుప్తవత్ ॥ ౨

### పీ యూ ష ప ఙ్క్తి కి

తెలిసికొనుచున్నాను, అని అనుసంధానము చేయు నట్టి 'నేను' అని స్ఫురణము లేనిచో, ఏది యెవరికి భాసించును? అపుడు ప్రపంచము సుషుప్తి (గాఢనిద్ర) వలె నుండును.

### విశేష వివరణము

మూలశ్లోకమునందలి '[illegible]' అను [illegible] వివరించుచున్నారు. పరమేశ్వరసంబంధము లేకుండగ, ఘటపటాది విషయములను

సత్తాస్ఫురణములను అంగీకరించినచో, బాధకమైన ప్రమాణమును చెప్పుటకై పరమేశ్వరుని యొక్క స్వప్రకాశత్వ, సద్రూపత్వములను 'అహమిత్యనుసంధాతా' యని నిరూపించుచున్నారు.

'నేను తెలిసికొనుచున్నాను' అనెడి యనుసంధాత (భావములను ఏకసూత్రమున గ్రథితము చేయువాడు) లేనిచో, స్ఫురింపనిచో, జగత్తు అంధకారమయ మగును. భావములు క్షణకాలమాత్ర పర్యవసాయులు. సకల భావములను అనుసంధానము చేయువాడు లేనిచో, ఏ భావమునకు గూడ మఱియొక భావముతో సంబంధము లేకపోవలసివచ్చును. కావున, సకల భావములకు అనుసంధానకర్త యొకడు ఉండవలయును. అతడే 'అహం' శబ్దవాచ్యుడు. భావములు పరివర్తనశీలములు కావచ్చును గాని, 'అహం' అనునట్టి స్ఫురణము అనుస్యూతముగ నుండును.

ఒకవేళ, విషయము స్వయముగా ప్రకాశించినచో, అపుడు 'అహం జానామి'-'నేను తెలిసికొనుచున్నాను' అనెడి జ్ఞానమునకు ఆశ్రయుడుగా విషయానుసంధాత యొక్క స్ఫురణమే కలుగక పోవలసి వచ్చును. అట్టి స్ఫురణమే లేనిచో, కఠినశిలచే కప్పబడిన గుహాంతర్గత మహాదీపము వలె, ఇది నాచే తెలిసికొనబడినది (మయా విదితో౽యం) అని యెవనికిని భాసింపదు. ఆరీతిగ కాగా, సుషుప్తియందు జగత్తు ప్రకాశింపనటుల, జగత్తుయొక్క భావము ఉండదు.

అందువలన జగద్వ్యవహారము ప్రసక్తము కాదు. కావున, జగత్తుయొక్క స్ఫురణము అన్యాధీనమని చెప్పుట యుపాదేయమే యని గ్రహింపవలెను. ఈ జగత్తు దేని కారణముగా భాసించుచున్నదో, అది నిత్యప్రకాశస్వరూపమే యని స్పష్టమగుచున్నది. ఆ ప్రకాశమునకు మఱియొక ప్రకాశమును అంగీకరించినచో, అనవస్థాప్రసంగ దోషము వాటిల్లును. కావున, నిత్యప్రకాశస్వరూపుఁడైన చైతన్యమే జగద్భానమునకు కారణమని విస్పష్టము. ('యదధీనశ్చాస్య ప్రకాశః స నిత్యప్రకాశరూప ఏవాస్థేయః, తస్యాపి ప్రకాశ్యత్వేఽనవస్థాప్రసంగాదితి').

వార్తికము

ప్రాగూర్ధ్వం చాసతాం సత్త్వం వర్తమానేఽపి స్వతః।
తస్మాదీశే స్థితం సత్త్వం ప్రాగూర్ధ్వత్వవివర్జితే ॥ 3

పీయూషవర్షిణీ

భూతకాలమునందు, భవిష్యత్ కాలమునందును సత్తారహితములు అయినవానికి వర్తమాన కాలమునందు సయితము స్వతః సత్త లేదు. కావున, భూత భవిష్యత్కాల స్పర్శ లేని (ప్రాగూర్ధ్వత్వవివర్జితే) ఈశ్వరునియందు సత్త యుండును.

విశేష వివరణము

విషయములందలి జ్ఞానము వలె సత్త గూడ, పరాధీనమని యుక్తిపురస్సరముగా చెప్పుచున్నారు. భావములు

అనన్యాధీన (స్వతంత్ర) ప్రకాశము లని చెప్పినచో,
రూపత్వము అనుపపన్న మగును. అప్పుడు స్వతంత్ర
యందు సంయుతము సత్త యనుపపన్నమగునని ఆపాదిం
'ప్రాగూర్ధ్వ' మనునట్టి యీ వార్తికము ఆరంభింపబడిన

వాస్తవమునకు సమస్త విషయములు (భావవ
ప్రాగభావ, ప్రధ్వంసాభావములు (ఉత్పత్తి వినాశవ
కలవి. వానికి నైరంతర్యము లేదు. ఒకప్పుడు ఉండి
యొకప్పుడు ఉండవు. కాదాచిత్కముగా నుండునది మఱి
నిమిత్తము కారణముగా గలిగి యుండును. కావున, వి
సత్త పరాధీనము గాని, స్వతంత్రము కాదు.
అనుమానరచన యిట్లు ఉండును. "విమతా భావాః, న
సత్తావన్తః, కదాచిదేవ సంబధ్యమానసత్త్వాత్,
రజతాదివత్."

కాగా, భావముల సత్త గూడ, ప్రకాశము
అనాధీనమని స్పష్టమగుచున్నది. విషయములు స్వ
సత్త గలవైనచో, ఆత్మవలె స్వయంప్రకాశములు
నగును. అప్పుడు అవి ఆత్మవలె విషయములు కావు
వానికి విషయత్వమే యనుపపన్న మగును. ('అననా
సత్తావత్త్వేఽనాత్మవ దనన్యాధీన ప్రకాశత్వాపత్తౌ వి
త్వానుపపత్తిః').

పరమేశ్వరుడు కాలపరిచ్ఛేద రహితుడు. ఆ
నుండియే సమస్త సృష్టి జరుగుచున్నది. కా

పరమేశ్వరుడు సమస్త విషయముల యొక్క ఆగమనమునకు (ఆవిర్భావమునకు) అవధిభూతుడు. అటులనే, ఆయనయందే సమస్తము లయము నొందుచున్నది. కావున, పరమేశ్వరుడు, అపాయావధిభూతుడు. ఈవిధముగా సర్వపదార్థములకు ఆగమ అపాయావధిరూపముతో పరమేశ్వర సత్త సతతము అనుస్యూతమై యుండును ('ఈశ్వరస్యతు న ప్రాగూర్ధ్వం చాసత్త్వశంకా, అప్రకాశత్వశంకావా స్యాత్, సర్వభావానా మాగమాపాయావధిత్వేన తస్య సత్త్వాత్'). కావున, పరమేశ్వరుడు ప్రత్యగాత్మ రూపముతో సకలావస్థలకు సాక్షి యగుటచేత, ఆయన సదా ప్రకాశస్వరూపు డనియు తెలియవలయును. "న హి ద్రష్టుః దృష్టే ర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్" అను బృహదారణ్యక శ్రుతివచనము వలన, పరమేశ్వరునకు ప్రాగభావముగాని, ప్రధ్వంసాభావము గాని లేవనియు ఆయన, నిత్యస్వరూపుడనియు, స్వయం ప్రకాశరూపుడనియు తెలియుచున్నది.

వా ర్తి క ము

స్వయమేవ ప్రకాశేరన్ జడా యది వినేశ్వరమ్ ।
సర్వం సర్వస్య భాసేత నావభాసేత కించన ॥ ४

పీ యూ ష వ ర్షి ణి

జడపదార్థములు ఈశ్వరాపేక్ష లేకయే స్వయముగ భాసించినచో అందఱకు సర్వపదార్థములు భాసింపవలసి

యుండును; లేక, లేశమాత్రమైనను భాసింపకపోవలసి యుండును.

## విశేష వివరణము

స్వయంప్రకాశత్వ మనునది చేతనధర్మము గాని, జడమైన విషయమునందు ఉండదు. పరప్రకాశాపేక్ష లేక, అది స్వయముగా ప్రకాశింపనేరదు. చేతనసాన్నిధ్యము చేతనే విషయము భాసించును. మఱియొక విషయ మేమన, చేతనము ఎన్నడు విషయము కాదు. ఇతరుల చేతనత్వము సర్వదా అనుమేయము. చేతనసాక్షాత్కార మనగా 'అహం' 'నేను' అను ప్రత్యయముతో అభిన్నముగా నుండుట. మహాదీపము స్వప్రకాశము వలననే ప్రకాశించును. కావున, చేతనము ఎన్నడు విషయము కాదనియు, విషయము ఎన్నడు చేతనము కాజాలదనియు స్పష్టము. విషయములకు స్వతః ప్రకాశత్వ మున్నచో, అవి యన్నిసమయములయందును అందఱి జ్ఞానమునకు విషయములై యుండవలయును. అనగా, సదా ప్రతీయమానములు కావలసియుండును. ఇట్టిగుట అనుభవదూరమైన విషయము.

## వా ర్తి క ము

తస్మాత్సర్వ మజ్ఞం వా జగత్ స్యా దేకరూపకమ్ ।
తుల్యే స్వయంప్రకాశత్వే జడచేతనయోర్మిథః ॥ ౫
తుల్యమేవ ప్రసజ్యేరన్ గ్రాహ్యగ్రాహకతాదయః ।
ఇన్ద్రియాణా మనియమా చ్చాక్షుషాః స్యూ రసాదయః ॥౬

## పీ యూ ష వ ర్షి ణి

విషయములు స్వయంప్రకాశము లగుటవలన, సమస్త సంసారము సర్వజ్ఞముగ గాని, అజ్ఞముగ గాని, ఏకరూపము కలదై యుండెడిది. స్వయంప్రకాశత్వము ఏకరూప మగుట వలన, జడచేతనములకు పరస్పరము గ్రాహ్య గ్రాహకత్వాదులు, అనగా జ్ఞాతృ జ్ఞేయాదులు సమానముగనే ప్రసక్తములై యుండెడివి. జ్ఞానసాధనము లగు ఇంద్రియముల యొక్క నియమాభావము వలన, రసాదులు (జిహ్వేంద్రియ గ్రాహ్యములైన మధురాది రసములు) చక్షురింద్రియము చేత గూడ గ్రహింపబడవలసి వచ్చును.

### విశేష వివరణము

సమస్తము సర్వులకు భాసించును, లేక భాసింపదు. దీనివలన కలిగెడి విప్రతిపత్తి యేమి? యను నాశంకకు సమాధానము చెప్పుచున్నారు. అందఱకు సమస్తము సదా భాసించినచో, సర్వులు సర్వజ్ఞులు కావలసియుండును. ఆరీతిగ, భాసింపకపోయినచో, సర్వులు అజ్ఞులు కావలసి యుండును ('యది సర్వం సర్వస్య సదా భాసేత తదా సర్వః సర్వజ్ఞః స్యాత్, యది నైవం భాసేత తదా సర్వోఽప్యజ్ఞః స్యాత్'). ఏ జీవుడును సర్వజ్ఞుడు కాడు, అజ్ఞుడును కాడు. ఇది లోకానుభవసిద్ధ విషయము. కావున, విషయములకు స్వతః సత్తాస్ఫురణములు లేవని చెప్పుట ఔపనిషద సిద్ధాంతము.

విషయములు గూడ నాత్మ వలె స్వయంప్రకాశములు
చెప్పుటయందు మఱియొక దోషము గూడ ప్రసక్తమగును
ఆవిధముగా చెప్పుటవలన, అనుభవసిద్ధమైన భేదవ్యవహారము
కూడ నుండదు. దానివలన జ్ఞానవిషయమే జ్ఞానాశ్రయ
మగును. ఈవిధముగా కర్మ, కర్తలకు ఏకత్వరూపమైన
దోషము సంభవించును. విషయము విషయమును తెలి
కొనును. అపుడు విషయము, విషయి యను వ్యవహారమ
అనుపపన్న మగును. ఇది అనుభవవిరుద్ధము.

గ్రాహ్యము, గ్రాహకము అను వ్యవస్థను అంగీ
కరించకపోయినచో, లోకవ్యవహారమునకు భంగము వాటిల్లున
సర్వేంద్రియములకు సర్వగ్రాహ్యత్వము, సర్వగ్రాహక
త్వము అంగీకరింప బడినచో, చక్షురింద్రియము రసాది
గ్రాహకము కావలసివచ్చును. అటులనే రసాదులు గూడ
చక్షురింద్రియగ్రాహకము లగును. అందువలన, సర్వ
ప్రకాశకత్వ వాదమునందు విషయ, విషయి వ్యవహారమ
అసంగత మగును. స్వతః సత్తావాదమునందు విషయములక
స్వరూపావ్యభిచారిత్వము ప్రసక్త మగును. కావున
విషయములు అన్యాధీనములైన సత్తాస్ఫురణములు కలవే
గాని, స్వతః సత్తాస్ఫురణములు కలవి కావనియు
స్వతః సత్తా స్ఫురణములు గలవాడు పరమేశ్వరుడే
కాని, యన్యుడు కాడనియు పర్యవసితార్థ మని భావనీయము.
("అన్యాధీన సత్తాస్ఫూర్తి కాః విషయాః. అన్యశ్చ స్వతః
సత్తాస్ఫురణ వానీశ్వర ఏవ నాన్యః"). కావున, లోక

వ్యవహారసిద్ధి కొఱకు పరమేశ్వరుని సత్తాస్ఫురణముల వలననే, విషయములు సత్తావంతములు, ప్రకాశవంతములని గ్రహింపనగును.

వార్తికము

మలినామలినాదర్శ పశ్చాత్ప్రాగ్భాగతుల్యయోః ।
క్రియాశక్తిజ్ఞానశక్త్యో రంతఃకరణభాగయోః ॥ ౩
ప్రతిబింబే స్ఫురన్నీశః కర్తా జ్ఞాతేతి కథ్యతే ।

పీ యూ ష వ ర్షి ణీ

అంతఃకరణభాగములు అద్దమునకు ముందు, వెనుకనున్న స్వచ్ఛ, మలినభాగముల వలె, క్రియాశక్తి, జ్ఞానశక్తులు కలవు. అంతఃకరణ భాగములైన ఆ క్రియా జ్ఞానశక్తుల యందు ప్రతిఫలించిన ప్రతిబింబమునందు అభేదభావముతో స్ఫురించుచున్న పరమేశ్వరుడు కర్త, జ్ఞాత యని వ్యవహరింపబడును.

విశేష వివరణము

పరమేశ్వరుడు విషయములయందు సత్తాప్రకాశములను వ్యాపింపజేయునా, లేదా? ఆరీతిగ జేయనిచో, సంనిధానమునందు ఉన్నను ఆకాశమువలె అకించిత్కరుడగును. ఒకవేళ చేయుచున్నాడని చెప్పిన, వికారిత్వము వచ్చును. వికారిత్వము వచ్చిన, అనిత్యత్వము ఆపాదించును. దానివలన అనీశ్వరత్వము ప్రసక్తమగును. ఇట్లు ఆక్షేపము రాగా, ఇది దోషము కాదని చెప్పుచున్నారు.

పరమేశ్వరుని యందలి వ్యాపారవత్త్వము ఉపాధి ప్రయుక్తము. ఆయన స్వతః నిర్వ్యాపారియే. పరమేశ్వరునకు గల జ్ఞాతృత్వ, కర్తృత్వములు మాయాశక్తి యొక్క యుపాధి వలన సంక్రమించినవే గాని, స్వతఃసిద్ధములు కావని యుపపాదనము చేయబడినది.

ఈశ్వరుడు, ప్రాణరూపక్రియాశక్తి ద్వారా తనను అనేక విధములైన వ్యాపారములలో అభివ్యక్తము చేసికొనును. ప్రాణశక్తికి సత్తాస్ఫూర్తుల నిచ్చుటయే యీశ్వరుని కర్తృత్వము ('వ్యాపారవత్త్వేనోపాధిః సత్తాస్ఫూర్తిప్రదత్వేన అనుగమ్యమానః సదాశివః కర్తా').

ఈశ్వరుడు, బుద్ధిరూప జ్ఞానశక్తిద్వారా, స్వయం ప్రకాశజ్ఞాతృరూపముతో అనేక విధములైన జ్ఞానములలో వ్యక్తము చేసికొనును. జ్ఞానశక్తికి స్వీయ సత్తా స్ఫూర్తుల నొసగుటయే సదాశివుని జ్ఞాతృత్వమని తెలియవలయును. ('పరిణమమాన మన ఆద్యుపాధిః సత్తాస్ఫూర్తి ప్రదత్వేన అనుగమ్యమానః జానాతీతి వ్యపదేశభాక్ (జ్ఞాతా) భవతీత్యర్థః').

వార్తికము

బుద్ధిసత్త్వగుణోత్కర్షాత్ నిర్మలో దర్పణో యథా ॥
గృహ్ణాతి విషయచ్ఛాయా మాత్మచ్ఛాయానుభావతః ।
అంతఃకరణసంబంధాత్ నిఖిలానింద్రియాణ్యపి ॥ ౯

## పీ యూ ష వ ర్షి ణి

నిర్మలమైన దర్పణము సత్త్వగుణాతిశయము వలన, విషయప్రతిబింబమును గ్రహించును. ఆరీతిగనే, బుద్ధి, ఆత్మ ప్రతిబింబము ప్రతిఫలించిన తరువాత, ఆత్మయుక్త మగుట వలన, విషయప్రతిబింబమును గ్రహించును. అంతఃకరణ సంబంధము వలన సర్వేంద్రియములు గూడ విషయ ప్రతిబింబమును గ్రహించును.

### విశేష వివరణము

ఆత్మకు జ్ఞాతృత్వాదులు, ఉపాధిభూతజ్ఞానశక్తియైన యంతఃకరణము వలననే కలుగుచున్నవి గాని, స్వాభావిక ములు కావు. బుద్ధియందు రెండు ప్రతిబింబములు పడుచున్నవి. ఒకటి, ఆత్మప్రతిబింబము; రెండవది, విషయప్రతిబింబము. ఆత్మకు, విషయమునకు సంబంధము కలుగుటయే జ్ఞానము. ఆత్మకు సాక్షాత్తుగ విషయజ్ఞానము కలుగదు. ఆత్మప్రతి ఫలితమైన బుద్ధి ద్వారానే కలుగును. ఆత్మ, చేతనము; విషయము జడము. రెండును సమసత్తాకములు కావు గాన, రెంటికి సంబంధము పొసగదు. ఆత్మప్రతిబింబము, విషయ ప్రతిబింబము రెండును అనిర్వచనీయములు, సమసత్తాకములు, బుద్ధిస్థము లగుటచే రెంటికి సామానాధికరణ్యము గలదు. కావున, బుద్ధియందు గల ఆత్మయే జ్ఞాత, బుద్ధిస్థమైన విషయమే జ్ఞేయము.

"సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాద మోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥"

అను భగవద్వచనానుసారము రజస్తమో గుణముల యతిశయము వలన లోభ, ప్రమాద, మోహములు కలుగును. అందువలనే సత్త్వగుణాతిశయము వలన బుద్ధి, విషయములను గ్రహించుననని చెప్పబడినది. బుద్ధియుక్తమైనపుడే యింద్రియములు సైతము విషయగ్రహణ సమర్థము లగును గాని, స్వయముగా సమర్థములు కాజాల వనుట సిద్ధాంతము. సహజముగా, ఇంద్రియముల బహిర్ముఖత్వమునకు ప్రేరకము బుద్ధియే గాని, విషయము కాదు. ఆ బుద్ధియే యింద్రియ గతిని శాసించునట్టిది. కావున, బుద్ధిప్రేరితములైన యింద్రియములే విషయగ్రహణ సమర్థములు.

వార్తికము

రథాంగనేమివలయే కీలితా ఇవ కీలకాః।
నాడ్యోఽన్తఃకరణే స్యూతా జాలసంస్యూత సూత్రవత్॥ ౧౦

పీయూషవర్షిణీ

ఇపుడు, దేహాంతరమునందు అనుప్రవేశము వలన జీవభావాపన్నుడైన వానికి, ఉపాధివశముచే ప్రాప్తమైన జాగరాది అవస్థాత్రయమును చెప్పదలచి, తదనుభవ సంచార స్థానమైన నాడీమండలమును నిరూపించుచున్నారు:

అంతఃకరణమునందు నాడులు ("దేహాంతరాలగతాః సిరాః అంతస్సుషిరాః స్నాయ్వాఖ్యా నాడ్యః") రథచక్రము

యొక్క నేమియందలి ఆకులు (అరాః) వలె, కలిసియున్నవి. అవి మత్స్యకారుని వలలోని సూత్రముల వలె ఓతప్రోతముగా గ్రథితములై యుండును.

మత్స్యమును పట్టుకొను సాధనమైన వలయందు సూత్రములు ఓతప్రోతములై పరస్పరము పెనవేసికొని యుండుట జూతుము. అట్లనే, సర్వవిషయములను నిరోధించు సాధనము, వృత్తిమంతమునైన యంతఃకరణము నందు నాడులు ఓతప్రోతములై యుండును. ("సర్వవిషయావరోధసాధనే వృత్తిమదన్తఃకరణే నాడ్యః ప్రోతా వర్తన్త ఇత్యర్థః").

వా ర్తి క ము

తాభిస్తు గోలకాన్తాభిః ప్రసర్పన్తి స్ఫులింగవత్ ।
కరణాని సమస్తాపి యథా స్వం విషయం ప్రతి ॥ ౧౧

పీ యూ ష వ ర్షి ణీ

సర్వేంద్రియములు, మనోవృత్తుల సహితముగా, ఇంద్రియగోళకముల వఱకు పోవునట్టి యా నాడుల ద్వారా తమ తమ విషయముల వైపునకు విస్ఫులింగములవలె ముందుకు దుమికి జారిపోవుచుండును. అనగా, సంచరించుచుండు నని భావము.

ఇంద్రియముల అభివ్యక్తిస్థానము గోళక మనబడును. అనగా, దేహములో నింద్రియముల నివాసస్థానమే గోళక

శబ్దవాచ్యము ("ఇన్ద్రి యాయతన మిన్ద్రియాభివ్యక్తిస్థా
దేహదేశ విశేషరూపమ్"). శరీర ప్రదేశ విశేషములయం
చక్షు, శ్రోత్ర, నాసికాగోళకములు ఉండును. వానియం
చక్షురింద్రియ, శ్రోత్రేంద్రియ, ఘ్రాణేంద్రియము
ప్రవేశించి సంచరించును. అవి విస్ఫులింగముల వలె ప్రవేశిం
సంచరించుచుండు నని చెప్పుటచేత, ఆ నాడులు అతిసూక్ష్మ
లని తెలియవలయును. ఇంతియే కాక, నాడులయం
ప్రవేశించిన యింద్రియములలో ప్రకాశ స్వరూపమై
పరమాత్మచైతన్యము ప్రవేశించి యున్నదను భావము గూ
ధ్వనించుచున్నది. ఇంద్రియములు అంతఃకరణమునం
ప్రవేశించిన తరువాతనే, గతార్థము లగును. 'గోళకాంతా
అను పాఠాంతరము గలదు. కరణములకు (ఇంద్రియములక
'గోళకాన్తాని' యనునది యిచట విశేషణ మని తెలియనగున
సుషుప్తినుండి జాగ్రద్దశకు తిరిగివచ్చుట గోళకాం
పర్యంతము జరుగునని భావము.

వా ర్తి క ము

**దేహస్య మధ్యమం స్థానం మూలాధార మితీర్యతే ।**
**గుదాత్తు ద్వ్యంగులా దూర్ధ్వం మేఢ్రాత్తు ద్వ్యంగులాదధః**

పీ యూ ష వ ర్షి ణి

నాడుల ద్వారా యింద్రియములు సంచరించున
చెప్పబడినది. ఆ నాడులు ఏవి ? అవి యెన్ని ? వాని పరిమా

మెంత ? యను జిజ్ఞాస కలుగుట సహజము. ఆ ప్రశ్నల కిట సమాధానము చెప్పబడుచున్నది.

ఆసనము (మలవిసర్జనస్థానము) నుండి రెండు అంగుళములు పైభాగమున, జననేంద్రియమునకు రెండు అంగుళముల క్రింది భాగమున, దేహము యొక్క మధ్యమస్థానము మూలాధార మని చెప్పబడును.

వా ర్తి క ము

త్రికోణోఽధోముఖాగ్రశ్చ కన్యకాయోనిసన్నిభః
యత్ర కుండలినీ నామ పరాశక్తిః ప్రతిష్ఠితా ॥ ౧౩

పీ యూ ష వ ర్షి ణీ

మూలాధారమునందు అధోముఖమై త్రికోణాకారములో నున్న, కన్యకాయోనిసన్నిభమైన 'కుండలినీ' నామముతో నొప్పారు పరాశక్తి యుండును.

ఆ పరాశక్తియే మూలప్రకృతి. మూలాధారమునందు జ్యోతిస్స్వరూపముగ వెలుగొందునట్టి శివలింగమును సార్ధత్రివలయమై మూడున్నరచుట్టులతో పరివేష్టించి యున్న భుజంగరూపిణి కుండలిని యనబడును. ('సర్పకుండలాకారా కుండలినీ సంజ్ఞితా').

వా ర్తి క ము

ప్రాణాగ్ని బిన్దునాదానాం సవిత్రీ సా సరస్వతీ ।
మూలాధారాగ్రకోణస్థా సుషుమ్నా బ్రహ్మరంధ్రగా॥౧౪

మూలేఽర్ధచ్ఛిన్నవంశాభా షడాధారసమన్వితా।
తత్పార్శ్వకోణయో ర్జాతే ద్వే ఇడా పింగళే స్థితే ॥ ౧౩

పీ యూ ష వ ర్షి ణి

ఆత్మతేజస్సుతో ప్రకాశించునట్టి పరాశక్తిస్వరూపి యగు కుండలినీశక్తి 'సరస్వతీ' నామముచే వ్యవహరింబడును. ఆమె ప్రాణ, అగ్ని, బిందు, నాదజనయిత్రి; మూలాధారమున, అధోముఖకోణమునందు ఉండును; మఱియు సహస్రారచక్రపర్యంతము గమనము చేయుచుండును.

మూలాధారమునందలి సూక్ష్మ సుషిరము(గంధ్రము)నంబి సగము తెగిన వెదురువాసము వలె భాసించునది, షట్చక్ర సహితమైన సుషుమ్నా నాడి యున్నది. తత్పార్శ్వకోణము యందు ఉత్పన్నములైన ఇడ, పింగళ యను రెండు నాడుల ఉన్నవి. వామపార్శ్వమునందు ఇడానాడి, దక్షిణపార్శ్వము నందు పింగళానాడి యున్నదని తెలియసగును. ఈ నాడి ద్వయము లలాటము యొక్క మూలము వఱకు ప్రసరిం యుండును.

## విశేష వివరణము

శ్రీ వ్యాసమహర్షి సూతసంహితా జ్ఞానయోగఖండమున ఏకాదశాధ్యాయమునందు నాడీచక్రనిరూపణము విశదముగ చేసియున్నారు. మనుష్యశరీరము షణ్ణవత్యంగుళ పరిమితమై యుండు ననియు, నలుబది యెనిమిది యంగుళములు గల ఊర్ధ్వ

శరీరమును వదలిన, శరీర మధ్యభాగము మూలాధారస్థాన మనియు వివరించిరి.

"దేహమధ్యే శిఖిస్థానం తప్తజాంబూనదప్రభమ్ ।
త్రికోణం మనుజానాం తు సత్యముక్తం బృహస్పతే ॥"

యనుచు మూలాధారస్థానము దేహమధ్యభాగమున కల దనియు, అది అగ్నిస్థాన మనియు, బాగుగ కాల్చిన బంగారము వలె కాంతిమంతమైయుండు ననియు, అది త్రికోణాకారముగ నుండుననియు చెప్పిరి.

"కన్దస్థానం మునిశ్రేష్ఠ మూలాధారా న్నవాంగుళమ్ ।
చతురంగుళ మాయామవిస్తారం మునిసత్తమ ॥"

యనుచు మూలాధారమునుండి తొమ్మిది అంగుళముల పైభాగమున, నాలుగు అంగుళముల విస్తారము గల కంద స్థానము కలదనియు, కుక్కుటాండమువలె నుండు కంద మధ్య భాగమునందు నాభి యున్నదనియు చెప్పిరి.

"కందమధ్యే స్థితా నాడీ సుషుమ్నేతి ప్రకీర్తితా ।
తిష్ఠన్తి పరిత స్తస్యా నాడ్యో మునిసత్తమ ॥"

యను సూతసంహితావచనము వలన, కందమధ్యభాగమునందు సుషుమ్నానాడి యున్నదని తెలియుచున్నది. ఇంతియేకాదు, అచట, ఇరువది యేడు వేల నాడులున్నవి. వానిలో సుషుమ్నా పింగళా, ఇడా, సరస్వతీ, పూషా, వారుణీ, హస్తిజిహ్వా, యశస్వినీ, అలంబుసా, కుహూః, విశ్వోదరా, పయస్వినీ,

శంఖినీ, గాంధారీ యను పేరుగల పదునాలుగు నాడులు ముఖ్యములని చెప్పబడినది.

"ఆసాం ముఖ్యతమా స్త్రిస్త్రస్త్రిస్ర్తేష్వేకా వరా మునే।
బ్రహ్మనాడీతి సా ప్రోక్తా మునే వేదాంతవేదిభిః॥"

ఆ పదునాలుగు నాడులలో ముఖ్యతమమైన సుషుమ్నా నాడి బ్రహ్మలోక ప్రాప్తిసాధన మగుట వలన 'బ్రహ్మనాడి' యను పేరుతో నొప్పారును.

"సహా మస్తకపర్యన్తం సుషుమ్నా సుప్రతిష్ఠితా।
నాభికన్దా దధః స్థానం కుండల్యా ద్వ్యంగుళం మునే॥"

"అష్టప్రకృతిరూపా సా కుండలీ మునిసత్తమ।
యథావ ద్వాయుచేష్టాం చ జలాన్నాదీని నిత్యశః॥"

"పరితః కందపార్శ్వేషు నిరుధ్యైవ సదా స్థితా।
స్వముఖేన సదాఽఽవేష్ట్య బ్రహ్మరంధ్రముఖం మునే॥"

యను వచనము వలన సుషుమ్నా నాడి మూర్ధస్థానము వఱకు వ్యాపించి యుండునని యవగత మగుచున్నది.

"శతం చైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభినిఃసృతైకా। తయోర్ధ్వ మాయ న్నమృతత్వ మేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి॥"

యనుచు ఆథర్వణిక శ్రుతి, హృదయమునందు నూటఒక్క నాడులు కలవనియు, వానిలో నొకటి (బ్రహ్మనాడి, లేక

సుషుమ్నానాడి) ఊర్ధ్వముగా ప్రసరించి, అమృతత్వము పొందుననియు, మిగిలిన నాడులు ప్రాణోత్క్రమణ ద్వారము లగుననియు చెప్పుచున్నది.

అమృతత్వ మనగా, బ్రహ్మలోకప్రాప్తి.

"ఆభూతసంప్లవం స్థాన మమృతత్వం హి భాష్యతే"
యని అమృతత్వశబ్ద నిర్వచనము.

వాయువు మూలాధారమునుండి బయలుదేరి తత్ పార్శ్వస్థములైన ఇడా, పింగళా నాడుల ద్వారా బహిర్గతమై అస్తమించును.

"దేహేఽపి మూలాధారేఽస్మిన్ సముద్యాతి సమీరణః ।
నాడీభ్యా మస్తమేతి ఘ్రాణాంతే ద్వాదశాంగులే ॥"

యను వచనము ఉక్తవిషయమునే చెప్పుచున్నది. మూలాధారమునుండి యుత్థితమైన వాయువు, తన యెదుట నున్న, మధ్యస్థితమైన సుషుమ్నా ద్వారమును పరిత్యజించును; ఆ వాయువు ఇడా పింగళా నాడులయందు సంచరించును. ఏలయన, కుండలిని స్వఫణాగ్రము చేత సుషుమ్నా ద్వారమును మూసియుంచును. ఆ కారణముచేత వాయువు ఇడా, పింగళానాడుల ద్వారా బహిర్గత మగును. ఆ కుండలినీ శక్తి అష్టప్రకృత్యాత్మికయై వెలుగొందుచుండును. "మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయః సప్త"

అను వచనానుసారము అష్టవిధ ప్రకృతులు కలిగియుండును. మహదాది ప్రకృతి వికృత్యాత్మికమైన కుండలిని, అష్టధా కుండలీకృతమై యుండును.

"కుండలీ పరిత స్తస్మా దష్టధా కుండలీకృతా ।
అష్టప్రకృతిరూపా సా సుప్త సర్ప సమాకృతిః ॥"

యను తంత్రవచనము వలన కుండలినీశక్తి యష్టప్రకృతిరూప యనియు, సుప్త భుజంగిని వలె అష్టవేష్టనములు (చుట్లు) చుట్టుకొనియుండుననియు తెలియుచున్నది.

"పరితః కన్దపార్శ్వేషు నిరుధ్యైవ సదా స్థితా ।
స్వముఖేన సదాఽఽవేష్ట్య బ్రహ్మరంధ్రముఖం మునే॥"

యను సూతసంహితావచనము (జ్ఞానయోగఖండ-అధ్యా-౧౧) కుండలిని, మూలాధారమునుండి సముత్థితమైన వాయుసంచారమును, కందపార్శ్వములయందు నిరోధించి యుండుననియు, స్వముఖముతో సుషుమ్నా మూలరంధ్రమును (బ్రహ్మనాడీరంధ్రమును) మూసివేసి, అష్టవిధ కుండలీభావముతో తన మెడను (స్వగ్రీవాం) చుట్టుకొని, శేష కాయమును వంశాస్థి (వెన్నెముక) పై భాగమునకు తీసికొనిపోయి, బ్రహ్మరంధ్రమును కప్పి వేయుచున్నదనియు చెప్పుచున్నది.

"కన్దనాభే రధోరంధ్రే నిధాయ స్వఫణాం దృఢమ్ ।
సన్నిరుధ్య మరున్మార్గం పుచ్ఛేన స్వముఖం తథా ॥
బ్రహ్మరంధ్రం చ సంవేష్ట్య పృష్ఠాస్థ్నా సహ సుస్థితా ॥"

యను తంత్రవచనములు పూర్వప్రతిపాదిత విషయమునే స్పష్టము చేయుచున్నవి. ఈ విధముగా కుండలినీశక్తిస్వరూప, వ్యాపారములను సూతసంహిత స్పష్టము చేయుచున్నది. (స్వా. విద్యారణ్యకృత తాత్పర్యదీపిక).

పరాశక్తిస్వరూపిణియైన కుండలిని వర్ణరూపముతో నభివ్యక్తమగుచు 'సరస్వతి' నామమున బరగును అని యోగీశ్వరుల యనుభవము. ఈ సరస్వతి నాలుగు విధములుగా నుండునని శ్రీ శంకర భగవత్పాదుల యీ క్రింది వచనము వలన తెలియుచున్నది.

"మూలాధారాత్ ప్రథమ ముదితో యస్తు భావః పరాఽఽఖ్యః
పశ్చాత్ పశ్యన్త్యథ హృదయగో బుద్ధియుఙ్మధ్యమాఽఽఖ్యః।
వక్త్రే వైఖర్యథ రురుదిషో రస్య జన్తోః సుషుమ్నా బద్ధః
తస్మాద్భవతి పవనః ప్రేరితో వర్ణసంఙ్ఘః ॥"

జ్ఞాతమైన యర్థమును అభివ్యక్తము చేయవలయు ననెడి సంకల్పముతో ప్రయత్నము ద్వారా మూలాధార స్థితమైన వాయువు సంస్కారమును పొందును. అట్లు వాసనా వాసితమైన వాయువు సర్వవ్యాపకమైన శబ్దబ్రహ్మను అచటనే అభివ్యక్తము చేయును. అట్లు అభివ్యక్తమైన శబ్దబ్రహ్మయే స్పందము లేకయుండి, 'నాదబిందు' రూపముతో 'పరా వాక్' అని వ్యవహరింపబడును.

ఆ పరావాక్కు నాభి వఱకు జేరినపుడు, 'పశ్యన్తీ' వాక్కు అని వ్యవహృత మగును. నాభిస్థానమును జేరుచు వాయు ప్రేరితయై విమర్శరూపిణియై అభివ్యక్తి నొందును. మనోయుక్తయై సామాన్య స్పన్దప్రకాశరూపకార్యమైన బిందుతత్త్వరూపముతో 'పశ్యన్తీ' నామముతో నభిహిత యగును. అపుడు ఆ పశ్యన్తీవాక్కు, అధిదైవతమగు నీశ్వర రూపిణియై యొప్పారును.

అభివ్యక్తమైన యా శబ్దబ్రహ్మయే వాయుప్రేరితమై హృదయపర్యన్తము చేరినపుడు 'మధ్యమా వాక్' అను నామముతో వ్యవహరింపబడును. అపుడు నిశ్చయాత్మికమైన బుద్ధితో గూడి యుండును. విశేషస్పన్దరూపమైన నాదబిందు రూపముతో హిరణ్యగర్భరూపమును అధిదైవముగా గలిగి, మధ్యమా వాక్కు అని ప్రసిద్ధి నొందును. ఆ మధ్యమా వాక్కు వాయుప్రేరితయై ముఖపర్యంతము జేరి కంఠ,తాల్వాది స్థానములయందు అభివ్యక్తయై 'వైఖరీ' వాగ్రూపమును ధరించును. ఈవిధముగా పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ భేదముతో సరస్వతీ రూపిణి యైన కుండలినీశక్తి అకారాది క్షకారాన్త మాతృకా (వర్ణ) స్వరూపముతో విరాజిల్లు చుండును. ఇది యంతయు యోగిహృదయైకవేద్యము.

మూలాధారాది సహస్రారపర్యంతము గల చక్రములు, తద్గత దళములు, తద్గత వర్ణముల (మాతృకల రంగుల) విశేష విజ్ఞానమునకై షట్చక్రస్వరూప నిరూపణ, మాతృకాచక్ర వివేకాది తంత్రశాస్త్రగ్రంథములయందు దర్శింపనగును.

(మణిపూరచక్రమును) ఆశ్రయించి అనగా, దాని సాయముతో పూష, అలంబుష, యను నాడులు రెండు చెవులువఱకు పోవును. ఆ నాభిమండలమునుండి బయలుదేరిన 'శుక్లా' నామముతో నొప్పారు నాడి భ్రూమధ్యము వఱకు జేరును.

## విశేష వివరణము

గాంధారీ, హస్తిజిహ్వానాడులు కొందఱు మూలాధారము నుండి బయలుదేరు నని చెప్పుదురు. మఱికొందఱు స్వాధిష్ఠానమునుండి ఉద్గతములగుచున్నవని యందురు.

"గాంధారీ సవ్యనేత్రాన్తా ప్రోక్తా వేదాన్తనాదిభిః".

"గాంధారీ చన్ద్రదేవతా".

"ఇడా పృష్ఠేతు గాంధారీ మయూరగలసన్నిభా ॥
సవ్యపాదాది నేత్రాన్తా గాంధారీ పరికీర్తితా ॥"

ఇత్యాది వచనములు గాంధారీ స్వరూపమును వివరించుచున్నవి. సవ్యనేత్రాంతము గల నాడి గాంధారి యనియు, చంద్రుడు గాంధారీనాడికి అధిష్ఠానదైవ మనియు, ఇడానాడి యొక్క పృష్ఠభాగమునందు నెమలియొక్క వర్ణము వంటి వర్ణము కలిగి సవ్యపాదము మొదలుకొని సవ్యనేత్రము యొక్క చివరిభాగము వఱకు వ్యాపించి యుండుననియు పూర్వోదాహృత వచనముల వలన తెలియుచున్నది.

హస్తిజిహ్వోత్పలప్రఖ్యా సవ్యభాగస్య మూర్ధాది
పాదాంగుష్ఠ మాశ్రితా ॥"

హస్తిజిహ్వా యను నాడి యుత్పలము (కలువ) యొక్క రంగు కలిగియుండును. సవ్య (కుడి) భాగమునందు శిరస్సు మొదలుకొని, పాదములయొక్క బొటనవ్రేలు చివరి వరకు వ్యాపించియుండు నని పైన నుదహరించిన వచనము వలన విదిత మగుచున్నది. వరుణదేవుడు హస్తిజిహ్వానాడికి అధిష్ఠాన దైవతమని యోగదర్శనము చెప్పుచున్నది.

"పూషా యామ్యాక్షిపర్యన్తం పింగళాయాస్తు పృష్ఠతః"
"నీలజీమూతసన్నిభా"
"పూషా దిగ్దేవతా ప్రోక్తా"

ఇత్యాది వచనములు 'పూష' యను నాడి నీలమేఘవర్ణము కలిగియుండు ననియు, పింగళానాడి పృష్ఠభాగమునుండి ఉద్గతమై, దక్షిణనేత్రము వరకు వ్యాపించి యుండుననియు, పూషానాడి దిగ్దేవతాక మనియు పూషానాడీవర్ణనము చేయుచున్నవి.

"అలంబుసా పీతవర్ణా కంఠమధ్యే వ్యవస్థితా"

యను వచనమువలన అలంబుసానాడి పీత (పసుపుపచ్చని) వర్ణము కలిగి కంఠమధ్యభాగమునందుండునని తెలియ వలయును. అలంబుసానాడి వరుణదేవతాకము.

"పూషా. అలంబుసా [illegible] దూర్గతా
శుక్లా [illegible] ప్రవర్తతే శుక్లా [illegible]
భ్రూమధ్య ముపస్థితా"

పూష, అలంబుష యను నాడుల లోపల నాభిమండలము నుండి 'శుక్లానాడి' భ్రూమధ్యమును జేరును. ఆ నాడి పేరు శుక్ల, తన్నాడీవర్ణము శుక్లవర్ణము.

వార్తికము

"సరస్వత్యాహ్వయా నాడీ జిహ్వాన్తా వాక్ప్రసారిణీ ॥
నాడీ విశ్వోదరీ నామ భుంక్తే ఽన్నం చతుర్విధమ్ ॥ ౧౬

పీయూషవర్షిణి

సరస్వతీనామముతో విరాజిల్లునట్టి నాడి జిహ్వాగ్రము వఱకు పోయి, వాక్కును ప్రసరింపజేయును. 'విశ్వోదరి' యను పేరుగల నాడి, చతుర్విధమైన, అనగా భక్ష్య, భోజ్య, లేహ్య, చోష్యరూపమైన యన్నమును గ్రహించును. జాఠరాగ్నిచే పచ్యమానమైన అన్నరసమును గ్రహించునని భావము. ("జాఠరాగ్నినా పచ్యమానరసం గ్రసతి").

**విశేష వివరణము**

"సరస్వత్యాః విరాట్"

"సుషుమ్నా పూర్వభాగస్థా జిహ్వాన్తస్థా సరస్వతీ"

యను సూతసంహితావచనానుసారము విరాట్పురుషుడు సరస్వతీనాడికి అధిష్ఠానమనియు, సుషుమ్నానాడి యొక్క పూర్వభాగమునుండి బయలుదేరి జిహ్వాగ్రమువఱకు ఈ సరస్వతీనాడి వ్యాపించి యుండుననియు తెలియుచున్నది.

"విశ్వోదరాభిధా నాడీ తుండమధ్యే వ్యవస్థితా।"
"హస్తిజిహ్వామధ్యే విశ్వోదరీ స్థితా"
"విశ్వోదరాభిధాయాస్తు భగవాన్ పావకః పతిః॥"

అను సూతసంహితావచనములు 'విశ్వోదరా' నాడి 'హస్తిజిహ్వా' యను నాడీమధ్యభాగము ద్వారా పయనించు ననియు, ఈ విశ్వోదరానాడికి అగ్ని, అధిదైవత మనియు తెలియజేయుచున్నవి.

## వార్తికము

**పీత్వా పయస్విని తోయం కంఠస్థా కురుతే క్షుతమ్ ॥**

## పీయూషవర్షిణి

పయస్వినీనాడి కంఠమునందు ఉండి, జలపానము చేసి, తుమ్ముటను చేయుచున్నది.

## విశేష వివరణము

"పయస్విన్యాః ప్రజాపతిః।"
"పూషాయాశ్చ సరస్వత్యా మధ్యే ప్రోక్తా పయస్వినీ॥"

యను వచనములు 'పయస్వినీ' నాడికి అధిష్ఠానదేవత ప్రజాపతి యనియు, పూషా, సరస్వతీనాడుల మధ్యగా పయస్వినీనాడి యున్నదనియు చెప్పుచున్నవి.

"విశ్వోదరీ జఠరస్థా నాడీతి, పయస్వినీ కంఠస్థా నాడీతి జ్ఞేయా" యనుచు రామనాథుడు, 'విశ్వోదరి' జఠరాగ్నియందు ఉండుననియు, 'పయస్వినీ' నాడి కంఠమునందు ఉండుననియు చెప్పుచున్నారు.

వార్తికము

**నాడీచక్రా త్సముద్భూతా నాడ్య స్తిస్ర స్త్వధోముఖాః।**
**రాకా శుక్రం సినీవాలీ మూత్రం ముంచే త్కుహూర్మలమ్॥**
**భుక్తాన్నరస మాదాయ శంఖినీ ధమనీ పునః॥**
**కపాలకుహరం గత్వా మూర్ధ్ని సంచినుతే సుధామ్ ॥ ౨౧**

పీయూష వర్షిణి

నాడీచక్రమునుండి (మూలాధారచక్రమునుండి) అధోముఖములయిన మూడు నాడులు బయలుదేరును. 'రాకా, సినీవాలీ, కుహూః' అనునవి యీ మూడు నాడులు. 'రాకా' యను నాడి శుక్రమును (వీర్యమును), సినీవాలీనాడి మూత్రమును, 'కుహూః' అను నాడి మలమును విసర్జించును. మఱియు 'శంఖినీ' నాడి, తినిన యన్నసారమును గ్రహించి కపాలఛిద్రమును (బ్రహ్మరంధ్రమును) జేరి, సహస్రార పద్మమునందు నిరంతరము అమృతోపచయమును (సుధాభివృద్ధిని) చేయుచుండును. కపాలకుహరము లంబికాయోగ లభ్యమని యోగసాధకుల యనుభవము.

**విశేష వివరణము**

"గాన్ధారీ నాడ్యోః సరస్వత్యామధ్యే ప్రోక్తా చ శంఖినీ"
"శంఖిన్యా శ్చన్ద్రిమాః"

యను సూతసంహితావచనముల వలన శంఖినీనాడి, గాంధారీ సరస్వతీనాడులకు మధ్య నుండు నాడి శంఖినీశబ్దవాచ్య

యనియు, ఈ నాడికి అధిష్ఠాన దేవత చంద్రుడనియు తెలియుచున్నది.

వా ర్తి క ము

శతంచైకా చ నాడ్య స్సన్తి తాసా మేకా శిరోగతా ।
తయోర్ధ్వ మాయన్ ముక్త స్స్యాదితి వేదానుశాసనమ్॥

పీ యూ ష వ ర్షి ణి

ఇంకను, అధికముగ చెప్పనేల! ప్రాణేంద్రియ, మన స్సంచారస్థానములైన యితర నాడులు శతసంఖ్యాకముగ నున్నవనుచు, నాడీవిభాగము నుపసంహారము చేయుచున్నారు.

నూటొక్క నాడులు ఉన్నవి. వానిలో నొకటి శిరోగతయై యున్నది. ఆ యొక నాడి, సుషుమ్నానాడి. ఆ సుషుమ్నానాడి బ్రహ్మరంధ్ర పర్యంతము వ్యాపించి యుండును.

ఆ సుషుమ్నామార్గము ద్వారా బ్రహ్మలోకప్రాప్తిని పొందినవాడు సంసారబంధమునుండి ముక్తుడగు నని వేదానుశాసనము. ఈ విషయము కాఠకోపనిషత్తునందు ఉపదేశింపబడినదనుచు (శ్రీ) సురేశ్వరులు ఆ శ్రుతి తాత్పర్యమును వార్తికమునందు నిబంధించినారు. ఆ శ్రుతివచనమును పరికింతము.

"శతంచైకా చ హృదయస్య నాడ్య స్తాసాం మూర్ధాన మభినిస్సృతైకా తయోర్ధ్వ మాయన్నమృతత్వ మేతి విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవన్తి॥" (కఠ. ౧౬)

అనగా, శతసంఖ్యాకములైన నాడులు, మఱియు సుషుమ్నా నాడి యొకటి పురుషుని హృదయమునుండి వినిఃసృతములై వ్యాపించి యుండును. అవసాన కాలమునందు ఆత్మ ను వశము చేసికొని, వాని మధ్యనుండి సుషుమ్నా నాడి శీర్ష కపాలమును భేదించి బహిర్గత మగును. ఆ నాడీమార్గమున అర్చిరాది మార్గము ద్వారా ఊర్ధ్వ (బ్రహ్మ) లోకమున కేగిన పురుషుడు ఆపేక్షికమైన యమృతత్వమును పొందును. "ఆభూతసంప్లవం స్థాన మమృత్వం హి భాష్యతే" యను స్మృతివచనానుసారము ప్రళయాంతము వఱకు నుండు బ్రహ్మలోకావాసము అమృతత్వ మనబడును. మహా ప్రళయానంతరము బ్రహ్మ (హిరణ్యగర్భ బ్రహ్మ) తో గూడి బ్రహ్మలోకమునకు సంబంధించిన యసాధారణ భోగముల ననుభవించి, నిరతిశయమైన అమృతత్వమును పొందును. పునరావృత్తిరహితమైన స్వస్వరూపావగతి నొందునని భావము. నానావిధములైన యితర నాడులు ప్రాణోత్క్రమణము నకు ద్వారభూతము లగును. అనగా తిరిగి జన్మ మరణరూప సంసారబంధమునకు హేతువు లగునని భావము. కావున సాధకుడైన యోగి సుషుమ్నా నాడీమార్గమున ప్రాణమును పైకి గొనిపోయి, బ్రహ్మరంధ్రమును భేదించి, యర్చిరాది మార్గము ద్వారా బ్రహ్మలోక ప్రాప్తిరూపమైన అమృతత్వమును సాధించుటకు ప్రయత్నింప నగును.

## వార్తికము

యదా బుద్ధిగతైః పుణ్యైః ప్రేరితేంద్రియమార్గతః ।
శబ్దాదీన్ విషయాన్ భుంక్తే తదా జాగరితం భవేత్॥ ౨౩

## సియాషపష్టిః

బుద్ధిగతములైన (అంతఃకరణమునందున్న) పుణ్యముల చేత ఇంద్రియాదులు ప్రేరేపింపబడును. తత్తదింద్రియ మార్గములైన యింద్రియగోళకముల వలన ప్రసరించునట్టి నాడీమార్గముల ద్వారా జీవుడు శబ్దాది విషయములను అనుభవించును. అప్పుడు జాగ్రదవస్థ కలుగును.

## విశేష వివరణము

నాడీభేదమును, తత్స్వభావ, కార్యాదుల ప్రయోజనమును, చిదాత్మ నొక్క జాగ్రత్స్వప్న, సుషుప్తిరూపమైన అవస్థాత్రయము నొక్క యోగోపపత్తిని వివరించినారు.

ఈ జీవుడు ఏ యే కర్మలను చేయునో, అప్పుడు బుద్ధిగతమైన (అంతఃకరణమునందున్న) స్వచిదాభాసుని ద్వారా వానిని అభివ్యక్తము చేయునేగాని, స్వయముగా చేయడు. కాగా, సర్వకర్మకర్తృత్వమైన అభిమానము బుద్ధిగతమే యగుచు 'బుద్ధిగతైః పుణ్యైః' యని చెప్పబడినది. పుణ్యములే బుద్ధిగతములని యేల చెప్పవలయును? పాపములు గూడ బుద్ధిగతములే కదా? యనినను, అది నిజమే. 'పుణ్య' శబ్దము ప్రశస్తార్థ సూచకమేగాని, ... కాదని తెలియ

నగును. ('పుణ్యగ్రహణం శైశ్రేష్ఠ్యాభిప్రాయం, నతు పాప వ్యావృత్త్యర్థమ్. అకళ్యాణ దర్శనాదేరపిదర్శనాత్"). కావున, 'తస్మాత్తేనోభయం పశ్యతి' (ఛాందోగ్య. ౧-౨-౮) అను శ్రుతి పూర్వజన్మకృతములైన పాపపుణ్యములను రెంటిని చూచునని చెప్పుచున్నది. కావున, యథాదేశకాలనిమిత్తము వలన నుద్భవించునట్టి పుణ్యపాపప్రేరితము లయిన ఆయా యింద్రియగోళక స్థానములను జేరిన పూర్వోక్త నాడుల ద్వారా దేహాకాశము నుండి బాహ్య ప్రదేశమునకు ప్రసరించిన యింద్రియముల వలన జాగరితావస్థ యేర్పడును. ఈ చిదాత్మకు, శరీరబాహ్యదేశము నందు ప్రత్యక్షాది ప్రమాణములచేత ఆధ్యాత్మికములైన శబ్దాది విషయానుభవము కలిగినపుడు జాగ్రదవస్థ కలుగును. "ఇంద్రియై రర్థోపలబ్ధి ర్జాగరితమ్" అని జాగ్రద్దశాలక్షణము చెప్పబడినది.

వా ర్తి క ము

సంహృతేష్విన్ద్రియేష్వేషు జాగ్రత్సంస్కారజాన్ పుమాన్।
మానసా న్విషయాన్ భుంక్తే స్వప్నావస్థా తదా భవేత్॥ ౨౪

పీ యూ ష వ ర్షి ణి

ఈ యింద్రియములు దేహగతములై నాడీచ్ఛిద్రముల యందు నుపసంహృతములు కాగా, అనగా ప్రాణసహితమైన నాడీజాల సూత్రాంతఃకరణముచేత ఆయా యింద్రియ గోళకస్థానములనుండి యింద్రియములు ఉపసంహృతములు

కాగా, జీవుడు జాగ్రత్కాలమునందలి వాసనలచే వాసితములు, మనః పరిణామ రూపములు నయిన విషయములను అనుభవించును. అపుడు, స్వప్నావస్థ కలుగును. "కరణేషూపసంహృతేషు జాగరితసంస్కారజస్య విషయః స్వప్నః" అని స్వప్నావస్థాలక్షణము చెప్పబడినది.

### వార్తికము

మనసోఽప్యుపసంహారః సుషుప్తిరితి కథ్యతే ।
తస్మాన్మాయానమాచ్ఛన్న స్సన్మాత్రో వర్తతే పుమాన్॥

### పీయూషవర్షిణి

మనస్సు నయితము లయము చెందుట సుషుప్తి యనబడును. ఆకారణము చేత సత్తామాత్రుడైన ఆత్మ (జీవుడు) మాయచేత నాచ్ఛాదితుడై యుండును.

### విశేష వివరణము

వాసనామాత్రముగా మనస్సు కారణరూపముతో నుండుటయే సుషుప్తి. "సర్వప్రకార జ్ఞానోపసంహారే బుద్ధేః కారణాత్మనావస్థానం సుషుప్తిః"- అనగా, సర్వవిధ జ్ఞానము ఉపసంహృతమగుట, బుద్ధి, కారణాత్మరూపముతో నుండుట 'సుషుప్తి' యనబడును అని భావము.

ఈవిధముగా చిదాత్మగతములైన జాగ్రదాది దశలు ఉపాధిగతములైన విశేష దశలు. ఏలన, మాయాసంబంధము లేక, ఉపాధులకు చిదాత్మతోటి సంబంధము అసంభవము.

కావున, ఈజీవాత్మ మాయాసమాచ్ఛాదితుడై సమావృత బ్రహ్మభావము కలవాడై సద్రూపుడుగ వ్యవహారయోగ్య మాత్రుడుగ నుండును. అథవా, నిర్వికల్పసత్తామాత్రు డయినను, ఈ జీవాత్మ, మాయావృతుడై యుండునని భావింపనగును.

వార్తికము

మూఢో మత్తోఽజ్ఞ ఇత్యేవం మాయావేశాత్ ప్రకాశతే।
సుఖ మస్వాప్స మిత్యేవం ప్రబోధసమయే పుమాన్॥౨౭

సచ్చిదానందరూపం చ సమ్యగేవ ప్రకాశతే।
ఇత్థం జగత్సమావిశ్య భాసమానే మహేశ్వరే॥ ౨౮

సూర్యాదయోఽపి భాసన్తే కిముతాన్యే ఘటాదయః।
తస్మాత్సత్తా చ భావానా మీశ్వరాశ్రయణాశ్రయా॥౨౯

పీయూషవర్షిణి

ఆత్మ, స్వభావముచేత చిదానందరూపుడు, సందేహ, విపర్యాస, అజ్ఞానములకు విషయుడు కాడు గదా! అయిన, ఆయనకు మూఢత్వాది రూపమైన అన్యథాభావము ఏల కలుగుచున్నది? యను శంకను నివారించుటకై యీ వార్తికశ్లోకములు ప్రవృత్తములైనవి.

ఆత్మ, మాయాసంబంధము చేత 'నేను మూర్ఖుడను, ఉన్మత్తుడను, అజ్ఞానిని' అని ప్రతీయమాను డగుచున్నాడు. ఆ యాత్మ, నిద్రనుండి మేల్కాంచిన కాలములో 'నేను సుఖముగ నిద్రించితిని, (సుఖ మహ మస్వాప్సమ్) యని

సచ్చిదానందరూపమును గూడ వ్యక్తము చేయుచున్నాడు. ఈరీతిగ, మహేశ్వరుడు జగత్తునందు ప్రవేశించి, భాసించి నపుడు సూర్యాదులు గూడ ప్రకాశించుచున్నారనిన, ఘట పటాదుల విషయము చెప్పనేల? కావున, పదార్థసత్త యీశ్వరునియందు అధ్యస్త మగుట ద్వారా ఆధారపడి యున్నదని తెలియవలయును.

## విశేష వివరణము

'సుఖ మహా సుస్వాప్సం' అను స్థలమున, సుఖ స్వరూపము అనాగంతుకమైన (సహజసిద్ధమైన) స్వప్రకాశ సదానందరూప మని తెలియవలయును. 'అస్వాప్స' మనగా నుపాధులు ఉపశమించుటయే. సుషుప్తియందు సాధనాభావము (ఇంద్రియములు ఉపరమము చెందుట) వలన ఆగంతుకమైన సుఖము ఉండదు. ఉపాధ్యుపశమనము వలన కలుగు సుఖ సాధనమైన వ్యాపారోపశమనమే యుండదు. ఒకటి నివర్తింపగా మఱియొకటి యుత్పన్న మగుట యనుభవగోచరమైన విషయము కాదు. అభావమునుండి భావోత్పత్తి అంగీకార్యము కాదు. సుఖశబ్దము చేత దుఃఖాభావము చెప్పబడుచున్నదని యనుటయు సంగతము కాదు. సుషుప్తియందు తత్సుఖమునకు సాధన మేదియు లేదు. అననుభూతమైన విషయమును పరామర్శించుట యుక్తిసహము కాదు. కావున, సౌషుప్త సుఖము దుఃఖాభావము కాదని స్పష్టముగ తెలియుచున్నది.

సుషుప్తిదశ యందలి దుఃఖాభావము స్మృతివిషయము కాదనియు, అనుమానగమ్యమనియు చెప్పుటకు వలను పడదు. స్మర్యమాణములు కానివి వ్యభిచారదోష దూషితములు; సుషుప్తిదశలో సామగ్రి యొక్క అభావాదుల వలన నేనియు సిద్ధింపనేరదు. కావున, 'సుఖ మహ మస్వాప్సమ్' అనునది స్మరణచే గాని, సుషుప్తియందు సాధనసామగ్రి లేనందున అనుమానము కాదు. అందువలన, సుషుప్తియందు యథాఽవస్థితమైన సుఖస్వరూపము సిద్ధించునని తాత్పర్యము ('తస్మాత్ యథాఽవస్థితమేవ స్వరూపం సుఖమ్').

నిష్క్రియుడు, నిరంశుడు (నిరవయవుడు) నయిన చిదాత్మకు శయన, గమనాదులు గాని, స్వాప, ప్రబోధములు గాని, స్వయంసిద్ధములు కావు. కావున, నిది యంతయు నుపాధికృతచే గాన, ఉపాధ్యుపరమమే యతనికి స్వాపము. అది 'అస్వాప్సమ్' అను శబ్దముచే పరామృష్టమైనదని గ్రహింప నగును ('అతః, ఉపాధికృత చేష్టైత త్సర్వ మిత్యుపాధ్యుపశమ ఏవ అస్య స్వాపః అస్వాప్స మిత్యుల్లిఖ్యతే'). కావున, అవస్థాత్రయమునందును ఆత్మ, సచ్చిదానందరూపుడే యని భావము.

ఇంతవఱకు వివరింపబడిన సారాంశము నిట్లు భావింప నగును. కార్యకారణాత్మకమైన సమస్త విశ్వము, అజ్ఞాన, తత్కార్య మయిన స్థూల, సూక్ష్మ శరీరద్వయము, జాగ్రత్ స్వప్న, సుషుప్తిరూపమైన యవస్థాత్రయము- ఇవన్నియు,

వ్యష్టిభావాపన్నమైన పరమేశ్వరుని వలన ప్రకాశించును. ఇట్టి కార్యకారణాత్మకమైన విశ్వమును మాయాశక్తిచేత ప్రవేశించి పరమేశ్వరుడు విశ్వ, తైజస, ప్రాజ్ఞ రూపములతో ఆధ్యాత్మికముగను, వైశ్వానర, హిరణ్యగర్భ, అవ్యాకృత రూపములతో ఆధిదైవికముగను భాసించును. ఆవిధముగ, పరమేశ్వరుడు భాసింపగా, సర్వవిషయ ప్రకాశకత్వముతో స్వప్రకాశ స్వభావము గల సూర్యాదులు సయితము భాసించుచున్నవే గాని, స్వీయ మహిమచే ప్రకాశింపవు. అట్టి పరిస్థితిలో అప్రకాశ స్వభావము గల ఘట, పటాది విషయములకు సహజ ప్రకాశత్వము ఏల చెప్పరాదు? అని శంక చేయుట యుక్తిసంగతము కాదు.

కావున, సత్తాస్ఫురణములు ఈశ్వరసంబంధులే. తత్సంపర్కము వలననే, బాహ్యవిషయములకు సత్తా ప్రకాశములు సిద్ధించుచున్నవే గాని, వానికి స్వతః సత్తా స్ఫురణములు లేవని స్పష్టమగుచున్నది. విషయముల సత్తా స్ఫురత్తలు ఈశ్వరాశ్రయములు. ("ఈశ్వర మాశ్రయస్త ఇతి ఈశ్వరాశ్రయణాః, ఈశ్వరవ్యక్తిః ఆశ్రయో యస్యాః సా ఈశ్వరాశ్రయాశ్రయా, ఈశ్వరాధ్యస్త విషయాశ్రయా, న స్వరూప సద్విషయగేత్యర్థః"). అనగా, విషయ సత్తా ప్రకాశములు ఈశ్వరునియందు అధ్యస్తమై యున్న విషయముల నాశ్రయించి యున్నవే గాని, స్వయం సత్తా ప్రకాశములు గలవి కావని భావము.

## వార్తికము

సత్యం జ్ఞాన మనన్తం చ శ్రుత్వా బ్రహ్మోపదిశ్యతే ।
జాగ్రత్స్వప్నోద్భవం సర్వ మసత్యం జడ మన్ధవత్ ॥ ౨౯

## పీయూషవర్షిణి

శ్రుతిమాత, బ్రహ్మ సద్రూపము, చిద్రూపము (జ్ఞానస్వరూపము), అనంత (వ్యాపక) రూప మనియు నుపదేశించుచున్నది. మఱియు జాగ్రత్, స్వప్నముల వలన జనించునదంతయు అంధకారమువలె మిథ్యాభూతము, జడము అనియు నుపదేశించుచున్నది.

## విశేష వివరణము

పరమేశ్వరుని సత్తాస్ఫురణములు స్వయంసిద్ధము లని శ్రుతిప్రమాణమును ప్రదర్శించుచున్నారు. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" యనుచు తైత్తిరీయశ్రుతి, బ్రహ్మలక్షణమును చెప్పుచున్నది. ఈ లక్షణము వలన, బ్రహ్మ, సజాతీయ, విజాతీయ వ్యావర్తకమైన సత్స్వరూపమాత్ర మని తేలుచున్నది. అతీంద్రియార్థవిషయమున, శ్రుతియే ప్రమాణము; శ్రుత్యనుప్రాణితములయిన స్మృతీతిహాస పురాణాదులును ప్రమాణమే. కాని, తద్విరుద్ధములైన బుద్ధికల్పిత పౌరుషేయ వాక్యములు ప్రమాణములు కాజాలవు. ప్రస్తుత ప్రసంగములో నైయాయికులు "అసాధారణో ధర్మో లక్షణమ్" అని చెప్పి, స్వరూపలక్షణము యొక్క సూక్ష్మ నిర్దేశము చేయుదురు. అసాధారణ మనగా, సజాతీయ, విజాతీయ వ్యావర్తకము.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే" యను శ్రుతి, బ్రహ్మ యొక్క యుపలక్షణము చెప్పుచున్నది. ఈ స్థితిలో ప్రతివాదులు స్వకపోల కల్పితము లయిన ప్రధాన, పరమాణ్వాదులు లభించుట వలన జగత్కారణమైన బ్రహ్మను నిషేధింతురు. అథవా, జగత్కారణముగా ప్రధాన, పరమాణ్వాదులు బ్రహ్మసజాతీయములని, కార్యముగా, భూత భౌతిక ప్రపంచము విజాతీయము మని యందురు. ఉభయ విధములైన అనృత, జడ, పరిచ్ఛిన్న స్వభావముల నుండి వ్యావృత్తి మొనర్చు 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' యను శ్రుతి, బ్రహ్మస్వరూపమును బోధించును. ఏవంస్థితే, సత్తా స్ఫురణ రూపములైన సత్యజ్ఞానములు బ్రహ్మకు సంబంధించిన యసాధారణ ధర్మములే గాని, మఱి యెవరివి కావని విస్పష్ట మగుచున్నది.

సర్వవిషయానుభవము జాగ్రత్, స్వప్నోద్భవ మని తెలియవలయును.

"పురుష ఏతావుభావస్థే వనుసంచరతి స్వప్నాన్తం చ బుద్ధాన్తంచ" (బృ. ఉ. ౪-౩-౧౮)

యనుచు ఈ శ్రుతివాక్యము జాగ్రత్, స్వప్నదశలే విషయానుభవస్థానము లని చెప్పుచున్నది.

"నాన్య దతోఽస్తి ద్రష్టృ, నాన్య దతోఽస్తి శ్రోతృ" అనుచు బృహదారణ్యక శ్రుతి బ్రహ్మకంటె భిన్నమైన

ద్రష్టగాని, శ్రోతగాని, లేడని చెప్పుచున్నది. కావున, ఈశ్వరుడు కానిదంతయు అనృతము, జడము, అంధకార మని గ్రహింపనగును.

ఇచట, యనుమానరచన యిట్లుండును.

"వివుతం అసత్యం జడత్వాత్, మృగతృష్ణికోదకవత్ ।"
"వివుతం జడం, పరాధీనచేష్టత్వాత్, అంధవత్,"
"అంధపంగువదిత్యర్థః ।"

వా ర్తి క ము

ఈశ్వరశ్చాహ మిత్యేవం భాసతే సర్వజన్తుషు ।
నిర్వికల్పశ్చ శుద్ధశ్చ మలినశ్చేత్యహం త్రిధా॥ 30

పీ యూ ష వ ర్షి ణి

సర్వప్రాణిజాతమునందు 'అహం' నేను అని యీశ్వరుడు భాసించుచున్నాడు. 'అహం' 'నేను' నిర్వికల్పుడు, శుద్ధుడు, మలినుడు అని మూడు విధములుగ నుండును.

విశేష వివరణము

సమస్త ప్రపంచమునకు అధిష్ఠానరూపుడు, సర్వుల యందు ననుస్యూతముగ నున్న సత్తాస్ఫురణములకు ఏకమాత్ర ఆశ్రయుడు పరమేశ్వరుడని యుపపాదనము చేయబడినది. ఇపుడు ఆ యీశ్వరుడు ప్రత్యగాత్మాభిన్నుడని ప్రతిపాదింపబడినది. ఈయర్థము నుపపాదించుటకై అహంకార భేదమును నిర్వికల్ప, శుద్ధ, మలిన రూపముతో త్రివిధముగ నుండునని ప్రతిపాదించిరి.

వార్తికము

నిర్వికల్పం పరం బ్రహ్మ నిర్ధూతాఖిల కల్పనమ్ ।
ధూల్యన్ధకార ధూమాభ్రనిర్ముక్త గగనోపమమ్ ॥ ౩౧

పీయూషవర్షిణి

నిర్వికల్పమైన 'అహం'యొక్క అవభాసనము ఈశ్వరుడే యని ప్రతిపాదింపబడుచున్నది.

ధూళి, అంధకార, ధూమము, మేఘరహితమైన యాకాశము వలె పరబ్రహ్మ సమస్త కల్పనావినిర్ముక్తుడు (సమస్తభేదరహితుడు). 'అహం' అని భాసించునట్టి జీవాత్మ బ్రహ్మమే యని భావము(నిరస్త సమస్త విశేషతయా అహమిత్యవభాసమానః ఆత్మా బ్రహ్మైవేత్యర్థః).

వార్తికము

వివేకసమయే శుద్ధం దేహాదీనాం వ్యపోహనాత్ ।
యథాఽన్తరిక్షం సంక్షిప్తనక్షత్రైః కించి దీక్ష్యతే ॥ ౩౨

పీయూషవర్షిణి

ఆత్మ యున్నను భాసింపదు గదా యని యాశంక జేసి, సహజముగా సర్వులకు భాసింపకపోయినను, తత్త్వం పదార్థ శోధనము చేసిన వివేకి జ్ఞానోదయమున ఆత్మ భాసింపవచ్చునని యీ వార్తికమున సోదాహరణముగా వివరింపబడుచున్నది.

ఎడనెడ యున్న నక్షత్రముల వలన ఆకాశము కొలదిగ గన్పట్టును. అటులనే, వివేకసమయమునందు, అనాత్మ దేహాది పరిచ్ఛేదము లేకపోవుట వలన, బ్రహ్మాభిన్నమైన ఆత్మ తత్త్వమే భాసించును.('వివేకసమయే దేహదీనామనాత్మత్వేన అహ మవభాస్యత్వ వ్యపోహనాత్ పరిచ్ఛేదకాభావాత్ శుద్ధమేవాత్మతత్త్వం బ్రహ్మ భాసత ఇత్యర్థః,).

వా ర్తి క ము

**దేహేంద్రియసంసర్గాత్ మలినం కలుషీకృతమ్ ।**
**యథాఽఽకాశం తమోరూఢం స్ఫురతి అనవకాశవత్ ॥33**

పీ యూ ష వ ర్షి ణి

సర్వప్రాణి సాధారణమైన మూడవ యహంతను వివరించుచున్నారు.

అంధకారావృతమైన యాకాశము అవకాశరహితముగా ప్రతీయమాన మగును. ఆరీతిగనే, దేహేంద్రియాది సంబంధము వలన, ఆత్మ కలుషీకృతముగా, మలినముగా భాసించును.

దేహేంద్రియాది సంసర్గము సంసర్గాధ్యాసయే. పరిచ్ఛేదకమైన యుపాధి ఆత్మావరకముగ నుండును. దేహాదులచే పరిచ్ఛిన్నమైన ఆత్మ యందు రాగద్వేషాదు లుండును. ఆ కారణము చేత ఈ యహంత మలిన మని చెప్పబడినది.

వా ర్తి క ము

అహ మిత్యైశ్వరం భావం యదా జీవః ప్రబుధ్యతే ।
సర్వజ్ఞ స్సర్వకర్తా చ తదా జీవో భవిష్యతి ॥ ౩౪

పీ యూ ష వ ర్షి ణీ

జీవుడు 'నేను ఈశ్వరుడను' అను భావమును అనుభవించినపుడు, అతడు సర్వజ్ఞుడు, సర్వకర్త యగును. ఇది, త్రివిధమైన అహంకారనిర్దేశమునకు ఫలము.

విశేష వివరణము

'ఈశ్వరోఽహమ్' అనెడి యనుభూతి మహాదుర్లభ మని 'యదా' పదముచే సూచింపబడినది. ఇచట జీవునకు సర్వజ్ఞత్వాదిప్రాప్తి విధింపబడుట లేదు. కాని, సర్వజ్ఞత్వ, సర్వకర్తృత్వాదులచే నుపలక్షిత మగునట్టి యీశ్వరస్వరూపముతో జీవుడు అభివ్యక్తుడగునని భావము ('అత్ర జీవస్య సర్వజ్ఞత్వాదిభవనం న విధీయతే, కిన్తు సర్వజ్ఞత్వాద్యుపలక్షితేశ్వరస్వరూపేణ అభివ్యక్తో భవిష్యతీత్యర్థః').

వా ర్తి క ము

మాయయాఽధికసమ్మోహో విద్యయేశః ప్రకాశతే ।
నిర్వికల్పానుసన్ధానే సమ్యగాత్మా ప్రకాశతే ॥ ౩౫

పీ యూ ష వ ర్షి ణీ

జీవుడు అల్పజ్ఞుడు; ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఇట్టి యీయిరువురికి నభేదము ఎట్లు చెప్పనగు ? నని శంకింప నవసరము

లేదు. ఈ భేదము మాయాకృత మని, వస్తుసిద్ధము కాదని చెప్పబడుచున్నది.

ఈశ్వరుడు మాయాశక్తిద్వారా అధిక సమ్మోహితుడై, తిరిగి విద్యాశక్తిద్వారా స్వస్వరూపముతో ప్రతీయమానుడగును. ఆత్మ, నిర్వికల్పానుసంధానమునందు చక్కగా ప్రకాశించును. కావున, మాయానివృత్తికొఱకు నిర్వికల్పమైన ఆత్మానుసంధానమునందు పూనికతో ప్రయత్నింపనగును. ('తస్మాన్మాయానివృత్తయే నిర్వికల్పాత్మావభాసనే యత్నః కార్యః').

వార్తికము

**అవిద్యాఽఽఖ్య తిరోధానవ్యపాయే పరమేశ్వరః ।**
**దక్షిణామూర్తి రూపోఽసౌ స్వయమేవ ప్రకాశతే ॥ 36**

పీయూషవర్షిణి

నిర్వికల్పానుసంధాన ఫలస్వరూపముగా శ్రీదక్షిణామూర్తిస్వరూపలాభము సిద్ధించునని చెప్పబడుచున్నది.

అజ్ఞానావరణము భగ్నమైనపుడు, ఈ పరమేశ్వరుడు శ్రీదక్షిణామూర్తి స్వరూపముతో స్వయముగ ప్రకాశించును.

పరమేశ్వరుడు అవిద్యావృతుడైనపుడు జీవశబ్ద వ్యపదేశ్యుడగును. అవిద్యానాశమైనంతనే, యా జీవుడు పరమేశ్వర శబ్దవాచ్యుడగును. సర్వవికల్పరహిత స్థితిలో శ్రీదక్షిణామూర్తి నామముతో వ్యవహరింపబడును. కావున,

బ్రహ్మనిష్ఠాప్రాప్తి నభిలషించునట్టి ఆత్మానాత్మవివేకులు ఆచార్యవర్యుడగు శ్రీ దక్షిణామూర్తిని నిరంతరము ఉపాసింప వలయును.

వా ర్తి క ము

ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే
ప్రబన్ధే మానసోల్లాసే చతుర్థోల్లాస సంగ్రహః ॥

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
చతుర్థోల్లాస సంగ్రహము
సంపూర్ణము.



దేహం ప్రాణ మపీన్ద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాన్ధ జడోపమా స్త్వహ మితి భ్రాన్తా భృశం వాదినః।
మాయాశక్తి విలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే ॥౫

పీయూషవర్షిణి

ఈ శాస్త్రార్థమంతయు నిరాధారము (అభిత్తిచిత్రమ్). దేహవ్యతిరిక్తమైన ఆత్మయే లేదు; నేను స్థూలుడను (స్థూలోఽహం), కృశించియున్నాను (కృశోఽహం), నేను నడచుచున్నాను, కూర్చుండుచున్నాను అని యాత్మత్వానుభూతి దేహమునకే కలుగుచున్నందున, దేహమే యాత్మ యని కొందఱు వచింతురు.

మఱికొందఱు దేహాత్మవాదమును నిరసించుచు, జీవుడు శరీరమునుండి యుత్క్రమణము చేసినంతనే, శరీరము మరణించుట చూచుచున్నాము. మాట్లాడుచుంటిని (వచ్మి), చూచుచుంటిని (పశ్యామి), వినుచుంటిని (శృణోమి) అని వచన, దర్శన, శ్రవణాదులు బుద్ధియందు కన్పట్టుచున్నవి. కావున, ఇంద్రియములు ఆత్మయని వాకొనుచున్నారు.

ఇంద్రియాత్మవాదము అనుభవ విరుద్ధము; చక్షురాది యింద్రియములు పని చేయని స్థితి అనుభవములో నున్న విషయము. అట్టి స్థితిలో ప్రాణముండిన, జీవించియుండుట చూచుచున్నాము. తద్భిన్నముగా జీవనము కన్పడుట లేదు. క్షుత్పిపాసలు కలిగియున్నానని యనుభవము కలుగుచున్నది.

ఆకారణముచేత ప్రాణమే యాత్మ, ఇంద్రియములు కావు అని కొంత నిర్మలమైన బుద్ధి గల మఱికొందఱు ప్రాణాత్మ వాదమును ప్రతిష్ఠాపింప బూనుకొందురు.

ఈ ప్రాణాత్మవాదమును తిరస్కరించుచు మఱికొందఱు యుక్తిపురఃసరముగా మనస్సు ఆత్మ యని వాదింతురు. ప్రాణము బాహ్యవాయువు వలె జడము గాన, ఆ ప్రాణమునకు భోక్తృత్వాది ధర్మములు చెప్పుట అసంగతము. కావున, మనస్సే చేతనము, భోక్తృత్వాది ధర్మవిశిష్టమునైన యాత్మ యని చెప్పుదురు.

'నా మనస్సు' (మమ మనః) అని భిన్నముగా ప్రతీయమాన మగుట చేత, మనస్సునకు ఆత్మత్వము అసంభవము. కావున, 'అహం' అని ప్రతీయమానము, బుద్ధిశబ్దమునకు పర్యాయవాచకము నయిన 'క్షణికవిజ్ఞానము' ఆత్మ యని యోగాచారులు జల్పము చేయుదురు.

క్షణిక విజ్ఞానవాదమును కాదనుచు, మేఘమునందలి తటిల్లత (మెఱుపు) వంటి క్షణికవిజ్ఞానమును ఆత్మ యని జల్పము చేయుట యనుపపన్నము; సుషుప్తియందు ఆ క్షణిక విజ్ఞానము (బుద్ధి) ఉండదు; మఱి యేదియు నుండదు. కావున, శూన్యమే ఆత్మ యని శూన్యవాదులు (మాధ్యమికులు) ఎలుగెత్తి చాటుదురు.

వీరందఱు స్వస్వపక్షములను సమర్థించుకొనుటకై యేదియో యొక శ్రుతివచనమును ప్రమాణముగా గ్రహించి

యుదాహరింతురు. మఱికొందఱు, ఈ యాత్మస్వరూపమును అన్యథా చిత్రింతురు. ఈ ప్రతివాదులందఱు దైవోపహత చిత్తులు; భ్రాంతులు; సకల శ్రుతి, స్మృతి, ఇతిహాస, న్యాయ శాస్త్రవిరుద్ధార్థమును గ్రహించినవారు. వీరి మార్గములు ఆత్మ శ్రేయస్సునభిలషించు ముముక్షువులకు స్వప్నమునందు సైతము ఉపాదేయములు, అనుసరణీయములు కావనుచు శ్రీశంకరభగవత్పాదులు 'దేహం ప్రాణ మపీన్ద్రియాణి' యను శ్లోకము నారంభించుచున్నారు.

దేహమును, ప్రాణాపానాది పంచవృత్త్యాత్మకము, ముఖనాసికాసంచారియు నయిన ప్రాణమును, తత్తద్గోలక వృత్తులు, రూపాదిగ్రాహకములు నయిన చక్షురాదీంద్రియములను, నిరంతరము ఉదయించునట్టి క్షణికము, చంచలము నయిన బుద్ధిని, విజ్ఞానమును, శూన్యమును (తుచ్ఛమ్, చకారము చేత తార్కికాదులకు అభిమతమైన యాత్మ గ్రహింపబడును) ఆత్మ యని వాదించువారు (చార్వాకాదులు) స్త్రీ, బాల, అంధ, జడ సదృశులు; ఆత్మానాత్మవివేకరహితులు. కావుననే భ్రాంత చిత్తులై, అనగా తత్త్వమును మఱియొకరీతిగ ప్రతిపాదించునట్టి స్వభావము కలవారై 'అహమితి విదుః' ఆత్మగా తెలిసికొను చున్నారు. అంతియే కాదు; ఇతరులకు సైతము ఆవిధముగనే యుపదేశించుచుందురు.

అయిన, ఈవిధముగా వాదించు ప్రతివాదులు నాస్తికులై తత్త్వమును మఱియొకతీరుగా నేల గ్రహించు

చున్నారు (తెలిసికొనుచున్నారు) ? అని యడుగుదురేని, ఈశ్వరానుగ్రహము లేకపోవుటచేతనే అట్లు గ్రహించుచున్నారని చెప్పవలసి యుండును. శ్రుతి, స్మృతులు ఉపదేశించిన వైదిక కర్మానుష్ఠానము చేత భగవత్సేవ చేయునట్టి యాస్తికులకు (వేదప్రామాణ్యము నంగీకరించువారలకు) పరమేశ్వరానుగ్రహము వలన నిట్టి వ్యామోహము కలుగదనెడి యభిప్రాయముతో 'మాయాశక్తి విలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే' యని శ్రీ భగవత్పాదులు ఈ శ్లోకమునందు పేర్కొనినారు. పరమేశ్వరుని మాయాశక్తి అనాది, అనిర్వచనీయ, పరవ్యామోహ జనయిత్రి. ఆ మాయాశక్తియొక్క విలాసముచేత మహావ్యామోహము కల్పింపబడును. ఆ వ్యామోహము గొప్పది; అనంతమైనది; ఇంత యని పరిమాణము లేనిది. తాదృశమైన మహావ్యామోహము వలననే దేహాదులయందు ఆత్మ యను భ్రాంతి యుదయించుచున్నది, ఆ మహావ్యామోహమును పోనాడు స్వభావము కలవాడు, పరమేశ్వరాభిన్నుడు నయిన వాడు సద్గురుమూర్తి యొక్కడే. అట్టి సద్గురుమూర్తి యగు శ్రీ దక్షిణమూర్తి రూపము దాల్చిన పరమాత్మకు నమస్కారము.

## విశేష వివరణము

"యేషాం స ఏవ భగవాన్ దయయేదనంత
స్సర్వాత్మనాశ్రితపదో యది నిర్వ్యలీకమ్ ।

తే దుస్తరా మతితరన్తి చ దేవమాయాం
నైషాం మమాహమితి ధీ శ్శ్వసృగాలభక్ష్యే ॥"

యని పురాణవచనము (స్కాంద. ౧-౭.౮-౨) చెప్పుచున్నది. అనగా, ఎవరు త్రికరణశుద్ధితో భగవంతుని చరణకమలములను అవ్యాజమైన భక్తితో నాశ్రయింతురో, వారిని దయాసాగరుడైన పరమేశ్వరు డనుగ్రహించును. అట్టి భగవత్పాదారవిందసేవకులు దుస్తరమైన దేవమాయ నతిక్రమించి తరింతురు. పరమేశ్వరానుగ్రహము వలన దేవమాయను తరించినవారికి శ్వాన, సృగాలములకు భక్ష్యమైన యీ దేహమునందు అహం మమాభిమానము లుండవని భావము.



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## పంచమోల్లాసః

### అవతారిక

'నానాచ్ఛిద్రఘటోదరస్థిత' యను శ్లోకవ్యాఖ్యానము ద్వారా బ్రహ్మైకత్వ వాక్యార్థమునందు ప్రత్యక్షాది ప్రమాణాభాస నిబంధనరూప విరోధాశంక పరిహరింపబడినది; మఱియు, ఆత్మ సచ్చిద్రూపమని ప్రతిపాదింపబడినది. ఇపుడు "దేహం ప్రాణమపీంద్రియాణి" యను శ్లోకము ద్వారా ప్రతివాదుల బుద్ధివిలసిత కల్పనానిబంధనరూపమైన విరోధ శంకాపరిహారమునకై తత్తన్మతములు ఉపన్యసింపబడు చున్నవి.

### వార్తికము

ప్రమాణమేకం ప్రత్యక్షం తత్త్వం భూతచతుష్టయమ్ ।
మోక్షశ్చ మరణాన్నాన్యః కామార్థౌ పురుషార్థకౌ ॥ ౧

### పీయూషవర్షిణీ

శ్రీ సురేశ్వరులు తమ వార్తికమునందు చార్వాక మతము నిట్లు ప్రదర్శించుచున్నారు. పరమ నాస్తికుడైన చార్వాకుడు ప్రత్యక్షప్రమాణము నొక్కదానినే ప్రమాణ

మని యంగీకరించును; అనుమానాది ప్రమాణముల నంగీక రింపడు. ప్రత్యక్షాతిరిక్తమైన ప్రమాణముచేత, ఏ బ్రహ్మసత్త గ్రహింపబడునో, అది యంతయు, ప్రత్యక్షప్రమాణము చేత సంవాదము పొందుటలేదు. ప్రత్యక్షానుభవముతో సంవాదము పొందనంతవఱకు అది విశ్వాసార్హము కాదు. అదియును గాక, అనేక స్థలములయందు వ్యభిచారము గూడ కన్పట్టు చున్నది. ప్రత్యక్ష ఇంద్రియానుభూతికి, ప్రమను కలిగించుటలో ఎన్నడు వ్యభిచారము దృష్టము కాదు. కావున, చార్వాకులు ఒక్క ప్రత్యక్ష ప్రమాణమునే యంగీకరింతురు.

పృథివీ, జల, తేజో వాయు చతుష్టయమే, పదార్థతత్త్వ మనియు, అప్రత్యక్షము లగుటవలన, ఆకాశాదులు పదార్థములు కావనియు నందురు. వారికి వాయువు ప్రత్యక్ష తత్త్వమే.

ఈవిధముగా ప్రమాణమును, ప్రమేయమును చెప్పిన తరువాత, పురుషార్థతత్త్వము చెప్పబడుచున్నది. మరణము కంటె నన్యమైన మోక్ష మను పురుషార్థము లేదని చెప్పుదురు. 'మోక్షశ్చ' యను పదమునందలి 'చ' కారము వలన ధర్మము గూడ వారి మతమున పురుషార్థము కాదని తెలియ నగును. ధర్మ, మోక్షములు పోగా, శేషించినవి అర్థ, కామములు. ఆ యర్థకామములు రెండును పురుషునిచే నభిలషణీయములు, సంపాదనీయములు నయిన ప్రధాన పురుషార్థములు. అందున, అర్థము కామసాధనముగనే

అభిలషింపదగినది; కామమన్ననో, సాక్షాత్తుగ సంపాద నీయ మని భావము.

వార్తికము

న కశ్చి దీశ్వరః కర్తా పరలోకకథా వృథా।

పీయూషవర్షిణి

భూతచతుష్టయమే (పృథివ్యప్ తేజో వాయువులే) ప్రమేయ మని యేల ? యనిన, తద్విలక్షణుడు, తత్పరిణామ కర్త యీశ్వరుడే యని యంగీకరించుట వలన, అట్లు చెప్ప నగును. అరీతిగనే, ప్రాణులకు జన్మసిద్ధముగనే సుఖదుఃఖ వైచిత్ర్యము కన్పడుచున్నది. ఆ సుఖదుఃఖములకు హేతు భూతములైన పురాకృత ధర్మాధర్మములు ఉండనేయున్నవి. ఏలన, కారణవైచిత్ర్యము లేక, కార్యవైచిత్ర్యము ఉండుట యసంభవముగదా ? యనెడి యాశంకకు వారు 'న కశ్చిత్ ఈశ్వరః కర్తా' యని సమాధానము చెప్పుదురు. పదార్థము లకు సహజముగనే పరిణామము సిద్ధించుచున్నది. ప్రతి పదార్థమును (వ్యక్తిని) పరిణమింపజేయువాడు మఱియొకడు లభించుట లేదు కదా ! ధనుర్ముక్తమైన బాణమును గమ్య స్థానమునకు గొనిపోవునట్టి వ్యక్తి యెవరును లేరు గదా ! కాని, బాణము లక్ష్యమును జేరుట యనుభవములోనున్న విషయమే. కృషీవలుడు విత్తిన విత్తనములను అంకురింప జేయువాడు ఎవరును ఉపలభ్యమానుడగుట లేదే ? ఆ బీజములు సహజముగనే మొలకెత్తుచున్నవి గదా !

కావున, ఈశ్వరుడనెడి జగత్సృష్టికర్త యెవరును లేడు అని చార్వాకుల వాదము. ఇంతియే కాదు; మరణానంతరము తత్తత్కర్మానుగుణముగా లోకాంతరముల కేగుటయు వృథాజల్పమేగాని, మఱొండు కాదని వారి సిద్ధాంతము.

"స్వర్గః కర్తృక్రియాద్రవ్యనాశేఽపి యది యజ్వనాం।
భవే ద్దావాగ్నిదగ్ధానాం ఫలం స్యా ద్భూరిభూరుహామ్॥

అని చార్వాకులు చెప్పుదురు. యజ్ఞానుష్ఠానకర్త, యజ్ఞానుష్ఠానక్రియ, హోమద్రవ్యములు నశించినను (చితియందు దగ్ధమైనను), సోమయాగము చేసిన యజ్వలకు స్వర్గలోకప్రాప్తి సిద్ధించునేని, కాఱుచిచ్చులో దగ్ధమైన మహావృక్షములకు సైతము స్వర్గము లభించునని చెప్పవలసియుండును. కావున, కర్మకృతమైన స్వర్గాది లోకగమనకథ వ్యర్థప్రసంగమని వారు చెప్పుదురు.

వా ర్తి క ము

దేహం వినాఽస్తి చే దాత్మా కుంభవ ద్దృశ్యతాం పునః॥

పీ యూ ష వ ర్షి ణి

కావున, దేహాతిరిక్తమైన ఆత్మకల్పన గూడ, ప్రత్యక్షవిరుద్ధమని చెప్పబడుచున్నది.

దేహరహితముగా నాత్మ యున్నచో, ఘటమువలె మనకు ప్రత్యక్షగోచరమయ్యెడిది. అట్లు గోచరమగుట లేదు. ఆత్మాస్తిత్వము గోచరము కానియపుడు జన్మాంతరమనునది

యుండుట యసంభవము. జన్మాంతరముండినచో, జన్మాంతర స్మృతి యుండును. అట్టి యనుభవము ఎవరికిని కలుగుట లేదు. కావున, దేహావ్యతిరిక్తుడైన యీశ్వరుడు లేడని, వారు వాదింతురు.

వా ర్తి క ము

హ్రస్వో దీర్ఘో యువా బాల ఇతి దేహోఽభిదృశ్యతే ।
అస్తి జాతః పరిణతో వృద్ధః క్షీణో జరన్మృతః ॥
ఇత్యేవ ముక్తాః షడ్భావవికారాః దేహసంశ్రయాః ।
వర్ణాశ్రమవిభాగశ్చ దేహేష్వేవ ప్రతిష్ఠితః ॥

పీ యూ ష వ ర్షి ణి

దేహము హ్రస్వముగ, దీర్ఘముగ, యువావస్థలో నున్నట్లు, బాల్యదశలో నున్నట్లు కన్పడుచున్నది. అస్తి (ఉండుట), జన్మించుట, పరిణమించుట, వార్ధకము నొందుట, క్షీణించుట, జీర్ణించి మృతినొందుట—ఈవిధముగా షడ్భావ వికారములు దేహాశ్రితములని చెప్పబడినవి. మఱియు, వర్ణాశ్రమ భేదములు దేహప్రతిష్ఠితములై యున్నవి.

విశేష వివరణము

శరీరమునందు గన్పట్టు హ్రస్వత్వ, దీర్ఘత్వాదులను అహంపదవాచ్యమైన ఆత్మయందు ఆరోపించి దేహాత్మలకు అభేదము చెప్పుచున్నారు. ఈ జగత్తునందు సర్వ పదార్థములు షడ్భావ వికారయుక్తములై యుండును. అట్లే, దేహాదులు

ఉత్పన్నములై, పరిణామము నొందుచు, బాల్య యౌవనాది, వికారములకు లోనై, అంతమున జీర్ణములై, శీర్ణములై మృత్యుగ్రస్తము లగుట యనుభవములోని విషయము. ఆత్మానాత్మవివేకము లేని మూఢులు దేహధర్మములను తమయందు ఆరోపించుకొని, తామే షడ్భావవికారములను పొందుచున్నామని వెతలు పొలగుచుందురు. ఈ కోటిలోనికి జేరినవారే చార్వాకులు. కావుననే, చార్వాకులు దేహమే యాత్మ యని వాదింతురు. ఆరీతిగనే, దేహాశ్రితములైన వర్ణాశ్రమధర్మములను ఆత్మధర్మములుగా భావించి నాస్తికులు దేహముకంటె నతిరిక్తమైన యాత్మ లేదని చెప్పుదురు. వారి మతమున, దేహమే ఆత్మ యని భావము.

వా ర్తి క ము

**జాతకర్మాది సంస్కారో దేహస్యైవ విధీయతే ।**
**శతంజీవేతి దేహస్య ప్రయుంజ న్త్యాశిషం శుభామ్ ।**
**ఇతి ప్రపంచం చార్వాకో వాచయ త్యల్పచేతనః ॥ ౫**

పీ యూ ష వ ర్షి ణి

జాతకర్మాది సంస్కారములు దేహమునకే విధింపబడుచున్నవి. 'శతమానం భవతి' యనుచు శుభాశీర్వచనము శరీరసంబంధిగానే చేయబడుచున్నదని అతి స్థూలబుద్ధి గల చార్వాకులు ప్రపంచమును గుఱించి తమ శిష్యులకు నుపదేశింతురు. ఈవిధముగా శ్రీసురేశ్వరులు చార్వాక మతము నుపసంహరించినారు.

వా ర్తి క ము

కేచి చ్ఛ్వసిమి జీవామి క్షుధితోఽస్మి పిపాసితః ।
ఇత్యాది ప్రత్యయబలాత్ ప్రాణ ఆత్మేతి మన్వతే ॥ ౬

పీ యూ ష వ ర్షి ణి

దేహాత్మ వాదమును నిరసించు వారు కొందఱు ప్రాణమే ఆత్మ యని వాదింతురు. పాంచభౌతికమైన దేహామే ఆత్మ యనినచో, మృత దేహమునకు, సజీవ దేహమునకు భేద మేమియు నుండదు. అపుడు మృత దేహమునందు గూడ చేతనత్వము ఉండవలయును. కాని, అట్లు గోచర మగుటలేదు. శరీరమునందు ప్రాణము లున్నప్పుడు మాత్రమే చేతనత్వము ఉండును. మృత దేహమునందు ప్రాణములు ఉండవు గాన, చేతనత్వము కనబ్పట్టదు. కావున, ప్రాణమే యాత్మ యని వారు వాదింతురు.

కొందఱు (వీరును అనాత్మ వాదులే.) నేను శ్వాస క్రియ చేయుచున్నాను; జీవించుచున్నాను; ఆకలిదప్పికలు కలిగియున్నాను, ఇత్యాదిగా అనుభవము పొందుచుండుట వలన ప్రాణమే ఆత్మ యని భావింతురు. ('యది భూత మాత్రో దేహ ఏవ శ్వాసాది కుర్వీత, తర్హి మృతదేహస్యాపి తద్రూపత్వావిశేషఉచ్ఛ్వాసాది వ్యాపారప్రసంగః అతోఽపి దేహాతిరిక్తః ప్రాణః ఆత్మేతి కేచిన్మన్యంత ఇత్యర్థః') వీరు అనాత్మ వాదులైనను, చార్వాకులకంటె భిన్నులు.

వార్తికము

తేచి చ్ఛృణోమి పశ్యామి జిఘ్రామి స్పందయా మ్యహమ్।
ఇతీన్ద్రియాణా మాత్మత్వం ప్రతియన్తి తతోఽధికమ్॥ ౩

పీయూషవర్షిణి

చార్వాకమతములో నేకదేశిమతమైన ఇంద్రియాత్మవాదము చెప్పబడుచున్నది.

కొందఱు, నేను వినుచున్నాను, చూచుచున్నాను, వాసన చూచుచున్నాను, కదలుచున్నాను అని భూతసంఘాతము కంటె నధికమైన ఇంద్రియాత్మత్వమును (ఇంద్రియములే ఆత్మ యని) భావింతురు.

విశేష వివరణము

'అహం' అనుభవము ఇంద్రియవ్యాపారాధీనము, తద్భిన్నము, దేహసంచాలకము నయిన ప్రాణము కలదనుటకు ప్రమాణము లేదు; ఇంద్రియోపరమరూపమైన స్వాపము (సుషుప్తి) నందు దేహచలనము కన్పించుటలేదు; అచట గోచరించు శ్వాసాదులు భ్రాంతిమాత్రములు; ఇంద్రియములు కలసి ఒకేమారు విషయభోగముల ననుభవించుటలేదు; ఆ యింద్రియములు నియతమైన భోగవిశేషములు కలిగి యుండును; వ్యస్తము లయినయే యింద్రియములు ఒకే శరీరమునందు ఆరూఢములై యున్నవి. ఈ కారణములచేతనే, ఆత్మలు అనేకము అని యింద్రియాత్మవాదుల మతము.

ఇచట, వాస్తవమునకు ఇంద్రియాత్మవాదమును ప్రతిపాదించిన తరువాతనే ప్రాణాత్మవాదోపన్యాసము చేయవలసి యున్నది. ఇంద్రియోపరమము జరిగినను, ప్రాణ వ్యాపారము ఉపరమము నొందదు. ('తత్ర చేంద్రియోప రమేఽపి ప్రాణవ్యాపారానుపరమాదితి యుక్తిరనుసంధేయా') కాని, పాఠక్రమము ఆరీతిగ లేదు. "పాఠక్రమా దర్థక్రమో బలీయః" యను న్యాయము ననుసరించి ఇంద్రియాత్మ వాదోపన్యాసానంతరమే ప్రాణాత్మవాదోపన్యాసము దర్శింప నగును.

వా ర్తి క ము

జానామి ప్రత్యయబలాత్ బుద్ధి రిత్యపరే జగుః ।
మాయావ్యామూఢచిత్తానాం తేషాం దూషణ ముచ్యతే॥ ౭

పీ యూ ష వ ర్షి ణి

ఇపుడు, బౌద్ధమతము వివరింపబడుచున్నది.

బౌద్ధులు 'నేను తెలిసికొనుచున్నాను' అను జ్ఞాన బలమువలన బుద్ధియే ఆత్మ యని చెప్పుదురు. మహామాయచే వ్యామూఢచిత్తులైన పూర్వోదాహృత ప్రతివాదుల మత నిరాసము ద్వారా నిర్విశేషమైన ఆత్మతత్త్వమును ప్రతిపాదించుటకై "దేహం ప్రాణ మపీన్ద్రియాణి" యను శ్లోకము నారంభించిరి.

## విశేష వివరణము

బుద్ధిని, అనగా క్షణికవిజ్ఞానమును ఆత్మ యని విజ్ఞానవాది ప్రభృతులైన యితర బౌద్ధులు చెప్పుదురు. స్వప్నమునందు ఇంద్రియములు, ప్రాణములు పని చేయవు. కాని, బుద్ధిమాత్రము యథావస్థితమై యుండును; జాగ్రదవస్థలో గూడ, బుద్ధి, విషయోపభోగమునందు లగ్నమై యుండని యెడల, విషయములతో నింద్రియస్పర్శ యున్న కాలమునందు గూడ, వ్యవహారము జరుగదు. కావున, ఇంద్రియములకంటె, ప్రాణములకంటె నతిరిక్తమైన బుద్ధిని అంగీకరింపక తప్పదు. కావున, బుద్ధియే ఆత్మ యని విజ్ఞానవాదుల రాద్ధాంతము. ఇది శూన్యవాది మతమునకు గూడ నుపలక్షకము. సుషుప్తియందు విజ్ఞానభావ ముండును. మఱియు అన్యదశలలో (జాగ్రత్ స్వప్నములలో) ఆకస్మికముగా 'అహం' అను విజ్ఞాన ముదయించును. అది, అహంకారోదయము యొక్క సంవృతి మాత్రమే. కావున, అభావరూపమైన శూన్యము నుండియే విజ్ఞానము ఉదయించును. కావున, ఆత్మస్వరూపము అభావరూపమైన శూన్యమే యని శూన్యవాది సిద్ధాన్తము ('స హి సుషుప్తౌ విజ్ఞానస్యాప్యభావాత్, అవస్థాన్తరేఽహ మిత్యకస్మా దహంకారోదయస్య సంవృతిమాత్రత్వాత్ శూన్య మాత్మేతి వదతి'). పూర్వోదాహృత మతకల్పన లన్నియు భ్రాంతిమూలకము లగుటవలన ప్రామాణికులు ఆ మతములను విశ్వసింపజనదు. ఇక,

శ్రీసురేశ్వరులు శంకరభగవత్పాదుల శ్లోకతాత్పర్యమును వివరించుచున్నారు.

వా ర్తి క ము

దేహాదీనాం జడార్థానాం పాషాణవ దనాత్మనామ్।
కథం భవే దహంభావః సమావేశం వినేశతుః ॥ ౯

పీ యూ ష వ ర్షి ణీ

పరమేశ్వరుడు దేహాదులయందు ప్రవేశింపకున్న, పాషాణము వలె నచేతనములు, జడపదార్థములు నయిన దేహాదులకు 'అహం' అను భావము ఎట్లు కలుగును?

విశేష వివరణము

ఇచట ప్రతివాదులు ఈ విషయమును గుఱించి ప్రశ్నింపవలసి యున్నారు. దేహేంద్రియ మనఃప్రాణ బుద్ధ్యాదులు చేతనములా, లేక అచేతనములా? దేహాదులు పాషాణమువలె అనాత్మలు, జడపదార్థములు గాన, చేతనములని చెప్పుట ప్రమాసంగతము కాదు. 'జడార్థాః' యనగా, దృశ్యవిషయములని యర్థము. ఈశ్వరప్రవేశము లేక, జడ పదార్థములయిన దేహాదులకు చేతనత్వము ఎన్నడు కలుగ జాలదు. జడ పదార్థమునుండి చేతనోత్పత్తి జరుగుట యసంభవము. ఇచట, యిట్లు యుక్తి ప్రదర్శనీయము. 'వివాదాః అనాత్మానః జడత్వాత్, పాషాణవత్; జడత్వంచ దృశ్యత్వాత్, తద్వ దేవేత్యర్థః". కావున, సాలభంజికా

సదృశము లైన యీ దేహాదులకు స్వతః, చిదాత్మకుడైన యీశ్వరుని ప్రవేశము లేక, 'అహం' అను భావము, అనగా చేతనత్వము ఎన్నడు సిద్ధింపదని తాత్పర్యము.

వా ర్తి క ము

దేహ స్తావ దయం నాత్మా దృశ్యత్వా జ్జాడ్యవత్త్వతః ।
రూపాదిమత్త్వా త్సాంశత్వా ద్భౌతికత్త్వాచ్చ కుంభవత్ ॥

పీ యూ ష వ ర్షి ణి

ఈ దేహము ఘటమువలె అచేతనత్వము, రూపాది మత్త్వము, సావయవత్వము, భౌతికత్వము, దృశ్యత్వము కలదగుట వలన, ఆత్మ కాదు.

విశేష వివరణము

"జాడ్యవత్త్వం నామ స్ఫురణభిన్నత్వమ్-"అనగా, ప్రకాశభిన్నత్వమే జడత్వము. 'న హి దేహః స్ఫురణాత్మా, స్వసత్తాయాం స్ఫురణవ్యభిచారాత్'– దేహము ప్రకాశ, స్వరూపమైన ఆత్మ కాదు; స్వసత్తయందు స్తంభమవలె ప్రకాశ వ్యభిచారము గోచర మగుచున్నది.

'దృశ్యత్వం నామ పరాధీనప్రకాశత్వమ్'-పరాధీనమైన ప్రకాశము కలిగియుండుటయే దృశ్యత్వము. స్వసత్తాసిద్ధికై అన్యపదార్థముపై నాధారపడియుండు ప్రతిపదార్థము దృశ్యమే. ఔపనిషదాత్మ, ఏజ్ఞానమునకు గూడ, విషయము కానందున, స్వప్రకాశ మగుటవలన దృశ్యము కాదు గాన, స్వయం

సిద్ధము. రూపాదిమత్త్వాదులు ప్రసిద్ధములైన హేతువులే యని తెలియవలెను.

ఆత్మరూపమైన సాధ్యవస్తువు ప్రసిద్ధము, తత్ప్రతియోగియైన అనాత్మ అప్రసిద్ధ మని చెప్పనగును. 'అహం' యొక్క అనుభవము ఆత్మరూప మని సర్వవాదిసంమతము; మఱియు, ఆ యనుభవము యొక్క యభావరూపమైన ఘటాదులయందు అనాత్మత్వము గూడ నంగీకరింపబడినది. ('అహ మవభాస గోచరమాత్రే సర్వేషాం వాదినా మాత్మత్వప్రసిద్ధేః, తదన్యత్వస్య చ ఘటాదౌ ప్రసిద్ధత్వాదితి').

వా ర్తి క ము

మూర్ఛా సుషుప్తి మరణేష్వపి దేహః ప్రదృశ్యతే ।
దేహాదివ్యతిరిక్తత్వా త్తదాత్మా న ప్రతీయతే ॥౧౧

పీ యూ ష వ ర్షి ణి

పూర్వోక్తమైన అనుమానము అప్రయోజకము అని, శంక కలుగుచుండగా, తన్నివృత్తికై విపక్షబాధకమైన తర్కమును చెప్పుచున్నారు.

దేహము మూర్ఛ, సుషుప్తి, మరణముల యందు, గూడ, కన్పడుచున్నది. ఆ సమయమునందు, దేహాదుల కంటె వ్యతిరిక్త మగుటవలన ఆత్మ, ప్రతీత మగుటలేదు.

విశేష వివరణము

దేహము, ఆత్మ అభిన్నములని యంగీకరించినచో, శరీరము గోచర మగుచున్నప్పుడు ఆత్మ, ప్రతీతము కాక

పోవుట యనునది యసంభవము. మూర్ఛాదిదశలలో ఆత్మ, గోచరము (ప్రతీతము) కాకపోవుట అందఱకు అనుభవసిద్ధము. కావున, ఆ స్థితులలో 'అహం' అని ప్రతీతము కానట్టి (అనుభూతము కానట్టి) యాత్మ, అవస్థాంతరమునందు అనుభూయమానమగు నాత్మ, దేహముకంటె భిన్నమని విశదమగుచున్నది. ('భవతి చ మూర్ఛాద్యవస్థాసు ఆత్మానవగమః సంప్రతిపన్నః; అతస్తాస్వవస్థాసు అహ మిత్యనవభాసమానః అవస్థాన్తరే చావభాసమాన ఆత్మా దేహాన్య ఏవేతి సిద్ధ మితర్థః').

వా ర్తి క ము

యథా జగత్ప్రవృత్తీనా మాదికారణ మంశుమాన్ ।
పుమాం స్తథైవ దేహాదిప్రవృత్తౌ కారణం పరమ్ ॥ ౧౨

పీ యూ ష వ ర్షి ణి

సూర్యుడు జగత్ప్రవృత్తులకు (ప్రపంచవ్యాపారములకు) మూలకారణమైనటుల, ఆత్మయే (హృదయ గుహాశయము నందున్న పురుషుడే) దేహాదుల క్రియలకు పరమ కారణమని భావము.

దేహాతిరిక్తమైన ఆత్మసద్భావమునందు అనుమానాంతరము ప్రదర్శింపబడు చున్నది. 'గాఢాంధకార వ్యాప్తమైన హృదయగుహాంతఃస్థ దేహవ్యాపారము దేహాతిరిక్తప్రకాశసంసర్గ నిమిత్తకము, దేహవ్యాపారమగుటవలన, పగటి పూట బాహ్యప్రదేశమునందలి సూర్యప్రకాశ

సాన్నిధ్యనిమిత్త దేహ వ్యాపారమువలె' అని యనుమాన రచన చేయబడును.

వా ర్తి క ము

మమ దేహోఽయ మిత్యేవం స్త్రీ బాలోఽన్ధశ్చ మన్యతే ।
దేహోఽహ మితి నావైతి కదాచిదపి కశ్చన ॥ ౧౩

పీ యూ ష వ ర్షి ణీ

మఱియు, 'ఇది నాశరీరము' అని స్త్రీలు, బాలురు, అంధులు అవివేకముతో తలంతురు. ఎవరును, ఎన్నడు 'నేను శరీరమునై యున్నా' నని అనుభవము పొందరు.

విశేష వివరణము

దేహము ఆత్మాతిరిక్త మనుటలో మఱియొక యనుమానమును ప్రదర్శించుచున్నారు. "దేహో నాత్మా, మమ ప్రత్యయవిషయత్వాత్, వస్త్రాదివత్", అనగా 'నాది' యను జ్ఞానమునకు విషయ మగుటవలన దేహము ఆత్మ కాదు. శరీరమే ఆత్మయై యున్నచో, 'నేను శరీరమును' అను జ్ఞానము కలిగియుండెడిది. ఇట్టి జ్ఞానము సమస్తలోకాను భవ విరుద్ధము. కావున, దేహము ఆత్మ కాదని భావము.

"న చ మనుష్యోఽహ మిత్యనుభవ ఏవ దేహాత్మాను భవః, తస్యాహ మనుభవ వ్యభిచారాత్"- అనగా, 'నేను మనుష్యుడను' అనెడి యనుభవము దేహాత్మానుభవమని చెప్పవలనుపడదు. ఏలన, స్వప్నములో ఏతద్భిన్నముగా

'వ్యాఘ్రోఽహం'- నేను పెద్దపులిని యనెడి యనుభవము కలుగుచున్నది. ఇచట 'అహం' అను అనుభవము జాగ్రత్ స్వప్నములయందు సమానమైనను, మనుష్యత్వాద్యనుభవము వ్యావృత్త మగుచున్నది. ఆకారణముచేత మనుష్యత్వాది ధర్మము గల దేహము కంటె అన్యమైన 'అహం' ప్రత్యయమునకు విషయమే ఆత్మ యని స్పష్ట మగుచున్నది. అందువలన, దేహాతిరిక్తమైన ఆత్మాస్తిత్వము సిద్ధించు చున్నది ('తత్రాహ మనుభవావ్యావృత్తావపి మనుష్యత్వాద్యనుభవస్య వ్యావృత్తే ర్మనుష్యత్వాది ధర్మక దేహాదన్య ఏవాహ మవభాసవిషయః ఆత్మేతి సిద్ధం దేహాతిరిక్తాత్మాస్తిత్వమితి').

ప్రత్యక్షమును మాత్రమే ప్రమాణమని వాదించునట్టి చార్వాకుల పట్ల అనుమానప్రమాణముచే దేహాతిరిక్తమైన ఆత్మాస్తిత్వమును సాధింపబూనుట యసంగతమని యందురేని సమాధానము చెప్పుచున్నారు. అనుమానాది ప్రమాణము లను స్వీకరింపక, వాదమునందు ప్రతివాది యొక్క యభిప్రాయము ప్రత్యక్షముగా అనుభవగోచరము కాదు. అతని వాక్యమును స్వీకరించియే ఆక్షేప సమాధానములు ప్రవృత్తములగును ('అనుమానాద్యనభ్యుపగమే ప్రతివాద్యభి ప్రాయస్య ప్రత్యక్షావిషయత్వాత్ తదుక్తి మార్గాది సమాశ్రయణ మంతరేణ తం ప్రతి ఆక్షేప సమాధానాది ప్రవృత్త్యనుపపత్తేః'). కావున, ఇచట గూడ నితర

ప్రమాణములను స్వీకరింపక తప్పదు. విరుద్ధ ధర్మములకు వ్యవస్థను కల్పించుట యందు ప్రత్యక్ష ప్రమాణము సమర్థము కాదు. ఏదియైనను, కల్పించి సమాధానములు చెప్పెడివారి వాక్యములు విద్వాంసులకు ఆదరణీయములు కావు; ఉపేక్షణీయములు.

ఇష్టానిష్ట సాధనములయందు ప్రవృత్తి నివృత్తులు గూడ పూర్వదృష్టమైన సజాతీయత్వాది చిహ్నముల వలన, అనుభూతములైన పదార్థముల యందు అనుమాన ప్రమాణము చేతనే సంభవమగును. అనుమాన ప్రమాణమును అంగీకరింపనిచో, ప్రవృత్తి నివృత్తివ్యవహారము జరుగదు; దానివలన, జీవితము గూడ దుస్తర మగును. కావున, అనుమానాది ప్రమాణములు ఆశ్రయణీయములు. ఈ అనుమానాదులు ఆశ్రయణీయము లగుటంజేసి, అనుమానము వలన దేహాతిరిక్తమైన ఆత్మాస్తిత్వమును సాధించుట యుక్తమే యని గ్రహింపనగును. కావున, చార్వాకుని పరలోకాది నాస్తికవాదము కేవల ప్రలాపము గాన, ఉపేక్షణీయ మని భావము.

వా ర్తి క ము

ఇన్ద్రియాణ్యపి నాత్మానః కరణత్వా త్ప్రదీపవత్ ।

పీ యూ ష వ ర్షి ణీ

దీపము ప్రకాశసాధనమైన చందముగా, కరణములు (ఇంద్రియములు) సాధనము లగుటవలన ఇంద్రియములు

గూడ ఆత్మలు కావు. కావున ఇంద్రియాత్మవాదము యుక్త్యనుభవసిద్ధము కాదు.

వార్తికము

**వీణావాదనవచ్ఛ్రోత్రం శబ్దగ్రహణసాధనమ్ ।**
**చక్షుస్తేజస్త్రితయవత్ రూపగ్రహణసాధనమ్ ॥ ౧౫**

**గంధస్య గ్రాహకం ఘ్రాణం పుష్పసంపుటికాదివత్ ।**
**రసస్య గ్రాహికా జిహ్వా దధిక్షౌద ఘృతాదివత్ ॥ ౧౬**

పీయూషవర్షిణి

ఇంద్రియముల సాధనములు అను హేతువుచేత ఇంద్రియములు అనాత్మలని సాధింపబడినది. ఆ విషయములో హేత్వసిద్ధి శంకను పరిహరించుచు ప్రతి యింద్రియమునకు సాధనత్వమును ప్రదర్శించుచున్నారు.

వీణావాదనము శబ్దగ్రహణసాధనమైనట్లు, శ్రోత్రము శబ్దగ్రహణసాధనము. నేత్రము తేజస్త్రితయము వలె, అనగా సోమ, సూర్య, అగ్నిరూపమైన నేత్రత్రయము వలె రూపమును గ్రహించుటకు సాధనము. పుష్పదళములు గంధగ్రాహక సాధనములైనరీతిగా ఘ్రాణేంద్రియము గంధమునాఘ్రాణించుటకు సాధనము. రసనేంద్రియము దధి, మధు, ఘృతములకువలె రసగ్రహణ సాధన మని భావము. కావున, సాధనములైన యింద్రియములు అనాత్మలే గాని, ఆత్మ కాజాలవు.

వా ర్తి క ము

ఇన్ద్రియాణి న మే సన్తి మూకోఽస్మి బధిరోఽస్మ్యహమ్।
ఇత్యాహు రిన్ద్రియైర్హీనా జనాః కిం తే నిరాత్మకాః ॥ ౧౪

పీ యూ ష వ ర్షి ణీ

ఇంద్రియములు మమకారమునకు ఆస్పదములు. కావున, వానికంటె ఆత్మ భిన్నుడు అని యుక్తిపురఃసరముగా నుపపాదించుచున్నారు.

ఇంద్రియహీనులైనవారు నాకు ఇంద్రియములు లేవు; నేను మూకత్వ, బధిరత్వములు గలవాఁడ నని చెప్పుదురు. అంతమాత్రముచేత వారు ఆత్మరహితు లగుదురా? ఇది విపక్షులకు బాధకమైన తర్కమని తెలియవలయును.

వా ర్తి క ము

ప్రాణోఽప్యాత్మా న భవతి జ్ఞానాభావా త్సుషుప్తిషుః
జాగ్రత్స్వప్నోపభోగోత్థ శ్రమవిచ్ఛిత్తిహేతవే ॥ ౧౫
సుషుప్తిం పురుషే ప్రాప్తే శరీర మభిరక్షితుమ్ ।
శేషకర్మోపభోగార్థం ప్రాణశ్చరతి కేవలమ్ ॥ ౧౬

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు ముఖ్యప్రాణాత్మవాదము నందలి దోషమును ప్రదర్శించుచున్నారు.

సుషుప్తి, మూర్ఛాదులయందు జ్ఞానాభావము వలన ప్రాణము గూడ, ఆత్మ కాదు. జాగ్రత్, స్వప్నములయందలి

విషయోపభోగము వలన జనించు శ్రమను పోగొట్టు కొనుటకై పురుషుడు, (జీవుడు) గాఢ నిద్రలో మునిగిపోవును. అట్లు జీవునియొక్క సుషుప్తి శేష కర్మోపభోగనిమిత్తమై, శరీరరక్షణమునకై కేవలము ప్రాణము సంచరించుచుండును.

ప్రాణము ఆత్మ కాదను స్థలమున అనుమాన రచన యీవిధముగా నుండును. "ప్రాణ ఆత్మా న భవతి, స్వసత్తాయాం చైతన్యవ్యభిచారాత్, దేహవత్".

## విశేష వివరణము

కర్మఫలానుభవమున కయియే జీవుడు శరీరధారణము చేయును. సమస్త కర్మఫలానుభవము ఈ శరీరమునందు ప్రాణము లున్నంతవఱకే కలుగును. ప్రాణమే జీవనశక్తి. "అతః, శేషకర్మోపభోగార్థం శరీర మభిరక్షితుం ప్రాణ శ్చరతి కేవలమ్"- శేషించిన కర్మఫలము ననుభవించు నిమిత్తమై శరీరరక్షణకై ప్రాణము శరీరమునందు సంచరించు చుండును. ప్రాణములు ఉపరమించినచో, శేషించిన కర్మాను భవమునకు అవకాశము ఉండదని భావము.

## వార్తికము

ప్రాణస్య తత్ర చైతన్యం కరణోపరమే యది।
ప్రాణే వ్యాప్రియమాణే తు కరణోపరమః కథమ్॥ ౨౦

సంగ్రామాజౌ హి రణోద్యుక్తే విరమన్తి న సైనికాః।
తస్మాన్న కరణస్వామీ ప్రాణో భవితు మర్హతి॥ ౨౧

## పీ యూ ష వ ర్షి ణి

ప్రాణమే, స్వశ్రమాపనయనమునకై సుషుప్తి నొందినది. మఱియొక పురుషుడు కాడు; తన శేషకర్మ భోగము కొఱకు శరీరమును రక్షించుచు సంచరించుచున్నదని చెప్పినచో, అందలి దోషము చెప్పబడుచున్నది. సుషుప్తిదశలో నింద్రియములు లీనమైనపుడు, ప్రాణమునకు చైతన్యమున్నచో, (ఆత్మత్వమున్నచో) అపుడు ప్రాణము నిర్వ్యాపార మగును. ప్రాణము సక్రియమై యున్నచో, ఇంద్రియములు లీనమగుట యెట్లు సంభవము ?

చక్రవర్తి యుద్ధరతుడై యున్నప్పుడు సైనికులు నిర్వ్యాపారులై యుద్ధవిరమణము చేయరు. ఆ కారణము చేత ప్రాణము ఇంద్రియములకు ప్రభువగుటకు సమర్థము కాదు.

### విశేష వివరణము

సుషుప్తియందు సర్వేంద్రియములు స్వస్వవ్యాపారముల నుండి విరతము లగును. అపుడు ప్రాణమునకు ఆత్మత్వము చెప్పినచో, ఆ సుషుప్తిదశయందు ప్రాణము స్వవ్యాపారము నందు నిరతమైయుండగా, తదాయత్త వ్యాపారములు గల ఇంద్రియములు వ్యాపారోపరతములు కాకపోవలసి వచ్చును. కాని, సుషుప్తియందు ఇంద్రియములకు వ్యాపారోపరమము అనుభవసిద్ధము. "తస్మాన్న కరణాధిపతిః ప్రాణః కింత్వన్య ఏవ"— కావున, ఇంద్రియములకు అధిపతి ప్రాణము కాదనియు,

మఱియొకరనియు స్పష్ట మగుచున్నది. కావున ఏవిధముగ జూచినను, ప్రాణము ఆత్మ కాదని తెలియును.

వా ర్తి క ము

మనసః ప్రేరకే పుంసి విరతే విరమ న్త్యతః ।
కరణాని సమస్తాని తేషాం స్వామీ తతః పుమాన్ ॥ ౨౨

పీ యూ ష వ ర్షి ణి

కావున, మనః ప్రేరకుడైన ఆత్మ, విశ్రాంతి నొందగా ఇంద్రియము లన్నియు ఉపరమము చెందుచున్నవి. అందు వలన, ఆ యింద్రియములకు ప్రభువు ప్రాణాతిరిక్తమైన ఆత్మ యని తెలియవలెను.

విశేష వివరణము

"యో మనోఽంతరో యమయతి" యను అంతర్యామి బ్రాహ్మణ వచనము (బృ. ఉ. ౫-౭-౨౦) వలన మనః ప్రేరకుడు, అంతర్యామి పురుషుడు ఆత్మ యని తెలియు చున్నది. ఇంద్రియములు మనోద్వారములు. సర్వాధ్యక్షు డైన పురుషుడు వ్యాపారవిరతుడైనంతనే, ఇంద్రియములు మనస్సహితముగా ఉపరమించును. ఆకారణము చేత మనస్సహితముగ సర్వేంద్రియములకు స్వామి యగు పురుషుడు ప్రాణాతిరిక్తుడనియే గ్రహింపనగును.

వా ర్తి క ము

బుద్ధిస్తు క్షణికా వేద్యా గమాగమ సమన్వితా ।
ఆత్మనః ప్రతిబింబే తు భాసితా భాసయే జ్జగత్॥ ౨౩

## పీ యూ ష వ ర్షి ణి

ప్రాణాత్మ వాదమును నిరసించి, యిపుడు క్షణికవిజ్ఞానాత్మ వాదమును నిరాకరించుచున్నారు.

ఉత్పత్తి వినాశయుక్తమైన బుద్ధి క్షణకాలపర్యవసాయి, జ్ఞానమునకు విషయము. ఆ బుద్ధి, ఆత్మప్రతిబింబము చేత ప్రకాశమును పొంది, ప్రపంచమును భాసింపజేయును.

## విశేష వివరణము

క్షణిక విజ్ఞానవాదులు జ్ఞానము (బుద్ధి) క్షణకాలస్థితి కలదని చెప్పుదురు. ఆ క్షణకాలపర్యవసాయి బుద్ధినే వారు 'ఆత్మ' యని చెప్పుదురు. దీనివలన వారు చెప్పునట్టి యాత్మ; ప్రతి క్షణము నశించునట్టిదని తెలియనగును. ఉత్పత్తి వినాశములు గల పదార్థము పరప్రకాశ్యమై యుండును గాని, స్వప్రకాశమైన ఆత్మ కాజాలదు. పరప్రకాశ్యమైనదే వేద్య మగును. కావుననే, క్షణికబుద్ధి 'వేద్యా' యని చెప్పబడినది. ఆత్మతత్త్వము వేద్యము కాదు అని శ్రుతులనేకములు కంఠోక్తిగా చెప్పుచున్నవి. బుద్ధియో, అన్యాధీన ప్రకాశ యగుటచే నాత్మ కాదని భావము.

## వా ర్తి క ము

**ఆత్మన్యుత్పద్యతే బుద్ధి రాత్మన్యేవ ప్రలీయతే।**
**ప్రాగూర్ధ్వంచాసతీ బుద్ధిః స్వయమేవనిషిధ్యతే ॥ ౨౪**

జ్ఞానాచ్చే త్పూర్వ పూర్వస్మా దు త్తరో త్తరసంభవః ।
యుగపద్బహుబుద్ధిత్వం ప్రసజ్యేత క్షణే క్షణే ।
బుద్ధ్య న్తరం న జనయే న్నాశో త్తర మస త్త్వతః ॥ ౨౫

పీ యూ ష వ ర్షి ణి

బుద్ధి, అన్యాధీనప్రకాశము కలదని ప్రతిపాదింపబడు చున్నది. బుద్ధి, యాత్మయందు ఉత్పన్నమై యాత్మయందే విలీనమగును. పూర్వోత్తర కాలములయందు లేని బుద్ధి, స్వయముగనే, సత్త లేనట్టిది. పూర్వపూర్వజ్ఞానము వలన ఉత్తరోత్తర జ్ఞానము సంభవించినచో, ప్రతి క్షణము ఒకే పర్యాయము అనేక బుద్ధులు ప్రసక్తములు కావలసివచ్చును. ఒకమారు నాశమొందిన బుద్ధి, సత్తారహిత మగుట వలన, మఱియొక బుద్ధికి ఉత్పాదకము కాజాలదు.

## విశేష వివరణము

పదార్థము స్వీయమైన యుత్పత్తి వినాశములను తెలిసికొనలేదు. ఉత్పత్తి యనగా పూర్వము లేనిది యిపుడు ఉండుట. తనయొక్క ప్రాగభావమును తానిపుడు భావ రూపమున నుండక తెలిసికొన జాలదు. అటులనే నాశ మనగా లేకపోవుట. తాను లేకపోవుటయు స్వసత్తా రహితముగా తెలిసికొన బడజాలదు. కావున, ఉత్పత్తి వినాశములు పరసంవేద్యములు గాని, స్వసంవేద్యములు కావు. ఆకారణముచేత బుద్ధిసంబంధులైన క్షణిక పరిణామములను

తెలిసికొనగల, బుద్ధికంటె భిన్నమైన చేతనాత్మను అంగీకరించి తీరవలయును. అట్టి స్థితిలో బుద్ధిని చేతనాత్మ యని యంగీకరించుట యసంగతము ('స్వోత్పత్తివినాశయోః స్వగ్రాహ్యత్వాభావాత్, అగ్రాహ్యత్వే చ తదసిద్ధేః ఉత్పత్తి వినాశవతశ్చ అన్యగ్రాహ్యత్వనియమాత్, సిద్ధం క్షణిక విజ్ఞానస్య అన్యగ్రాహ్యత్వేన అనాత్మత్వ మిత్యర్థః').

ఆత్మ, విజ్ఞానస్వరూపుడు కాకపోవచ్చుగాక, విజ్ఞాన సాంతత్యమే యాత్మ కావచ్చును గదా? యని యాశంక చేసి, యది దుర్నిరూప్య మని చెప్పబడుచున్నది. జ్ఞానము నుండి జ్ఞానాంతరము ఉత్పన్నమగునని చెప్పెడి క్షణిక విజ్ఞానవాది యిట్లు ప్రశ్నింపదగియున్నాడు. పూర్వక్షణము నందలి జ్ఞానముతో సమన్వితమై యుత్తర క్షణ జ్ఞానము ఉదయించునా? లేక, అనన్వితమై జనించునా? పూర్వజ్ఞాన సమన్విత మయియే, యనంతర జ్ఞానము జనించు ననినచో, ఒక దోషము కలదు. పూర్వ పూర్వ బుద్ధితో సమన్వితమై ఉత్తరోత్తరబుద్ధి జనించినచో, ఆ యా బుద్ధులు ఉదయించెడి క్షణములందు అనంత బుద్ధు లనువృత్త మగును. అపుడు విజ్ఞాన క్షణికత్వవాదమునకు హాని వాటిల్లును. అనన్విత మయియే ఉత్తర జ్ఞానము ఉదయించునని చెప్పెద మనిన, పూర్వబుద్ధి (జ్ఞానము) అనన్వితమై నశించినచో, అది సత్తా రహిత మగును. అసత్పదార్థము అన్యసాధక మని చెప్పుట

యుపపన్నము కాదు. అందువలన, పూర్వజ్ఞానము వలన అన్యజ్ఞానము ఎన్నడు జనించదు. అసత్పదార్థము సత్తాజనక మనుట అతిప్రసంగ మగునని భావము.

### వార్తికము

**ఏషాం సంఘాత ఆత్మా చే దేకదేశే పృథక్కృతే ।**
**న చైతన్యం ప్రసజ్యేత సంఘాతాభావత స్తదా॥ ౨౯**

### పీయూషవర్షిణి

శరీరము మొదలుకొని, బుద్ధివఱకు గల ప్రతిది ఆత్మ కాదని, నిరాకృతమైనది. అయినను, ఒకడు దేహేంద్రి యాదులు వేఱువేఱుగా ఆత్మ కాకపోవుగాక, దేహేంద్రియ సంఘాతము ఆత్మ యని యనవచ్చును. వానికి సమాధానము శ్రీసురేశ్వరులు వార్తికమున చెప్పుచున్నారు.

ఈ దేహేంద్రియసంఘాతము ఆత్మయైనచో, అపుడు సంఘాతమునందలి యేకదేశమును (ఒకభాగమును) వేఱు చేసినపుడు, సంఘాతము లేకపోవుట వలన, చైతన్యము ప్రసక్తము కాదు.

### విశేష వివరణము

'దేహేంద్రియ సంఘాతము ఆత్మ' యని వాదించు వానిని ఈరీతిగ ప్రశ్నింపనగును. సంఘాతమే చేతనాత్మయా? లేక తదవయవములు గూడ చేతనములా? సంఘాతమే ఆత్మ యనెడి వాదమును అనువదించి యందలి దోషమును

చూపుచున్నారు. సంఘాత మనగ, సంపూర్ణమైన యవయవి. ఆ సంఘాతమే ఆత్మ యని చెప్పినచో, తదేకదేశములైన చక్షుశ్శ్రోత్ర, మనోవాక్కులలో నేదేని యొక యవయవము నష్టమైపోయినపుడు, సంఘాతము నశించును; అపుడు చైతన్యము ఉండకపోవలసి వచ్చును. అట్లగుట ఇష్ట ప్రసంగము కాదు. అంధ, బధిర, మూక, జడాదుల యందు సైతము చేతనత్వము కన్పట్టుచున్నది. కావున, సంఘాత చేతనత్వపక్షము (సముదాయము ఆత్మ యను పక్షము) యుక్తిసహము కాదని భావము.

## వార్తికము

**భిన్న దిగ్గత్యభిప్రాయో బహు చేత్తన్న పూజితమ్।**
**సద్యోభిన్నం భవే దేత న్నిష్క్రియం వా భవిష్యతి॥ ౨౩**

## పీయూషవర్షిణి

అవయవములు చేతనములు అను పక్షము గూడ యుక్తిసంగతము కాదని నిరూపింపబడుచున్నది.

ఒకే సంఘాతమునందు ఆత్మలు అనేకములైనచో భిన్న భిన్న దేశములకు పోవలయు నని కలుగునట్టి కోరిక అంగీకార్యము (పూజితమ్) కాదు. అట్టి యాత్మ, వెంటనే శకలములుగా నగును; అథవా, నిష్క్రియమగును.

## విశేష వివరణము

భిన్న భిన్న దేశములకు పోవలయు ననెడి యిచ్ఛ యుదయించినంతనే, ఒక యింద్రియము తూర్పుదిక్కునకు

పోవలయునని తలంచినపుడు, మఱియొక యింద్రియము పశ్చిమదిశ వైపునకు ఆకర్షించును. అటులనే, మిగిలిన యింద్రియములు దక్షిణ, ఉత్తరదిశల వైపునకు ఆకర్షించును. అట్టి క్లిష్ట పరిస్థితిలో ఆత్మ, విదీర్ణమై శకలములుగా నగును. అట్లు నిర్వీర్యమానము కాకపోయిన, ఒక యింద్రియముచే నాకృష్టమై, మఱియొక యింద్రియముచేత కదలకుండునట్లు స్థాప్యమాన మగుట వలన ఆత్మ, నిష్క్రియ మగుటకు నవకాశము కలుగును. కావున, చక్కగా పరిశీలించినపుడు, సంఘాతమునకు (అవయవికి), తదవయవములకు ఆత్మత్వము చెప్పుట సంగతము కాదు. ఆకారణముచేత సంఘాత, తదవయవ విలక్షణుడే యాత్మ యని విదిత మగును.

### వార్తికము

**దేహస్యాన్తర్గతోఽప్యాత్మా వ్యాప్త ఏవేతి బుధ్యతే।**
**అణుప్రమాణశ్చే దేష వ్యాప్నుయా న్నాఖిలం వపుః॥౨౧**

### పీయూషవర్షిణి

ఇంతకుముందు, దేహేంద్రియ సంఘాతము, తదవయవముల కంటె విలక్షణమైనవాడు ఆత్మ యని యుక్తిపురఃసరముగా ప్రతిపాదింపబడినది. ఇపుడు ఆత్మపరిమాణమును గుఱించి భిన్నభిన్న మతానుయాయులు చేసిన వాదములను పేర్కొని తద్దూషణము చేయబడుచున్నది.

### విశేష వివరణము

దేహము ఎంత పరిమాణము గలదో, తద్దేహాంతర్గతమైన ఆత్మ యంత ప్రమాణమే కలిగియుండు నని జైన

మతానుయాయులు చెప్పుదురు. ('ఏవమపి యావాన్ దేహః తావానేవ తదన్తర్గత ఆత్మేతి జైనమతానుసారిణః'). వేదాంతులలో నేకదేశీయులైనవారు కొందఱు 'అణు పరిమాణ ఏవేతి'- ఆత్మ, అణుపరిమాణమే యని వాకొందురు. 'విభు రేవాత్మేత్యన్యే సాంఖ్యాదయో మన్యన్తే'- ఆత్మ, విభువనియే యితర సాంఖ్యాదిమతానుయాయులు భావింతురు. కావున, దేహాదివిలక్షణమైనను, ఆత్మ ఏ పరిమాణము గలది? యను విచికిత్స బయలు దేరుచుండగా, (శ్రీ)సురేశ్వరు లిట్లు చెప్పుచున్నారు.

ఆత్మ, దేహాంతర్గతుడైనను, వ్యాపకుడనియే నిశ్చిత మగుచున్నది. 'వ్యాప్తః' అని ప్రయోగింపబడినది. 'వ్యాప్త ఏవేతి కర్తరి నిష్ఠా, వ్యాపక ఏవేత్యర్థః' 'వ్యాప్తః' అనగా వ్యాపకుడనియే యర్థము. పక్షాంతరములన్నియు దోష దుష్టములు అనెడి భావముతో రామానుజ, మధ్వ, వల్లభా చార్య, నింబార్కాదులు చెప్పునట్టి అణుపరిమాణ వాదము నందలి దోషోద్ఘాటనము చేయుచున్నారు. ఈ యాత్మ, అణుపరిమాణ మని యంగీకరించినచో, ఈ యాత్మ, దేహము నంతయు వ్యాపించి యుండజాలదు.

ఆత్మ, అణుపరిమాణ మను పక్షమును స్వీకరించిన, సరోవరమునందలి శీతల జలము యొక్క శీతలత్వము, పైన సూర్యాతపమునకు సంబధించిన ఉష్ణత్వము ఏకకాలమున అనుభవించుట పొసగదు ('సర్వాంగగతశీతోష్ణాదినిబంధన

వేదనానుసన్ధాన యౌగపద్యాభావః ప్రసజ్యేత'). కాని, అనుభవములో నారీతిగ లేదు. విరుద్ధ లక్షణములైన శీతోష్ణములను యౌగపద్యముగా (ఏకకాలమునందు) అనుభవించుట ప్రసిద్ధము. అదేవిధముగా, ఏకకాలమున రెండు అవయవములు క్రియ యందు ప్రవర్తించుట, నివర్తించుట జరుగదు. ఈ రీతిగ అనేక దోషదుష్టమైన అణుపరిమాణ వాదము పరిహరణీయమే గాని, స్వీకార్యము కాదని తెలియ నగును. ('తథాచ అణుమాత్ర చేతనాధిష్ఠితస్య యుగప దనేకాంగ వ్యూహన ప్రత్యూహనాది వ్యాపారాభావప్రసంగ ఇత్యాది దోషో దుష్పరిహార ఇత్యర్థః).

వార్తికము

దేహప్రమాణశ్చే న్న స్యా ద్బాలస్య స్థవిరాదితా ।
దేహవత్పరిణామీ చే త్తద్వదేవ వినంక్ష్యతి॥ ౨౬

పీయూషవర్షిణి

జైనమతానుయాయులు ఆత్మ దేహపరిమాణము కలదని చెప్పుదురు. దేహపరిమాణవాదము దోషదుష్టమని యీ వార్తికమున నిరాకరించుచున్నారు.

ఆత్మ, దేహపరిమాణము కలదని యంగీకరించు పక్షమున, బాలకునకు వార్ధకాదు లుండవు. శరీరమువలెనే ఆత్మ, పరిణామి యైనచో, అది నాశమొందునట్లుగనే, ఆత్మయు నశించును. కావున, దేహపరిమాణవాదము సర్వథా అనుపపన్నము, అనుభవ విరుద్ధము.

వా ర్తి క ము

కర్మణాం పరిణామేన క్రిమి హస్త్యాదిషు మూర్తిషు ।
వ్యాప్తత్వా త్ప్రవిశత్యాత్మా ఘటాది ష్వన్తరిక్షవత్ ॥ ౩౦

పీ యూ ష వ ర్షి ణీ

ఘటాదులందలి యాకాశము వలె ఆత్మ వ్యాపకుడు కావున, కర్మల పరిపాకఫలముగా క్రిమి, గజాది శరీరముల యందు ఆత్మ, ప్రవేశించును.

## విశేష వివరణము

ఆత్మకు దేహ, అణుపరిమాణాదులలో నేదేని యొక పరిమాణము నంగీకరించుటలో మఱి యొక దోష మున్నది. ఒకే ఆత్మకు విరుద్ధములైన యనేక శరీరములలో ప్రవేశించుటకు అర్హమైన అనేక కర్మలు గూడ నుండవచ్చును. మానవదేహ పరిమాణము గల ఆత్మ, హస్తిశరీరమునంతయు వ్యాపించలేదు. మఱియు, క్రిమి శరీరములో నిముడలేదు ('సన్త్యేవ ఏకస్యాత్మనోఽనేకాని కర్మాణి విరుద్ధానేక దేహప్రవేశయోగ్యాని. తత్ర మనుష్యశరీర పరిమాణస్యాత్మనః కదాచిత్కేనచిత్కర్మణా హస్తిజన్మ ప్రాప్నువతో న తత్ర జీవః సమీయేత'). కావున, దేహపరిమాణాత్మ పక్షము దోషదుష్టము. ఆకారణముచేత ఆత్మ విభువని, అనగా ఆకాశమువలె సర్వవ్యాపకమని యంగీకరింపవలయును అట్లు అంగీకరించుటవలన పూర్వజన్మకృతమైన కర్మకు

అనుగుణమైన యుపాధులయందు జీవప్రవేశము ఉపపన్న మగును.

"యద్యచ్ఛరీర మాదత్తే తేన తేన స యుజ్యతే"
"కర్మానుగా న్యనుక్రమేణ దేహీ స్థానేషు రూపా ణ్యభిసంప్రపద్యతే" (శ్వేతాశ్వ. ౫-౧౦, ౧౧).

ఇత్యాదిశ్రుతులు శరీరి (జీవుడు) పూర్వజన్మకృత కర్మ ఫలానుభవ యోగ్యములైన శరీరములయందు ప్రవేశించునని యుద్ఘోషించుచున్నవి. కావున, వ్యాపకాత్మపక్షము సర్వథా సుసంగత మనియు, దేహపరిమాణ, అణుపరిమాణాది వాదములు అసంగతము లనియు తెలియనగును.

వార్తికము

పరమాణుప్రమాణేఽపి మనసి ప్రతిభాసతే ।
స్వప్నే చరాచరం విశ్వ మాత్మన్యేవ ప్రతిష్ఠితమ్ ॥ ౩౧

పీయూషవర్షిణి

అత్యంత అల్ప పరిమాణము గల యుపాధియందు ప్రతీయమానుడగు ఆత్మయు వ్యాపకుడని అర్థాపత్తి ప్రమాణము ద్వారా నిరూపింపబడుచున్నది.

ఆత్మ, అతిసూక్ష్మమైన మనస్సునందు సైతము ప్రకాశించును. స్వప్నమునందు, చరాచరజగత్తు ఆత్మయందే ప్రతిష్ఠితమై యున్నది. మనస్సు, స్వప్నము-ఈలింగద్వయము

అర్థాపత్తిప్రమాణము చేత ఆత్మయొక్క వ్యాపకత్వమునకు గమకమని దర్శింపనగును.

వా ర్తి క ము

దేహాదిష్వహ మిత్యేవం భ్రమః సంసారహేతుకః ।
అన్తఃప్రవిష్టః శాస్తేతి మోక్షాయోపాదిశచ్ఛ్రుతిః ॥ 3౭

పీ యూ ష వ ర్షి ణీ

కావున, దేహాద్యాత్మ వాదములు యుక్త్యసహములు, ప్రమాణ శూన్యములు. అందువలన, దేహాదుల యందు అహం' అను అభిమానము భ్రమ మాత్రమే యని స్పష్టమైన దనుచు ఉపసంహరించుచున్నారు.

దేహాదులయందు 'అహ' మ్మను భావము సంసారహేతువైన భ్రమ; అనగా అజ్ఞానము (సంసారహేత్వవిద్యాహేతుక ఇత్యర్థః'). శ్రుతి, మోక్షము కొఱకు, అనగా సంఘాతవివేకము కొఱకు పరమేశ్వరుడు శరీరాదుల యందు ప్రవేశించెనని యుపదేశించెను. అనగా, ఆత్మ, సంఘాతము కంటె నతిరిక్తుడని భావము.

"అన్తఃప్రవిష్టః శాస్తా జనానామ్"
"ఏకస్సన్ బహుధా విచారః"

త్యాది శ్రుతులు దేహేంద్రియ సంఘాతము కంటె

నతిరిక్తమైన యాత్మ, దేహాదులయందు ప్రవేశించెనని చెప్పు చున్నవి.

వార్తికము

ఏవ మేషా మహామాయా వాదినామపి మోహినీ।
యస్మాత్సాక్షాత్కురుతే సద్యో లీయతే సదాశివే ॥ 33

పీయూషవర్షిణీ

ఈవిధముగా దేహాదులయందు ఆత్మాధ్యాస మహా మాయావిలాస మని ప్రతిపాదింపబడుచున్నది. ఈ మహా మాయ, గురుదేవతానుగ్రహ రహితులైన, కేవల బుద్ధిపై నాధారపడిన ప్రతివాదులను గూడ భ్రమలో పడవేయును. సదాశివుని (ఆత్మ) యొక్క అపరోక్షసాక్షాత్కారమైనంతనే, ఆ మోహినీశక్తి, వెంటనే లయ మగును. ప్రతివాదులు చేయు కల్పన యంతయు మాయామయము గాన, భ్రాంతిసిద్ధ మనియు, నిరాధార మనియు తెలియవలయును.

వార్తికము

దేహేన్ద్రియాసుహీనాయ మానదూరస్వరూపిణే।
జ్ఞానానందస్వరూపాయ దక్షిణామూర్తయే నమః ॥ 34

పీయూషవర్షిణీ

దేహ, ఇంద్రియ, ప్రాణరహితుడు, ప్రమాణమాత్రము కంటె నతిదూరముగ నున్న స్వరూపము గలవాడు (ప్రమా ణాతీతుడు) జ్ఞాన, ఆనందస్వరూపుడు నయిన శ్రీదక్షిణా

మూర్తి స్వరూపముతో వెలుగొందు పరమాత్మకు నమస్కారము. ఈవిధముగా నిర్విశేష ఆత్మస్వరూపమును శ్రీ శంకరులు ఈ శ్లోకమున ప్రతిపాదించిరి.

### వార్తికము

ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।
ప్రబన్ధే మానసోల్లాసే పంచమోల్లాస సంగ్రహః ॥

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
పంచమోల్లాస సంగ్రహము
సంపూర్ణము.



రాహుగ్రస్త దివాకరేందుసదృశో మాయాసమాచ్ఛాదనా
త్సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూ
త్సుషుప్తః పుమాన్ ।
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥ ౬

పీ యూ ష వ ర్షి ణి

ప్రత్యగ్రూపుడైన పరమేశ్వరుడు, విశేషవిజ్ఞాన హేతువులైన చక్షురాది యింద్రియములు ఉపసంహృతము లగుటవలన, సన్మాత్రుడై, అనగా పూర్ణ ఆనందాదిరూప ముతో స్పష్టముగా ప్రకాశించక కేవల సన్మాత్రుడుగనుండి సుషుప్తుడగును. ఇంద్రియము లుపసంహృతము లయినపుడు గూడ, పూర్ణానందస్వరూపముతో ప్రకాశించునట్టి ముక్తాత్మ కంటె సుషుప్తాత్మ భిన్నముగనుండును. అట్టి వైషమ్యమునకు కారణము మాయా సమాచ్ఛాదనమే. మాయా సమా చ్ఛాదనము వలననే స్పష్టముగా భాసింపక, కేవల సద్రూపుడై యుండును. స్పష్టమైన భానము లేక కేవల సత్తా మాత్రుడై యుండుటకు ఉదాహరణము చెప్పబడుచున్నది. రాహుగ్రస్తులైన సూర్యచంద్రులవలె ఆత్మ, స్పష్ట ప్రకాశము లేక సుషుప్తుడగును. రాహుగ్రస్తులైనంత మాత్రమున, సూర్యచంద్రులు లేరని చెప్పుటకు వీలులేదు గదా! ఆరీతిగనే, ఇంద్రియము లుపసంహృతము లగుట వలనను, మాయావృత మగుటవలనను సుషుప్తియందు

ప్రత్యగాత్మాభిన్నుడైన పరమేశ్వరుడు స్పష్టముగా భాసింపడు. తావన్మాత్రముచేత ఆత్మ, సద్రూపుడై లేడని చెప్పుటకు వలనుపడదు ('కరణానా ముపసంహారాత్, మాయావృతత్వాచ్చ సుషుప్తౌ స్ఫుట మాత్మా న భాసత ఇత్యేతావతా నాత్మనోఽసత్త్వ మిత్యర్థః').

రాహుగ్రస్తులైన సూర్యచంద్రులకు స్పష్టమైన భానము లేకపోయినను, సాధారణముగా చక్షురింద్రియము ద్వారా సర్వులచే గ్రహింపబడుచున్నారు. ఆకారణముచేత సూర్యచంద్రుల సత్త అనుభవసిద్ధమే. అట్లు, ఎవరును సుషుప్తియందు ఆత్మసత్తను అనుభవించుటలేదు గదా ? యను శంకాపరిహారార్థమై 'ప్రాగస్వాప్సం' అను గ్రంథ మారంభింపబడుచున్నది. సుషుప్తికాలము నందలి యాత్మ మేల్కాంచినంతనే (ప్రబోధసమయే), స్మరించుచున్నాడు. 'ప్రాక్ యోఽహం అస్వాప్సం, స ఇదానీం జాగర్మి'— పూర్వము నిద్రించిన నేను ఇపుడు మేల్కాంచితిని' అని ప్రత్యభిజ్ఞ (స్మృతి, గుర్తించుట) కలవాడగుచున్నాడు. తాదృశమైన యనుభవము పొందకున్న, ప్రత్యభిజ్ఞ కలుగుట యసంభవము. అన్యత్ర, మేల్కొనియున్న దేవదత్తాదులకు అట్టి అనుభవము కలుగకపోవుట వలన, ప్రత్యభిజ్ఞ కలుగుట లేదు. సుషుప్తియందు ఇంద్రియాది సాధనములు లేకపోవుట వలన, అపుడు ఆత్మానుభవము కలుగుటలేదు ('అన్యత్ర

దేవదత్తా దననుభూతే ప్రత్యభిజ్ఞానాదర్శనాత్, నచ తదా కరణేనాత్మానుభవః ఇన్ద్రియాది కరణానాం సుషుప్తావభావాత్ '). కావున, ఆత్మ స్వప్రకాశ స్వరూపుడు, సద్రూపుడునై యున్నాడు. ఆవిధముగా సద్రూపుడై యుండుట వలన, సుషుప్తియందు ఆత్మ, శూన్యవాదులు చెప్పుచున్నట్లు శూన్యము కాదు; క్షణిక విజ్ఞానవాదులు వాకొనునట్లు క్షణికమును గాదు; జడమును గాదు అని చెప్పుట యుక్తిసహామే.

## విశేష వివరణము

"సుషుప్తికాలే సకలే విలీనే తమోఽభిభూత స్సుఖరూపమేతి ।
పునశ్చ జన్మాన్తరకర్మయోగాత్ స ఏవ జీవ స్స్వపితి
ప్రబుద్ధః ॥"

యను కైవల్యోపనిషద్వచనము వలన, సుషుప్తికాలమునందు సమస్తము విలీనము కాగా, తమోఽభిభూతుడైన (అవిద్యావృతుడైన) జీవుడు సుఖరూపమైన స్వరూపమును పొందును. మరల జన్మాంతర కర్మసంబధము వలన ఆ జీవుడే నిద్రించును, మేల్కాంచు నని తెలియుచున్నది. సుషుప్తిదశలో నవిద్య, తోడుగా నుండుటచేతనే జీవుడు మరల ప్రబోధము నొంది అవిద్యాకార్యమగు, జాగ్రద్దశయందువిషయముల ననుభవించుచుండును. అవిద్య, నివృత్తమగుటచే బ్రహ్మాత్మనిష్ఠునకు బాహ్య సంసారవిషయముల యందు ప్రవృత్తి యుండదు.

"సతా సోమ్య తదా సంపన్నో భవతి"

యనుచు ఛాందోగ్యశ్రుతి (౬.౮.౧) సుషుప్తియందు ఆత్మ, సచ్చిదానందరూపముతో నుండునని చెప్పుచున్నది. సుషుప్తి నుండి ప్రబోధము నొందిన వ్యక్తిచేత 'సుఖమహ మస్వాప్సమ్' అనుచు ఆత్మయొక్క సుఖరూపత్వము అనుసంధానము చేయబడుచున్నది. ('ఆత్మన స్సుఖరూపత్వం చోక్తితేన తేనానుసన్ధీయతే సుఖ మహ మస్వాప్స మితి').



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## షష్ఠోల్లాసః

### అవతారిక

పరమాత్మ యందు అధ్యస్తమైన దృశ్యజాత మంతయు స్వప్నమువంటిది; జాగ్రత్ప్రపంచము మోహిని యగు మాయాశక్తియొక్క విలాసముచేత కల్పితము; ఆత్మ, నిత్యుడు, అద్వితీయుడు, నిర్వికారుడు అని దేహాద్యాత్మవాద నిరాకరణము ద్వారా ప్రతిపాదితము. మాధ్యమిక బౌద్ధులు కేవల యుక్తివాదబలముతో స్థాయి యగు నాత్మ సద్రూపుడు కాడని చెప్పుచున్నారు. కావున, విజ్ఞానవాద, శూన్యవాద, పంచస్కంధవాదములు ఈశ్వర మాయాశక్తి విలాసముచేత కల్పితములైన మహావ్యామోహ రూపము లనుచు శ్రీ సురేశ్వరులు అసమాన ప్రతిభతో శూన్యవాద నిరాకరణమునకై ముందుగ శూన్యవాదిమత ప్రతిపాదన పూర్వకముగ తమ వార్తికము నారంభించుచున్నారు.

### వార్తికము

స్వప్నే విశ్వం యథా తత్స్థం జాగ్రత్యపి తథేతిచేత్।
సుషుప్తౌ కస్య కిం భాతి కః స్థాయీ తత్ర చేతనః ॥ ౧

## పీ యూ ష వ ర్షి ణి

సమస్త దృశ్యప్రపంచము స్వప్నము నందు పరమేశ్వరాధిష్ఠితమై యున్నట్లు, జాగ్రద్దశలో తత్పరమేశ్వరాధిష్ఠిత మయియే యున్నదని భావించినచో, సుషుప్తియందు ఏ ద్రష్టకు, ఏ తత్త్వము భాసించుచున్నది ? ఆ సుషుప్తియందు స్థాయీరూపముతో నున్న చేతనుడు ఎవరు? అచట, చేతనాత్మ యనువాడు ఎవడును లేడు, ఎవరికిని ఏదియు భాసింపదనియు, వేదాంతసమ్మతమైన ఆత్మతత్త్వము లేదనియు శూన్యవాది భావించునని భావము.

### వా ర్తి క ము

**సర్వం చ క్షణికం శూన్యం సర్వమేవ స్వలక్షణమ్ ।**
**సంఘాతః పరమాణూనాం మహ్యంబ్వగ్నిసమీరణాః ॥**

### పీ యూ ష వ ర్షి ణి

విజ్ఞానవాదిమతము చెప్పబడుచున్నది. ద్రష్టృ, దర్శన, దృశ్యరూపమైన యీ సమస్తము ఆత్మసహితముగా క్షణికము శూన్యము, సర్వము స్వలక్షణము. అనగా, స్వగ్రాహ్యము. గ్రాహ్య, గ్రాహక భేదమువంటిది కాదు. ప్రతి అనుభవము స్వప్రకాశము గాన, ఆత్మను గాని, బాహ్య పదార్థమును గాని అంగీకరించవలసిన యావశ్యకత లేదు. ఆత్మకు, పదార్థమునకు భేదము నంగీకరించుటయు ననావశ్యకము.

బౌద్ధులలో నేకదేశీయులైన సౌత్రాంతికులు, వైభాషికులు చెప్పునట్టి పంచస్కంధవాదమును గూడ వివరించుచున్నారు. పృథివి, జలము, అగ్ని, వాయువు- ఈ నాలుగు భూతములును చతుర్విధములైన పరమాణువుల సంఘాతము(సముదాయము). వీరు వైశేషికుల వలె పరమాణుకారణవాదమును, సాంఖ్యుల వలె పరిణామవాదమును అంగీకరింపక, సంఘాత వాదమును ప్రమాణముగా భావింతురు.

వార్తికము

మనుష్యాది శరీరాణి స్కన్ధపంచకసంహతిః ।
స్కన్ధాశ్చ రూపవిజ్ఞాన సంజ్ఞాన సంస్కార వేదనాః ॥ 3

పీయూషవర్షిణి

అణువులు హేతువుగా గల బాహ్య సంఘాతమును చెప్పి, స్కంధహేతుకమైన అధ్యాత్మ సంఘాతమును చెప్పుచున్నారు.

మనుష్యాది శరీరములు స్కంధపంచక సంఘాతము. రూపస్కంధము, విజ్ఞానస్కంధము, సంజ్ఞాస్కంధము, సంస్కార సంధము, వేదనాస్కంధ మని యైదు విధములుగా నుండును.

వార్తికము

రూప్యన్త ఇతి రూపాణి విషయాశ్చేన్ద్రియాణ్యపి ।
విషయేన్ద్రియయోః జ్ఞానం విజ్ఞానస్కన్ధ ఉచ్యతే ॥ ४

పీ యూ ష వ ర్షి ణి

ఉద్దేశ క్రమముతో పంచస్కంధముల స్వరూపము వివరింపబడుచున్నది.

విషయములు, మఱియు నింద్రియములు గూడ నిరూపింపబడుచున్నవి గాన, నవి రూపస్కంధములని చెప్ప బడును. విషయములకు, ఇంద్రియములకు సంబంధించిన జ్ఞానము విజ్ఞానస్కంధ మనబడును.

వా ర్తి క ము

సంజ్ఞా గుణ క్రియా జాతివిశిష్ట ప్రత్యయాత్మికా ।
పంచధా కల్పనా ప్రోక్తా సంజ్ఞాస్కంధస్య సౌగతైః ॥ ౨౫

పీ యూ ష వ ర్షి ణి

సౌగత మతానుయాయులైన సౌత్రాంతికాదులు సంజ్ఞాస్కంధము అయిదు విధములుగా నుండునని కల్పన చేసిరి. 1) సంజ్ఞ, అనగా శబ్దము, 2) గుణము, అనగా రూపాదులు, 3) క్రియ, యనగా, తత్తత్కార్యోత్పాదన సామర్థ్యము, 4) జాతి, అనగా అవచ్ఛేదకమైన ధర్మ విశేషము, 5) విశిష్టప్రత్యయము, అనగా అనేకవిధములైన అవయవముల సంస్థాన (సఘూంత) ప్రత్యయము. ఈవిధముగా సౌగతులచేత సంజ్ఞాస్కంధము అయిదు విధములుగా నుండు నని చెప్పబడినది.

వార్తికము

గవాం గౌరితి సంజ్ఞోక్తా జాతి ర్గోత్వం తు గోగతమ్ ।
గుణా శ్శుక్లాదయ స్తస్య గచ్ఛత్యాద్యా స్తథా క్రియాః॥ ౬
శృంగీ చతుష్పా ల్లాంగూలీ విశిష్ట ప్రత్యయో హ్యసౌ ।
ఏవం పంచవిక ల్పైః సంజ్ఞాస్కన్ధ ఇతీర్యతే ॥ ౭

పీయూష వర్షిణి

ప్రాసంగికముగా వచ్చిన యీ స్థైనెంటిని సోదాహర ణముగా నిరూపించుచున్నారు.

గోవులకు 'గోవు' అని 'సంజ్ఞ', లేక నామము చెప్ప బడినది. గోగతమైన (కేవలము గోమాత్రమునందే గల) గోత్వము 'జాతి' యని చెప్పబడును. ఆ గోవు యొక్క ధావళ్యాది వర్ణములు గుణము లనబడును. గమనాదులు క్రియ లని వ్యవహరింపబడును.

కొమ్ములు కలది (శృంగీ), నాలుగు కాళ్ళు గలది (చతుష్పాత్), పుచ్ఛము కలది (లాంగూలీ)- ఇదియే విశిష్ట ప్రత్యయము. 'నానావయవసంస్థాననిబంధనో విశిష్టప్రత్యయః' అనేకావయవముల సంగతిత రూపజ్ఞానమే విశిష్ట జ్ఞానము. వీనిలో ప్రతి యొక జ్ఞానమునందు అనేకత్వము భాసించియు, ఏకత్వము ప్రతీత మగును.

వార్తికము

రాగాద్యాః పుణ్యపాపే చ సంస్కారస్కన్ధ ఉచ్యతే ।
సుఖం దుఃఖం చ మోక్షశ్చ స్కన్ధ స్స్యా ద్వేదనాదయః॥౮

పీ యూ ష వ ర్షి ణి

వ్యక్తినిష్ఠ ధర్మవిశేషములైన రాగ, ద్వేష, కామ, క్రోధాదులు, మఱియు పుణ్యాపాపములు 'సంస్కారస్కన్ధ' మని చెప్పబడును. సుఖదుఃఖములు, మోక్షము ('మోక్షో నామ నిరుపప్లవ విజ్ఞానసంతానోదయః, మోహశ్చేతి పాఠే విషయాద్యాకారోపప్లుత విజ్ఞానసన్తానః') 'వేదన' యను పేరు గల స్కంధ మని వ్యవహృత మగును.

వా ర్తి క ము

**పంచభ్య ఏవ స్కన్ధేభ్యో నాన్య ఆత్మాఽస్తి కశ్చన।**
**న కశ్చి దీశ్వరః కర్తా స్వగతాతిశయం జగత్ ॥ ౯**

పీ యూ ష వ ర్షి ణి

పంచస్కంధాతిరిక్తుడు, శాశ్వతుడు నైన యొకానొక యాత్మ యుండవచ్చును గదా? యని యాశంక జేసి, అట్టి యాత్మాస్తిత్వము నందు ప్రమాణము లేకపోవుటం జేసి ఆత్మనిషేధము చేయబడుచున్నది.

పంచస్కంధములకంటె నన్యుడైన ఆత్మయే లేడు; అయినను అనుసంధాత లేనియపుడు సంఘాతము సిద్ధింపజాలదు గాన, అనుసంధాత, సంఘాతాతిరిక్తుడైన యీశ్వరుడు ఉపాదేయుడు; ఆయనయే ఆత్మ యగును గదా? యని యాశంకించి ఈశ్వరుడను కర్త యెవరును లేడని చెప్పబడినది. ఈ జగత్తు, స్వయంనిర్మితము (స్వగత ఏవ అతిశయో యస్య తత్స్వగతాతిశయం, నాన్యకృతాతిశయయోగీత్యర్థః).

వార్తికము

స్కన్ధేభ్యః పరమాణుభ్యః క్షణికేభ్యోఽభిజాయతే ।
పూర్వపూర్వక్షణాదేవ క్షణస్స్యా దుత్తరోత్తరః ॥ ౧౦

పీయూషవర్షిణి

ఆధిభౌతికము, ఆధ్యాత్మికము నయిన ఉభయవిధ సంఘాతమునందును స్వగతాతిశయత్వము సాధింపబడుచున్నది.

క్షణకాలస్థాయులైన పరమాణువుల వలన, స్కంధముల వలన బాహ్యాభ్యంతర జగత్తులు రెండును ఉత్పన్నమగును. పూర్వపూర్వక్షణమునుండియే ఉత్తరోత్తరక్షణము ఉత్పన్నమగును.

**విశేష వివరణము**

ఇచట, ఒక యాశంక ఉత్థాపితము చేయబడుచున్నది. ఈశ్వరుడు అన్యాపేక్షతో అనుసంధానము చేయుచున్నాడా? లేక అన్యాపేక్షారహితముగనే చేయుచున్నాడా ? అన్య సహకారాపేక్ష లేకయే స్వతంత్రముగా చేయుచున్నాడని యందురేని, దృష్టవిరోధము వచ్చును. వ్రజంగి, ద్వారాదుల యపేక్ష లేకయే, గృహసంఘాతకర్తగా గన్పడుటలేదు. సంధానకర్తృత్వమునకు సంధానయోగ్యమయిన వస్త్వపేక్ష లేకుండుట యసంగతము; సంహన్యమాన (జోడింపదగిన) పదార్థాభావమునందు సంధాన మొనర్చుట యనుపపన్నము ('న యుజ్యతే చ, సంహన్తృతాయాః సంహన్యమాన సాపేక్షత్వాత్, తదభావే అనుపపత్తేః').

పరాపేక్షాసహితముగనే యీశ్వరుడు సంధాన మొనర్చునని యందురేని, ఈశ్వరుడు స్వతః, సంహనన సమర్థములైన పదార్థములను సంధానము చేయుచున్నాడా? లేక, అసమర్థములైన (సంహననమునకు యోగ్యము కాని) పదార్థములను సంధానపఱచుచున్నాడా? మొదటిపక్షము సరి కాదు. ఏలన, స్వతంత్రములైనవానికి అన్యాపేక్ష యుండదు. లేనిచో, ఈశ్వరునకు సైతము ప్రేరకాంతరాపేక్ష ప్రసక్త మగును. ఆప్రేరకునికి మఱియొక ప్రేరకాపేక్ష యావశ్యక మగును. ఈవిధముగ అనవస్థాదోషము వచ్చును. అట్లుగాక, సంధానానర్హములైనవానినే యీశ్వరుడు సంధానము చేయు నని యంగీకరించు పక్షమున, జలము, దధ్యుత్పాదకము కావలసి వచ్చును. కావున, పరమాణువుల కంటె, స్కంధముల కంటె భిన్నుడైన చేతనాత్మను సంధానకర్తగా స్వీకరింప వలసిన యావశ్యకతయే లేదు.

మఱియు, ఈశ్వరుడు అపరిణామి, జగత్తు పరిణామ శీలము గలది. కావున, రెంటికి కార్య కారణభావము పొసగదు. పూర్వక్షణమునందే యనంతరక్షణము యొక్క కారణత్వము అంగీకరింపనగును. ఉత్తరోత్తరక్షణములయందు స్కంధముల యొక్క, పరమాణువులయొక్క పూర్వక్షణ రూపము అనువృత్తమగు నని భావము. ఇచట, 'క్షణ' మనగా క్షణకాలవర్తియైన సత్త యని గ్రహింపవలయును.

వార్తికము

పూర్వస్మాదేవ హి జ్ఞానా జ్జాయతే జ్ఞాన ముత్తరమ్ ।
స ఏవాయ మితి జ్ఞానం సేయం జ్వాలేవ విభ్రమః ॥ ౧౧

పీయూషవర్షిణి

విషయమువలె, విషయి యొక్క జ్ఞానము సైతము హేత్వంతర సాపేక్షము కాదని చెప్పబడుచున్నది.

ఎలన, పూర్వజ్ఞానము వలననే, అనంతర జ్ఞానము ఉదయించును. "సఏవాయమ్"-అతడే యితడు, అను జ్ఞానమును "సేయం జ్వాలా"- అదియే యీ జ్వాల' అనునట్లు భ్రాంతి మాత్రమే.

**విశేష వివరణము**

'అదియే యీ ఘటము' 'ఆ పురుషుడే నేను' 'స ఏవాయం ఘటః, సోఽహం పుమానస్మి' అను ప్రత్యభిజ్ఞ విషయ, విషయులకు స్థాయిత్వమును సిద్ధింపజేయును. కావున, క్షణికత్వము సిద్ధింపదు అని శంక రాగా, సమాధానముగా 'సేయం జ్వాలేవ' అని చెప్పబడినది. జ్వాల ప్రతిక్షణము నష్టమైనను, నిరంతరము సమానమైన మరియొక జ్వాల యుత్పన్న మగుచుండును. ఆ కారణముచేత తజ్జ్వాలల భేద జ్ఞానమునకు ప్రతిబంధకమై 'సేయం జ్వాలా' యను భ్రాంతిని కలిగించును. ఆ రీతిగనే, ఏ పదార్థము యొక్క స్థాయిత్వ మైనను, భ్రమయే ('జ్వాలావన్నిరన్తరోత్పన్నైః భేదాగ్రహ నిబంధనో విభ్రమః ప్రత్యభిజ్ఞేత్యర్థః') యని భావము.

వా ర్తి క ము

**అస్తి భాతీతి ధీర్భ్రాన్తై రాత్మానాత్మసు కల్ప్యతే ।**
**హానోపాదానరాహిత్యా దాకాశః కిం ప్రకాశతే ॥ ౧౨**

పీ యూ ష వ ర్షి ణీ

సౌగత పక్షము ఉపసంహారము చేయబడుచున్నది. భ్రాంతులైన యవివేకులు ఆత్మ-అనాత్మలయందు 'అస్తి'– ఉన్నది, 'భాతి'– ప్రకాశించుచున్నది యనెడి బుద్ధిని కల్పింతురు. హాన-ఉపాదాన రహితమైన (గ్రహణముగాని, అగ్రహణముగాని, లేని) ఆకాశము ఏమి ప్రకాశించును ?

**విశేష వివరణము**

భ్రమ యనగా సవికల్పక జ్ఞానము (సవికల్పక జ్ఞానం భ్రమః). ఈ భ్రమకారణముగనే ఆత్మయందు అనాత్మ భావము, అనాత్మయందు ఆత్మభావము కలుగును. ఆత్మ యందు సత్తాస్ఫురణములు భ్రాంతిసిద్ధములని చెప్పుటయందు హేతువు ఇట్లు ప్రదర్శింపబడును. "ఆత్మా అవస్తుః, అహేయానుపాదేయత్వాత్, ఆకాశవత్. యథాప్రతిపత్తి సంవాదాభావా దిత్యభిప్రాయః".

వా ర్తి క ము

**ఇత్యేవం బౌద్ధసిద్ధాన్తి భాషమాణో నిషిధ్యతే । ౧౩**

పీ యూ ష వ ర్షి ణీ

ఈవిధముగా భాషించునట్టి సౌగత మతానుయాయి చేయునట్టివాదమును నిరాకరించుచు శ్రీశంకరభగవత్పాదులు

'రాహుగ్రస్త దివాకరేందు సదృశః' అని శ్రీ దక్షిణామూర్తి స్తోత్ర శ్లోకము నారంభించినారు.

ఈ శ్లోకమునందలి తాత్త్వికార్థమును శ్రీ సురేశ్వరాచార్యులు ఇట్లు వివరించుచున్నారు.

### వార్తికము

శూన్యం చే జ్జగతో హేతు ర్జగదేవ న సిద్ధ్యతి ।
ఘట శూన్యః పట శూన్య ఇతి కైః ప్రతిపాద్యతే ॥౧॥

### పీయూషవర్షిణి

శూన్యము జగత్కారణమైనచో, ప్రపంచమే యుండదు. 'ఘట శూన్యః'- 'ఘటము శూన్యము' 'పటశూన్యః'– 'వస్త్రము శూన్యము' అని ఎవరు ప్రతిపాదింతురు ?

### విశేష వివరణము

"యదుచ్యతే బౌద్ధైః జగద్ధేతుత్వేన ఉపలక్షిత ఈశ్వరః ఆత్మా నాస్తి శూన్యమేవ జగతః ప్రాగవస్థేతి"-జగత్కారణమైన ఆత్మ (పరమేశ్వరుడు) లేడనియు, జగత్తుయొక్క పూర్వావస్థ శూన్యమే యనియు బౌద్ధులు చెప్పుదురు. తన్నిరాసము చేయబడుచున్నది. బౌద్ధులు సృష్టికి పూర్వము శూన్యమే కారణరూపముగ నున్నదని చెప్పుదురు. శూన్యమునందు కారణరూపత్వమును కల్పింపబూనుట యుక్తిసహము కాదు. కార్యకారణభావము ఉన్న స్థలమున, కార్యము

స్వోపాదానకారణరూపముతోనే ప్రతీయమాన మగును. సువర్ణ కుండలాదులు స్వోపాదానకారణమైన సువర్ణ రూపముతోనే భాసించుట యనుభవసిద్ధము. ఆరీతిగనే, జగత్తునకు శూన్యమే ఉపాదాన కారణమైనచో, ఆ జగత్తు శూన్యాత్మకముగనే వ్యవహృత మగును; సదాత్మక వ్యవహారము ప్రసక్తము కాదు. కాని, సర్వులు జగత్తును సదాత్మకముగా వ్యవహరించుట లేదు.అకారణ కార్యోత్పత్తి యంగీకరించినపుడు, కార్యార్థియందు ఉపాదానప్రవృత్తి చూడబడరాదు. అసత్పూర్వకత్వకల్పన యందు అసత్పదార్థమునకు సద్రూపత్వము లభించునని చెప్పుటకు దృష్టాంతము లేదు. ('అకారణకార్యోత్పత్త్యభ్యుపగమే కార్యార్థినా ఉపాదాన ప్రవృత్తి దర్శన విరోధాత్, అసత్పూర్వకత్వ కల్పనాయాం అసతః సదాత్మతాపత్తౌ దృష్టాన్తాభావాత్)'. "కథ మసతః సజ్జాయేత" యనుచు శ్రుతి యసత్పదార్థము నుండి సత్పదార్థము ఎట్లు జనించు? ననుచు యసత్తును జగత్కారణముగా చెప్పజనదని నిరసించుచున్నది. కావున, అసత్కారణత్వపక్షము ప్రామాణికులకు ఆదరణీయముకాదని నిష్కృష్టార్థము.

వా ర్తి క ము

నైవ భాసేత శూన్యం చే జ్జగ న్నరవిషాణవత్ ।
వ్యక్తస్వర్థీ కిముపాదద్యాత్ భారార్తః కిం పరిత్యజేత్॥ ౧౫

## పీయూషవర్షిణి

పూర్వోక్తమైన సర్వవ్యవహారవిరోధమే వివరింపబడుచున్నది. యద్వా, శూన్యము కారణముగా గల జగత్తు శూన్య మయినను, సంవృతి, లేక భ్రమ వలన వ్యవహారము జరుగుచునే యుండుననుట సరి కాదు. ఏలన, శూన్యము నిరుపాఖ్యము (సత్తారహితము, నామరహితము). కావున, సంవృతియు శూన్యమునందు వ్యవహారమును సిద్ధింపజేయ లేదనుచు చెప్పబడుచున్నది.

జగత్తు శూన్యమైనచో, నరవిషాణమువలె భాసించక పోవలయును. వస్తువు నభిలషించువాడు దేనిని గ్రహించును? భారముచే బాధపడువాడు దేనిని పరిత్యజించును?

## విశేష వివరణము

నరవిషాణము వలె అసత్పదార్థము భ్రాంతిచేత గూడ, ప్రతీతము కాదు. మిథ్యావస్తువునకు, అసద్వస్తువునకు గల భేద మిదియే. అనుభవకాలములో ఉండి, తరువాతికాలములో లేనిది మిథ్య యనబడును. మిథ్యాభూతమైన వస్తువు సాధిష్ఠానమై యుండును. కాలత్రయమునందును ప్రతీతము కానిది అసద్వస్తువు. అద్వైతవేదాన్తశాస్త్రమునందు జగత్తు మిథ్యయే గాని అసత్తు కాదు గావున, వ్యవహార్యము. పూర్వమునందున్న పదార్థమే గ్రహణత్యాగములకు విషయ మగును గాని, అవిద్యమాన వస్తువు కాదు. కావున, శూన్య వాదమునందు వ్యవహారము అసంభవము.

### వార్తికము

**కో విధత్తాం నిషేద్ధా వా శూన్యత్వాత్ స్వస్య చాత్మనః ।**
**అవసీదే న్నిరాకూతం తస్మాత్సర్వమిదం జగత్॥ ౧౩**

### పీయూషవర్షిణీ

వ్యవహారయోగ్యములైన పదార్థములవలె, వ్యవహర్త కూడ నుండడు గాన, శూన్యవాదమునందు వ్యవహారము అనుపపన్నమని చెప్పబడుచున్నది.

తనకు తాను, శూన్యమగుట వలన, విధించువాడు ఎవరు? నిషేధించువాడు ఎవరు? కావున, ఈ సమస్త జగత్తు, నిష్ప్రయోజనముగ (నిర్హేతుకముగ) నశించిపోవును.

### విశేష వివరణము

విధి, నిషేధములు లేకపోవుట వలన, శూన్యవాదమునందు ధర్మ, అర్థ, కామ, మోక్షరూపములైన చతుర్విధ పురుషార్థములకు తావు లేదు. విధి, నిషేధములు లేనందున, ఈశ్వరుడు, భోక్తయైన జీవుడు లేకపోవుట వలన, ధర్మాచరణము అసంభవము. వ్యవహారాభావము వలన, అర్థము సిద్ధించదు. భోగ్యజాతాభావము వలన కామపురుషార్థమునకు చోటు లేదు. మోక్షవిషయమందురా, శూన్యరూపమే. ఈ విధముగ సమస్తము అవసన్నమగును.

### వార్తికము

**స్థూలానాం పరమాణూనాం న సంఘాతయితాఽస్తి చేత్।**
**సంఘాతో న వినా హేతుం జడా ఘటపటాదయః॥ ౧౪**

## పీయూషవర్షిణి

ఇపుడు పంచస్కంధ సంఘాతాత్మవాదమును నిరాకరించుచున్నారు. పరమాణువులను, స్కంధములను సంధానపఱచునట్టి స్థాయియైన కర్త లేడనినచో, నిర్హేతుకముగ సంఘాతము జరుగదు. ఘట, పటాదులు జడములు గాన, సంధానము చేయుటయందు నసమర్థములు.

పంచస్కంధ సంఘాతాత్మవాదులను ఇట్లు ప్రశ్నింపనగును. స్కంధములను, పరమాణువులను సంధానమొనర్చునట్టి కర్త యెవడైనను గలడా, లేడా? ఉన్నచో, స్థిరమైనవాడా, లేక క్షణికుడా? స్థిరమైనవాడని యందురేని, వారి సిద్ధాంతము (సర్వక్షణికత్వవాదము) అపసిద్ధాంతమగును. క్షణికుడందురేని, ఏకత్రితము (సంధానము) చేయువాడు కార్యారంభక్షణమునందే నశించును; సంఘాతము నొక్క యుత్పత్తిక్షణమునందు అసంబంధి (సంబంధము లేనివాడు) అగును. ('సంఘాతోత్పత్తి క్షణాసంబంధినః సంఘాతయితృత్వానుపపత్తిః') సంఘాతోత్పత్తిక్షణమున లేనివాని యందు కారణత్వము నంగీకరించుట సర్వదా యసంగతము. సంఘాతకర్తయే లేనిచో, సంఘాతమే సిద్ధించదు. అనగా, తాదృశ దృష్టాంతమే లభింపదు. సంహన్యమాన పదార్థములైన ఘటపటాదులు సంహననాసమర్థములు. లోకమునందు జడములైన తంతు (దారము), వీరణ (వట్టివేరు), మృత్తు, కొయ్య మొదలైనవానికి, తంతువాయ (నేతనేయువాడు),

పురుష (వట్టివేళ్ళచాప నేయువాడు) కులాల (కుమ్మరి) తక్ష (వడ్రంగి) మొదలగు నధిష్ఠానములు లేనివానికి స్వయముగనే పట (వస్త్రము) కట (చాప) ఘట, రథాది రూపములతో సంహన్యమానత్వము లభింపదు ('నహి లోకే జడానాం తంతు వీరణ మృద్దార్వాదీనాం కువింద పురుష కులాల తక్షాద్యనధిష్ఠితానాం స్వయమేవ పట కట ఘట రథాద్యాత్మనా సంహన్యమానతా ఉపలభ్యతే'). కావున, దృష్టాంతము లేక పోవుట వలన, విశేషించి, దృష్టాంతవిరోధము వలన, నిరాత్మకమైన స్కంధవాదము అప్రామాణిక మని భావము.

వా ర్తి క ము

**మహానుభావో భూయాసమితి భ్రాన్తశ్చ మన్యతే ।**
**ఆత్మాపలాపకో బౌద్ధః కిమర్థం చరతి వ్రతమ్ ॥ ౧౮**

పీ యూ ష వ ర్షి ణీ

క్షణికాత్మపక్షము నంగీకరించునట్టి బౌద్ధుల యవివేకము ను ప్రకటించుచు, ఆ మతమునందలి యసామంజస్యమును సూచించుచున్నారు.

భ్రాంతుడు (దృష్టమాత్రప్రత్యయః భ్రాంతః), ఆత్మ సత్త నపలాపించువాడు నగు బౌద్ధుడు, ఏ ప్రయోజనము నాశించి వ్రతమును(వ్రతం పారలౌకికం చైత్యవందనాదీత్యర్థః) చేయుచున్నాడు ? మఱియు, మహానుభావుడను కావలయు నని భావించుచున్నాడా ?

కర్త, భోక్త యొకఁడైనపుడే, ప్రయోజనము సిద్ధించును. క్షణికాత్మవాదమునందు సర్వము క్షణికము గాన, కర్త, భోక్త ఒకఁడు కాఁడు. కావున, చైతన్యవందనాది వ్రతాచరణము వ్యర్థము ('క్షణికాత్మమతే కర్తు ర్భోక్తు శ్చైకస్యాభావాత్ వ్రతాచరణం వ్యర్థమ్'). ఆ కారణము చేత తద్విధాయక శాస్త్రము అతనికి ప్రామాణికము కావని భావము.

వా ర్తి క ము

ప్రత్యభిజ్ఞా యది భ్రాన్తి ర్భోజనాది కథం భవేత్ ।
ఇష్టసాధన మేవైతదన్నం గత దినాన్నవత్ ।
ఇతి నిశ్చిత్య బాలోఽపి భోజనాదౌ ప్రవర్తతే ॥ ౧౫

పీ యూ ష వ ర్షి ణి

బౌద్ధమతఖండనము చేసి, ఇపుడు ప్రత్యభిజ్ఞ యందు ప్రతివాదులు చూపునట్టి దోషములను నిరసించుచు ప్రమా రూపత్వమును సాధించుచున్నారు.

ప్రత్యభిజ్ఞ భ్రాంతి యైనచో, భోజనాదికము ఎట్లు జరుగును ? గత దినము భుజించిన యన్నము వలె, పురోవర్తి యైన యీ యన్నము ఇష్టసాధన మని, అనగా, క్షుద్బాధా నివృత్తి సాధన మని నిశ్చయించుకొని, బాలుఁడు సైతము భోజనాదికమునందు ప్రవర్తించుచున్నాఁడు.

విశేష వివరణము

ప్రత్యభిజ్ఞ యనగా, స్మృతి, అనుభవముల మిశ్రణము.

పదార్థములను చూచినపుడు అనుకూల, ప్రతికూల సంవేదనలు (ప్రవృత్తి నివృత్తులు) కలుగుట యనుభవ సిద్ధము. ప్రవృత్తి, నివృత్తులు నాకు ఇది యనుకూలము, ఇది ప్రతికూలము అను బుద్ధినిశ్చయములు ('ప్రవృత్తినివృత్తీ చ మన్మైత దనుకూలం ప్రతికూల మితి బుద్ధినిబంధనే'). అనుభవింప బడిన పదార్థము తనకు సుఖాపాదకమైనచో అది, యనుకూలముగా ప్రతీత మగును; దుఃఖసంధాయక మైనచో ప్రతికూలముగా తోచును(అనుకూలవేదనీయం సుఖం, ప్రతికూలవేదనీయం దుఃఖమ్). ఏ పదార్థమునైనను, చూచి నంతమాత్రమున, సుఖ, దుఃఖజన్యజ్ఞానము కలుగదు. ఏ పదార్థమునకు సజాతీయమైన వస్తువు యొక్క పూర్వాను భవము కలుగునో, ఆ వస్తువునందే, చూచినంతమాత్రమున, అకస్మాత్తుగా ప్రవృత్తిగాని, నివృత్తిగాని, కలుగును. కాగా, పూర్వానుభూతమైన సజాతీయత్వలింగము చేత, అనుకూల్య, ప్రాతికూల్యములను ఊహించియే ప్రవృత్తినివృత్తులు కలుగుచున్నవని తప్పనిసరిగా నంగీకరింపవలయును. ('యత్ర సహసా వస్తుదర్శనమాత్రాత్ ప్రవృత్త్యాది దృశ్యతే, తత్ర పూర్వానుభూత సజాతీయత్వేన లింగేన తస్య స్యానుకూలత్వం ప్రతికూలత్వం వా అనుమాయ ప్రవర్తతే నివర్తతే చేత్యంగీకార్యమ్') అత్యంతవ్యవహిత పూర్వోత్తర కాలముల యందు అనుస్యూతముగా నొక అనుసంధాతయైన

ఆత్మ లేకపోయినచో, ఇది (ఈ ప్రత్యభిజ్ఞ) యెట్లు పొసగును? కావున, క్షణికవాది యొక్క జీవితము గూడ దుర్భరమగును. "వివాతో౽యమోదనో మదిష్టసాధనమ్, ఓదనత్వాత్, గతదినభుక్తౌదనవత్" అని యనుమాన ప్రమాణము చేత బాలుడు గూడ, భోజనాదికమునందు ప్రవర్తించుచున్నాడు. కావున, ఆబాలవృద్ధులయందు, ఆగోపపండితులయందు నిస్సంశయముగా ప్రసిద్ధమై యున్న వ్యవహారమార్గము నపలపించునట్టి బౌద్ధుని, శ్రేయస్కాములైనవారు దూరముగ పరిహరింపవగునని తాత్పర్యము.

వార్తికము

అవకాశప్రదాతృత్వ మాకాశార్థక్రియా యథా ।
తథైవార్థక్రియా పుంసః కర్తృత్వ జ్ఞాతృత్వాదికా ॥ ౨౦

పీయూషపర్షిణీ

ప్రత్యభిజ్ఞ, భ్రమ యను అపలాపము నివారింపబడినది. ఇప్పుడు, స్థాయి యగు వస్తువునకు అర్థక్రియాకారిత్వము అనుపపన్న మనియు, ఆత్మ క్షణికమనియు బౌద్ధులు చేయునట్టి వాదము అవిచారిత రమణీయ మని చెప్పుచు, ఆత్మయందు అర్థక్రియాకారిత్వమును సాధించుచున్నారు.

అవకాశము నొసగుట ఆకాశము యొక్క యర్థక్రియలు. ఆవిధముగనే, ఆత్మయొక్క, అర్థక్రియలు కర్తృత్వ, భోక్తృత్వములే యని భావము.

## విశేష వివరణము

ఆకాశమును అవస్తువు అని చెప్పుటకు వీలు లేదు. అనావరణరూపమైన అభావము ఆకాశము కాదు. పదార్థముల కదలికకు సాధనమైన యొక తత్త్వము ఆకాశము. ఆవరణాభావమాత్రము చేత ఆకాశము అర్థక్రియాకారి కాదని చెప్ప జనదు. ఆవరణాభావమాత్రము గూడ అభావరూప మగుట వలన, సాధిష్ఠానమయియే యుండవలసియుండును. నిరధిష్ఠానమైన అభావము ఎచటను సంభవము కాదు. ఆవరణాభావమునకు ఏదేని సత్తను అంగీకరించినచో, అది ఆకాశరూపమే యగును. కావున, ఆకాశము అర్థక్రియాకారి యగుట వలన, ఆకాశము ఒక పదార్థరూప తత్త్వమే యని స్పష్ట మగును.

ఆ రీతిగనే, ఆత్మకు జ్ఞాతృత్వ, కర్తృత్వములు ప్రసిద్ధములు. కావున, అర్థక్రియాకారి యగుటవలన ఆత్మాస్తిత్వసిద్ధియందు పైన పేర్కొనిన యుక్తిచేత ఆత్మయొక్క స్థాయిత్వము స్పష్టమని భావము.

### వార్తికము

సుషుప్తిసమయేఽప్యాత్మా సత్యజ్ఞానసుఖాత్మకః ।
సుఖమస్వాప్స మిత్యేవం ప్రత్యభిజ్ఞాయతే యతః ॥ ౨౧

### పీ యూ ష వ ర్షి ణీ

అర్థక్రియాకాలమునందే ఆత్మసత్తను అంగీకరింప నగును; కావున, జాగ్రత్ స్వప్నదశలయందు ఆత్మకు అర్థ

క్రియాకారిత్వము ఉండునని యంగీకరింతుము. కాని, సుషుప్తియందు అర్థక్రియలకు ప్రసక్తి లేదు; ఆ కారణముచేత ఆత్మకు అసత్త్వము (సత్త్వాభావము) ప్రాప్త మగుచున్నదని శంక రాగా, తత్సమయమునందు సైతము ఆత్మాస్తిత్వమును చెప్పుచున్నారు.

'సుఖ మహస్వాప్సమ్'-సుఖముగా నిద్రించితిని' యని నిద్రనుండి మేల్కొంచినవాడు స్మరించుచున్నాడు (ప్రత్యభిజ్ఞాయగా). కావున, సుషుప్తికాలమునందు గూడ ఆత్మ సత్య, జ్ఞాన, సుఖస్వరూపుడై యున్నాడని తెలియ నగును.

## విశేష వివరణము

'యోఽహ మస్వాప్సం సోఽహ మిదానీం జాగర్మి'- సుఖముగా నిద్రించిన నేనే ఇపుడు మేల్కొంచుచున్నాను' అను వాక్యము అనుభవద్వయమునందు అనుగతుడై యున్న ఒకే చేతనాత్మను నిర్దేశించుచున్నది. ఇది ప్రత్యభిజ్ఞాస్ఫోటక వచనము. ప్రత్యభిజ్ఞ యొక్క ప్రామాణ్యము, పూర్వమే సాధింపబడినది. బౌద్ధుడు గూడ ప్రత్యభిజ్ఞను భ్రమ యని చెప్పజాలడు. ఏలన, పూర్వోత్తర క్షణములయందు ఒక ద్రష్ట యొక్క సద్భావము నంగీకరించకపోవుట వలన, సాదృశ్యమును గ్రహించువాడు ఉండడు ('పూర్వోత్తర క్షణయో రేకస్య ద్రష్టుః సద్భావాసంగీకారాత్ సాదృశ్య గ్రాహకాభావాత్'). కావున, బౌద్ధుని ప్రత్యభిజ్ఞా భ్రమ

కూడ సిద్ధింపనేరదు. ప్రత్యభిజ్ఞను భ్రమ యనుట యతని ప్రలాపము మాత్రమే యని భావము.

సుషుప్తియందు సుఖానుభవము ఉన్నది. తాదృశ సుఖమును అనుభవించునట్టి యాత్మ సద్రూపుడై యున్నాడు. అనుభవము కలుగుటవలన జ్ఞానస్వరూపుడై యున్నాడు. సుఖసాధనరహితమైన ఆనందము కలదు. కావున, ఆత్మ స్వయముగనే, ఆనందస్వరూపుడు. కావుననే "ఆత్మా సత్య జ్ఞానసుఖాత్మకః" యని వార్తికమునందు ఆత్మ పేర్కొన బడినాడు.

## వా ర్తి క ము

ప్రత్యభిజ్ఞాయత ఇతి ప్రయోగః కర్మకర్తరి।
ఆత్మా స్వయంప్రకాశత్వాత్ జానాత్యాత్మాన మాత్మనా॥

## పీ యూ ష వ ర్షి ణీ

'ప్రత్యభిజ్ఞాయతే'- 'గుర్తింపబడుచున్నాడు' అనునది కర్మకర్తరిప్రయోగము. స్వయంప్రకాశు డగుటవలన ఆత్మ, ఆత్మ చేత ఆత్మను తెలిసికొనుచున్నాడు అని భావము.

## విశేష వివరణము

క్షణిక విజ్ఞానవాదియైన బౌద్ధుడు 'ఆత్మ, ప్రత్యభిజ్ఞానము చేత తెలిసికొనబడుచున్నాడు' అను వచనమును వ్యాకరణ శాస్త్రదృష్టితో ఆక్షేపించును. ఇచట ఆత్మ, కర్మ యగు చున్నాడు. అనగా, ఆత్మ, జ్ఞానమునకు విషయ మగు

చున్నాడని యర్థము. కావున, ఆత్మ, జ్ఞానస్వరూపుడని గాని, స్వయంప్రకాశస్వరూపుడని గాని, చెప్పుటకు నవకాశము లేదు. జ్ఞానమునకు విషయము ఆత్మ యని యంగీకరించి నపుడు, దృశ్యత్వము వచ్చును. తత్కారణముగ అనిత్యత్వాదులు వచ్చును గదా ? యను శంక సమూలముగా పెకలించి వేయబడుచున్నది. 'ముచ్యతే వత్సః'- దూడ బంధవిముక్త మగుచున్నది' అను కర్మకర్తరిప్రయోగము వంటిదే యీ 'ప్రత్యభిజ్ఞాయతే' యను ప్రయోగముకూడ. కావున, 'ఆత్మా ఆత్మనా ఆత్మానం జానాతి' యని చెప్పుట చేత ఆత్మ, జ్ఞానవిషయము కాదు. ఆత్మయొక్క స్వయం ప్రకాశత్వమునకు విరోధము లేదని భావము.

వా ర్తి క ము

**సుషుప్తౌ మాయయా మూఢో జడోఽన్ధ ఇవ లక్ష్యతే।**
**అప్రకాశతయా భాతి స్వప్రకాశతయాఽపి చ ॥ ౨౩**

పీ యూ ష వ ర్షి ణి

ఇంతవఱకు, తాత్పర్యవర్ణనము ద్వారా ఆత్మయొక్క నిత్య శుద్ధ బుద్ధ ముక్తస్వభావము ప్రతిపాదింపబడినది. ఇపుడు 'రాహుగ్రస్త దివాకరేందుసదృశః' యను శ్లోకము యొక్క యక్షరార్థము వివరింపబడుచున్నది.

మాయామోహగ్రస్తుడైన వ్యక్తి, సుషుప్తియందు ప్రకాశరహితుడై జడునివలె, అంధునివలె గోచరించును, మఱియు, స్వప్రకాశరూపముతోను భాసించును.

## విశేష వివరణము

సూర్యచంద్రులు రాహుగ్రస్తులైనట్లు, ఆత్మ, మాయా గ్రసిత మగును. రాహుగ్రస్తులగుటచే సూర్యచంద్రులు ప్రకాశరహితముగ నుండిరేని, తమకు ఆచ్ఛాదకమైనదానిని ప్రకాశింపజేయుచు తాము గూడ స్వయంప్రకాశులై యుందురు. ఆరీతిగనే, ఆత్మ, స్వావరకమైన మాయాశక్తిని ప్రకాశింపజేయుచు, స్వయంప్రకాశరూపముతో భాసించును.

సుషుప్తియందు జీవుడు జడునివలె, అంధునివలె నుండు నని చెప్పబడినది. జడత్వ మనగా, అచేతనత్వము; అంధత్వ మనగా, అజ్ఞాతృత్వము. కావున, విషయవిజ్ఞానము లేకపోవుట వలన అప్రకాశమానముగా భాసించుచు, 'న కించి దవేదిషమ్' అని చెప్పును. కావున, విశేషవిజ్ఞానాభావము వలన అప్రకాశరూపముగా ప్రతీత మగును. అపుడు, స్వరూప విజ్ఞానము లోపించదు; 'సుఖ మహ మస్వాప్సమ్' అనెడి ప్రత్యభిజ్ఞానము కలవాడగుటచేత స్వయంప్రకాశరూపముతో గూడ, భాసించును. ('జడత్వ మచేతనత్వమ్, అన్ధత్వ మజ్ఞాతృత్వ మితి భేదః. అతో విశేషవిజ్ఞానాభావాత్ అప్రకాశతయా భాతి. స్వరూపవిజ్ఞానస్య విలోపాభావాత్ స్వప్రకాశతయాపి చ ఆభాతీత్యర్థః').

### వా ర్తి క ము

జడాత్మని చ దేహాదౌ సాక్షాదీశో వివిచ్యతే ।

పీయూషవర్షిణి

ఇంతవఱకు, జరిగిన గ్రంథము ద్వారా, 'రాహుగ్రస్త' యను శ్లోకము యొక్క పూర్వార్థము వివక్షితము, ఇపుడు, ఉత్తరార్థము నందలి మొదటి పాదము యొక్క యర్థము చెప్పబడుచున్నది.

స్వపరవ్యాపారములు తెలియునట్టివి, జడములు నైన దేహేంద్రియ మనోబుద్ధులయందు 'యోఽహం మద్రాక్షం సోఽహం జిఘ్రామి'- చూచిన నేనే, ఆఘ్రాణించుచున్నాను; శృణోమి - వినుచున్నాను; వచ్మి - మాట్లాడుచున్నాను; మన్యే - తలంచుచున్నాను; జానామి - తెలిసికొనుచున్నాను; గచ్ఛామి-నడచుచున్నాను; తిష్ఠామి-కూర్చుండుచున్నాను; లంఘయామి - ఎగిరి దుముకుచున్నాను అని, సర్వావభాసకుడుగా ప్రత్యభిజ్ఞాతుడైన ఆత్మ (జీవుడు) సాక్షాత్తుగ నీశ్వరు డని వివేచన చేయబడుచున్నాడు.

వార్తికము

ఏషైవ మోహినీ నామ మాయాశక్తిర్మహేశితుః ।
మోహాపోహః ప్రమాతౄణాం మోక్ష ఇత్యభిధీయతే ॥

పీయూషవర్షిణి

ఈవిధముగా ఆత్మయొక్క నిత్య శుద్ధ బుద్ధ ముక్త లక్షణమైన యీశ్వర స్వభావము అవిద్యచేత ఆవృత మగును; అవిద్యానివృత్తి యైనంతనే, భేదకాభావము వలన విద్వాంసులైన జ్ఞానులకు సంసారబంధము తొలగిపోవును.

ఈ యనిర్వచనీయము మోహినీ మాయాశక్తి; ఆ మోహినీశక్తి చేత మోహితులైన బౌద్ధులు నైరాత్మ్యవాదము నాశ్రయించినారని యుపసంహారము చేయబడుచున్నది.

మోహిని యను పేరు గల మహేశ్వరునియొక్క మాయాశక్తి యిదియే. ప్రమాతలయొక్క (అంతఃకరణావచ్ఛిన్నమైన ఆత్మ, ప్రమాత యనబడును) మోహనివృత్తి (అవివేకము తొలగిపోవుట) మోక్ష మని వ్యవహరింపబడును.

వా ర్తి క ము

**అవస్థాత్రయనిర్ముక్తో దోషాదిభి రనావిలః ॥ ౨౫**

పీ యూ ష వ ర్షి ణి

ప్రబోధకాలమునందు ప్రత్యభిజ్ఞాయమానుడైన (స్మరింపబడుచున్న) ఆత్మయొక్క స్వరూపము చెప్పబడుచున్నది.

పరమాత్మ జాగ్రత్, స్వప్న, సుషుప్తిరూపమైన యవస్థాత్రయము లేనివాడు ('అవస్థాత్రయ సాక్షిత్వాదేవ అవస్థాత్రయవర్జితః'); సంకల్ప, కామాది దోషస్పర్శ లేనివాడు ('దేహాదిభి రనావిలః సాక్ష్యసంబంధకృత దోష రహితః అసంగత్వాత్'). "అసంగోహ్యయం పురుషః", "అసంగో నహి సజ్జతే" ఇత్యాది శ్రుతులు ఆత్మస్వరూపము సంగవర్జితము అని యుద్ఘోషించుచున్నవి.

వార్తికము

ఇషీక ఇవ సన్మాత్రో న్యగ్రోధకణికోపమః ।
బాహ్యా ద్బాహ్యాదలోన్మృక్తః కదలీకందసన్నిభః ॥ ౨౭

పీయూషపఙ్క్తిః

ఆత్మ, సదా ఏకరూపమని, ఇంద్రియాగోచరమని చెప్పబడుచున్నది.

ముంజగడ్డి యొక్క - అతిసూక్ష్మమైన శలాక (గడ్డిపోచ) వలె ('ముంజతృణపుంజాస్త శ్శలాకా ఇషీకే త్యుచ్యతే') ఆత్మ, సన్మాత్రుడు, వటవృక్షబీజసదృశుడు, అతి బాహ్య దళముల నుండి విడివడిన అరటిదుంపవంటివాడు. అనగా, అన్నమయాది కోశముల కతీతముగా జీవుల హృదయాకాశము నందు పరమాత్మ లభించునని భావము.

వార్తికము

నిరంశో నిర్వికారశ్చ నిరాభాసో నిరంజనః ।
పురుషః కేవలః పూర్ణః ప్రోచ్యతే పరమేశ్వరః ॥ ౨౮

పీయూషపఙ్క్తిః

పూర్వశ్లోకోక్తములైన ఇషీకా, వటబీజ, కదలీకంద దృష్టాంతముల వలన, సావయవత్వ, పరిచ్ఛిన్నత్వ, వికారిత్వాదులు ఆత్మకు కలుగును గదా ? యను శంకను పరిహరించుటకై యీ వార్తికము ఆరంభింపబడినది.

అవయవరహితుడు, వికార రహితుడు, నిరాభాసుడు (జన్యజ్ఞానావిషయః), నిరంజనుడు (నిర్లేపః), పూర్ణుడు (అపరిచ్ఛిన్నః), కేవలుడు (ఉపాధిసంసర్గరహితః) నగు పురుషుడు (చేతసా త్మా) పరమేశ్వరుడని చెప్పబడును.

వా ర్తి క ము

వాచో యత్ర నివర్తంతే మనో యత్ర విలీయతే ।
ఏకీభవన్తి యత్రైవ భూతాని భువనాని చ ॥ ౨౦
సమస్తాని తత్త్వాని సముద్రే సిన్ధవో యథా ।
క శ్శోక స్తత్ర కో మోహ ఏకత్వ మనుపశ్యతః ॥ ౨౧

పీ యూ ష వ ర్షి ణి

పై శ్లోకమునందు వర్ణింపబడిన పరమేశ్వరునకు శ్రుతి ప్రతిపాదితమైన సర్వప్రపంచధర్మ విలక్షణ స్వభావము విశదీకరింపబడుచున్నది.

ఏ పరతత్త్వమునుండి వేదవాక్కులు నివృత్తములగునో, ఏ పరమేశ్వరునియందు మనస్సు విలీనమగునో, ఏ పరమాత్మ యందు సమస్త భూతములు, లోకములు, తత్త్వములు (తత్త్వాని—జీవాః), నదులు సముద్రములో జేరి కలసిపోయినట్లు ఏకీభూతము లగుచున్నవో, ఆ పరమాత్మ యందు ఏకత్వాను భవము పొందువానికి శోకమోహము లేమి యుండును ?

## విశేష వివరణము

"యతో వాచో నివర్తన్తే, అప్రాప్య మనసా సహ"
(తై. ఉ. ౨—౪

"ఆత్మేత్యేవోపాసీతాత్రహ్యేతే సర్వ ఏకం భవన్తి"
(బృ. 3-౪-౭)

"పరేఽవ్యయే సర్వ ఏకీభవన్తి" (ముం. ఉ. 3-౨-౭)

"యథాఽస్యైవ ప్రజ్ఞాయై సర్వాణి భూతాని ఏకం భవన్తి తద్వ్యాఖ్యాస్యామః" (కౌ. ఉ. 3-౫)

"అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి" (కౌ. ఉ. 3-3)

ఇత్యాది శ్రుతులు పరమాత్మ సర్వప్రపంచధర్మ విలక్షణు డని చెప్పుచున్నవి. ఉపాధిపరిత్యాగము చేత జీవులు, బ్రహ్మైకత్వానుభూతిని పొందుదురని నిమ్నోదాహృత శ్రుతి యుద్ఘోషించుచున్నది.

"యథా నద్యః స్యందమానాః సముద్రేఽస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ, తథా విద్వాన్నామరూపాద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్" (ముం. ఉ. 3-౨-౮)

ఈవిధముగా ఏకాత్మత్వదర్శనము చేసినవానికి నిఖిల బంధనివృత్తి కలుగునని యీ శ్రుతి చెప్పుచున్నది.

"యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూ ద్విజానతః।
తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః॥"

ఈవిధముగా ఉపనిషత్ప్రతిపాదిత తత్త్వమునే శ్రీసురేశ్వరులు పైన నుదహరింపబడిన వార్తికములయందు ప్రతిపాదించిరి.

వార్తికము

**వాచ్యవాచకరూపత్వాత్ సవికల్పోఽపి సన్నహమ్ ।**
**దేహాదీనాం వ్యపోహేన సంభవే న్నిర్వికల్పమ్ ॥**

పీయూషవర్షిణి

నామరూపాత్మక ప్రపంచాధిష్ఠానరూపము చేత గాని, లేక ఆ ప్రపంచమునకు ఉపాదానకారణరూపము చేత గాని, తదన్తఃపాతి యగుటవలన గాని, పూర్వోక్త లక్షణములు గలవాడు ఆత్మ యెట్లగు? అను శంక పరిహరింపబడుచున్నది.

వాచ్యవాచకరూపత్వము వలన సవికల్పుడయ్యును, దేహాద్యుపాధులు తొలగిపోవుటవలన నిర్వికల్పమైన 'అహం' (ఆత్మ) యగును.

వార్తికము

అసన్నేవ భవే ద్విద్వా నసద్బ్రహ్మేతి వేద చేత్ ।
అస్తి బ్రహ్మేతి చే ద్వేద సన్తమేనం తతో విదుః ॥ ౩౦

పీయూషవర్షిణి

దేహేంద్రియాది తాదాత్మ్యాభిమానము తొలగిపోయినపుడు శేషించి యుండునని యేదియు నుండదు; అపుడు నిర్వికల్పాత్మ యెట్లు సిద్ధించును? అని యాశంక చేసి, విచారపూర్వకముగ, శ్రుతి నిర్వికల్పాత్మసత్తానిర్ధారణము చేయుటవలన అట్లు, ఆశంక చేయుట యుక్తము కాదని చెప్పబడుచున్నది.

బ్రహ్మ లేదని తెలిసికొనిన విద్వాంసుడు (ఉపాసకుడు) అసద్రూపుడే యగును. ('సోఽ-వ్యసన్నేవ అవిద్యమాన

ఏవ భవతి, బ్రహ్మణ ఏవాత్మత్వాత్ తస్య నాస్తిత్వే స్వస్యైవ నాస్తిత్వాపాతాదిత్యర్థః').

బ్రహ్మాస్తిత్వము తెలిసినవానిని సద్రూపుడని విద్వాంసులు భావింతురు.

ఈ వార్తికము తైత్తిరీయశ్రుతి (౧-౬) తాత్పర్య బోధక మని తెలియనగును. ఈవిధముగ నీ శ్లోకమునందు ఆత్మ, సద్రూపమని శ్రుతియుక్త్యనుభవపురస్సరముగ ప్రతిపాదింపబడినది.

వా ర్తి క ము

ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।
ప్రబన్ధే మానసోల్లాసే షష్ఠోల్లాసస్య సంగ్రహః ॥

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
షష్ఠోల్లాస సంగ్రహము
స ం పూ ర్ణ ము.



**బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి**
**వ్యావృత్తాస్వనువర్తమాన మహ మిత్యన్త స్స్ఫురన్తం సదా।**
**స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో ముద్రయా భద్రయా**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే॥౭**

పీయూషవర్షిణీ

ఇపుడు, ముంజతృణమునుండి సన్నని గడ్డిపోచను వేఱు చేసినట్లు, దేహాదులనుండి వేఱు చేసి, సచ్చిదానందరూపమైన ప్రత్యగాత్మను ప్రదర్శించి, గురు, ఈశ్వర ప్రసాద లభ్యమైన పరమేశ్వరాభేదమును ప్రదర్శించుచు శ్రీ శంకర భగవత్పాదులు 'బాల్యాదిష్వపి' యను శ్లోకము నారంభించుచున్నారు.

పరస్పరము వ్యావృత్తములైన, అనగా, ఒకటి యున్నప్పుడు మఱియొకటి లేని బాల్య, కౌమార, యౌవన, వార్ధక దశల యందును, జాగ్రత్, స్వప్న, సుషుప్తి, మూర్ఛా, జన్మ, జరా, మరణరూపములైన దశలయందును, మఱియు దర్శన, శ్రవణాది రూపములు, కర్తృత్వ, భోక్తృత్వాదిరూపములు నయిన అవాంతర దశలన్నింటి యందును 'అహం' అనునట్టి యంతస్స్ఫురణము నిరంతరము అనుగతమై యుండును. అసత్య, జడ, అనానంద (దుఃఖ) రూపములు, పరస్పర వ్యావర్తకములు నయిన సర్వ దశల యందు నిద్రయందు స్వప్నమును జూచిన నేనే యిపుడు మేల్కాంచుచున్నను ('సోఽహం సుప్తః స్వప్న మద్రాక్షం,

సోఽహ మిదానీం జాగర్మి') అనియు జాగ్రత్, స్వప్న, సుషుప్తిరూపమైన అవస్థాత్రయమునందు బాలుడనైన నేనే యువకుడ నయితిని, యువావస్థ ననుభవించిన యా నేనే యిపుడు వృద్ధుడనై యున్నాను (యోఽహం యువా చాభూవమ్, సోఽహ మిదానీం వృద్ధోఽస్మి') అని బాల్య, యౌవనాది దశలయందును సద్రూపముతో ననుగతుడై యనుభవించుచున్నాడు. ఆరీతిగనే, ద్రష్టగా, పరస్పరము వ్యావర్తములు, అభిమతములయిన చక్షురాదీంద్రియముల యందు, స్వయముగ తత్సకల సాక్షిరూపముతో చిద్రూపుడు సదా అనుగతుడై యనుభూయమానుడగుచుండును. అట్లే, పరస్పర వ్యావర్తమానములు, ప్రియములు నగున అభిమత విత్త, పుత్ర, శరీరాదులయందును, సదా ప్రీతివిషయుడు సర్వశేషిగను, నిరతిశయమైన ప్రీతికి విషయుడుగను ఆనంద రూపముతో అనుగతుడై యనుభూయమానుడగుచుండును. ఆవిధముగనే, 'అహం' అను బుద్ధికి విషయమై పరస్పరము వ్యావృత్తములు, ఆత్మధర్మముతో నభిమతము లయిన దేహాది భోక్త్రంతముల యందు స్వయముగ నహంబుద్ధి వ్యభిచరించక, సదా అనుస్యూతమై అనుభూయమాన మగు చుండును. అట్లు కాగా, సద్రూపత్వమును, చిద్రూపత్వమును ఆనందరూపముతో ప్రియత్వమును, అహంబుద్ధివిషయముగా ప్రత్యక్త్వమును ఎన్నడు వీడడు. అతడే 'త్వం' పద లక్ష్యార్థ మని భావము.

"తం వా ఏత మాత్మానం జాగ్రత్యస్వప్న మసుషుప్తం
స్వప్నేఽజాగ్రత మసుషుప్తం సుషుప్తేఽజాగ్రత మస్వప్నం
తురీయేఽజాగ్రత మస్వప్న మసుషుప్త మవ్యభిచారిణం
నిత్యానంద సదైకరసం హ్యేవ చక్షుషో ద్రష్టా శ్రోతస్య
ద్రష్టా వాచో ద్రష్టా మనసో ద్రష్టా సర్వస్య ద్రష్టా।"

యనుచు నృసింహోత్తరతాపనీయోపనిషత్తు ఈ యర్థమునే చెప్పుచున్నది.

శరీరాదుల మధ్య అహంబుద్ధి విషయరూపముతో సర్వకాలములయందును సద్రూపముగను, ప్రియరూపముతోను సదా భాసించునట్టి ప్రత్యగాత్మను ఏ పరమేశ్వరుడు స్వాత్మగా అనగా "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" (తై. ఉ. ౨-౧), "విజ్ఞానమానందం బ్రహ్మ" (బృ. ఉ. ౩-౯-౨౮) ఇత్యాది శ్రుతులయందు సచ్చిదానందాత్మకుడుగ, త్రివిధ (దేశ, కాల, వస్తు) పరిచ్ఛేదశూన్యుడుగ ప్రసిద్ధుడైన పరమేశ్వరుని స్వరూపమును, బ్రహ్మభిన్నమైన ప్రత్యగాత్మను (కర్తృ భోక్తృరూపముగ ప్రతీయమానుడు కానట్టి స్వాత్మను) కళ్యాణప్రదమైన చిన్ముద్రతో స్వభక్తులకు ప్రకటించునట్టివాడు, శ్రీ గురుమూర్తియు నగు శ్రీ దక్షిణామూర్తికి నమస్కారము.



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## సప్తమోల్లాసః

### అవతారిక

శ్రీ సురేశ్వరులు 'బాల్యాదిష్వపి జాగ్రదాదిషు' అను శ్లోకార్థమును ప్రతిపాదించుటకై తమ వార్తికగ్రంథము నారంభించుచున్నారు.

### వార్తికము

ప్రత్యభిజ్ఞాబలా దాత్మా స్థాయీ నిర్ధార్యతే యది ।
కా నామ ప్రత్యభిజ్ఞైషా కిం వా తస్యాః ప్రయోజనమ్॥ ౧

### పీయూషవర్షిణి

ప్రత్యభిజ్ఞాబలము వలన ఆత్మకు స్థాయిత్వము చెప్ప బడినది గదా! ఇపుడు ప్రత్యభిజ్ఞ యొక్క ప్రామాణికత యాక్షేపింపబడుచున్నది.

ప్రత్యభిజ్ఞాబలము చేత ఆత్మయొక్క స్థాయిత్వము నిర్ధారింపబడినచో, ప్రత్యభిజ్ఞ యనగా నేమి? దానికి ప్రయోజన మేమి?

### వార్తికము

ప్రత్యక్షాదిప్రమాణేషు ప్రత్యభిజ్ఞా పఠ్యతే।
కథం తస్యాః ప్రమాణత్వ మితి పృచ్ఛన్ ప్రబోధ్యతే॥ ౨

## పీ యూ ష వ ర్షి ణి

ప్రత్యక్షాది ప్రమాణములయందు ప్రత్యభిజ్ఞ ఒక ప్రమాణముగా చెప్పబడలేదు. అట్టి ప్రత్యభిజ్ఞకు ప్రమాణత్వము చెప్పుట యెట్లు సంగత మగునని ప్రశ్నింపగా, సమాధానము చెప్పబడుచున్నది.

### విశేష వివరణము

ఇంద్రియార్థ సంనికర్షమాత్రముచేత జనించు జ్ఞాన విశేషము ప్రత్యక్షము ('ఇన్ద్రియార్థ సంనికర్షమాత్రజన్య జ్ఞానవిశేషః ప్రత్యక్షమ్'). ప్రత్యభిజ్ఞ యట్టిది కాదు. ఏలన, ప్రత్యభిజ్ఞ సంస్కారమునకు గూడ కారణము. కావున, ప్రత్యక్ష ప్రమాణము ప్రత్యభిజ్ఞ కాదు. అనుమానాది ప్రమాణముల యందు అర్థసన్నికర్ష గూడ కారణ మగుట వలన ప్రత్యభిజ్ఞకు ప్రసక్తియే లేదు. ('అనుమానాదిష్వస్యాః ప్రసంగ ఏవ నాస్తి, అర్థసంప్రయోగస్యాపి కారణత్వాత్'). ప్రత్యభిజ్ఞ స్వతంత్రమైన ప్రమాణాంతరము కూడ కాదు. కావున, ప్రత్యభిజ్ఞ ఆత్మ యొక్క స్థాయిత్వమును చెప్పుటకు ప్రమాణము కాదని యాక్షేపము రాగా, శ్రీశంకర భగవత్పాదులు తత్సమాధానముగా 'బాల్యాదిష్వపి జాగ్రదాదిషు' అను శ్లోకమును శ్రీదక్షిణామూర్తిస్తోత్ర వ్యాజముతో నారంభించినారు.

వార్తికము

**భాతస్య కస్యచిత్పూర్వం భాసమానస్య సాంప్రతమ్।**
**సోఽయ మిత్యనుసన్ధానం ప్రత్యభిజ్ఞాన ముచ్యతే॥ 3**

పీయూషవర్షిణి

పూర్వము ప్రతీతమైన, ఇప్పుడు ప్రతీత మగుచున్న యొకానొకని యొక్క 'అతడే యితడు' అనెడి అనుసంధానము ప్రత్యభిజ్ఞాన మని చెప్పబడును.

విశేష వివరణము

'కా నామ ప్రత్యభిజ్ఞా?' యనునది ప్రశ్నయా? లేక ఆక్షేపమా? యను విషయము ప్రతివాదిని యడుగవలసి యున్నది. అది ప్రశ్న యైనచో, దానికి సమాధానమిది- పూర్వము ఒకానొకప్పుడు ఒక పదార్థము అవగతమై, ఇపుడు అవగమ్యమానమగుచున్న పదార్థమును జూచి 'సోఽయం' 'అతడే యితడు' యని సామానాధికరణ్యముతో గలిగెడి యనుసంధానము ప్రత్యభిజ్ఞ యనబడును. పూర్వోత్తర దేశకాల వైశిష్ట్యాంశమును పరిత్యజించుట వలన అనుగత మగునట్టి వస్తువిశేష మాత్రము యొక్క అనుసంధానము ప్రత్యభిజ్ఞాన మని భావము.

వార్తికము

**తద్దేశకాలాకారాదీ నవధూయాఽనుషంగికాన్।**
**యథైకం వస్త్వనుస్యూతం ప్రత్యభిజ్ఞాన మాత్మనః॥ ౪**

## పీ యూ ష వ ర్షి ణి

సాధారణముగ బాహ్యార్థ గోచరమైన ప్రత్యభిజ్ఞ ననువదించి, దానిని ఆత్మయందు ప్రదర్శించుచున్నారు.

ఆనుషంగికములైన (అసహజమైన) ఆ యా దేశకాల ఆకారాదులయందు ('ఆకారః అవయవసంస్థానవిశేషః') ఒక వస్తువు అనుస్యూతముగ నున్న, యా వస్తువే యవగత మగుచుండును. అదేవిధముగ, ఆత్మయొక్క ప్రత్యభిజ్ఞ కలుగును.

## విశేష వివరణము

ఏదేని సంబంధము వలన కలుగు గుణాదులు ఆనుషంగి కము లనబడును. ఆనుషంగికములు అస్వాభావికములు. మార్చుటకు వీలు లేనిది స్వభావ మనబడును. అరుణిమ యెన్నడు ధవళము కాదు. దేశకాలాదులు తాదృశములు కావు. అవి పరివర్తనశీలములై యుండును. కావున, దేశ, కాల ఆకారాదులు ఆనుషంగికము లని చెప్పబడినది. దేశ, కాల, అవయవసంస్థానాదులు పరిణామము చెందినను, తదాశ్రయు డైన వ్యక్తి పరిణామము నొందడు. అపుడు 'సోఽయం' అను ప్రత్యభిజ్ఞ కలుగును. ఉపాధులయందు పరివర్తనము గోచరింప వచ్చును గాని, తద్గత సచ్చిద్రూపాత్మ పరిణామము నొందదు గాన, ఆత్మయొక్క ప్రత్యభిజ్ఞ కలుగును. 'సోఽహం' అనెడి భావము అనుభవగమ్య మగును.

## వా ర్తి క ము

మాయానుషంగసంజాత కించిజ్జ్ఞత్వా ద్యపోహనాత్ ।
సర్వజ్ఞత్వాది విజ్ఞానం ప్రత్యభిజ్ఞాన మాత్మనః ॥ ౫౫

## పీ యూ ష వ ర్షి ణి

దార్ష్టాంతికమైన ఆత్మ ప్రత్యభిజ్ఞానము యొక్క ఉపపాదనము చేయబడుచున్నది.

మాయాసంబంధముచేత గలిగిన అల్పజ్ఞత్వాదులు నివృత్తములు కాగా, ఆత్మయొక్క సర్వజ్ఞత్వాది సాక్షాత్కారము (విజ్ఞానము) ప్రత్యభిజ్ఞాన వ్యపదేశ్యము.

## విశేష వివరణము

పదముల యర్థము పరిశోధనదశలో అనృత, జడ, పరిచ్ఛిన్న, అనాత్మల కంటె, తద్ధర్మముల కంటెను విలక్షణము, అపరిచ్ఛిన్నము నయిన జ్ఞానముగ తెలియబడును. వాక్యార్థజ్ఞానకాలమునందు మాయ వలన, తత్కార్య అభ్యాసరూప కారణము వలన జనించునట్టి అధ్యస్తాంశము అయిన అల్పజ్ఞత్వ, అల్పశక్తిమత్త్వాదులను తొలగించు కొనుట ద్వారా సర్వజ్ఞత్వ, అనంత ఆనందత్వాదుల సాక్షాత్కారము కలుగును. పూర్వానుభూత పరమేశ్వరుడు అపరిచ్ఛిన్నుడు, అనంత ఆనందస్వరూపుడు నయినను, దృశ్యత్వ, పరోక్షత్వ భ్రాంతిసహితుడై యున్నాడు. అదేరీతిగ ప్రస్తుతము అనుభూయమాన మగుచున్న చైతన్యమునకు

ద్రష్టృత్వ, ప్రత్యక్షత్వము లున్నను, వ్యాపకత్వాదులు లేవు. కావున, ఇరుపురియందు గల విశేషణములను తొలగించినపుడు పరమేశరతత్త్వ సాక్షాత్కారము కలుగును. కావున, సత్య, జ్ఞాన, ఆనందానంతస్వరూపము యొక్క అపరోక్షానుభవమే ఆత్మయొక్క ప్రత్యభిజ్ఞానము (అపరిచ్ఛిన్న జ్ఞానానంతా నందరూప సాక్షాత్కారః ఆత్మనః ప్రత్యభిజ్ఞాన మిత్యర్థః).

వా ర్తి క ము

పూర్వజన్మానుభూతార్థస్మరణా న్మృగశాబకః
జననీ స్తన్యపానాయ స్వయమేవ ప్రవర్తతే ॥ ౬

పీ యూ ష వ ర్షి ణీ

ప్రశ్నకు ప్రత్యుత్తరము చెప్పి, "ప్రత్యభిజ్ఞా యది భ్రాన్తిః భోజనాది కథం భవేత్" ? అను వచనముచేత నాక్షేపము పూర్వమే పరిహరింపబడినదను భావముతో నిపుడు ఆత్మ యొక్క స్థాయిత్వమును సాధించుచున్నారు.

పూర్వజన్మయందు అనుభవించిన విషయములను స్మరించి తల్లియొక్క స్తన్యమును ద్రావుటకై లేడిపిల్ల స్వయముగనే ప్రవర్తించును.

విశేష వివరణము

ఒకడు ఒక కార్యమునందు ప్రవర్తించుట యనిన, ఆ కార్యము అతనికి అభిమతము, సుఖాపాదక మని యర్థము. పూర్వజన్మయందు స్తన్యపానము అభీష్టసుఖసాధనమైనది

గాన, ఈ జన్మయందును తత్స్మరణ వలన పుట్టినవెంటనే, మృగశాబకమునకు స్తన్యపాన ప్రవృత్తి అన్యాపేక్షా రహితముగనే కలుగుచున్నది. అట్లు కానిచో, తల్లివెంట పరుగెత్తుటయందుగూడ ప్రవర్తించియుండజాలదు.

అట్లు కాగా, స్మృతివలన, జాగ్రదాది దశలు, బాల్యాద్యవస్థలు పరిణమించినను, ఆత్మ అపరిణామి, శాశ్వతుడు అని అనుభూయమానుడగును. అటులనే, కర్మ పరిపాకము వలన దేవ, మానవ, తిర్యగాది అనేక దేహముల యందు ప్రవేశించినను, ఆత్మ పరిణామము లేకయే యుండును. జనించుచున్న దేహములయందు అజాయమానుడు, మరణ స్వభావము గల శరీరములయందు అమరణధర్మియునగు నాత్మ నిత్యుడు, ఏకరస స్వరూపుడు అని స్పష్టమగుచున్నది. అట్లు కానిచో, అనేక శరీరములలో అనుభవింపబడిన పదార్థముల స్మృతియే యుపపన్నము కాదు('తథాచ బాల్యాది స్థావిరాన్తం విపరిణమమానేఽపి దేహే యథా ఆత్మా న విపరిణామో భిన్నాస్వవస్థాసు అభిన్నః, తథా దేవ తిర్యఙ్మనుష్యాది క్రమ భావ్యనేకశరీరేషు జాయమానేషు అజాయమానో మ్రియమాణేషు అమ్రియమాణ ఏవ ఆత్మేతి తస్య సిద్ధా నిత్యతేత్యభిప్రాయః').

వా ర్తి క ము

తస్మాన్నిశ్చీయతే స్థాయీ హ్యాత్మా దేహాంతరేష్వపి ।
స్మృతిం వినా న ఘటతే స్తన్యపానం శిశోర్యతః ॥ ౩

## పీ యూ ష వ ర్షి ణి

ఆత్మయొక్క స్థాయిత్వోపపాదనము ఉపసంహరింపబడు చున్నది.

స్మరణము లేక, శిశువు స్తన్యపానము చేయుట సంభవించదు. కావున, దేహాంతరములయందు సైతము ఆత్మ, స్థాయిత్వము కలిగియుండు నని నిశ్చయము కలుగుచున్నది.

### విశేష వివరణము

పూర్వము అనుభూతమైన విషయసంస్కారము (వాసన) వలన, అనుభూతమైన సజాతీయ వస్తుదర్శనము నందు జీవుడు పూర్వము అనుభవించిన విషయమును స్మరించును; అట్లు స్మరించి, దృశ్యమాన విషయమునందు గూడ, తజ్జాతీయ లింగము చేత దీనియందు గూడ, తాదృశ స్వభావత్వము కల్పించును; అట్లు కల్పించి,జీవుడు (పుమాన్) రెండు పదార్థముల యనుభవకాలమునందు అనపాయియైన (వీడని) ఒక యాత్మను గుర్తించును. ఇట్లు అగుట వలన, ప్రత్యభిజ్ఞ ప్రమాణమే యని తెలియనగును. ఈ ప్రత్యభి జ్ఞానము ప్రత్యక్ష ప్రమాణాంతర్గత మని తెలియవలయును ప్రత్యక్షము దర్శన, స్పర్శన, శ్రవణాది భేదముతో సామగ్రీ భేదము కలిగినవాని నన్నిటిని స్వీకరించును. ఇంతమాత్రము చేత ప్రమాణముయొక్క జాతినే మార్చుట నిష్ప్రయో జనము. ఇంద్రియార్థ సంనికర్షతో బాటు స్మృతి కూడ, పని

చేసిన, ప్రత్యభిజ్ఞ యుదయించును. దోష సంస్కారసహితమైన యింద్రియసన్నికర్ష జన్యమైన భ్రాంతి జ్ఞానము అప్రత్యక్షమని భావింపరాదు. కావున, ప్రత్యభిజ్ఞానము ప్రత్యక్షప్రమాణ మని స్పష్ట మగుచున్నది. ('నహి దోషసంస్కారసహిత సంప్రయోగజన్యం భ్రాంతిజ్ఞాన మప్రత్యక్షం భవతి, తస్మాత్ ప్రత్యభిజ్ఞానం ప్రత్యక్షం ప్రమాణమితి స్థితమ్').

ఈ ప్రత్యభిజ్ఞావిషయమును మహాకవి కాళిదాసు ఆలోచనామృతమైన శ్లోకము ద్వారా నభివ్యంజితము చేయుట గమనార్హము.

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జన్తుః ।
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాన్తర సౌహృదాని ॥"

మహాకవి కాళిదాసు ప్రత్యభిజ్ఞాదర్శనమును రామణీయక ముగా నభివ్యంజితము చేయుట స్మరింపదగినది.

వా ర్తి క ము

**పూర్వత్రానుభవే కాలే స్మృతికాలే పరత్ర సన్ ।**
**ఆత్మా సంస్కారరూపేణ స్మరత్యర్థం స్వనిష్ఠితమ్ ॥ ౭**

పీ యూ ష ప ఙ్క్తి కి

పూర్వప్రతిపాదితమైన యర్థమునే విశదీకరించు చున్నారు. మొదట, అనుభవకాలమునందును, తరువాత

స్మృతికాలమునందును ఉభయకాలములయందు ఉన్నవాడై ఆత్మ, సంస్కారరూపముతో తనలోనున్న (స్వగతమైన) విషయమును స్మరించును.

## విశేష వివరణము

అనుభవించినవాడు, స్మరించినవాడును ఆత్మయే. దీని వలన ఆత్మయొక్క అవినాశిత్వము (స్థాయిత్వము) సిద్ధించుచున్నది. అనుభవింపబడిన పదార్థము నివృత్తమయినప్పుడు, ఆత్మయందు అవ్యక్తముగా నున్న విషయజ్ఞానమే సంస్కారమనబడును. సాధారణముగా సంస్కారములు అంతఃకరణనిష్ఠములై యుండును. కాని, యిచట అభేదదృష్టితో సాక్షినిష్ఠములని చెప్పబడినవని గ్రహింపవలయును. అంతఃకరణము మాయాకార్యము. మాయాశక్తి పరమేశ్వరాభిన్నయే కదా! అందువలన సంస్కారములు (వాసనలు) సాక్షినిష్ఠములుగా చెప్పబడినవి.

## వా ర్తి క ము

**ప్రత్యభిజ్ఞేతి భావానాం స్మృతిశ్చ దభిధీయతే ॥**
**ఆత్మస్థైర్యే ప్రమాణత్వం స్మృతిశ్చ ప్రాప్నుయా**
**త్కథమ్ ॥ ౯**

## పీ యూ ష వ ర్షి ణీ

'స్మరతి' యను స్థలమున, యథాశ్రుతార్థమును గ్రహించి, ప్రతివాది మరల యెదురు నిల్చుచున్నాడు.

భావముల స్మరణము ప్రత్యభిజ్ఞయని చెప్పినచో, స్మృతి, ఆత్మస్థాయిత్వమునందు ఏవిధముగా ప్రామాణ్యమును పొందును ? స్మృతి, ప్రమాణము కాకపోవుట సర్వవాది సంమతము కదా !

వార్తికము

**స్మృతౌ ప్రకాశో నార్థస్య నచాప్యర్థస్య నిశ్చయః ।**
**నచాప్యర్థానుభవయో రంగుల్యోరివ సంభవేత్ ॥ ౧౦**

పీయూషవర్షిణి

స్మృతియొక్క అప్రామాణ్యమును పూర్వపక్షియే సాధించుచున్నాడు.

స్మృతియందు విషయజ్ఞానము లేదు (విషయాను భవములేదు), మఱియు విషయనిశ్చయము గూడ లేదు. రెండు వ్రేళ్ళు ఏకకాలమున అనుభూయమానము లయినట్లు పదార్థానుభవములు ఏకకాలమున ప్రతీయమానములు కావు.

**విశేష వివరణము**

స్మృతి, ప్రత్యక్ష ప్రమాణము కాదు. ఏలన, స్మృతి యందు విషయము యథావస్థిత స్వరూపముతో భాసింపదు. అనుమానప్రమాణాంతర్గతము కూడ కాదు. ఏలన, స్మృతి కాలమునందు విషయసత్తా నిశ్చయము లేదు. మూలము నందలి 'నచాప్యర్థానుభవయోః' అను పాఠమునకు బదులు,

'నచార్థానుభవస్య వా' అను పాఠము లభించిన, ఉత్తరార్థము సుసంగత మగును. పూర్వము అనుభూతమైన విషయానుభవము నష్ట మగుట వలన స్మృతియందు దానికి ప్రకాశము లేదని భావము. కనుకనే రెంటికిని ప్రకాశము సంభవించదు. ('పూర్వానుభూతార్థానుభవస్య వా న చ స్మృతౌ ప్రకాశః, తస్య నష్టత్వాదితి తస్యార్థః. అత ఏవ నోభయోరపి ప్రకాశః సంభవేత్').

### వా ర్తి క ము

**నానుభూతివిశిష్టస్య పదార్థస్య దండివత్ ।**
**సర్వత్రాప్యేవ మిత్యేవం ప్రసంగాదితి చేచ్ఛృణు॥ ౧౧**

### పీ యూ ష వ ర్షి ణీ

అయినను, అన్యతరవిశిష్టమైనదానికి అన్యతర స్మృతియందు ప్రకాశము కలుగవచ్చునని యాశంకించుకొని, అతిప్రసంగ మగుట వలన, అదియుక్తము కాదని చెప్పబడుచున్నది.

మరియును, దండమును ధరించిన యతివలె జ్ఞానవిశిష్టమైన పదార్థమునకు అనుభవము లేదు. ఈ విధముగనే, అన్నిటియందును, అనగా స్మృతిసామగ్రిమునందును, ఇదేవిధమైన ప్రసంగము ప్రాప్తించు నగుటవలన, ఏతచ్ఛంకానివృత్తి యగునని యనినచో, తత్సమాధానము వినుము.

పై శ్లోకము నందలి 'చాపి' అను స్థలమునందలి 'చ' కారము వలన, పదార్థవిశిష్టమైన యనుభూతి గ్రహింపబడును.

అనగా, పదమువలన పదార్థస్మృతియందు గూడ అనుభవ విశిష్టమైన యర్థము ప్రస్తుక మగునని భావము ('చకారాత్ పదార్థవిశిష్టానుభూతి గృహ్యతే, పదాత్ పదార్థస్మృతావపి అనుభవవిశిష్టార్థ ప్రకాశప్రసంగ ఇత్యర్థః).

దండవిశిష్టుడైన యతివలె జ్ఞానవిశిష్టమైన పదార్థజ్ఞానము గూడ స్మృతియందు లేదు. కావున స్మృతి, ప్రమాణమని యంగీకరించుటకు వీలు లేదని పూర్వపక్షి యొక్క కథనము. ప్రతివాది చూపుచున్న దోషములను పరిహరించుచు, స్మృతి ప్రామాణ్యమును స్పష్టము చేయుచున్నారు.

### వార్తికము

**ప్రాక్తనానుభవే నష్టే తదవష్టంభసంభవాత్ ।**
**సంస్కారసంజ్ఞాత్ సామర్థ్యాత్ పౌరుషో**
**జాయతే స్మృతిః ॥ ౧౭**

### పీయూషవర్షిణి

అద్వైతవేదాంతమునందు మేము స్మృతిని ప్రమాణ మని చెప్పము; స్మృతి యొక్క అన్యథానుపపత్తిని ఆత్మయొక్క స్థాయిత్వమునకు ప్రమాణమని యంగీకరింతుము. కావున, ప్రతివాది చూపిన దోషములు వేదాంతశాస్త్రము నందు లేవనుచు స్మృతియొక్క యుత్పత్తిసామగ్రిని ప్రదర్శించుచున్నారు.

పూర్వము ఎప్పుడో కలిగిన యనుభవము ప్రాక్తనాను భవము. అట్టి ప్రాక్తనానుభవము నశించగా, తదాశ్రయము

నందు ఉండునట్టి('తదవష్టంభః ప్రాక్తనానుభవాశ్రయః తస్మిన్ సంభవో యస్య తత్ తథా') సంస్కార మను పేరు గల సామగ్రి వలన, అనగా సమగ్రభావమైన యసాధారణ కారణము వలన, పురుషాధిష్ఠితమైన, అనగా చైతన్య ప్రధానుడు, ప్రమాతయు నగు నీశ్వరునిచే నధిష్ఠితమైన ('పౌరుషాత్ పురుషేణ చైతన్యప్రధానేన ప్రమాత్రేశ్వరేణ చాధిష్ఠితాదిత్యేతత్') సామగ్రివలన స్మృతి యుదయించును.

వార్తికము

**ఆవేద్యానుభవే నష్టే తదీయం విషయం ప్రతి ।**
**అనుభావక మాత్మానం బోధయత్యనపాయినమ్ ॥ ౧౩**

పీయూషవర్షిణీ

ఈవిధముగా సూచింపబడిన స్మృతి చేయునట్టి పని వివరింపబడుచున్నది.

ఈవిధముగా చక్కగా వేదనీయమైన జ్ఞానముయొక్క యనుభవము నష్టము కాగా, ఆ జ్ఞానమునకు సంబంధించిన విషయమును అనుభవించినవాడు, నిత్యుడును అయిన ఆ యాత్మను స్మృతి జ్ఞప్తికి తెచ్చును.

విశేష వివరణము

పూర్వానుభవము వలన కలిగిన సంస్కారముతో పూర్వానుభూత విషయమును స్మరించుచు, ఇప్పటి విషయానుభవము కలిగిన వెంటనే, పురుషుడు (ఆత్మ), పూర్వము

గజ, నర, తురగ సంకులమైన రాజ్యసుఖము ననుభవించిన యా నేనే, ఇపుడు హిమగిరిగుహా పరిసరములయందు పడుచున్న మందాకినీ ఘోషను శ్రోత్రపేయముగా ననుభవించుచున్నా నని, ఆత్మను స్మరింపజేయును. ఈరీతిగనే జన్మాంతరీయ విషయమును గూడ స్మరించుచు, జీవుడు జన్మాంతరీయమైన ఆత్మను స్మరించును (గుర్తించును). ప్రత్యభిజ్ఞానము స్మృతి వలన కలుగుట చేత, స్మృతియే ప్రత్యభిజ్ఞ యని చెప్పబడినదని భావము (స్మృతిద్వారత్వాత్ ప్రత్యభిజ్ఞానస్య స్మృతిరేవ ప్రత్యభిజ్ఞే త్యభిహితమితి భావః). ఈవిధముగా, ఆత్మ ప్రత్యభిజ్ఞానము ఆత్మయొక్క స్థాయిత్వమును స్పష్టము చేయును.

వార్తికము

విషయే చ ప్రముషితే నష్టే చానుభవే సతి।
స్వవిశ్రాన్తం స్మరత్యర్థం దేవోఽప్రముషిత స్సదా॥ ౧౪

పీయూషవర్షిణీ

వేద్య, వేదనములు (జ్ఞేయ, జ్ఞానములు) నివృత్తము లయినను, వేదిత (జ్ఞాత) యొక్క వ్యావృత్తి కలుగదు గాన, జ్ఞాత యగు నాత్మ, నిత్యుడని చెప్పబడుచున్నది.

విషయము దూరము కాగా, నుఖేయు అనుభవము విలీనము కాగా, సదా అప్రముషితుడైన (అంతర్హితుడుకాని) దేవుడు- స్వయంప్రకాశుడైన యాత్మ, తనయందు సంస్కార

రూపముతో విలీనమై యున్న అర్థమును (విషయమును) స్మరించును ('ప్రముషితే నష్టే స్వవిశ్రాన్తం స్వాత్మని సంస్కారరూపేణ విలీన మిత్యర్థః. దేవ ఆత్మా అప్రముషితో ఽనస్తర్హితః').

వా ర్తి క ము

ప్రమోషణం ప్రమాతౄణాం మాయయా తమసా కృతమ్ ।
మాయా విద్యే ప్రభో శ్శక్తీ భానో శ్ఛాయాప్రభోపమే॥ ౧౫

పీ యూ ష వ ర్షి ణీ

సుషుప్తి, ప్రళయములయందు ఆత్మకు ప్రమోషణము (అంతర్ధానము) సంభవించుచుండగా ఆత్మ, సదా అప్రముషితు డని యెట్లు చెప్పుదు ? రను శంకకు సమాధానము చెప్ప బడుచున్నది.

తమోగుణప్రధానమైన మాయచేత ప్రమాతల యొక్క ప్రమోషణము కల్పింపబడినది. సూర్యచ్ఛాయ, ప్రభలవలె, మాయ, విద్య—యీ రెండును, ఈశ్వరుని యొక్క శక్తులు, అనగా సామర్థ్యములని భావము.

విశేష వివరణము

తమోగుణప్రాధాన్యము వలన, మాయ ఆవరకమై యుండును. కావున ఆత్మ యొక్క ప్రమోషణము(అంతర్ధానము) మాయికము గాని, పారమార్థికము కాదు. అదియు, ఆకార విశేషము యొక్క అనవభాసము మాత్రమే గాని, స్వరూప

నాశము మాత్రము కాదు. సుషుప్తియందు గూడ, ఆత్మ అచేతనుడు కాడు. సుషుప్తియందు ఆత్మ, తనను ఏ రూపములో నైనను వ్యక్తము చేసికొనడు. అయినను, స్వయంప్రకాశము, స్వవిషయకమైన చైతన్యము అపుడు గూడ ఆత్మకు నుండనే యుండును. అవిద్య, తత్కార్యములైన బుద్ధ్యాది యుపాధుల యవివేకము వలన, ఆ యుపాధులు స్వకారణమునందు లీన మయినపుడు ఆత్మ గూడ ప్రలీన మైనట్లు, నష్టమైనట్లు భ్రాంతి కలుగును ('తస్మాదవిద్యా తత్కార్యోపాధ్యవివేకా దుపాధిషు ప్రలీయమానేషు ఆత్మాఽపి ప్రలీనో నష్ట ఇతి భ్రమ ఇత్యర్థః).

పరమేశ్వరుని శక్తి, అనాది భావరూపమైన మాయ, పరమాత్మయందు స్వరూపము నాచ్ఛాదించుట తొలగించు టకు వీలులేనిదై అనాదికాలమునుండి, అజ్ఞానాంధకారమును కలుగజేయుచున్నది. ఆ మాయ, సమూలముగ తొలగిపోవుట యెట్లు సంభవము ? మోక్షము ఎట్లు సిద్ధించును ? ('మాయా రూపోపాధేః ఆత్మావరణస్య అనాదిభావరూపత్వేన అనుచ్ఛేద్యత్వాత్ ఆత్మనో మోక్షాభావప్రసంగః') అని యాశంక జేసి, సమాధానము చెప్పబడుచున్నది.

మాయ, విద్యవలన అపాస్త మగును. మాయ అవిద్యా మాత్రము, అనిర్వచనీయము నగుట వలన, నివృత్తికి విషయ మగును. కావున, పూర్వోక్త దోషము ప్రసక్తము కాదు.

మాయ, విద్య—యీ రెండును పూర్వాపర భావముతో పరమేశ్వరునియందు (ఏకత్ర) ఉండును. మాయ, విద్య-యీ రెండును పరమేశ్వరుని శక్తులు. పరమేశ్వరుడు వీనిచేత బంధమోక్షములు స్వాత్మయందు అనుభవించునని, యీ రెంటికి శక్తిత్వము ఔపచారికముగ చెప్పబడినదిగాని, వస్తుతః లేదు. ఏలన, అసంగుడు, అలుప్తప్రకాశస్వభావుడు నగు పరమేశ్వరునకు అవిద్యాత్మకమైన ఆశ్రయత్వము పరాహతము; జ్ఞానస్వరూపుడైన పరమాత్మకు ఆగంతుకమైన జ్ఞానాపేక్ష లేకపోవుట వలన, తదాశ్రయత్వము అసంభవము. ఈ రెండును (మాయ, అవిద్య) ఆత్మాశ్రితములని యేల చెప్పబడె? ననిన, ఆత్మయే బంధ, మోక్ష ప్రకాశకుడు, అనుభవితయు నగుట చే నని తెలియవలయును. పరమాత్మ, అఖండచైతన్యస్వరూపుడు, ఆనందస్వరూపుడు. ఆ పరమాత్మయందు అవిద్య యున్నను నుండదు గాన, విద్యాప్రాప్తియు నసంభవము. ఇచట, 'భానోశ్ఛాయాప్రభోపమే' యని దృష్టాంతము చెప్పబడినది. భాను యనగా రాహువు. వస్తుతః, రాహువు సూర్యునితో సంబద్ధుడు కాడు. అయినను, తత్సంబంధము గలిగియున్నట్లు రాహువు సూర్యాచ్ఛాదకుడుగ గోచరించును. ఈరీతిగనే, మాయ గూడ, వస్తుతః, ఆత్మసంబంధము కలది కాకపోయినను, ఆత్మతత్త్వము నాచ్ఛాదించి యుండును. ఈ పక్షమున, ప్రభాదృష్టాంతము, ఆత్మస్వరూపమునకు మాత్రమే యయిగూడ

నేదేని నిమిత్తముచేత ధర్మిత్వవ్యవహారము సిద్ధించుటకొఱకే యని తెలియనగును. ('భానునా రాహుః. యథా రాహుర్వస్తుతో భాన్వసంబద్ధోఽపి తత్సంబంధితయా ప్రతీయమానః తదాచ్ఛాదకః, ఏవం మాయాఽపి వస్తుతః ఆత్మాసంబంధిన్యపి ఆత్మతత్త్వాచ్ఛాదికా. ప్రభాసృష్టాన్తస్తు స్వరూపస్యైవ సతః కేనచిన్నిమిత్తేన ధర్మిత్వవ్యవహార సిద్ధ్యర్థః').

వార్తికము

**సర్వానాచ్ఛాదయేన్మాయా విద్యా వ్యాక్షిప్య దర్శయేత్।**
**ప్రత్యభిజ్ఞైవ సర్వేషాం ప్రమాణానాంచ సాధనమ్॥ ౧౬**

పీయూషవర్షిణి

పూర్వోక్త మాయ, విద్యలయొక్క కార్యనిరూపణము చేయబడుచున్నది.

మాయ, సర్వప్రమాతలను (జీవులను) ఆచ్ఛాదించును. విద్య, ఆచ్ఛాదనను తొలగించి ('వ్యాక్షిప్య-వ్యావృత్య ఉద్వాస్యేత్యర్థః') ప్రదర్శించును. ప్రత్యభిజ్ఞయే సర్వప్రమాణములకు సాధనమని భావము.

**విశేష వివరణము**

విద్య, అంతఃకరణవృత్తిరూప మగుట వలన, విద్య జడము. జడమైన విద్య, సర్వాచ్ఛాదకమైన మాయ నపాకరించి (తొలగించి) జీవతత్త్వమును ఎట్లు ప్రదర్శింప గలదు ? అని యాశంక జేసి, సమాధానము చెప్పబడుచున్నది.

సర్వ ప్రమాణములకు, అప్రమాణములకు (చకారాత్ అప్రమాణానాంచ) గూడ సాధనము, ప్రత్యభిజ్ఞయే. భాసమానములగు సర్వపదార్థములయందును అనుస్యూతముగ నవగతమగునది గాన, ప్రత్యభిజ్ఞ; సాక్షి. ('ప్రత్యభిజ్ఞాయతే సర్వేష్వవభాసేషు అనుస్యూతతయా అవగమ్యత ఇతి ప్రత్యభిజ్ఞా సాక్షీ'). ఆ ప్రత్యభిజ్ఞయే సర్వవిజ్ఞాన సాధకమని భావము. విద్య, స్వరూపముచేత జడమే. అయినను, సమస్త విజ్ఞానమునకు అధిష్ఠానభూతమైన సాక్షి చైతన్యముతో వ్యాప్తయై యుండుటవలన, తప్తాయఃపిండము దాహ మొనర్చుటకు, ప్రకాశము నిచ్చుటకు సమర్థమైన రీతిగా, ఆ విద్య, మాయను నివారింప సమర్థురాలగును ('విద్యయా స్వరూపతో జడత్వేఽపి అశేష విజ్ఞానాధిష్ఠాన సాక్షిచైతన్యవ్యాప్తతయా తప్తాయఃపిండవత్ ఆపన్న ప్రకాశిత్వాత్ సా మాయానివారణసమర్థేతి భావః').

అథవా, "విద్యా వ్యాక్షిప్య దర్శయేత్" అని యెట్లు అవగత మగుచున్నది ? సర్వ ప్రమాణములకు, అనగా సర్వ ప్రమాణవృత్తులకు 'నేను దీనిని తెలిసికొంటిని' (ఇద మజ్ఞాసిష మహం) అనెడి యే ప్రత్యభిజ్ఞ కలదో, అది, విద్యారూప ప్రమాణవృత్తి యొక్క స్వభావమును సాధించునట్టి సాధనము; విద్యయొక్క విషయావరణ తిరోధాన సామర్థ్య జ్ఞాపక మని భావము.

యద్వా, అవిద్యను తొలగించి సమస్త పదార్థముల తత్త్వమును ప్రదర్శించునట్టి యీ విద్యాస్వరూపమేమి ? యని యాకాంక్ష కలుగగా, "ప్రత్యభిజ్ఞైవ" యని తదాకాంక్షా నివృత్తి చేయబడుచున్నది. ప్రతి జ్ఞానమును, ప్రతివిషయమును ప్రకాశితమొనర్చి ప్రత్యభిజ్ఞానమును కలుగజేయున దగుట వలన, అనగా ఉత్కృష్టముగా, అపరిచ్ఛిన్నముగా, సాక్షి యైన ప్రత్యగాత్మను తెలియజేయున దగుటవలన విద్య, ప్రత్యభిజ్ఞ యనబడును ('ప్రతి పత్యయం ప్రతి విషయం చ ప్రకాశకతయా ప్రత్యభిజ్ఞాయతే ప్రకర్షేణ అభితః అనవచ్ఛేదేన జ్ఞాయతే యః ప్రత్యగాత్మా సాక్షీ సా ప్రత్యభిజ్ఞా' ఈ ప్రత్యభిజ్ఞ సర్వప్రమాణములకు సాధనము, సర్వ ప్రమాణవృత్తాంతములకు అభిజ్ఞానరూపమైనదని భావము.

వా ర్తి క ము

ఈశ్వరోఽన్యోఽహమప్యన్య ఇతి విచ్ఛేదకారిణీ ।
వ్యాక్షిప్యవిద్యయా మాయా మీశ్వరోఽహమితి స్మృతిః॥౧౩

పీ యూ ష వ ర్షి ణి

ఆ ప్రత్యభిజ్ఞాస్వరూపమును నిర్దేశించుచున్నారు.

'ఈశ్వరుడు వేఱు, నేను వేఱు' అని విభజించునట్టి మాయాశక్తిని విద్యచేత దూర మొనర్చి 'ఈశ్వరోఽహమ్'- నేనుఈశ్వరుడను అనునట్టిస్మృతి ప్రత్యభిజ్ఞ. అథవా, జీవేశ్వర భేదము మాయాకృతము. అట్టి మాయాస్వభావమును

అనువదించి, ఆ మాయ, విద్యచేత బాధితము కాగా, స్వయముగనే, స్వరూపావిర్భావము కలుగుట ప్రత్యభిజ్ఞ యని చెప్పవచ్చును.

వా ర్తి క ము

**ఈషత్ప్రకాశోఽభూ దీశో మాయాయవనికావృతః।**
**సమ్యగావరణాపాయే సహస్రాంశురివ స్ఫురేత్॥ ౧౮**

పీ యూ ష వ ర్షి ణీ

విద్య చేత అవిద్య మాత్రము బాధిత మగును, స్వరూపము (ఆత్మజ్ఞానము) ప్రకాశితము కాదను విషయము ప్రపంచితము (వ్యక్తము) చేయబడుచున్నది.

మాయాయవనిక (మాయ యను తెర) చేత ఆవృతుడైన యీశ్వరుడు ఈషత్ప్రకాశము కలవాడగును. మాయావరణము తొలగినంతనే, యీశ్వరుడు మేఘావరణము తొలగిన భాస్కరునివలె చక్కగా భాసించును.

సహస్రాంశువు, సదా స్వయంసిద్ధమైన ప్రకాశముతోనే భాసించును; అట్లగనే, విద్యచేత మాయ అపాస్తమయినంతనే, ఆత్మ, స్వతస్సిద్ధమైన ప్రకాశముతోనే భాసించును. కావున, విద్యచేత మాయ అపావృత మగును గాని, ఆత్మజ్ఞానము ప్రకాశితము కాదనియు, ఆత్మజ్ఞానము స్వయంసిద్ధమనియు తెలియనగును. స్వరూపాభివ్యక్తియే ప్రత్యభిజ్ఞ. ('తథా చ పూర్వసిద్ధస్వరూపస్యైవ యథావత్స్వరూపాభివ్యక్తిమాత్రం ప్రత్యభిజ్ఞేత్యభిప్రాయః').

వార్తికము

**న కారణానాం వ్యాపారాత్ ప్రమాణానాం న వా పునః।**
**ప్రత్యభిజ్ఞాపనం నామ మోహాపసరణం పరమ్॥ ౧౯**

పీయూషవర్షిణి

ప్రత్యభిజ్ఞానమును పూర్వసిద్ధమైన స్వరూపమాత్ర మని భావింపక ఆగంతుకమే యైన ధర్మరూపమని యేల యంగీకరింపరాదు? అని శంక రాగా, చెప్పబడుచున్నది.

కారణ వ్యాపారము వలన గాని, ప్రమాసాధనము లైన ప్రమాణముల వలన గాని, ప్రత్యభిజ్ఞాపనము ఉత్పాద్యము కాదు; జ్ఞాప్యము కాదు. మఱి యేమనిన, ప్రత్యభిజ్ఞాన మనగా, కేవలము మోహాపసరణము. 'మోహాపసరణం పరం అభివ్యక్తి కారణ మిత్యర్థః' కేవలము మోహమును తొలగించుట మాత్రము చేతనే ప్రత్యభిజ్ఞ వ్యక్తమగునని యర్థము.

వార్తికము

**యావన్తి సన్తి మానాని వ్యవహారప్రవృత్తయే।**
**తేషాం మోహాపసరణా ద్వ్యాపారోఽన్యో న విద్యతే॥ ౨౦**

పీయూషవర్షిణి

విద్యవలన, స్వతఃసిద్ధమైన ఆత్మభావము కలుగును. ప్రమాణము చేయు పని, ఆవరణతిరోధానమే యని, సర్వ ప్రమాణముల సాధారణ ధర్మ మని ప్రతిపాదింపబడుచున్నది.

వ్యవహార ప్రవృత్తికి ఎన్ని ప్రమాణములు కలవో, వానికి మోహాపసరణము (అజ్ఞానమును పోగొట్టుట) కంటె అన్యమైన వ్యాపారము లేదని భావము.

## విశేష వివరణము

'అయం ఘటః'- 'ఇది కుంభ' యను చాక్షుష ప్రమాణముచే భాసించునట్టి ఘటమునందు ప్రమాణము వలన జనించిన యతిశయము అపూర్వధర్మము వలన కలిగినదా? లేదా, ఘటగతమైన యేదేని గుణము యొక్క నివృత్తియా? యను విషయము వివేచన చేయవలసి యున్నది.

ఘటమునందు అపూర్వధర్మము ఉదయించు నను పక్షమున, అది స్ఫురణరూపమా? లేక జ్ఞాతృత్వాది రూపమా? స్ఫురణరూపము కాదు. స్ఫురణము చేతనమగుటచేత జడమైన ఘటమునందు అది జనించుటయుపపన్నము కాదు. మరియు, 'ఘటజ్ఞానవానహం-' 'నేను ఘటజ్ఞానము కలవాడను' అని జ్ఞాతయందు ప్రమాశ్రయత్వానుభవము అనుపపన్నము కూడ నగును. అనగా, జ్ఞాతయందే జ్ఞానాశ్రయత్వము అనుభూత మగును గాని, ఘటమునందు కాదు. ఘటమునందు స్ఫురణరూపము ఉదయించి యుండిన, ఘటజ్ఞానము కలది ఘటమే యగును గాని, ఆత్మ కాదు. 'జానాతి' క్రియ, జ్ఞాతృగామినియగుటను, ఫలముయొక్క ప్రమకు విషయగతత్వమే చెప్పనగును; ఏలన, 'ఘటస్తిష్ఠతి'-'ఘటము ఉన్నది'

యను భ్రమ వలె, 'ఘటః స్ఫురతి'- 'ఘటము భాసించు చున్నది' యను స్ఫురణమునకు ఘటకర్తృకత్వప్రతీతి కలుగుచున్నదని చెప్పరాదు. ఏలన, 'ఘటో మమ స్ఫురతి'- 'నాకు ఘటము భాసించుచున్నది' యని జ్ఞాతయే స్ఫురణ ధర్మము కలవాడుగా ననుభవము కలుగుచున్నది. జ్ఞాతలే, మాకు ఇపుడు ఇది స్ఫురించుచున్నది, స్ఫురించుటలేదు అని వ్యవహరించుచున్నారు గాని, విషయము ఇట్టి వ్యవహారము చేయుట యనుభవములో లేదు. మఱియు, విషయమును జ్ఞానోత్పత్తిస్థల మని భావించినచో, అచటనే సంస్కారము గూడ నుండును. మఱియు దానివలన, జనించిన స్మృతి గూడ నచటనే యుత్పన్నము కావలసివచ్చును. జ్ఞానాశ్రయము నందే సంస్కారజనకత్వము, సంస్కారముయొక్క స్వాశ్రయ మయినదానియందే, స్మృత్యుత్పత్తి నియమము వలన, జ్ఞాత యందు విషయస్మరణాభావము ప్రసక్తమగును. మఱియు, జ్ఞాతకు విషయస్మృతి లేకపోవుట వలనను, అతనికి తద్విషయ వ్యవహారము లోపించుట వలనను జీవితము గూడ దుర్ఘట మగును. కావున, ఈ పక్షము ఉపాదేయము కాదు. ('అనుభవస్య స్వాశ్రయ ఏవ సంస్కారజనకత్వనియమాత్, సంస్కారాశ్రయ ఏవ స్మృత్యుత్పత్తినియమాచ్చ జ్ఞాతరి విషయస్మరణాభావప్రసంగః స్యాత్; తథాచ జ్ఞాతు రర్థ స్మృత్యభావాత్ తస్య తద్విషయవ్యవహారలోపాత్ జీవన మపి దుర్ఘట మిత్యానాశంకనీయ ఏవాయం పక్షః').

ద్వితీయపక్షము సమర్థనీయము కాదు. జ్ఞాతత యనగా, ద్రవ్యమా, గుణమా, కర్మమా, సామాన్యమా? వీనిలో నేదేని యొకదానియందు అంతర్భూతము కావలయును. ఏలన, విషయమునకు ఆశ్రయము వీనిలో నొకదానిని చేయవలసియుండును. వీనిలో నేదియు నుపపన్నము కాదు. వీనిని అతీంద్రియములని భావించినచో, తదాధారమైన విషయము గూడ స్ఫురింపరాదు. అపుడు 'జ్ఞాతో మయా ఘటః'- 'నాచే ఘటము తెలియబడినది' యను వ్యవహారము ఉదయించక పోవుట ప్రసక్తమగును; మఱియు, ఇంద్రియగ్రాహ్యత్వమును అంగీకరించినచో, ఘటగతమైన ఆలోక, రూపాదులవలె, అన్యవేద్యత్వముగూడ వచ్చును. అనగా, మఱియొక ప్రమాత గూడ 'జ్ఞాతతను' తెలిసికొనును. ఇది యనుభవసిద్ధము కాదు.

మఱియు, ఇచట స్వజనకజ్ఞానము చేత 'జ్ఞాతత' భాసించునా? లేక జ్ఞానాంతరముచేత భాసించునా? మొదటిది కాదు. జ్ఞాతత యొక్క ఉత్పత్తి, అవభాసములు ఏకకాలమున నుండవు. క్రమముగా జరుగు ననుటయు సరి కాదు. ఏలన, జ్ఞానమునకు విరమ్యవ్యాపారవత్త్వము చెప్పుట యుపపన్నము కాదు. జ్ఞానాంతరముచేత భాసించునని యంగీకరింతుమేని దానికి సైతము జ్ఞాతతాంతరోత్పత్తియే క్షయమగుట వలన అనవస్థాదోషము ప్రసక్తమగును. కావున, జ్ఞానముచేత విషయమునందు ఒకానొక అపూర్వధర్మోత్పత్తి చేయబడునని చెప్పుట యుక్తము కాదని తేలినది.

అపుడు, ఇష్టజ్ఞానము వలన జనించునట్టి స్ఫురణ రూపమైన యపూర్వతను నై యాయికులు గూడ నాత్మయందే యంగీకరించుటయు సంగతము కాదు. ఏలన, 'ఘటః స్ఫురతి' - ఘటము భాసించుచున్నది' యను స్థలమున, స్ఫురణమునకు ఘటత్వ సామానాధికరణ్య రూపమైన యనుభవమునకు విరోధము కలుగును. స్ఫురణమునకు ఘటాసంసర్గిత్వము నందు ఇతరులచే నవగతమైనదానివలె 'జ్ఞాతో మయా ఘటః' - 'నాచే ఘటము తెలిసికొనబడినది' యని, స్వాత్మ యందు జ్ఞాతృ, జ్ఞేయ సంబంధము విశేషాభావము వలన కలుగదు. స్వేంద్రియసంస్ప్రష్టత్వము విశేషమని చెప్పుటయు నసంగతము. ఏలన, ఈ యసంస్ప్రష్టత్వము అతీంద్రియమగుట వలన తత్సంబద్ధత గూడ నవగతము కాదు; తన్నిమిత్తకమైన జ్ఞేయసంబంధ ప్రత్యక్షము ఆత్మ యందు నయుక్తము; జ్ఞానమునకు స్వాశ్రయమైన ఆత్మజ్ఞానము ద్వారా విషయ సంబధ మని యంగీకరించుటయు నయుక్తమే. ఏలన, జ్ఞానము యొక్క ఆత్మాశ్రయత్వము సర్వవ్యాపి యని భావించినచో, సర్వసంసర్గము కలిగిన దగుటచేత ఆత్మకు ఏకకాలమునందు సర్వావభాసము (సర్వజ్ఞానము) ప్రసక్తము కావలయును.

దేహావచ్ఛిన్నమైన ఆత్మాశ్రయమునందు, దేహ బాహ్య ప్రదేశ సంబంధము లేకపోవుట వలన, బాహ్య విషయములు భాసింపకపోవుట సంభవించును.

మఱియు, విషయమునందు గాని, ఆత్మయందుగాని ఉత్పన్నమగు జ్ఞానము, ఉత్పత్తికి పూర్వము అసద్రూపమా,

లేక, స్వరూపమునా? అసత్ అని చెప్పుటకు వలనుపడదు. ఏలన, అసత్తునకు సత్తాసంబంధము చెప్పుట కుదరదు. సత్తా సంబంధము సమవాయసంబంధము. సత్పదార్థమునకే ధర్మము (సమవాయసంబంధము) అభ్యుపగతము, సదసత్తులకుగాని. అసత్తులకుగాని, పరస్పరము సమవాయ సంబంధము అభ్యుపగమ్యము కాదు (సత్తాసంబంధో హి సమవాయః, స సతో రేవ ధర్మో-భ్యుపగతః న సదసతోర్వా, అసతోర్వా'). స్వకారణముతోటి సంబంధము గాని, ఉత్తరక్షణముతోటి సంబంధము గాని భావ (సత్) పదార్థముల సంబంధమే గాన, వానికి అసత్పదార్థములతో సంబంధాభావము సమానమే. సిద్ధ (సిద్ధంభూతాన్) సంబంధము నంగీకరించినచో అన్యోన్యాశ్రయము వచ్చును. ఏలన, ఉక్త సంబంధము కలదానితో సంబంధము కలుగుటకు ప్రాగ్వము సిద్ధత అనుపపన్న మగును (ఉక్తసంబంధసంబంధాత్ ప్రాక్ సిద్ధతానుపపత్తేః). ఉపపన్నమైనపుడు సాత్మ్య-ర్యవాపనము యగును. కావున, సత్తాది సంబంధము సిద్ధము కాగా స్వరూపసిద్ధి, స్వరూపసిద్ధి కలిగినంతనే, సంబంధసిద్ధి- ఈ విధముగా అన్యోన్యాశ్రయము దుర్నివారము. కావున, అసత్ ఎన్నడు ఉత్పన్నము కాదు. సత్తుగూడ నుత్పన్నము కాదు. ఏలన, సిద్ధవస్తువునకు సాధ్యవస్తువు అనెడి వ్యాఘాతదోషము ప్రాప్తించును ('సిద్ధస్య సాధ్యత్వవ్యాఘాతాత్'). సదసదాత్మకమైనది జనించదు. ఏలన, విరుద్ధస్వభావము గల వస్తువు అసంభవము. కావుననే,

సదసద్విలక్షణమైనదియు నుత్పన్నముకాదు అని చెప్పబడినది. సదసద్విలక్షణము మిథ్యాత్వము యొక్క లక్షణము. ఆ కారణముచేత ఆత్మయందుగాని, విషయమునందుగాని యపూర్వధర్మము ఉత్పన్నము కాదు. విషయగతమైన యతిక్రాంచిన్నివృత్తి, జ్ఞానకృతమైన, యతిశయమైన పరమార్థము సంభవింపదు.

సత్తుయొక్క నివృత్తి, జ్ఞానము వలన కలుగుట యసంభవము. జ్ఞానమునకు ఆరోపితమైనదానినే నివృత్త మొనర్పగల సామర్థ్యము ఉండును. ('జ్ఞానస్య ఆరోపితమాత్ర నివృత్తిసాధనసామగ్ర్యస్యైవ సర్వత్రోపలంభాత్'). శుక్తితత్త్వ జ్ఞానము ఆరోపిత రజతమును, రజతవిశిష్టమైన యజ్ఞానమును నివర్తింపజేయును గాని, తద్గతమైన యల్పాంశమును సైతము నివర్తింపజేయజాలదు.ఆ రీతిగనే,జ్ఞానము ఆరోపితాజ్ఞానమునే నివర్తింపశేయునుగాని, సత్తను నివర్తింపజేయ జాలదు. సద్రూపమైన పూర్వజ్ఞానము యొక్క నివృత్తియు, నుత్తర జ్ఞానము చూడబడుచున్నదనుటయు సంగతము కాదు. ఏలన, జ్ఞానాంతరోత్పత్తిలేకయే, ఉత్పన్నజ్ఞానము యొక్క నివృత్తి స్వరసతయా దృష్ట మగుచున్నది. అపుడపుడు ఉత్తరజ్ఞానము పూర్వజ్ఞాననివర్తకము కాకుండుటయు జూతుము. ఉత్తరజ్ఞాన నివర్త్యము పూర్వజ్ఞాన మని చెప్పినచో, సుషుప్తియే సంభ వించదు. ప్రమాణసిద్ధమైనది 'సత్' అని చెప్పబడును. దానిని ప్రమాణాంతరముచేత బాధించుటకు వీలులేదు. బాధ్యమైనది

సదా అప్రామాణికమే యగును. ఆకారణముచేత, సన్నివృత్తి ప్రమాణఫలము కాదు. అసత్తు నిత్యనివృత్త మగుటవలన అసన్నివృత్తియు ప్రమాణఫలము కాదు. ప్రాగభావప్రతియోగియొక్క యుత్పత్తి వలన నివృత్తి కన్పడుచున్నదని నైయాయికు లందురు. అదియు, యుక్తము కాదు. ఏలయన, ప్రాగభావమును ధ్వంసాభావము యొక్క ప్రతియోగి యని యంగీకరించినపుడు, అది భావపదార్థమే యని స్పష్టమగును ('అభావస్య ధ్వంసప్రతియోగిత్వే భావత్వాపత్తేః'). నివృత్తి యనగా ధ్వంసము. అది భావధర్మముగాని, అభావధర్మము కాదు. కావున, అసన్నివృత్తి కుండ జ్ఞానసాధ్యము కాదు. సదసదాత్మకమైనది అభావ మగుట వలననే, సదసన్నివృత్తి సంభవించదు. కావున, పరిశేషన్యాయముచేత, ఒకానొక యనిర్వచనీయమునకు, ఒకానొక యనిర్వచనీయమైనదానిచేత నివృత్తియే, ప్రమాణకృత్యమైన మోహనివృత్తిమాత్రమే యని స్పష్టమగును. ('తస్మాత్పరిశేషాత్ అనిర్వచనీయస్య కస్యచిత్ అనిర్వచనీయేన నివృత్తిరితి మోహనివృత్తి మాత్రం ప్రమాణకృత్య మితి సిద్ధమితి').

వా ర్తి క ము

**జడానృత పరిచ్ఛిన్న దేహధర్మా శ్చిదాత్మని ।**
**సత్యజ్ఞాన సుఖాత్మత్వం మోహా ద్దేహేఽపి కల్ప్యతే॥౭౧**

పీ యూ ష వ ర్షి ణీ

ఈవిధముగా, స్వస్వవిషయములకు సంబంధించిన అజ్ఞాన రూప మోహనివర్తకత్వము సర్వప్రమాణముల స్వభావము.

కావున, ఆత్మయందు గూడ, వేదాంత వాక్యజనిత వృత్తి రూప ప్రమాణము ఆత్మగతమైన అనాది, అనిర్వచనీయమైన అజ్ఞానరూప మోహనివృత్తి చేత, తత్కార్యములైన దేహాదుల బంధనివృత్తిమాత్రము చేయును. అంతకంటె నధికముగా నేమియు చేయు దను విషయమును విశదీకరించు టకై శ్రీసురేశ్వరులు దేహాత్మల యన్యోన్యాధ్యాస నిమిత్తకమైనదే సంసారబంధముగాని, పారమార్థికము కాదని ప్రతిపాదించుచున్నారు.

చిదాత్మయందు మోహము వలన జడ, అనృత, పరిచ్ఛిన్న దేహధర్మములు, మఱియు, దేహమునందు సత్య జ్ఞాన, సుఖాత్మకత్వములు కల్పింప బడుచున్నవి.

వార్తికము

శుక్తౌ రజత మిత్యేవం యథా వ్యాముహ్యతేఽన్యథా ।
సదేవ రూప్యం చే ద్భాతి విలయ స్తైన సిద్ధ్యతి॥ ౨౨

పీయూషపత్రిణి

దేహాత్మలకు చెప్పబడిన అన్యోన్యాధ్యాసయందు దృష్టాంతము చెప్పబడుచున్నది.

లోకము, మోహమువలన శుక్తికయందు రజతమని భ్రాంతి చెందుచున్నది. అన్యథా భ్రాంతి కలుగకపోయినచో శుక్తికయందు రజతము సత్యముగనే భాసించిన, నీ మతము నందు రజతము యొక్క సమూలనాశము సిద్ధింపజాలదు.

వస్తుగతిచేత రజతముకాని శుక్త్యాదుల యందు ఇది రజత మనియు, అనిదమైన (ఇది కాని) రజతమునందు ఇది రజత మనియు, ఈవిధముగా పరస్పరాధ్యాసరూపమైన వ్యామోహ మును లోకము పొందుచున్నదని యర్థము ('వస్తుగత్యా శుక్త్యాదా వరజతే రజత మిద మిత్యన్యథా అనిదమి రజతే ఇదం రజత మితి చ ఏవం పరస్పరాధ్యాసరూపం వ్యామోహం ప్రాప్నోతి లోక ఇత్యర్థః').

## విశేష వివరణము

శుక్తికయందు భాసించునట్టి రజతమునకు అనిర్వచ నీయత్వమును ఉపపాదించుట ద్వారా 'సదేవేతి' యనుచు మాయామయత్వమును వార్తికకారులు సాధించుచున్నారు. నీ మతమునందు సత్యమైన రజతమే శుక్తిక యందు భాసించినచో, అపుడు ఆ రజతమునకు విలయము (బాధ) ఉండదు. 'నాసతో విద్యతే భావః, నాభావో విద్యతే సతః' యను భగవద్వచనము ఇచట అనుసంధేయము.

## వార్తికము

**నాత్యన్తాసత్ ప్రకాశేత నరశృంగాదివత్ క్వచిత్ ।**
**కాన్తారాదౌ రజతమితి స్యాత్ స్మరణం భ్రమే ॥ ౨౩**

## పీ యూ ష వ ర్షి ణీ

సత్త్వనిషేధము వలన ప్రాప్తమైన అసత్త్వమును, అనగా శుక్తిరజతమునకు ప్రాప్తించిన అసత్త్వమును గూడ అనిర్వచనీయతాసిద్ధికై నిషేధించుచున్నారు.

4 )

నరశృంగమువలె అత్యంత అసత్పదార్థము ఎచటను అనుభూతము కాదు. భ్రమయందు స్మరణ మందువేని, స్త్రీకరచరణాదులయందు రజత మని భాసించును.

**విశేష వివరణము**

అత్యంత అసత్పదార్థము ఎచటను గన్పట్టదు. కావున, శుక్తియందలి రజతము అసత్పదార్థము కాదు.

సదసత్తులను రెంటిని ప్రత్యేకముగా నిరాకరించుట వలన, ప్రవృత్తమైన సముచ్చయ పక్షము స్వయముగ నిరాకరింపబడినట్లే యని తెలియనగును. ఉపజీవ్యనిషేధము వలన ఉపజీవన నిషేధము స్వయంసిద్ధ మని భావము. ('ప్రత్యేకం సదసత్పక్షదూషణోపజీవనేన ప్రవృత్తస్య సదసత్సముచ్చయపక్షస్య ఉపజీవ్యనిషేధాదేవ నిషేధసిద్ధేః సోఽప్యర్థా న్నిషిద్ధో వేదితవ్యః').

ప్రాభాకరమతానుయాయులు 'శుక్తికా! అస్య సంప్రయోగము (సంనికర్ష) నందు అస్యవిషయక జ్ఞానము స్మృతియే గాని, యనుభవము కాదు. కావున, భ్రాంతి యెట్లు సిద్ధించునని యాశంక చేయుదురు. భ్రమయందు స్మరణా కార వైపరీత్యము వలన 'కాంతాకారాదా' అనుచు ఇది స్మరణము కాదని చెప్పబడుచున్నది. పూర్వదృష్టమైనదే ప్రతీయమానమై యుండిన, ఎక్కడ చూడబడినదో తదాశ్రయము నొక్క స్మృతి గూడ వెంటనే కలుగును. కాని, అట్లు కలుగుట లేదు ('యదిదం పూర్వదృష్టమేవ భాసేత,

తదా యత్ర స్పృష్టం తత్రత్య మిత్యేవ భాసేత, నేద మితి').
స్త్రీయొక్క కరచరణములయందు దృష్టమైన రజతభానము శుక్తికయందు స్త్రీకరచరణరహితముగనే కలుగును. దోషము వలన, తత్తాప్రమోషము (తత్తయొక్క యంతర్ధానము) వలన ఆవిధముగ భాసించుట లేదని యందు రేని, 'తత్త'యొక్క ప్రమోషము వలన, స్మృతిత్వనిశ్చయమే కలుగజాలదు. అపుడు, అవభాసానుగుణముగా అనుభవము కలుగును. కావున, అఖ్యాతివాదాదులకు అవకాశము లేదని భావము.

వా ర్తి క ము

**తేనేదం తుల్యమిత్యేవం స్యాత్ సాదృశ్యాత్తు విభ్రమః।**
**పీత శ్శంఖో గుడ స్తిక్త ఇత్యాదౌ నాస్తి తుల్యతా॥ ౨౪**

పీ యూ ష వ ర్షి ణీ

అఖ్యాతివాదమును నిరసించి, యన్యథాఖ్యాతి వాదమును నిరాకరించుచున్నారు.

సాదృశ్యము వలన, 'దానితో నిది సమానము' అని భ్రాంతి కలుగును. నుఱియు 'పీతః శంఖః'—'పచ్చని శంఖము' 'తిక్తో గుడః'—'చేదు బెల్లము' మొదలైన అనుభవములయందు తుల్యతము లేదు.

**విశేష వివరణము**

భ్రమస్థలమునందు రజతమునకు స్మర్యమాణత్వము ఉండకపోవచ్చుగాక ! అయినను, మాయామయత్వము

సిద్ధింపదు. పూర్వదృష్టమైన రజతసాదృశ్యము కన్పడుటవలన, తత్సంస్కారముయొక్క ఉద్బోధనము కలుగును; స్మృత (స్మరింపబడిన) రజతమునకు పురోవర్తియందు (ఎదుట ఉన్న దానియందు) స్మృతమైనవస్తువుయొక్క యారోపము జరిగినపుడు 'ఇదం రజతం'— 'ఇది రజతము' అను ప్రతీతి సంభవము. స్మర్యమాణ రజతాభేదము చేత శుక్తికయందే రజతాత్మత్వానుభూతి కలుగును. ఈవిధముగా అన్యథాఖ్యాతివాదము యొక్క మతత్వయమును అనువదించి నిరసించుచున్నారు.

రజతసాదృశ్యము వలన విభ్రమము కలిగినచో, అపుడు ఆ రజతముచేత ఇది పురోవర్తిసదృశ మనిగాని, ఇది తత్సదృశమనిగాని విభ్రమము కలుగును. 'నత్విదం రజతమ్'- ఇది రజతము కాదని యర్థము. మఱియు, సాదృశ్యము వలన భ్రమ యని వాదించువానిని విభ్రమము యొక్క సాదృశ్యము వ్యాప్యమా, వ్యాపకమా ? యని ప్రశ్నింపనగును. వ్యాపక మని చెప్పినచో, 'పీతః శంఖః' యను స్థలమునందు సాదృశ్యము లేదు. వ్యాప్య మని యంగీకరించినచో, ఒక శుక్తికకు శుక్తికాంతరముతో సాదృశ్య మున్నను, తద్భ్రమ యుదయించుట యసంభవము ('శుక్తికాయాః శుక్తికాంతర సాదృశ్యే సత్యపి తద్విభ్రమోనదయాదర్శనాదితి ద్రష్టవ్యమ్'). కావున, అన్యథాఖ్యాతివాదము యుక్తిసహము కాదు.

వా ర్తి క ము

**తాదాత్మ్యేన స్ఫురతి చేద్రజతత్వేన శుక్తికా ।**

**విభ్రమో నిరధిష్ఠానో బాధో నిరవధి ర్భవేత్ ॥ ౨౫**

## పీయూషవర్షిణి

'స్మర్యమాణమైన రజతము యొక్క అభేదముచేత శుక్తికయే రజతరూపత్వముతో ననుభూయమాన మగుచున్నది' యనెడి రెండవ అన్యథాఖ్యాతివాదమును నిరసించుచున్నారు.

శుక్తిక, రజతరూపముతో తాదాత్మ్యము ద్వారా, భాసించుచున్నచో, భ్రమ నిరధిష్ఠానము, బాధ (నివృత్తి) నిరవధికము నగును.

### విశేష వివరణము

శుక్తి రజతములు తాదాత్మ్యమే భ్రమకు ఆలంబనమైనచో, రెండును అధ్యస్తము లగుటవలన, రెంటికి మిథ్యాత్వము ప్రసక్తిక నగును. అప్పుడు వస్తుతః, అన్యసత్యము లేకపోవుటవలన శూన్యవాదము వచ్చిపడును అని భావము.

"తిమిరాన్ధకదృష్టీనాం యథా కేశోండ్రకాది ఖే ।
స్ఫురత్యేవం జగద్రూపం హ్యనాత్మన్యేవ తిష్ఠతి ॥"

యని యోగవాసిష్ఠవచనము ఉక్తార్థమునే చెప్పుచున్నది. రేచీకటివానికి కేశగుచ్ఛములు శూన్యములో (ఆకాశములో) కన్పించును. అట్లే, అనాత్మయందే జగద్రూపము ఉండును అని భావము. నిరధిష్ఠాన భ్రమ యుండదని చెప్పుట అనుభవవిరుద్ధమని, శూన్యవాది కథనము యుక్తిసంగతము కాదని భావము. ప్రత్యక్షమానము లగుచున్న ఆలోకాదులు లేక, ఈ

భ్రమలు కలుగకపోవుటయే, యవి సాధిష్ఠానములని స్పష్టము చేయుచున్నది. నిరవధిక బాధయందు దృష్టాంతము కన్పించుట లేదు. ఇది శూన్యవాదికి గూడ, ఇష్టప్రసంగము కాదు. దీనిచేత అసత్ ఖ్యాతివాదము నిరాకృతమని తెలియవలెను.

## వా ర్తి క ము

**బుద్ధిస్థితం చే ద్రజతం బాహ్యత్వేన ప్రతీయతే ।**
**గుంజాదౌ జ్వలనారోపే దేహదాహః ప్రసజ్యతే ॥ ౨౬**

## పీ యూ ష వ ర్షి ణి

ఇపుడు ఆత్మఖ్యాతిపక్షము నిరాకరింపబడుచున్నది.

బుద్ధియందున్న రజతము బాహ్యముగా ప్రతీతమైనచో గుంజాదులయందు (గురువిందగింజలు మున్నగువానియందు) జ్వలనము (మండుట) ఆరోపితమైనపుడు శరీరదాహము ప్రసక్తమగును.

## విశేష వివరణము

విషయభోగానంతరము, విషయము బుద్ధియందు నవ్యక్తముగా నుండునని యంగీకరింపవలసి యుండును. అవ్యక్తముగా నుండిన విషయమే బయట, వ్యక్తమగును. కావున, శుక్తిరజతము కూడ సత్యమే. బుద్ధియందు అవ్యక్తముగ నున్నది. బుద్ధిద్వారా బహిర్గతమగుటయే భ్రమ. అసత్య పదార్థము యొక్క యనుభవము ఎన్నడును కలుగదు అని ప్రతివాదియొక్క మతము.

ఈవిధముగా వాదించువానియొక్క మతము సుసంగతమైనచో, గుంజాపుష్పములయందు గోచరించునట్టి యరుణజ్వాల బుద్ధిస్థమైన సత్యమే. ఆ సత్యము బాహ్యముగ నభివ్యక్తమై శరీరదాహక మగును. ఇది అనుభవవిరుద్ధము. కావున, ఆత్మఖ్యాతివాదము అనాదరణీయము.

వా ర్తి క ము

యు క్తిహీన ప్రకాశత్వాత్ భ్రాన్తే ర్నహ్యస్తి లక్షణమ్ ।
యది స్యా ల్లక్షణం కించిత్ భ్రాన్తిరేవ న సిధ్యతి ॥ ౨౩

పీ యూ ష వ ర్షి ణీ

యుక్తివిహీనమైన ప్రకాశము (ప్రతీతి) కలదనుటవలన భ్రాంతికి లక్షణములేదు. ఏదేని లక్షణ ముండిన, భ్రాంతియే సిద్ధించదు.

ఎప్పుడైనను, ఎక్కడైనను సద్రజతము భాసింపదు, అత్యంతాసద్రూపము భాసింపదనినచో, అలౌకికపదార్థమా యిది? యని ప్రశ్నింపగా చెప్పబడుచున్నది. బుద్ధియందు అనారూఢమయినను, 'శుక్తౌ రజతమ్'-'శుక్తికయందు రజతము' అని యెట్లు భాసించుచున్నది? యని యాశంక చేయుట యనావశ్యకము. ఏదియైనా నొకవిధముగా నిరూపితమైనపుడు ప్రామాణికముగా జ్ఞానానపోహ్యత్వము అసంభవము. రజతజ్ఞానమునకు భ్రాంతిత్వప్రసిద్ధి యనుపపన్న మగునను ఉద్దేశముతో 'యుక్తిహీనప్రకాశత్వాత్' అను వార్తికము అరబ్ధమైనదని తెలియవలెను.

జ్ఞానాపనోద్యత్వమే భ్రమ. శుక్తికాజ్ఞానముచేత రజతనివృత్తి దృశ్యమాన మగుట యనుభవ సిద్ధము.

### వార్తికము

**జలచంద్రవదేకస్మిన్ నిర్భయే రజ్జుసర్పవత్ ।**
**ప్రతీయేతే యథా స్వర్ణే కారణే కటకాదివత్॥ ౨౦**

### పీయూషపక్షిణి

దృష్టాంతమైన భ్రాంతి మాయామయ మని ప్రతిపాదించి, దార్ష్టాంతికమైన ప్రపంచము గూడ మాయాకృతమని అన్యదృష్టాంతము చేత ప్రతిపాదించి యుపసంహారము చేయుచున్నారు.

జలమునందు చంద్రునివలె, రజ్జువునందు సర్పమువలె, సువర్ణమునందు కంకణాదులవలె ఒకే అభయమైన కారణమునందు ఈ సంసారము ప్రతీయమాన మగుచున్నది.

### విశేష వివరణము

ఒకడే యైన చంద్రునియందు జలోపాధిభేదము చేత ననేకత్వము భాసించుచున్నట్లు, అఖండ చిదానంద అద్వయాత్మయందు దేహోపాధుల భేదము వలన అనేకత్వము భాసించుచున్నది. రజ్జువునందు సర్పమువలె భయహేతుత్వరహితమైన చిదాత్మయందు సంసారభయము అవభాసమాన మగుచున్నది. ఏకత్వమునందు అనేకత్వము, భయరహితవస్తువునందు ప్రతీత మగుచున్నదని భావము. లోకప్రసిద్ధమైన

కార్యకారణవాదము నాశ్రయించి, కారణముకంటె భిన్నమైన కార్యము ఉండదనుటలో దృష్టాంతము చెప్పబడుచున్నది. కారణమైన సువర్ణమునందు మిథ్యాభూతములైన కటకాదులవలె, కారణమైన పరమేశ్వరునియందు, కార్యమైన ప్రపంచము భాసించుచున్నదని భావము.

వా ర్తి క ము

ఉపాత్తే రూప్యవచ్ఛుక్తౌ వ్యాప్తే యక్షపురీవ ఖే।
రశ్మ్యంబువత్ స్ఫురద్రూపే స్థాణౌ చోరవదక్రియే॥౨౭
అసత్కల్ప మిదం విశ్వ మాత్మన్యారోప్యతే భ్రమాత్।

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు శ్రుతి, స్మృతుల చేత నిశ్చయింపబడిన వివర్తవాదము నాశ్రయించి, దృశ్యమాన జగత్తునకు అధిష్ఠాన సత్తాతిరిక్తమైన సత్తలేదు; కాని, అధిష్ఠానమునందు భ్రాంతిసిద్ధమైన జగత్తు భాసించుచున్నదని దృష్టాంతపురఃసరముగా చెప్పబడుచున్నది.

గ్రహింపబడిన శుక్తికయందు రజతమువలె, వ్యాపకమైన ఆకాశమునందు గంధర్వనగరమువలె, ప్రకాశించుచున్న రూపమునందు మరుమరీచికాజలము వలె, స్థాణువునందు చోరుడు వలె స్వతస్సిద్ధము, అపరిచ్ఛిన్నము, కూటస్థము, స్వయంప్రకాశము, అక్రియము నగు చిదాత్మయందు అసత్కల్పమైన (మిథ్యాభూతమైన) యీ విశ్వము భ్రమవలన

(మిథ్యాజ్ఞానము వలన) ఆరోపింపబడుచున్నది. అనగా, వ్యవహరింపబడుచున్నదని భావము.

వార్తికము

స్వయం ప్రకాశం సద్రూపం భ్రాన్తిబాధవివర్జితమ్॥ ३० ప్రత్యభిజ్ఞాయతే వస్తు ప్రాగ్వ న్మోహే వ్యపోహితే।

పీయూషవర్షిణి

జీవభేదము, బాహ్యప్రపంచము అవిద్యామాత్ర మగుట వలన, విద్యచేత నవిద్య బాధితము కాగా, అద్వైతానంద బ్రహ్మరూపమైన ఆత్మ భాసించునని యుపసంహారము చేయబడుచున్నది.

స్వయంప్రకాశము, సద్రూపము, భ్రాంతిబాధ వివర్జితము (అనాగమాపాయధర్మకమ్) సయిన పరమార్థ వస్తువు, అజ్ఞానము తొలగిపోగా, యథావస్థితమైన స్వరూపము గుర్తింపబడును. అనగా, బ్రహ్మపరోక్ష సాక్షాత్కార మగునని భావము.

వార్తికము

దేహాద్యుపాధౌ నిర్ధూతే స్యా దాత్మైవ మహేశ్వరః॥ ३८

పీయూషవర్షిణి

దేహాద్యుపాధులు నివృత్తములు కాగా, ఆత్మయే (జీవుడే) పరమేశ్వరు డగును.

కారణమైన అవిద్య, బాధితము కాగా, తత్కార్యము లైన దేహాది యుపాధులయందు ఆత్మాధ్యాస నివృత్త

మగును. ఆత్మతత్త్వ బ్రహ్మస్వరూపావగతికి బాధకములైన అవిద్య, తత్కార్యములు లేకపోవుటవలన, జీవాత్మయే యీశ్వరతత్త్వపలక్షితమైన బ్రహ్మ యగునని భావము.

వా ర్తి క ము

స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యా మిత్యాదీ న్యపరాణ్యపి ।
ప్రమాణా న్యాప్తవాగాహ ప్రత్యభిజ్ఞా ప్రసిద్ధయే॥ ౩౨

పీ యూ ష వ ర్షి ణీ

యుక్తిచే ప్రతిపాదింపబడిన యర్థమునందు ప్రమాణములు చెప్పబడుచున్నవి.

స్మృతి యనగా—

"క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత"

(భ. గీ. ౧౩-౨)

"నచ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్"

(భ. గీ. ౯-౫)

ఇత్యాది స్మృతులు,

'ప్రత్యక్ష' మనగా, 'బ్రహ్మైవాహమస్మి' యనెడిజ్ఞానియనుభవము.
'ఐతిహ్య' మనగా, 'తత్త్వమసి'యను గురూపదేశవాక్యము.
'ఆది' శబ్దముచేత అనుమానప్రమాణము గ్రహింపబడును.
"జీవేశ్వరౌ న తత్త్వతో భిన్నౌ, ఏకస్వభావత్వే సతి ఉపాధిపరామర్శ మన్తరేణ అనభివ్యమాన భేదవత్త్వాత్, ఆకాశవత్" ఇత్యాది అనుమాన ప్రమాణము.

"సత్యంజ్ఞానం" (తై. ఉప. ౨-౧)
"ప్రజ్ఞానఘన ఏవ" (మాండూక్య.)

అను శ్రుతుల వలన జీవేశ్వరు లిరువురకు చిత్స్వభావత్వము శ్రూయమాణ మగుచున్నందున, విశేషణాసిద్ధి లేదు.

'ఆప్తవాగాహ' యనగా—

"స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యమ్। అనుమానంచతుష్టయమ్।
ఏతై రాదిత్యమండలమ్। సర్వైరేవ విధాస్యతే।"
(తై. ఆ. ౧-౨)

అను శ్రుతి, ఆప్తవాక్కు అయిన శ్రుతి, స్మృత్యాది ప్రమాణములను చెప్పినది. ఆదిత్యమండల మనుచు, అధ్యాత్మము, అధిదైవము, అతిపురుషాత్మకము నైన ఆదిత్యమండలముచే నుపలక్షిత మగునట్టి ప్రత్యగ్బ్రహ్మ తత్త్వమును విధించుచున్నదని ఉదాహృత శ్రుతివచన తాత్పర్యము. "అహంబ్రహ్మ" "బ్రహ్మైవాహం" అని బ్రహ్మాత్మల ఏకత్వసిద్ధికి (ప్రత్యభిజ్ఞకు) స్మృతి, ప్రత్యక్షాదులు ప్రమాణములని తాత్పర్యము.

వార్తికము

**ఇతి శ్రీదక్షిణామూర్తిస్తోత్రార్థ ప్రతిపాదకే।**
**ప్రబన్ధే మానసోల్లాసే సప్తమోల్లాస సంగ్రహః॥**

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
షష్ఠోల్లాస సంగ్రహము
సంపూర్ణము.

విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధత
శ్శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః
స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయాపరిభ్రామితః
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥౮

పీ యూ ష వ ర్షి ణీ

బ్రహ్మాతిరిక్తముగ, వేఱే వస్తువు లేకపోయినచో పరమార్థోపదేశాది వ్యవహారము ఎట్లు జరుగును? బద్ధుడైన వాడు ఒకడు ఉండినపుడు కదా, బంధనివృత్తికై విద్యోపదేశము ఆవశ్యక మగును? బంధహేతువు ఏదియును లేదు కదా? ముక్తిహేతువులగు గురుశాస్త్రాదులు లేకపోవుట వలన విద్యావంతులగు మోక్షము సంభవించదు కదా? యని నానాశంకలు బయలుదేరగా, పరమాత్మయందు, అదృష్టమైన అనాది, అనిర్వచనీయ మాయాశక్తివలననే బ్రహ్మపరోక్ష సాక్షాత్కారపర్యంతము సమస్త వ్యవహారము సంగత మగు ననుచు శ్రీశంకరభగవత్పాదులు 'విశ్వం పశ్యతి' యను శ్లోకము నారంభించుచున్నారు.

ఉపనిషత్తులయందు ప్రసిద్ధుడు, పూర్ణపురుషుడు నయిన పరమేశ్వరుడు మలినసత్త్వప్రధానయు, కార్యకారణ సంఘాతాకారముగా పరిణతయు, స్వోపాధిభూతయు నయిన మాయచేత బహువిధములైన భ్రమలను పొందినవాడై, సర్వప్రాణులకు అపరోక్షరూపుడైన జీవుడను అనెడి భావము నొంది, నిద్రాపరవశుడైనవాడు అనేక విధములైన

స్వప్నములను చూచినట్లు ఈవిశ్వమును బహుభేదభిన్నముగా భ్రమతో నవలోకించును.

'నేహ నానాఽస్తి కించన' ఇత్యాది శ్రుతులచేత నిషేధింపబడుటవలన పరమార్థమున, బ్రహ్మవ్యతిరిక్తమైనది యేదియు లేదు. అయినను, అనాది, అనిర్వచనీయ మాయా వశమున, వ్యర్థముగా భ్రాంతుడైన జీవుడు నిద్రాపరవశుడైనవాడు అనేకవిధములైన స్వప్నములను చూచినట్లు ప్రపంచమును బహుభేదభిన్నముగా చూచును. అనేకానర్థ సంకులమైన మాయచే పరిభ్రామితుడైన ఆ యాత్మకు, స్వభ్రాంతిసిద్ధమైన గురు శాస్త్ర న్యాయాదులచే విద్య యుదయించగా, వాసనాసహితముగ అవిద్య నశించును. స్వప్నమునందు వ్యాఘ్రమును చూచుటవలన కలిగిన భయముచే నిద్రనుండి మేల్కాంచిన పురుమునకు స్వప్నము నశించును. అంత, భయహేతువైన వ్యాఘ్రము నశించును. అటులనే, అవిద్యాసిద్ధములైన గురుశాస్త్రోపదేశములచే ప్రబోధము నొందిన పురుషునకు అజ్ఞానము నశించును. అంత నతడు సంసారబంధ వినిర్ముక్తుడై స్వస్వరూపమైన సచ్చిదానందాత్మయందు నిరతిశయ మహత్త్వసంపన్నుడై క్రీడించుచు నుండును. సంక్షేపశారీరకమునందు శ్రీ సర్వజ్ఞాత్మముని యీ విషయమును ఇట్లు వివరించిరి.

"తస్మాత్ బ్రహ్మవిద్యయా జీవభావం ప్రాప్య స్థిత్వా తావకే తు స్వరూపే। త్వచ్చిత్తేన స్పందితం విశ్వజాత మాకాశాది క్ష్మావసానం చ పశ్యేః॥"

"స్వీకారావిద్యాకల్పిత ఆచార్య వేద న్యాయాదిభ్యో
జాయతే తస్య విద్యా । విద్యాజన్మధ్వస్తమోహస్య
తస్య స్వేరూపావస్థితిః స్వప్రకాశే॥"

కాగా, సర్వము బ్రహ్మమాత్రమే యైనను,
భ్రాంతిచేత సర్వము ఉపపన్నము. కార్యము జన్యము;
'స్వం' అనగా, గృహ క్షేత్ర ధనాదులు; స్వామి—గృహ,
క్షేత్రధనాదుల కధిపతి; విద్యాగ్రహణమునకై ఉపసదనవిధితో
గురుసమీపమున కేగిన శిష్యుడు; విద్యోపదేష్ట యగు
నాచార్యుడు, పితృపుత్రాదిరూపముతో ఈ విశ్వమును నెవరు
చూచునో, అట్టి గురుమూర్తి యగు (శ్రీ) దక్షిణామూర్తి
దేవునకు నమస్కారము.



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## అష్టమోల్లాసః

### అవతారిక

ఇపుడు, పూర్వప్రతిపాదిత సర్వశాస్త్రార్థమును ఉపసంహారము చేయుటకై "విశ్వంపశ్యతి" యను శ్లోకము ఉత్థాపితము చేయబడుచున్నది. శ్రీ సురేశ్వరులు అష్టమ శ్లోకముయొక్క అర్థవివేచనమునకై అష్టమోల్లాసము నారంభించుచున్నారు.

వార్తికము

ప్రకాశవ్యతిరేకేణ పదార్థః కోఽపి నాస్తి చేత్ ।
పరమార్థోపదేశాన్తో వ్యవహారః కథం భవేత్ ॥ ౧

పీయూషవర్షిణి

ప్రకాశాతిరిక్తమైన పదార్థము లేనిచో, పరమార్థోప దేశాంతమైన వ్యవహారము ఎట్లు జరుగును ?

వస్తుగతిచేత కాలత్రయమునందు నైనను చైతన్య ప్రకాశము కంటె నతిరిక్తమైన భూత భౌతిక రూపమైన

మే పదార్థము లేనియెడల, పరమార్థోపదేశాంతమైన వ్యవహారము, గురువు వలన తత్త్వజ్ఞానగ్రహణోపదేశము కంటె పూర్వ వ్యవహారము, అనగా సంసారవ్యవహారము ఏమి యాలంబనము కలిగియుండును? అని ప్రశ్న.

## వార్తికము

కస్య బంధశ్చ మోక్షశ్చ బధ్యతే కేన హేతునా ।
మాయాయా లక్షణం కిం స్యా దిత్యేవం పరిపృచ్ఛతః॥ ౨
ప్రశ్నస్యాస్య దుత్తరం వక్తుం ప్రతిపత్తుం సుఖేన చ ।
ఉక్తోఽర్థ స్సప్తభిః శ్లోకైః పున స్సంక్షిప్య కథ్యతే ॥ 3

## పీ యూ ష వ ర్షి ణీ

ఎవరికి బంధము? ఎవరికి మోక్షము? ఏ హేతువు చేత ప్రాణి, బద్ధుడగుచున్నాడు? మాయయొక్క లక్షణ మేమి? ఈవిధముగా ప్రష్ట, ప్రశ్నించును. ఆ ప్రశ్నలకు సమాధానము చెప్పుటకై అనాయాసముగ తెలిసికొనుటకై పూర్వము ఏడు శ్లోకములతో చెప్పబడిన యర్థమే మరల సంక్షేపముగా చెప్పబడుచున్నది.

## విశేష వివరణము

బంధము లేనపుడు, మోక్షము మాత్రము ఎవరికి? మోక్షము బంధనివృత్తిరూపము కదా? ఇది యంతయు మాయామయ మనినచో, తన్మాయాలక్షణ మేమియో, చెప్పవలసి యున్నది.

మాయ యనగా నవిద్య. ఆ మాయకు ఆశ్రయము పరమేశ్వరుడు. పరమేశ్వరునకు అవిద్య వలననే జీవత్వము ప్రాప్తించును. జీవునకు అవిద్య కారణభూతురాలు. అవిద్యా కార్యమైన జీవుడు అవిద్యకు ఆశ్రయము కాజాలడు; అవిద్యకు విషయ మగును. కావుననే, 'ఆశ్రయత్వ విషయత్వ విభాగినీ నిర్విభాగచితిరేవ కేవలా' యని మాయాలక్షణము చెప్పబడినది.

పూర్వప్రతిపాదిత విషయమునే మరల చెప్పుటవలన పునరుక్తిదోషము రాదా ? యనిన, శాస్త్రార్థవిషయమునందు పునరుక్తిదోషము లేదని చెప్పుచున్నారు.

ఈ వేదాన్తశాస్త్రమునందు శబ్దమునుగాని, అర్థమును గాని, పౌనఃపున్యముగా చెప్పుట పునరుక్తిదోషము కాదు. అభ్యాసముచేత, అనగా పౌనఃపున్యముగా చెప్పుటచేత అర్థగరిమ ప్రతిపాదింపబడును.

ప్రతిపాద్యమైన బ్రహ్మాత్మైక్యరూపవస్తువు అతి సూక్ష్మము, అతిగహనము నగుటచేత పునరుక్తిదోషము చెప్పుటకు నవకాశము లేదు. శ్రుతితాత్పర్యగోచరత్వమే బ్రహ్మాత్మవస్తువుయొక్క గరీయస్త్వ మని తెలియ వలయును.

"విశ్వం పశ్యతి" యను శ్లోకహృదయమును శ్రీ సురేశ్వరులు ఇట్లు అభివ్యక్తము చేయుచున్నారు.

వార్తికము

స్వయంప్రకాశే సద్రూపే౽ప్యేకస్మిన్ పరమేశ్వరే।
కార్యకారణ సంబన్ధా ద్యనేకవిధకల్పనా ॥ ౫

పీయూషవర్షిణీ

అఖండ ఆనంద చిదాత్మయందే, విద్యవలన నవిద్య వృత్తము కానంతపఱకు, సమస్త వ్యవహారము, అవిద్య, మాయ, ప్రధానము అను నామములతో నభిహితమగు అనాది, అనిర్వచనీయ, అజ్ఞాన విలసితమైన ప్రపంచాలంబనము విరోధింపజని ప్రతిపాదించుచున్నారు.

అద్వయుడు, సద్రూపుడు, స్వయంప్రకాశుడునైన పరమేశ్వరుని యందు గూడ, కార్యము, కారణము, తత్సంబంధము మొదలైన అనేకవిధకల్పనలు చేయబడును.

వార్తికము

రాహోశ్శిరః సుషిః ఖస్య మమాత్మా ప్రతిమావపుః।
ఇత్యాది కల్పనా తుల్యా న పృథగ్వస్తుగోచరా ॥ ౬

పీయూషవర్షిణీ

ఏకము, అనేకరూపములతో కల్పింపబడు ననుచు దృష్టాంత పూర్వకముగ చెప్పబడుచున్నది.

రాహువు యొక్క శిరస్సు, ఆకాశరంధ్రము, నా యాత్మ, ప్రతిమయొక్క శరీరము మొదలగునవి కల్పనా తుల్యములు; తత్త్వతః, భిన్న వస్తువిషయకములు కావు.

## విశేష వివరణము

అమృతపాన సమయములో రాహువు యొక్క శిరస్సు ఖండింపబడినది. శిరస్సు దక్క, వానికి మఱియొక యవయవము లేదు. కాని, యిచట యవయవియైన రాహువు కంటె, తనవయవమైన శిరస్సు అభిన్నమైనను, భిన్నమని భావించి 'రాహోః శిరః' అను ప్రయోగము వ్యవహారములో నున్నది.

అవకాశము (శూన్యప్రదేశము) కంటె భిన్నమైనది కాదు ఆకాశము. అయినను, ఆకాశస్వరూపమునందు భేదభావనను కల్పించి 'ఖస్య సుషిః' యని ప్రయోగము లోకమున ప్రసిద్ధము.

'అహం' శబ్దవాచ్యమే ఆత్మ. కాని, అభిన్నములైన వాచ్య, వాచకములకు భేదకల్పనము చేసి సంబంధషష్ఠీ ప్రత్యయముతో 'మమ ఆత్మా' యని ప్రయోగించుట యనుభవములో జూతుము.

'ప్రతిమావపుః' అను స్థలమున, షష్ఠీతత్పురుష చెప్పి ప్రతిమయొక్క శరీర మని వ్యవహరించుట ప్రసిద్ధము. కాని, ప్రతిమ శరీరభిన్నము కాదు; శరీరము ప్రతిమాభిన్నము కాదు. అయినను, లోకులు భేదకల్పన జేసి 'ప్రతిమావపుః' అని ప్రయోగింతురు.

ఈ దృష్టాంతము లన్నిటను సద్వయబ్రహ్మ అనేక రూపములతో వ్యవహరించుటకు అవకాశము కలదని

సూచించుచున్నవి. నిరవయవము, నిర్గుణము నయిన పరమాత్మ తత్త్వమును వ్యవహారసిద్ధికై యా పరమాత్మ యందు సావయవత్వ, సగుణత్వ కల్పన చేయుట యనుభవసిద్ధమే. కార్యకారణాది రూపముతో ప్రపంచభేదము కల్పితమే గాని, వస్తువిషయకమైన భేదకల్పన కాదు.

## వా ర్తి క ము

ఉపాస్యోపాసకత్వేన గురుశిష్యక్రమేణ చ ।
స్వామిభృత్యాదిరూపేణ క్రీడతి స్వేచ్ఛయేశ్వరః ॥ ౭

## పీ యూ ష వ ర్షి ణి

పరమేశ్వరుడే అనేకవిధములుగా భావింపబడునని చెప్పబడుచున్నది.

పరమేశ్వరుడు స్వసంకల్పముచేత ఉపాస్య, ఉపాసక రూపముతోను, స్వామి భృత్యరూపముతోను, గురు శిష్య క్రమముతోను క్రీడించుచున్నాడు.

## విశేష వివరణము

"న తస్య కార్యం కరణం చ విద్యతే, న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే । పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ ॥"

యనుచు శ్వేతాశ్వతరోపనిషత్తు (౬-౮) ఆ పరమేశ్వరునకు కార్యముగాని, కారణత్వము గాని లేదనియు ఆయనతో సాటియైనవాడు, ఆయనకంటె నధికుడు లేడనియు చెప్పుచున్నది.

ఆ పరమాత్మకు బంధము ఒక లీలగా స్వేచ్ఛతో కల్పించుకొనబడినది. ఈవిషయమునే, "లీలావత్తు కైవల్యమ్" అను బ్రహ్మసూత్రము (౨- ౧-3-3) స్పష్టము చేయుచున్నది.

"బ్రహ్మైవ సంసరతి ముచ్యతే" అను సిద్ధాంతాను సారము స్వమాయాశక్తిచే కల్పితములైన బంధమోక్షములు బ్రహ్మకే యని తెలియవలయును. ఉపాస్య, ఉపాసక భేదము కించిద్‌జ్ఞత్వ, సర్వజ్ఞత్వాది గుణముల తారతమ్యము వలననే కలిగినది. ఆ పరమేశ్వరుడే గుణోత్కర్ష, అపకర్షల వలన ఉపాస్య, ఉపాసకరూపము నొందును.

ఒకప్పుడు శిష్యుడుగా విద్యాగ్రహణము చేసినవాడే, కాలాంతరమునందు విద్యోపదేశకుడై యాచార్యపదము నొందును. కావున, పరమేశ్వరుడే లీలగా ననేకరూపములను ధరించునని భావము.

వార్తికము

**పితరం ప్రతి పుత్రో యః పుత్రం ప్రతి పితైవ సః ।**
**ఏక ఏవ హి నానేవ కల్ప్యతే శబ్దమాత్రతః ॥ ౫**

పీయూషవర్షిణి

పితృపుత్రాదిభావము ఒక వ్యక్తియందు నియతముగా కన్పించుటలేదు గాన, పితృత్వాదులు సాపేక్షములు; అందు వలన నవి కల్పితములే గాని, పరమార్థమున లేవని చెప్పబడు చున్నది.

తండ్రికి పుత్రుడైనవాడే, పుత్రునకు తండ్రి యగుచున్నాడు. ఒకే వ్యక్తి, కేవల శబ్దములచేతనే యనేక విధములుగా కల్పింపబడుచున్నాడని భావము.

వా ర్తి క ము

**తస్మాత్ప్రకాశ ఏవాస్తి పరమార్థనిరూపణే ।**
**భేదప్రతీతి ర్మిథ్యైవ మాయయాఽఽత్మని కల్పితా ॥ ౯**

పీ యూ ష వ ర్షి ణీ

సాక్షిస్వరూపమైనది స్వప్నమువలె, మాయామయమే (మిథ్యాభూతమే) గాని, వాస్తవికము కాదని చెప్పబడుచున్నది.

సాక్షిస్వరూపమైనది మాయామయ మగుటవలన, పరమార్థ నిరూపణమునందు ప్రకాశస్వరూపుడైన పరమేశ్వరుడొక్కడే యున్నాడు. భేదప్రతీతి (భేదానుభవము) పరమాత్మయందు మాయాకల్పితమైన మిథ్యయే.

వా ర్తి క ము

**మిథ్యాత్వం నామ బాధ్యత్వం సమ్యక్ జ్ఞానోదయే ।**
**శిష్యాచార్యోపదేశాది స్వప్నవత్ ప్రతిభాసతే ॥ ౧౦**

పీ యూ ష వ ర్షి ణీ

మాయయొక్క లక్షణము ఏమి? యని అంతిమ ప్రశ్నకు భేదప్రతీతియే మిథ్య యని చెప్పబడినది. ఇపుడు మిథ్యాత్వము యొక్క లక్షణము చెప్పబడుచున్నది.

దృఢమైన అపరోక్షజ్ఞానము కలిగినంతనే, బాధ్యత్వము యొక్క పేరే మిథ్యాత్వము. అనగా, తత్త్వజ్ఞానముచే నివృత్త మగునది మిథ్యాత్వము. ఇదియే మాయాలక్షణము ('తత్త్వజ్ఞానాపనోద్యత్వం మిథ్యాత్వ మిత్యర్థః. ఇదమేవ మాయాయా లక్షణమ్,). జ్ఞానోదయమైనంతనే శిష్య, ఆచార్య ఉపదేశాది వ్యవహారములు స్వప్నము వలె గోచరించును.

## విశేష వివరణము

ప్రమాణసిద్ధమైనది యున్నదు ప్రమాణజ్ఞానముచే భాధితము కాదు. ఏలన, ప్రమాణసిద్ధమైనది భాధితమైనచో దాని ప్రామాణికత్వమునకే వ్యాఘాతము కలుగును. బాధ యనగా, దేనియందు ఏ జ్ఞానము కలుగునో, దానియందే, మూడు కాలములయందు తద్జ్ఞానాభావమునకు సంబధించిన దృఢ నిశ్చయ (బోధ) వ్యవహారయోగ్యముగా లీన మగుట ('బాధశ్చ యత్ర యత్ప్రతిపన్నం తత్రైవ తస్య కాలత్రయా భావబోధ వ్యవహారయోగ్యతయా లీయమానత్వమ్').

ఇచట, అనుమానరచన యిట్లుండును.

"విమతః శిష్యాచార్యరూపో భేదప్రపంచో వస్తుతః ఆత్మ న్యన్యత్ర వా న కాలత్రయేఽప్యస్తి, యత్ర యత్ పపన్నం తత్రైవ జ్ఞానాపనోద్యత్వాత్, స్వప్నదృష్ట ప్రపంచవత్."

వా ర్తి క ము

మిథ్యాభూతోఽపి వేదాన్త స్సత్య మర్థం ప్రబోధయేత్।
దేవతాప్రతిమావచ్చ చిత్రవత్ప్రతిబింబవత్ ॥ ౧౧

పీ యూ ష వ ర్షి ణి

అటులయినచో, ప్రత్యగ్బ్రహ్మాత్మ తత్త్వమును ఉపదేశించు
కి వేదాంతశాస్త్రమునకు ప్రామాణ్యము ఎట్లు సిద్ధించు
ౕన, చెప్పబడుచున్నది.

దేవతాప్రతిమవలె, చిత్రపటము వలె, ప్రతిబింబము
లె వేదాంతశాస్త్రము మిథ్యాభూతమైనను, వాస్తవికమైన
త్త్వమును బోధించును.

దేవత కాని ప్రతిమయందు ఆరోపితమైన దేవత
పూజకునకు యథార్థమైన ఫలము నిచ్చును. ప్రతిమ దేవత
దు. ప్రతిమయే దేవతయైనచో, తద్దేవతోచితమైన అనేక
ౕకిక వ్యాపారములు ప్రసక్తము లగును. అట్లే, వ్యాఘ్ర
జాది చిత్రములు బాలునికి భయాదిహేతువు లగును.
ర్పణమునందలి ప్రతిబింబము బింబాది సత్యబోధక మగును.
కేతిగనే, వేదాంతశాస్త్రము స్వతః మిథ్యాభూతమైనను,
త్యబ్రహ్మతత్త్వబోధక మగును.

వా ర్తి క ము

సర్వోఽపి వ్యవహారోఽయం మాయాయాః పరిజృంభణమ్।
సుషుప్తివద్వృథీ మాయా స్వప్రబోధేన బాధ్యతే॥ ౧౨

### పీయూష పఙ్క్తి

సమస్త వ్యవహారము మాయామయ మనుటలో నేమియు విప్రతిపత్తి లేదనుచు ఉపసంహారము చేయుచున్నారు.

సమస్త వ్యవహారము మాయయొక్క పరిజృంభణమే యని, అనగా మాయయొక్క వివర్తమే యని తెలియవలయును. గాఢనిద్రా సదృశమైన మాయ, ఆత్మయొక్క సమ్యక్ జ్ఞానముచే బాధిత మగును. మాయాస్వరూపము వేదాంత శాస్త్రజన్యమైన ఆత్మజ్ఞానముచే బాధిత మగునని భావము. ('మాయాయాః స్వరూపం స్వప్రబోధేనాత్మావబోధేన వేదాన్తజనితేన బాధ్యతే అపలప్యత ఇత్యర్థః').

### వార్తికము

**యుక్తిహీనప్రకాశస్య సంజ్ఞా మాయేతి కథ్యతే ।**
**నాసతీ దృశ్యమానా సా బాధ్యమానా న వా సతీ॥** ౧౩

### పీయూష పఙ్క్తి

ఇపుడు, సాక్షాత్తుగ మాయయొక్క లక్షణము చెప్పబడుచున్నది.

యుక్తిహీనమైన (విచారరహితమైన) ప్రకాశము (ప్రతీతి) యొక్క సంజ్ఞ మాయ యని చెప్పబడును. ఆ మాయ అపరోక్షముగ దృశ్యమాన మగుచు, అసత్తు అగును. బాధిత మగుచు సత్తును గాదు. సదసద్విలక్షణమని భావము.

## విశేష వివరణము

సర్వ సిధములు యున యుక్తులకు, అనగా ఆలోచనలకు ఎవనిదయ్యు, ప్రకాశమానత్వము మాయయొక్క లక్షణము యుక్తిహీనః ప్రకాశః ప్రతీతిమాత్రం యస్య తస్య సభానస్య గాయేతి కథ్యత ఇత్యర్థః. సర్వప్రకారయుక్త్యసహాత్వే త్యపి (ప్రకాశమానత్వం మాయాయా లక్షణ మిత్యర్థః').

మాయ, ప్రతీత మగుటవలన అసద్విలక్షణము; నముచే నివర్త్యము (బాధ్యము) అగున దగుటవలన ద్విలక్షణము; సదసద్విలక్షణము, దృశ్యమానము, బాధ్య మానము నగుటచేత యుక్తిహీన మని గ్రహింపనగును.

### వా ర్తి క ము

న ప్రకాశా దియం భిన్నా ఛాయేవార్కస్య తామసీ ।
నచాభిన్నా జడత్వేన విరోధా న్నోభయాత్మికా॥ ౧౪

### పీ యూ ష వ ర్షి ణీ

సదసద్విలక్షణత్వము కలదైనను, భిన్నాభిన్నత్వముల చేతగాని, సావయవత్వ నిరవయవత్వముల చేతగాని, యుక్తిసహ మగునని యాశంక యని, నిరాకరించుచున్నారు.

సూర్యుని యొక్క అంధకారరూపమైన ఛాయవలె, ఈ మాయ, పరమాత్మజ్ఞానప్రకాశము కంటె భిన్నురాలు కాదు. జడరూపిణి యగుటచే అభిన్నయు కాదు. జడ,

చేతనములకు గల విరోధము వలన ఉభయాత్మికయు (జడచేత నాత్మికయు) కాదు.

## విశేష వివరణము

సూర్యునియొక్క అంధకారచ్ఛాయ సూర్యునికంటె భిన్నము కానట్లు, ఈ మాయయు పరమేశ్వరప్రకాశము కంటె భిన్నము కాదు. యద్వా, అంధకారమునందే దృష్టి గల గుడ్లగూబలు మొదలగువానిచేత నారోపింపబడిన, సూర్యుని ఆచ్ఛాదించునట్టి తామసీచ్ఛాయ సూర్యునికంటె భిన్నము కానట్లు, ఆవరకశక్తి గల మాయయు పరమాత్మప్రకాశముకంటె భిన్నము కాదు ('యద్వా, అర్కస్య ఛాయా అర్కాచ్ఛాదికా తామసీ తమోదృష్టిభి ర్దివాంధైః ఆరోపితా నార్కాద్భిన్నా యతీత్యర్థః'). "పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే" (శ్వేతాశ్వ. ౬-౮) అను శ్రుతిచేత మాయ, ఆత్మశక్తిగ నవగత మగుటవలన, శక్తి, శక్తి మంతుని కంటె భిన్న యని భావింపబడదు. చిదాత్మ కంటె అభిన్న యని గాని, భిన్నాభిన్న యని గాని, చెప్పజనదు. ఏలన, జడము, భిన్నము నగుటవలన, జడాజడములకు సహభావము అసంభవ మగుటవలన, విషయత్వానుపపత్తి ప్రసక్త మగును. ('నాపి చిదాత్మనోఽభిన్నా, భిన్నాభిన్నా వా,జడత్వాద్భిన్నత్వా ద్విషయత్వానుపపత్తి ప్రసంగాత్ జడాజడయో రేకత్వాయోగాచ్చ').

### వా ర్తి క ము

స్వహేత్వవయవాభావా న్నేయం సావయవోచ్యతే ।
నచావయవహీనా సా కార్యేష్వవయవాన్వితా ॥ ౧౫

### పీ యూ ష వ ర్షి ణీ

ప్రకారాంతరము చేత మాయానిరాకరణము చేయబడుచున్నది.

తన కారణమునందు అవయవము కాకపోవుట వలన, అనగా, అనాదియగుట వలన ఈ మాయ సావయవ యని చెప్పజనదు. స్వకార్యములయందు అవయవ సహితయై యుండుట వలన, ఆ మాయ నిరవయవయు కాదు.

### విశేష వివరణము

మాయ అనాది. తత్కారణమైన పరమేశ్వరుడు అఖండ స్వరూపుడు గాన, ఆయనకు సావయవత్వము అసంభవము. 'కారణగుణాః కార్యే సంక్రామన్తి' యను న్యాయము ననుసరించి, కారణమైన ఆత్మయొక్క నిరవయవత్వము తత్కార్యమైన మాయయందు సిద్ధించును. సుషుప్తియందు మాయ నిరవయవగనే యనుభూయమాన మగుచున్నది.

మాయయే కార్యరూపము దాల్చుచున్నది. కార్యము సావయవముగ అనుభూయమాన మగుచున్నది. కావున, ఆమాయయే కార్యాకారముతో సావయవ యగుచున్నది. మాయా

సృష్టములైన గజ, తురగాదులు నిరవయవములు అగుట లేదు; సావయవములుగనే కన్పట్టుచున్నవి. కావున, తత్కారణమైన మాయ, సావయవ యని స్పష్ట మగుచున్నది ('తస్యా ఏవ కార్యాకారిత్వాత్ కార్యస్య చ సావయవత్వాత్ సైవ కార్యాకారేణ అవయవాన్వితేత్యర్థః. న హి మాయా వినిర్మిత హస్త్యశ్వాది నిరవయవం భవతీతి భావః'). పై విచారణ వలన, మాయ సావయవత్వ, నిరవయవత్వ ఉభయవిలక్షణ యగుటచేత, అనిర్వచనీయ యని స్పష్ట మగుచున్నది.

వా ర్తి క ము

అవిచారితసిద్ధేయం మాయా వేశ్యా విలాసినీ ।
పురుషం వంచయత్యేవ మిథ్యాభూతైః స్వవిభ్రమైః ॥౧౬

పీ యూ ష వ ర్షి ణీ

కావున, ప్రకారాంతరాభావము వలన మాయయొక్క యుక్తిహీనప్రకాశత్వరూపమైన లక్షణము సిద్ధించిన దనుచు ఉపసంహారము చేయుచున్నారు.

అవిచారితసిద్ధ (ఆలోచనారాహిత్యముచే నేర్పడు నట్టిది), విలాసిని యైన యీ మాయ యను వేశ్య, మిథ్యాభూతములైన విభ్రమములతో, (విలాసములతో) అనగా భ్రాంతికల్పిత పదార్థములతో స్వాశ్రయుడైన చేతన ఆత్మనే (పురుషమేవ) వంచన చేయును.

## వా ర్తి క ము

న తస్యా మూలవిచ్ఛేద మభివాంఛన్తి కేచన ।
తేషాం పక్షే కథం మోక్షో మనస స్సంభవిష్యతి ॥ ౧౩

## పీ యూ ష వ ర్షి ణీ

మాయావేశ్యావిలాసములచేత చంచలమైన యింద్రియజాతము ద్వారా వంచితులైనవారు ఆ మాయను వీడజాలరని చెప్పుచున్నారు.

కొందఱు ద్వైతులు ఆ మాయ సమూలముగా (వాసనాసహితముగా) ఉచ్ఛేదము నభిలషింపరు. వారికి మనోమోక్షము ఎట్లు సంభవించును ?

## విశేష వివరణము

మాయ, వాసనాసహితముగా నివృత్తము కానిచో, దోషమేమి ? అనగా, సంసారదుఃఖపరంపర నివృత్తము కాదు. కారణమైన మాయ నివృత్తము కానిచో, తత్కార్యమైన, సంసారము, తన్నిమిత్తకమైన జనన, మరణరూప దుఃఖము ఎట్లు నివృత్త మగును ?

“మనసో మోక్షః మనస్సకాశా న్మోక్షః మనోవిలయో వా, పరమోపశమలక్షిత పరమానందః తేషాం కథం స్యాత్ ?” అనగా, అత్యంత ఇంద్రియోపశమముచే లక్షిత మగు పరమానందరూపమైన మనోమోక్షము, అనగా మనస్సునుండి మోక్షముగాని, మనోవిలయముగాని, మాయాగణికావిలాస

ములచే వంచితులైనవారికి ఎట్లు కలుగును ? అని భావము. వారు మనోనాశమును స్వీయనాశముగనే భ్రాంతి వలన భావించి మాయాజాలములో చిక్కుకొని యుందురు.

## వార్తికము

**త్రిస్రోఽవ్యవస్థా మనసో జాగ్రత్స్వప్నసుషుప్తయః ।**
**చక్రవత్పరివర్తన్తే భేదభ్రాన్త్యేకహేతవః ॥ ౧౮**

## పీయూషవర్షిణి

మనోమోక్షము లేకపోయిన, పరమానందలాభము ఎట్లు చేకురును ? అను శంకకు సమాధానము చెప్పబడు చున్నది.

మనోభ్రాంతికి ముఖ్యహేతుభూతమైన జాగ్రత్, స్వప్న, సుషుప్తిరూపమైన అవస్థాత్రయమే చక్రము వలె తిరుగుచుండును.

## విశేష వివరణము

జాగ్రత్, స్వప్న, సుషుప్తులే భేదభ్రాంతికి ముఖ్య హేతువులు. మనస్సు బాహ్యేంద్రియముల ద్వారా బాహ్య విషయాకారాకారితమైనపుడు, జాగ్రదవస్థ కలుగును; జాగ్ర దవస్థయందు చూడబడిన (అనుభవింపబడిన) విషయములు వాసనారూపముతో మనస్సు లోనికి ప్రవేశించినపుడు స్వప్నావస్థ కలుగును. ఆ మనస్సు నాడీమార్గసంచారమును వీడి, స్వకారణమైన ప్రత్యగాత్మయందు విలీనమైనపుడు సమస్త వేద్య, వేదనారూపములు విలయము నొందుటవలన,

సుషుప్తిదశ కలుగును. ఈవిధముగా మనస్సంచారము ననే కర్తృ క్రియా కారక ఫలాశ్రయములైన భేద భ్రమములు (విలాసములు, భ్రాంతులు) జనించును; మనసో యదా బాహ్యేంద్రియ ద్వారా బాహ్యవిషయాకారతా భవతి తదా జాగ్రదవస్థా; యదా జాగ్రద్దృష్టవాసనామాత్రతయా స్వప్నే ప్రవిశతి, తదా స్వప్నావస్థా; యదా కర్మక్షీచ్ఛిద్రప్రసంచారం పరిత్యజ్య, స్వకారణే విలీయతే, తదా అశేష (విశేష) వేద్యవేదనాకార ప్రవిలయాత్ సుషుప్తిర్భవతి. ఏవం మనస్సంచారాత్ భేదవిభ్రమా యుక్తే కర్తృక్రియాకారక ఫలాశ్రయా ఇతి').

వా ర్తి క ము

**తాభిః కరోతి కర్మాణి పున స్తై ర్బధ్యతే మనః।**
**మనసః కేవల స్సాక్షీ భానువత్పురుషః పరః॥ ౧౯**

పీ యూ ష వ ర్షి ణీ

భేదవిభ్రమముల వలన ఏమి జరుగునో, చెప్పబడుచున్నది.

మనస్సు, ఆ భేదవిభ్రమముల వలన పుణ్య, పాప రూపములైన కర్మలను చేయును; మరల ఆ పుణ్య పాపకర్మల చేత బద్ధమగును. పరమ పురుషుడు మాత్రము సూర్యునివలె వాని మనస్సాక్షిగా నుండును.

**విశేష వివరణము**

మనస్సు భ్రాంతిచేత కర్మ చేయును. సంసారము నందలి పదార్థము లన్నియు భ్రమజన్యములే. మనస్సు

మాయాదివికారములైన యింద్రియముల ద్వారా భ్రాంతిజన్య విషయములతో సంసర్గము చెంది కర్మలు చేయును.

ఇచట, పరమేశ్వరుడు సాక్షిరూపముతో మనస్సునకు ఆశ్రయము, విషయమని చెప్పబడినది. అనేక వికారములు గల మనస్సునకు పరమేశ్వరుడు, సూర్యుడు అసంగుడై సాక్షిరూపముతో ప్రకాశించుచున్నట్లు నిర్వికారుడైన కేవల సాక్షిమాత్రుడుగనే యుండును. ఆయన, మనస్సుకంటె భిన్నుడు. వస్తుతః, అనేక వికారములు గల మనస్సునకు సాక్షి. "చేతా కేవలో నిర్గుణశ్చ" (శ్వే తా. ౬-౧౧) యను శ్రుత్యనుసారము బ్రహ్మయే. అట్లు సాక్షి కానిచో, సాక్షి యొక్కయవస్థసంసారధర్మములు కలిగినవని యంగీకరించినచో, ఆ బ్రహ్మయు సాక్ష్యకోటిలో చేరి, మఱియొక సాక్షి నపేక్షించును. అపుడు, ఆ సాక్షికి మఱియొక సాక్షి అపేక్షితు డగును. ఈవిధముగా అనవస్థాదోషము వచ్చును. ఇంతియే గాక, జాగ్రదాది అవస్థాత్రయము సాక్షిశూన్యము కావలసి వచ్చును. కావున, పరమాత్మను కేవల సాక్షిమాత్రుడుగ నంగీకరింపవలయును ('సాక్షిణో వస్తుత స్సంసారధర్మవత్త్వే తస్యాపి సాక్ష్యకోటిపతితత్వాత్ అసాక్షిక మవస్థాత్రయం స్యాదితి భావః').

వా ర్తి క ము

యథా ప్రాణకృతై రర్కః కర్మభి ర్నైవ బధ్యతే ।
తథా మనఃకృతై రాత్మా సాక్షిత్వా న్నైవ బధ్యతే॥ ౨౦

## పీయూషవర్షిణి

కర్మసాక్షి యగుటవలననే యాత్మ, కర్మలచేత లిప్తుడు కాడని చెప్పబడుచున్నది.

సూర్యుడు జీవులు చేసిన కర్మలచే లిప్తుడు కానట్లే సాక్షి యగుటవలన ఆత్మ, మనఃకృతములైన కర్మలచే బద్ధుడు బద్ధుండు కాడు.

## విశేష వివరణము

"సూర్యో యథా సర్వలోకస్య చక్షుః"

అను వచనము సూర్యుడు సర్వలోక కర్మసాక్షియైనట్లు, ఆత్మ, మనస్సుచే చేయబడిన పాప పుణ్యరూపములైన కర్మలకు సాక్షిమాత్రుడుగనే యుండునని చెప్పుచున్నది. "ఆత్మా కర్మభి ర్న బధ్యతే, సాక్షిత్వాత్, భానువత్" అని అనుమానరచన చేయబడును. దీనివలన పరమేశ్వరుడు నిత్యముక్తుడని స్పష్టమగుచున్నది.

## వార్తికము

**ఆత్మా కరోతి కర్మాణి బధ్యతే ముచ్యతే చ తైః।**
**ఇత్యౌపచారికీ కల్పిః భ్రమమాత్రైవ కేవలమ్ ॥ ౨౧**

## పీయూషవర్షిణి

ఆత్మకు, పైన చెప్పినరీతిగా, కర్తృత్వభోక్తృత్వములు లేనిచో, ఆ యాత్మకుగాని, ప్రతివాదులకుగాని, ఆగమముల యందు, లోకమునందును కర్తృత్వభోక్తృత్వములు ఎట్లు

ప్రసిద్ధములై యున్నవి? యను శంక కలుగగా, జపాకుసుమాది సంసర్గావశమున స్వచ్ఛ స్ఫటికమునందు లౌహిత్యము (ఎఱ్ఱదనము) భాసించినట్లు కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మ విశిష్టములైన, మనోబుద్ధి చిత్తాది నిమిత్తకములైన కర్తృత్వాదులే ఆత్మయందు భాసించుచున్నవి; అవివేకము వలన ప్రతివాది, లౌకిక, ఆగమ ప్రసిద్ధి కలుగుచున్నదని సమాధానము చెప్పుచున్నారు.

ఆత్మ, కర్మలను చేయుచున్నది, ఆ కర్మలచేత బద్ధమగుచున్నది, విముక్తము గూడ నగుచున్నది అను ఔపచారిక (గౌణ) కల్పన కేవలము భ్రమమాత్రమే యని భావము.

"మాయామాత్ర మిదం ద్వైత మద్వైతం పరమార్థతః" యను మాండూక్య కారికావచనము (౧.౧౭) వలన సమస్త ద్వైతవ్యవహారము భ్రమసిద్ధమని తెలియుచున్నది.

వార్తికము

**ధూమాభ్ర ధూళి నీహారై రస్పృష్టోఽపి దివాకరః ।**
**యథా ఛన్న ఇవాభాతి తథైవాత్మాఽపి మాయయా ॥ ౨౨**

పీయూషవర్షిణీ

మనోబుద్ధ్యాది ఉపాధిసంసర్గము వలన ఆత్మకు యథావత్ప్రకాశము లేనిచో, ఆయనకు అసంగత్వ, కూటస్థత్వాది స్వభావము ఎట్లు ఉపపన్న? నను శంకను దృష్టాంత పురస్సరముగా నిరాకరించుచున్నారు.

ఆదిత్యుని ప్రకాశము, మేఘము, ధూళి, పొగమంచుతో అసంస్పృష్టుడైనప్పటికి, ఆచ్ఛన్నమైనవాని వలె గనపట్టును. అట్లే, ఆత్మ స్వరూపము, మాయచేత, తత్కార్యములచేత నాచ్ఛాదితుడైనట్లు ప్రతీయమానుడగును. ఆవరకమైన మాయ, పరమాత్మస్వరూపమునందు ప్రవేశించకయే, పరమాత్మ ప్రకాశమును ఆవరించి యున్నట్లు అనిపించును.

### వా ర్తి క ము

యథా లీలావశాత్ కశ్చిద్ భ్రామ్యమాణః కుమారకః।
భ్రమా త్తత్పశ్యతి జగత్ శతచన్ద్రం నభఃస్థలమ్॥ ౨౩

### పీ యూ ష వ ర్షి ణీ

పరమార్థతః, ఆవరింపబడుట లేకపోయినను, ఆత్మకు ఆవృతత్వప్రతీతి దృష్టాంతపూర్వకముగ చెప్పి, విక్షేపావరణము గూర్చి పరమార్థమున ఆత్మకు లేదనుటయందు దృష్టాంతము చెప్పబడుచున్నది.

ఒకానొక బాలుడు ఆటలో (లీలావశాత్) పైకి ఎత్తి ...ట్టున త్రిప్పబడినప్పుడు అతడు, చుట్టు నుండు జగత్తును, తిరుగుచున్న ఆకాశమును శతచంద్రవిభ్రాజితముగ జూచును.

### వా ర్తి క ము

తథైవ మాయయా జీవో భ్రామితో వాసనావశాత్ ।
నానాకార మిదం విశ్వం భ్రమమాణం చ పశ్యతి ॥ ౨౪

పీ యూ ష ప ర్షి ణీ

అనాదిగను, జీవుడు వాసనావశుడై మాయచేత భ్రామితుడైనపుడు, ఈ విశ్వమును భ్రమమాణముగను (చంచలముగను), అనేక ఆకారములు కలదానినిగను జూచును ('వాసనావశాత్ పూర్వపూర్వ భ్రమజ సంస్కారోద్బోధ వశాత్, నానాకారం దేవ నిర్వ్యాజ్మనుష్యాద్యనేకాకారం భ్రమమాణం చంచల మిత్యర్థః').

వా ర్తి క ము

సంసృజ్య మనసా దేవ స్సంసరన్నివ లక్ష్యతే।
యథార్కో జలసంసర్గా చ్చల న్నానేవ లక్ష్యతే॥ ౨౩

పీ యూ ష ప ర్షి ణీ

మాయచేత భ్రామ్యమాణుడైనను, జీవునకు పరమార్థమున, భ్రమణము లేదని దృష్టాంతపురస్సరముగా చెప్పబడుచున్నది.

జలసంబంధము చేత సూర్యుడు, చలించుచున్నవాని వలె, నానారూపములు కలవానివలె గన్పట్టును. అటులనే, ఆత్మ (దేవః) మనస్సంసర్గము కలవాడై, సంసార పతితు డైనట్లు ప్రతీతుడగును.

## విశేష వివరణము

వస్తుతః, సూర్యుడు ఒక్కడే, అవికారియే. అయినను జలమునందలి చలనము వలన నానాగా భాసించును. అట్లే,

్వయంప్రకాశస్వరూపుడైన ఆత్మ (జీవుడు) నిర్వికారుడయ్యు, ఃనస్సంబంధము వలన సంసారివలె భాసించునుగాని, వాస్తవ తి యందు ఆత్మకు సంసరణము లేదని భావము.

వార్తికము

**యోగాభ్యాసవశాద్యేన మనో నిర్విషయం కృతమ్ ।**
**నివృత్తస్స పుమాన్ సద్యో జీవన్ముక్తో భవిష్యతి ॥ ౨౬**

పీయూషవర్షిణీ

ఈవిధముగా, చిదాత్మయగు జీవునకు మాయా నిత్తమైన బంధమును వర్ణించి, సాధనసహితముగా త్త్వజ్ఞాన ద్వారకమైన మోక్షమును వివరించుచున్నారు.

యోగాభ్యాసబలముచేత మనస్సును నిర్విషయక ుగ, అనగా, ఆలంబన శూన్యమైన నిర్విషయ బ్రహ్మ ారముగ చేసికొనినవాడు సర్వకర్మలనుండి, తన్మూలకమైన ంకల్పమునుండియు నివృత్తుడై (పరమహంస స్థితిని పొందిన ాడై) వెంటనే, అనగా, నిర్విషయమైన ఆత్మజ్ఞానోదయము లిగినంతనే, జీవన్ముక్తుడగును. ('నిర్విషయం కృతం ఆలంబన ూన్య మవిషయ బ్రహ్మాకారం కృత మిత్యర్థః; అతఏవ స ుమాన్ ఉపస్థితాత్ బాహ్యావిషయాత్ నివృత్తస్సన్ జీవన్ముక్తః ద్యో నిర్విషయాత్మ జ్ఞానోదయ సమయ ఏవ భవిష్య ిత్యర్థః').

వార్తికము

**ద్వా సుపర్ణా చ సయుజా పఠవ న్మాయయా శివః ।**
**అజామేకాం ద్విషన్నేకో నానేవాసీదితి శ్రుతిః ॥ ౨౭**

### పీయూషపఙ్క్తిజీ

ఈ విషయమునందు మాయాకృతమైన జీవేశ్వర భేదమును ప్రతిపాదించునట్టి శ్రుతులను ప్రదర్శించుచున్నారు.

పరస్పరమిత్రులుగా సదా యోగసంయుక్తములై యుండు, మంచి ఱెక్కలు గల రెండు పక్షులు రూప మున్నాయను. వానిలో నొకటి (జీవుడు), జన్మరహితమైన (అజాం) ఒకదానిని (ప్రకృతిని) సేవించుచు, అనేక రూపములు గలదానివలె నుండు నని శ్రుతి యుపదేశించుచున్నది.

### విశేష వివరణము

ఆ శ్రుతు లివి-

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం
పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్న
న్నన్యో అభిచాకశీతి" (ముండక. 3.1)

శ్రీ శంకరభగవత్పాదులు తమ భాష్యమునందు ఈ మంత్రార్థము నిట్లు వివరించినారు.

"ద్వా ద్వౌ సుపర్ణా సుపర్ణౌ శోభనపతనౌ సుపర్ణౌ పక్షిసామాన్యాద్వా సుపర్ణౌ సయుజా సయుజౌ సహైవ సర్వదా యుక్తౌ సఖాయా సఖాయౌ సమానాఖ్యానౌ సమానాభివ్యక్తికారణా వేవంభూతౌ సన్తౌ సమానవిశేష ముపలబ్ధ్యధిష్ఠానతయైకం వృక్షం వృక్షమివోచ్ఛేదన సామాన్యాచ్ఛరీరం వృక్షం పరిషస్వజాతే పరిష్వక్తవన్తౌ।

౹వర్ణావివైకం వృక్షం ఫలోపభోగార్థమ్ । అయం హి వృక్ష
ఊర్ధ్వమూలో౽వాక్ శాఖో౽శ్వత్థో౽వ్యక్తమూల ప్రభవః
క్షేత్రసంజ్ఞకః సర్వప్రాణికర్మఫలాశ్రయ స్తం పరిష్వక్తౌ
సుపర్ణావివ అవిద్యాకర్మవాసనాశ్రయలింగోపాధ్యాత్మేశ్వరౌ।
తయోః పరిష్వక్తయో రన్య ఏకః క్షేత్రజ్ఞో లింగోపాధివృక్ష
మాశ్రితః పిప్పలం కర్మనిష్పన్నం సుఖదుఃఖలక్షణం ఫలం
స్వాదు అనేకవిచిత్రవేదనాస్వాదరూపం స్వాద్వత్తి భక్షయ
త్యుపభుంక్తే౽వివేకతః అనశ్నన్నన్య ఇతర ఈశ్వరో నిత్య
శుద్ధ బుద్ధ ముక్తస్వభావః సర్వజ్ఞః సర్వసత్త్వోపాధి రీశ్వరో
నాశ్నాతి। ప్రేరయితా హ్యసా వుభయో ర్భోజ్యభోక్త్రోః
నిత్య సాక్షిత్వ సత్తామాత్రేణ స త్వనశ్నన్నన్యో౽భి
చాకశీతి పశ్యత్యేవ కేవలమ్ । దర్శనమాత్రం హి తస్య
ప్రేరయితృత్వం రాజవత్" (శం. భా. ముండక. 3-౧).

"అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీం ప్రజాం
జనయన్తీం సరూపామ్" (మహా. ఉ. ౧-౨-౫)

ఇత్యాది శ్రుతులు జీవేశ్వరుల మాయిక భేదమును
ప్రతిపాదించుచున్నవి. జీవేశ్వర భేదము మాయోపాధికృతమే
గాని, వాస్తవికము కాదని తెలియనగును.

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।**
**ప్రబన్ధే మానసోల్లాసే అష్టమోల్లాస సంగ్రహః ॥**

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
అష్టమోల్లాస సంగ్రహము
స ం పూ ర్ణ ము.

భూరంభాంస్యనలోఽనిలోఽంబర మహర్నాథో హిమాంశుః
పుమా
నిత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభో
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥౯

[illegible]

భూమియు, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, సకల శాస్త్ర విద్యాధికారియైన జీవుడు (పుమాన్) ఈవిధముగా చరాచరాత్మకమైన యీ విశ్వము సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సచ్చిదానందస్వరూపుడు, అద్వయుడు నయిన పరమేశ్వరుని యొక్క మూర్త్యష్టకముగా సంతత భాసించుచున్నది.

## విశేష వివరణము

ఉపాసకుడు తన దేహమునందున్న వ్యష్టి పంచభూతములను సూర్య, చంద్రులతో నేకము నొనర్చి పాంచభౌతికమైన శరీరము నభిమానించునట్టి స్వాత్మను అష్టమూర్త్యాత్మకుడైన పరమేశ్వరునితో నేకత్వము చేసి, 'సర్వత్ర వ్యాపించియున్న అష్టమూర్త్యాత్మకుడైన సదాశివుడను నేను' అని భావన చేయనగును. అంత, భావనాతిశయముతో పరమేశ్వర సాయుజ్యమును పొంది, సర్వైశ్వర్యసంపన్నుడైన యుపాసకుడు తుట్టతుదకు, పరమేశ్వరానుగ్రహము వలన కలిగిన తత్త్వజ్ఞానముచేత

౯పరోక్ష తత్త్వసాక్షాత్కారము వలన విముక్తుడగును. ఈ విధముగా, యథాశాస్త్రీయముగ గురువువలన, శ్రుతుల వలన, యుక్తులచేతను నిరంతరము తత్త్వవిచారము చేయు వారలకు వివిధ ప్రపంచాత్మకముగా వివర్తమానుడు, సర్వకారణుడు, సర్వాధిష్ఠానస్వరూపుడు, సచ్చిదానందాత్మకుడు నయిన పరమేశ్వరుని కంటె నన్యమైనది యేదియు నుండదు. ఏలయన, సర్వము ఆ పరమేశ్వరుని యందు అధ్యస్తమై, తన్మాత్రముగ నున్నది. ఈవిషయమునే మహిమ్న స్తోత్రము ఈ రీతిగ వివరించుచున్నది.

'త్వమర్క స్త్వం సోమ స్త్వమసి పవన స్త్వం హుతవహ
స్త్వమాప స్త్వం వ్యోమ త్వము ధరణి రాత్మా త్వమితి చ।
పరిచ్ఛిన్నా మేవం త్వయి పరిణతాం బిభ్రతి గిరం
న విద్మ స్తత్త్వం వయ మిహ తు యత్త్వం న భవసి ॥"

ఓ పరమేశ్వరా! సూర్యుడవు నీవు; సోముడవు నీవు; పృథివ్యప్తేజో వాయురాకాశములు నీ స్వరూపములే అయి యున్నవి; నీవే, ఆత్మవు (జీవాత్మవు); ఈవిధముగా నీయందు పరిచ్ఛిన్నమైన, పరిణామము నొందిన వాక్కు, ఏ తత్త్వము ధరించుచుండగా, అనగా ప్రతిపాదించుచుండగా, మేము ఇచట నీవు కాని తత్త్వ మేదియో తెలియకున్నాము. పరమేశ్వరుడు సర్వాత్మకుడుగ ప్రస్ఫుట మగుచున్నాడని భావము.

"విశ్వం భూతం భువనం చిత్రం బహుధా జాతం జాయమానం చ యత్, సర్వో హ్యేష రుద్ర స్తస్మై రుద్రాయ నమో అస్తు" (మ. ఉ. ౧౬—౧౫).

"యస్మాత్పరం నాపరమస్తి కించి ద్యస్మా న్నాణీయో న జ్యాయోఽస్తి కశ్చిత్, వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠ త్యేక స్తేనేదం పూర్ణం పురుషేణ సర్వమ్"

ఇత్యాది శ్రుతులు ఇచట అనుసంధేయములు. బ్రహ్మాత్మ జ్ఞానము వలన ఉత్తమాధికారులకు ఇచటనే (ఈ జన్మయందే) సచ్చిదానంద అద్వయ పరశివస్వరూపావస్థాన లక్షణమైన ముక్తి సిద్ధమగు ననుచు "అత్ర బ్రహ్మ సమశ్నుతే" యని శ్రుతి యుద్ఘోషించుచున్నది. జ్ఞానోపదేష్ట, గురుస్వరూపుడు నయిన శ్రీ దక్షిణామూర్తిస్వరూపముతో విరాజిల్లుచున్న పరమేశ్వరునకు నమస్కారము.



శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## నవమోల్లాసః

### అవతారిక

ఇప్పుడు శ్రీ సురేశ్వరులు పూర్వ ప్రతిపాదితమైన జీవేశ్వర తత్త్వజ్ఞాన సాధనవిధాన నిరూపణమునకై వార్తికము నారంభించుచున్నారు.

### వార్తికము

కథ మేవం విధా మాయా నివర్తేతేతి పృచ్ఛతః ।
ఈశ్వరోపాసనారూప స్తదుపాయః ప్రకీర్త్యతే ॥ ౧

### పీయూషవర్షిణి

ఈవిధమైన మాయ, అనగా, మిథ్యాభూత సంసార ప్రవర్తికమైన మాయ, ఎట్లు నివర్తించును ? అని ప్రశ్నించుచున్న శిష్యునకు ఈశ్వరోపాసన యొక్క స్వరూపము, తదుపాయము విశదీకరింపబడుచున్నది.

### వార్తికము

షట్ త్రింశత్తత్త్వరూపాసు పరమేశ్వరమూర్తిషు ।
ప్రత్యక్షేణోపలభ్యన్తే నన్వై రష్టమూర్తయః ॥ ౨

పీ యూ ష వ ర్షి ణి

ముప్పదియారులు (షట్త్రింశత్) తత్త్వరూపములైన పరమేశ్వరుని స్వరూపములయందు అష్టమూర్తులు అందఱిచే ప్రత్యక్షముగా పొందబడుచున్నవి.

పరమేశ్వరుడు స్వరూపముచేత నిరాకారుడు, నిర్గుణుడు, మనస్సునకు అగోచరుడు. అట్టి ఆలంబనశూన్యుడైన పరమేశ్వరుడు ఎట్లు ఉపాస్యుడు ? అను శంక కలుగుట సహజము. నిరాకారుడగుటవలన ఈశ్వరుడు ఉపాసనకు ఆలంబనమగు నవకాశము లేదు కదా ? ('నహి నిరాలంబనో పాసనా సంభవతి; న చ ఈశ్వర స్స్వరూపత ఏవ తదాలంబనం భవతి, తస్య నిరాకారత్వేన తదయోగాత్') యనిన, శంకా పరిహారము చేయబడుచున్నది. ఆలంబనసహితముగనే యుపాసన సంభవ మగును. కావున, ప్రపంచోపాదానముచేత (మాయాశక్తిచేత) కల్పిత విగ్రహరూపము కల యీశ్వరుడే యుపాసనకు ఆలంబన మని చెప్పుట యుక్తము. ('ప్రపంచో పాదానకల్పిత విగ్రహస్యేశ్వరస్య యుక్త ముపాసనా లంబనత్వమ్'). ఈ ప్రపంచము షట్త్రింశత్తత్త్వములతో సృష్టమైనదని శైవాగమప్రసిద్ధము. వానిలో సప్తమూర్తులు ప్రత్యక్షముగా గోచరించుట వలన, నవి యుపాసనకు విషయము లగును. ఆకాశము కూడ ప్రత్యక్షముగా గోచరించు నని చెప్పబడినది. ఆకాశము మనోగోచరము, లేక సాక్షి మాత్రగోచర మను మతము నాశ్రయించి చెప్పబడినదని.

లియవలయును ('ఆకాశస్యాపి మనోగోచరత్వం, సాక్షి
మాత్రగోచరత్వం చేతి మత మాశ్రిత్య ప్రత్యక్షేణోప
న్యస్తే ఇత్యుక్త మితి ద్రష్టవ్యమ్').

వా ర్తి క ము

**అను మేయాను న మనః క్షిప్ర మారోహతీత్యతః।**
**మూర్త్యష్టకమయీం బ్రూతే గురు స్సర్వాత్మభావనామ్॥ 3**

పీ యూ ష వ ర్షి ణీ

ఈ యష్టమూర్తులే యేల యుపాదేయములుగా గ్రహింప
బడినవి? అన్య తత్త్వము లేల గ్రహింపబడలేదు? అను
శంక పరిహరింపబడుచున్నది.

మనస్సు, అనుమానగమ్యములైన విషయములయందు
వెంటనే లగ్నము కాదని భావించి, యాచార్యుడు (శ్రీ శంకర
భగవత్పాదులు) అష్టమూర్త్యాత్మకమైన సర్వాత్మభావనను
చెప్పుచున్నారు.

ప్రకాశ్య, ప్రకాశక వ్యతిరిక్తమైన జ్ఞేయవస్తువు
లేకపోవుట వలన, అది అష్టమూర్తులకంటె వేఱైనది
కాకపోవుట వలన, ఇచట (శ్రీ) శంకరులు, చెప్పబోవునట్టి
యష్టమూర్తిధ్యానమే యీశ్వరుని యొక్క సర్వాత్మభావన
యని భావించి, చెప్పినారు. ('గురుః (శ్రీ) శంకరాచార్యః
ప్రకాశ్యప్రకాశకాతిరిక్తస్య జ్ఞేయస్యాభావాత్ తస్య చ
అష్టమూర్త్యతిరిక్తత్వాభావా దత్ర వక్ష్యమాణాష్టమూర్తి

ధ్యాసమేవ ఈశ్వరస్య సర్వాత్మభావమిత్యభిప్రేత్య ఉక్తమ్').

## వార్తికము

అస్యైవం సిద్ధాన్తః —

విరాట్ఛరీరే బ్రహ్మాండే ప్రాణినామపి విగ్రహే ।
షట్త్రింశత్తత్త్వసంఘాత స్సర్వత్రాప్యనువర్తతే ॥ ౪

## పీయూషపత్త్రిక

'భూరంభాంసి' యను శ్లోకతాత్పర్య వ్యాఖ్య జేయ నారంభించుచున్నారు.

ముప్పది యారు తత్త్వముల సముదాయమే విరాట్టు యొక్క సమష్టి శరీరమైన బ్రహ్మాండమునందును, జీవుల వ్యష్టిశరీరములయందును, సర్వత్ర అనుగతమై యున్నదని భావము.

## విశేష వివరణము

సమస్త బ్రహ్మాండము అష్టమూర్త్యాత్మకము. షట్ త్రింశత్ తత్త్వాత్మకమైన యీ బ్రహ్మాండము మహేశ్వరుని శరీరము (విగ్రహమ్). అది అధిదైవమని, ఆధ్యాత్మమని ద్వివిధము. అధిదైవమైన బ్రహ్మాండము చతుర్దశ భువనాత్మకము; అధ్యాత్మము పిండాత్మకము (వ్యష్టి శరీరాత్మకము). ఈ రెండును కార్యకారణరూపముతో నభిన్నములు. సమష్టిబ్రహ్మాండముయొక్క సర్వావయవము

లను వ్యష్టిపిండావయవముల యందు సంపాదింపనగును. పిండావయవి యైన జీవుని, బ్రహ్మాండావయవి (విరాట్) రూపముగ భావన చేయవలయును. తదాత్మకుడుగ ననుగతుడై యున్న పరమేశ్వరుని, ధ్యానింపనగును. ఆవిధముగ, ధ్యానము చేయుచు, ఆ పరమేశ్వరునియందు అంతఃకరణము స్థిర మొనర్ప నగును. అట్లు స్థిరీభూతమైన యంతఃకరణము కలవాడు, ఆ పరమేశ్వరుని ప్రసాదము వలన, తత్పరమేశ్వర సంబంధమైన నిర్విశేష తత్త్వమునే యపరోక్షముగా సాక్షాత్కరింపజేసికొని, కృతకృత్యు డగునని, యదంతయు క్రమముగా ప్రదర్శింపబడును.

షట్ త్రింశత్ తత్త్వము లివి—

పృథివ్యప్తేజోవాయురాకాశము లయిదు, ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానము లను పంచప్రాణములు, పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, మనోబుద్ధి చిత్త అహంకారములు కలసి పదునాలుగు ఇంద్రియములు మొత్తము ఇరువదినాలుగు తత్త్వములు; మహత్తత్త్వము, కాలము, ప్రధానము, మాయ, విద్య, పురుషుడు అనెడి యారు తత్త్వములు; బిందు నాదములు; శక్తి శివులు; శాంత అతీతము లను ఆఱు తత్త్వములు పిండాండ బ్రహ్మాండములయందు సర్వత్ర అనుగతములై యున్నవి. బ్రహ్మాండాతిరిక్తమైన పిండాండ మనునది యేదియు లేదు; అదియు అష్టమూర్తి వ్యతిరిక్తముగ లేదని భావము.

### వార్తికము

వ్యాప్తి ర్వ్యష్టిశరీరేఽస్మిన్ మనసో వ్యష్టిరూపిణః ।
తస్మాత్సర్వాత్మక మిదం స్వశరీరం విచిన్తయేత్॥ ౫

### పీయూష పఙ్క్తి

పిండాండమునందు (వ్యష్టిశరీరమునందు) బ్రహ్మాండ (సమష్టిశరీర) సంబంధిని ప్రకారమును చెప్పుటకై నిమిత్తమును, చెప్పుచున్నారు.

ఈ వ్యష్టిశరీరమునందు వ్యష్టిరూపమైన మనస్సునకు వ్యాప్తి యున్నది. అనగా, మనస్సు, వ్యష్టిశరీరమునందు వ్యాపించి యున్నది. కావున, ఈ శరీరమును సర్వాత్మకముగ భావింపవలయును. ('వ్యష్టిరూపిణో మనసోఽస్మిన్ వ్యష్టిశరీరే వ్యాప్తి ర్యస్మా త్తస్మాదితి యోజనా').

### విశేష వివరణము

"త ఏతే సర్వ ఏవ సమాః సర్వేఽనన్తాః" (బృ. ౩-౫-౧౩) యనుచు శ్రుతి, వాక్ మనః ప్రాణముల ననుక్రమించి, హిరణ్యగర్భరూపముగా వానిని ప్రతిపాదించుట వలన, మనస్సునకు వ్యాపకత్వము చెప్పినది ('వాఙ్మనః ప్రాణా ననుక్రమ్య హిరణ్యగర్భరూపేణ ఆమ్నానాత్ మనసో వ్యాపకత్వమ్'). సమష్టిశరీరియైన హిరణ్యగర్భుడు, లింగాత్మ యగుటవలన, మనఃప్రధానుడని తెలియనగును. కావున, తత్కార్యమైన

వ్యష్టిశరీరమునందు ఆ హిరణ్యగర్భవ్యాప్తి యుపపన్నము. తద్ద్వారా వ్యష్టిశరీరమునకు గూడ సర్వాత్మకత్వము చెప్పుట యుక్తిసహమని భావము.

వార్తికము

**వ్యష్ట్యుపాసనయా పుంస స్సమష్టివ్యాప్తి మాప్నుయాత్।**
**ఉపసంక్రామతీత్యేవం దశకృత్వ ఉపాదిశత్ ॥ ౬**

పీయూషవర్షిణీ

ఈవిధముగా పిండాండ, బ్రహ్మాండములు రెండును హిరణ్యగర్భరూపములు గాన, అత్యంతాభిన్నములు. కావున, పిండాత్మనా చేయునట్టి పరమేశ్వరోపాసన వలన, సమష్టి బ్రహ్మాండత్వము లభించును. కావున, పిండాండమునందు బ్రహ్మాండసంపత్తి (సంపదుపాసన) సాధింప నగును అని చెప్పబడుచున్నది.

పరమేశ్వరునియొక్క వ్యష్టిశరీరాంతరమైన ఆత్మోపాసన ద్వారా సమష్టితో నైక్యరూపమైన వ్యాపకత్వమును పొందును. తైత్తిరీయోపనిషత్తు 'ఉపసంక్రామతి' యని పది సూర్లు ఉపదేశించెను.

తైత్తిరీయోపనిషత్తునందు మొదట, అధ్యాత్మ పరముగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశముల ననుక్రమించి, యంతమున-

"ఏత మన్నమయ మాత్మాన ముపసంక్రామతి।
ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి।

ఏతం ప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రామతి ।
ఏత మానందమయ మాత్మాన ముపసంక్రామతి ।”
(తై. ఉ. ౧-౮-౫)

అని పై పంచకోశముల ఆనందమయకోశాంతర్గతమైన సంఘాతాధార, వ్యాపక బ్రహ్మప్రాప్తిరూపమైన సంక్రమణము చెప్పబడినది.

ఈవిధముగనే, భృగువల్లియందు గూడ నధ్యాయాంతమున పంచకోశసంక్రమణమును ప్రారంభించి తుదకు “ఏతమన్నమయ మాత్మాన ముపసంక్రమ్య” (తై. ఉ. 3-౧౫) ఇత్యాదిగా అయిదు మూర్తులకే సంక్రమణము చెప్పబడినది. కావున, పరిచ్ఛిన్నమైనదృష్టికి గూడ, పూర్ణాత్మవిషయముగా పరిపూర్ణప్రాప్తిహేతుత్వము ప్రమాణసిద్ధము (‘పరిచ్ఛిన్నదృష్టేరపి పూర్ణాత్మవిషయతయా పరిపూర్ణప్రాప్తిహేతుతా ప్రమాణసిద్ధేత్యర్థః’).

వార్తికము

బ్రహ్మాండస్యోదరే లోకా స్సప్త భూరాదయస్స్మృతాః ।
మూలాది బ్రహ్మరంధ్రాన్తే ష్వాధారేషు వసన్తి తే ॥ ౩

పీయూషవర్షిణీ

ఇపుడు సంపదుపాసనాప్రకారము చెప్పబడుచున్నది. భూః, భువః, సువః, మహః, జనః, తపః, సత్యలోకములు ఏడును బ్రహ్మాండోదరమునందు స్మరింపబడుచున్నవి. అనగా, శ్రుత్యనుప్రాణితములైన స్మృతులు చెప్పుచున్నవని

ంవము. ఆ సప్తలోకములు మూలాధార, స్వాధిష్ఠాన, ణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారాంతము గల క్రములు (పద్మములు) యందు ఉన్నవని ధ్యానింపవలయును.

### వార్తికము

వీణాదండో మహామేరు రస్థీని కులపర్వతాః ।
గంగా తు పింగళా నాడీ యమునేడా ప్రకీర్తితా ॥ ౮
సరస్వతీ సుషుమ్నా స్తా నాడ్యోఽన్యాః పుణ్యనిమ్నగాః ।
ద్వీపాన్యస్థి ధాతవ స్సప్త స్వేదబాష్పాదయోఽబ్ధయః॥ ౯

### పీయూషవర్షిణీ

సమస్త బ్రహ్మాండోపాసనము పిండాండమునందు పూర్వశ్లోకమున చెప్పబడినది. ఇపుడు ఆ పిండాండమునందే లోకముసంబంధి నదీ, పర్వతాదులను భావన చేయు ధానము చెప్పబడుచున్నది.

వీణాదండమునందు, అనగా వెన్నెముక యందు ('అస్థిస్కంధః పృష్ఠవంశో వీణాదండః') మహామేరుపర్వత భావన చేయవలయును; అస్థులు-ఎముకలు కులపర్వతములని ధ్యానింపవలయును; పింగళానాడి గంగ యనియు, ఇడానాడి యమున యనియు భావించి సంపదుపాసన చేయనగును.

వెన్నెముకకు పార్శ్వమునందు గల యెముకలు వంతట విస్తరించి యుండునట్టి పారియాత్రాది కులపర్వతము లని భావము.

సుషుమ్నానాడి సరస్వతీనది యని భావింపనగును. అన్యనాడులను భూలోకమునందలి పుణ్యనదులుగా నుపాసింపనగును. త్వగాది సప్తధాతువులు జంబ్వాది సప్తద్వీపము లనియు, స్వేద, బాష్పాదులు సాగరము లనియు భావన చేయవలయును. ఈ విధముగా సంపదుపాసన చెప్పబడినది. ('గంగానదీం పింగళానాడ్యాం సంపాదయేత్, ఇడాయాం యమునాం, సుషుమ్నాయాం సరస్వతీం, పార్శ్వయోర్మధ్యే చ ప్రకట గుప్తత్వ సామాన్యాత్ నాడీత్రయం నదీత్రయాత్మనా ధ్యేయ మిత్యర్థః').

వా ర్తి క ము

**మూలే తిష్ఠతి కాలాగ్ని రస్థిమధ్యే చ బాడబః ।**
**వైద్యుతోఽగ్ని స్సుషుమ్నాయాం పార్థివో నాభిమండలే॥**
**హృది తిష్ఠతి సూర్యాగ్నిః కపాలే చన్ద్రమండలమ్ ।**
**నక్షత్రాణ్యపరాణ్యాహు ర్నేత్రాదీ నీన్ద్రియాణ్యపి ॥ ౧౧**

పీ యూ ష ప ఙ్క్తి

మూలాధారమునందు ప్రళయకాలాగ్ని యున్నది; అస్థిసమూహముయొక్క యంతరాళమునందు స్వేదాది సాగరశోషకమైన బాడబాగ్ని యున్నదనియు ('అస్థిమధ్యే అస్థికుట్టాంతరాలే స్వేదాద్యబ్ధిశోషకః బాడబాగ్నిః తిష్ఠతీత్యర్థః') సుషుమ్నానాడియందు క్షణకాలస్ఫురణము గల దివ్య వైద్యుతాగ్ని యున్నది. లేక సర్వనాడులయందు ఉష్ణధారా ప్రవర్తకమగు వైద్యుతాగ్ని, సుషుమ్నానాడియందు

ునియు ధ్యానింపనగును. నాభిమండలమునందు పృథివీధాతు ప్రకమైన యగ్ని ధ్యేయమై యున్నది. సూర్యసంబంధమైన గ్నిని హృదయమునందు భావన చేయనగును. లలాటము ందు చంద్రమండలము ధ్యాతవ్యము. చంద్రవ్యతిరిక్తము ైన అశ్విన్యాది నక్షత్రములు ఇరువదియేడింటిని, నక్షత్ర పములతో గోచరించు కుజ, బుధాది గ్రహములను క్షురాది యింద్రియములయందు ధ్యానింపవలయును.

వా ర్తి క ము

ధార్యన్తే వాయుభిర్లోకా యథా ప్రవహణాదిభిః ।
ప్రాణాదిభిర్దశవిధైర్ధార్యతే వాయుభిర్వపుః ॥ ౧౨

పీ యూ ష వ ర్షి ణీ

బ్రహ్మాండగతమైన వాయువు, శరీరమునందు ప్రాణ పమున నున్నదనియు, స్వసంచారముచేత బ్రహ్మాండ రకమైన వాయువును శరీరాంతరమునందు దేహధారక న ప్రాణరూపముతో నున్నదనియు ధ్యానింప నగునని ప్పబడుచున్నది.

సప్తవిధములైన ప్రవహణ, సంహననాది వాయువుల త లోకములు ధరింపబడుచున్నవి. అట్లే, దశవిధములైన ాణాపానాది వాయువులు శరీరధారకము లగుచున్నవి.

వా ర్తి క ము

ప్రాప్యేడాపింగళే ప్రాణో మూలాత్సూర్యస్వరూపతః ।
నాసికాభ్యాం బహిర్గత్వా లీయతే ద్వషడంగుళే ॥ ౧౩

### పీయూషపఙ్క్తి

ప్రాణముయొక్క దశవిధత్వమును, తత్కార్యనిర్దేశన పురస్సరముగా ప్రదర్శింపబడుచున్నది.

మూలాధారమునుండి బయలుదేరిన ప్రాణము ఇడా, పింగళానాడులను జేరును; సూర్యునివలె ఉష్ణమునకు (వేడిమికి) ఆశ్రయమైన ప్రాణము నాసికాద్వారముల ద్వారా బాహ్యదేశమునకు పోయి, ద్వాదశ అంగుళమాత్ర పరిమితమైన ప్రదేశమున లయమును (అంతర్ధానము) నొందును ('లీయతే లయం సుదర్శనం గచ్ఛతీత్యర్థః').

### వార్తికము

అష్టాంగులేన సోమాత్మా నాడీభ్యా మన్తరావిశత్ ।
మలమూత్ర మరుచ్ఛుక్రాణ్యపానో విసృజే ద్బహిః॥ ౧౪

### పీయూషపఙ్క్తి

సోమాత్మకమైన యీ ప్రాణమే, అపాననామమును పొంది, యెనిమిది యంగుళముల పరిమాణముతో వచ్చి, ఇడాపింగళా నాడీరూపములయిన నాసికాపుటముల ద్వారా శరీరమధ్యభాగమును ప్రవేశించును; మల, మూత్ర, దుర్గంధ పూరిత వాయు, శుక్రములను బాహ్యప్రదేశమునకు విసర్జించును. అనగా, మలవిసర్జనద్వారముగుండా మల మూత్రాదులను విసర్జించునని భావము. ('తత్రాపానో వాయుః మలాది బహిర్విసృజేత్ గుదద్వారేణేత్యర్థః').

వా ర్తి క ము

అగ్నిషోమమయో భూత్వా సుషుమ్నారంధ్ర మాశ్రితః।
బ్రహ్మరంధ్ర ముద్గచ్ఛ న్నుదానో వర్ధతే స్వయమ్॥ ౧౫

పీ యూ ష వ ర్షి ణీ

ఆ ప్రాణమే అగ్నిషోమాత్మకమై (అగ్ని, చంద్రరూపముతో) సుషుమ్నా నాడీరంధ్రము నాశ్రయించి, సహస్రార చక్రము వఱకు ఊర్ధ్వముగా నధిరోహించుచు, ఉదాన వాయురూపముతో వృద్ధినొందును.

వా ర్తి క ము

వ్యాపయే ద్వపుషి వ్యానో భుక్తాన్నరస మన్వహమ్।
సన్ధుక్షణం సమానస్తు కాయాగ్నేః కురుతే సదా॥ ౧౬

పీ యూ ష వ ర్షి ణీ

ప్రతిదినము, భుజించిన అన్నరసమును వ్యాన మను పేరు గల ప్రాణవాయువు దేహమునందలి సర్వనాడులలో వ్యాపింపజేయును. సమాన మను వాయువు సదా శరీరాగ్ని ని ప్రజ్వలింపజేయుచుండును (సన్ధుక్షణం ప్రజ్వలనానుకూలో వ్యాపారః).

వా ర్తి క ము

నాగో హిక్కాకరః కూర్మో నిమేషోన్మేషకారకః।
క్షుతం కరోతి కృకరో దేవదత్తో విజృంభణమ్॥ ౧౭
స్థౌల్యం ధనుంజయః కుర్యా న్మృతం చాపి న ముంచతి।

### పీయూషపఙ్క్తిః

ఇంతకు పూర్వము శ్రుతిప్రసిద్ధములైన ప్రాణాపానాది వాయుపంచకమును, తత్కార్యములను విభజించి వివరించినారు. ఇపుడు, యోగశాస్త్రప్రసిద్ధములైన నాగ, కూర్మ, కృకర, దేవదత్త, ధనంజయరూప వాయుపంచకమును, తత్కార్యములను విభజించి, వివరించుచున్నారు.

నాగవాయువు వలన, ఎక్కిళ్లు వచ్చును. నిమేష ఉన్మేషములు (నేత్రములు మూసి తెరచుట) కూర్మవాయువు వలన కలుగును. తుమ్ము (క్షుతము) కృకర వాయువు వలన వచ్చును. ఆవలింత దేవదత్త నామకమైన వాయువు వలన వచ్చును ('విజృంభణం తంద్రాపాశాత్ ఆస్యవిదారణమ్'). స్థౌల్యము (దేహము లావెక్కుట) ధనంజయవాయువు వలన వచ్చును. ధనంజయ వాయువు వలన శవముగూడ నుబ్బిపోవును. మృత శరీరమునందు [illegible]ము ధనంజయవాయువు పని చేయుచుండు నని భావము ('మృతం చ శవమాపన్నమపి న ముంచతి, తత్రాప్యాస్తే ధనంజయ ఇత్యర్థః'). ఈవిధముగా దశవిధ వాయువులు, తత్కార్యములు వివరింపబడినవి.

### వార్తికము

**ఆకాశో బహిరప్యంతరవకాశం ప్రయచ్ఛతి॥ ౧౮**

### పీయూషపఙ్క్తిః

ఇంతవఱకు, శ్రీసురేశ్వరులు 'భూరంభాంస్యనలో౽నిలః' వఱకు గల గ్రంథమును వ్యాఖ్యానించి యున్నారు. ఇపుడు

ఆకాశాదులను వ్యాఖ్యానింపదలచి 'ఆకాశో బహిః' అను వార్తికము ద్వారా ఆకాశాదిసంపత్తిని సూచించుచున్నారు.

ఆకాశము, శరీరముయొక్క బాహ్యాభ్యంతరముల యందు సైతము అవకాశమును (రిక్తస్థానమును) ఇచ్చును. అనగా, బాహ్యజగత్తులో ఆకాశము వలన, గమనాగమనము లకు అవకాశము లభించును. అటులనే, శరీరములోపల అన్న, రక్త, రస, వాయ్వాది సంచారమునకు ఆకాశము వలన నవకాశ మేర్పడు నని భావము.

వా ర్తి క ము

చన్ద్రార్కౌ కాలనేతారౌ ప్రాణాపానౌ శరీరిణామ్ ।
సాక్షీ పురుష ఇత్యేవం మూర్త్యష్టక మిదం వపుః ॥ ౧౯

పీ యూ ష వ ర్షి ణీ

కాలనియామకులైన చంద్రసూర్యులు, జీవుల శరీరముల యందు ప్రాణ, అపాన రూపములని ధ్యానింపదగినవారు. ఆ దేహేంద్రియ సంఘాతమునకు సాక్షి, పురుషుడు పరమేశ్వరుడు. ఈ విధముగా ఈ శరీరము పరమేశ్వరుని యొక్క యష్టమూర్తి రూపమని ధ్యానింపనగును. 'ఇత్యాభాతి చరాచరాత్మకమ్' అను గ్రంథము వ్యాఖ్యాతము.

వా ర్తి క ము

సమనస్క మిదం యోగీ సేవమాన ఉపాసనమ్ ।
అష్టాంగయోగయుక్త స్స న్నమనస్కం స గచ్ఛతి ॥ ౨౦

### పీయూషపఙ్క్తిః

ఈవిధముగా, శరీరమునందే అష్టమూర్తిస్వరూపమును సంపాదించి, ధ్యానము చేయువానికి గలుగు ఫలము చెప్పబడుచున్నది.

సమనస్కుడు, అష్టమూర్తిలక్షణాత్మకము నయిన ఈ యుపాసనమును చేయువాడు, అష్టాంగయోగయుక్తుడు నయిన యోగనిష్ఠుడు ('మనసా ధ్యాతృత్వాత్ సమనస్క ఇమ మష్టమూర్తిలక్షణ ముపాసనం ధ్యానం సేవమానో ఽభ్యస్యన్ యోగీ యోగనిరతః'). అమనస్కుడును, అలింగమైన యీశ్వరపదమును పొందునని భావము ('సో ఽమనస్క మలింగ మీశ్వరం గచ్ఛతి, తత్పద మాప్నోతీత్యర్థః').

### వార్తికము

మనఃప్రసాద స్సన్తోషో మౌన మిన్ద్రియనిగ్రహః ।
దయాదాక్షిణ్య మాస్తిక్య మార్జవం మార్దవం క్షమా ॥ ౨౧
భావశుద్ధి రహింసా చ బ్రహ్మచర్యం స్మృతి ర్ధృతిః ।
ఇత్యేవమాదయోఽన్యే చ మనస్సాధ్యా యమా స్స్మృతాః ॥

### పీయూషపఙ్క్తిః

ఇపుడు, యోగము నొక్క యష్టాంగములు చెప్పబడుచున్నవి. అందు, మొదటిదైన యమము నొక్క లక్షణము వివరింపబడుచున్నది.

1. మనస్సునందు సత్త్వగుణాధిక్యము వలన కలుగు ప్రసన్నత. అనగా, లక్ష్యమునందు విక్షేపా

భావముతో నుండుట యని భావము ('మనస ఉద్రిక్తసత్త్వావస్థాపత్తిః ప్రసాదః ప్రసన్నతా, లక్ష్యే విక్షేపాభావేన అవస్థితి రితి యావత్').

2. సంతోషము ('యదృచ్ఛాలాభస స్తుష్టిః')
3. మౌనము ('వృథా వాగుత్సర్జనత్యాగః')
4. ఇంద్రియ నిగ్రహము (తద్వశీకరణమ్')
5. దయ ('భూతద్రోహాకరణమ్')
6. దాక్షిణ్యము ('వ్యవహారే దక్షతా, ఆగ్రహ రాహిత్య మిత్యేతత్')
7. ఆస్తిక్యము ('శాస్త్రాద్యుక్తవిషయే విశ్వాసః')
8. ఆర్జవము (ఋజుత్వం, అకుటిలత్వమ్)
9. మార్దవము ('మృదుత్వ మకఠినత్వమ్')
10. క్షమ ('క్రోధహేతుష్వపి క్రోధపరిత్యాగః')
11. భావశుద్ధి ('వచనోచ్చారణాదా మనశ్శుద్ధిః శుద్ధాంతఃకరణ మితి యావత్')
12. అహింస ('పరపీడావర్జనమ్')
13. బ్రహ్మచర్యము ('అష్టాంగమైథున త్యాగః')

"స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణమ్ ।
సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తి రేవ చ ।
ఏతన్మైథున మష్టాంగం ప్రవదన్తి హి పండితాః ॥"

ఏవంవిధమైన అష్టవిధ మైథునపరిత్యాగమునే పండితులు బ్రహ్మచర్యమని చెప్పుదురు.

14. స్మృతి ('జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుసన్ధానమ్')

15. ధృతి యనగా ధైర్యము ('ధైర్యం మనః ప్రాణేన్ద్రియాణా మవసాదప్రాప్తౌ ఉత్తంభనమ్') ఇతరములైన అమానిత్వ, అదంభిత్వ, అద్వేష్టృత్వాదులు మనస్సుచే సాధింపదగినవి; యోగ సాధనభూతములైన ధర్మములు యమము లని పండితులచే చెప్పబడినవి. మనోమాత్ర సాధ్యములు, నివృత్తిలక్షణ యోగాంగ విశేషములు యమము లని యమలక్షణము చెప్పబడిన దని తెలియనగును.

"యమాన్ పతత్యకుర్వాణో నియమాన్ కేవలాన్ భజన్" అను వచనము వలన మనస్సాధ్యమైన యమము నభ్యాసము చేయక, కేవల నియమాభ్యాసము చేయువాడు పతితు డగునని తెలియుచున్నది. కావున, యోగమునకు ప్రథమ సోపానమైన యమమును ముందుగ సాధన చేయుట యోగసాధకుని కర్తవ్య మని గ్రహింపనగును.

వార్తికము

**స్నానం శౌచం వ్రతు సత్యం జపో హోమశ్చ తర్పణమ్**
**తపోదానం తితిక్షా చ నమస్కారః ప్రదక్షిణమ్ ॥ 23**
**వ్రతోపవాసాద్యా శ్చాన్యే కాయికా స్స్మృతాః ।**

పీయూషవర్షిణీ

శరీరసాధ్య లక్షణములు, యోగవిశేషములు నయిన
ములు చెప్పబడుచున్నవి.

స్నాన, శౌచములు బాహ్యములని గ్రహింపవలయును.
, భావశుద్ధి యనునుదియందు చెప్పబడినది. క్రతువు
వ్రతపూజనమ్), సత్యము (యథార్థవచనమ్), జపము,
నము, తర్పణము, తపస్సు, దానము, తితిక్ష (ద్వంద్వ
సనమ్), ననుసంధానము, ప్రదక్షిణము, ఆయా కాలముల
ను ఉచితమైన వ్రత, ఉపవాసాదులు, యోగమునకు
ములు కాని యాహారవిహారాదులు శరీరసాధ్యములైన
మములని చెప్పబడును. ఇది ఉపలక్షణము. కాయ, వాక్
యములని యర్థము.

వార్తికము

స్వస్తికం గోముఖం పద్మం హంసాఖ్యం బ్రాహ్మ
మాసనమ్ ॥ ౨౪
నృసింహం గరుడం కూర్మం నాగాఖ్యం వైష్ణవాసనమ్।
రం మయూరం వజ్రాఖ్యం సిద్ధాఖ్యం రౌద్ర
మాసనమ్ ॥ ౨౫
యోన్యాసనం విదు శ్చార్తం శైవం పశ్చిమతానకమ్।

పీయూషవర్షిణీ

స్వస్తిక, గోముఖ, పద్మ, హంసాసనములు నాలుగును
బ్రహ్మదేవతాకములైన ఆసనములు. నృసింహ, గరుడ,

కూర్మ, నాగాసనములు విష్ణుదైవత్యములైన ఆసనములు. వీర, మయూర, వజ్ర, సిద్ధాసనములు రుద్రదేవతాకములు. యోన్యాసనము శక్తిదేవతాక మనియు, పశ్చిమతానక మను ఆసనము శివదేవతాక మనియు యోగిజనుల దర్శనము.

వార్తికము

**నిరాలంబనయోగస్య నిరాలంబన మాసనమ్ ॥ ౨౯**

**నిరాలంబతయా ధ్యానం నిరాలంబ స్సదాశివః ।**

పీయూషవర్షిణి

నిరాలంబనయోగమునకు నిరాలంబనమైన ఆసనము ప్రశస్తము ('నిరాలంబనం కరచరణాది సంస్థానవిశేష నియమాలంబన రహితమ్'). నిరాలంబయోగ మన నేమి? ఆలంబన రహితముగా ధ్యానము చేయుట నిరాలంబనయోగ మనబడును. నిరాలంబన స్వరూపుడు ఎవరు? అనిన సదాశివుడు, నిర్విశేషపరమాత్మ. అట్టి నిర్విశేష పరమాత్మ యందు మనస్సును ఏకాగ్ర మొనర్చుట నిరాలంబనయోగ మని భావము ('సదాశివో నిర్విశేషః పరమాత్మా తదాలంబనం తస్మిన్ మనస్సమాధానం నిరాలంబనయోగ ఇత్యర్థః'). స్వస్తికాది ఆసనలక్షణములను యోగశాస్త్ర గ్రంథముల వలన తెలియనగును.

వార్తికము

**రేచకః పూరకశ్చైవ కుంభకః ప్రాణసంయమః ॥ ౨౩**

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు ప్రాణాయామ స్వరూపమును వివరించుచున్నారు.

ప్రాణనిరోధ రూపమైన ప్రాణాయామము రేచక పూరక, కుంభకము లని మూడువిధములుగా నుండును.

వా ర్తి క ము

**ఇంద్రియాణాం సమస్తానాం విషయేభ్యో నివారణమ్ ।**
**ప్రత్యాహార ఇతి ప్రోక్తం ప్రత్యాహారార్థవేదిభిః ॥ ౨౮**

పీ యూ ష వ ర్షి ణీ

అష్టాంగయోగములలో నొకటైన ప్రత్యాహారము యొక్క లక్షణము చెప్పబడుచున్నది.

ప్రత్యాహారస్వరూపవేత్తలు, సకలేంద్రియములను విషయములనుండి నివర్తింపజేయుట ప్రత్యాహార మని చెప్పుదురు.

వా ర్తి క ము

**ఆధారే క్వాపి మనసః స్థాపనం ధారణోచ్యతే ।**

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు యోగాంగమైన ధారణాస్వరూపమును వివరించుచున్నారు.

ఆధారమునందు, అనగా, మణిపూరకాదిచక్రముల యందుగాని, శుభవిషయము, హృదయముచేనావిష్కృతము

నైన విష్ణు, శివాదిమూర్తులయందుగాని మనస్సును నిలుపుట 'ధారణ' యనబడును.

వార్తికము

బ్రహ్మవిష్ణుశివాదీనాం చిన్తా ధ్యానం ప్రచక్షతే ॥ ౨౯

పీయూషవర్షిణి

బ్రహ్మవిష్ణుశివాది మూర్తులయొక్క చింతనము, అనగా మనోవృత్తిధారాప్రవాహము 'ధ్యాన' మనబడును.

ప్రాణసహితముగా మనస్సును ఒక యోగస్థానమునందు స్థిరముగా నుంచుట ధారణయని, విష్ణ్వాది మూర్తివిశేషముల యందు మానసిక వృత్తిధార ధ్యాన మని తెలియనగును. ('ధారణా-ప్రాణేన సహ మనసః క్వాపి స్థిరీకరణమాత్రమ్, ధ్యానం తు - విషయవిశేషే విష్ణ్వాదౌ మనోవృత్తిధారా ప్రవాహ ఇతి భేదః').

వార్తికము

ధ్యానాదస్పన్దనం బుద్ధేః సమాధి రభిధీయతే ।
అమనస్క సమాధిస్తు సర్వచిన్తావివర్జితమ్ ॥ ౩౦

పీయూషవర్షిణి

యోగముయొక్క యెనిమిదవ యంగమైన సమాధి యొక్క స్వరూపమును వివరించుచున్నారు.

ధ్యానము వలన బుద్ధి స్థిరమగుట సమాధి యనబడును. ఇది సమనస్కసమాధి. సర్వచింతావర్జితమైనది అమనస్క సమాధి యనబడును.

ఈ సమనస్క ('సవికల్పక, సంప్రజ్ఞాత) సమాధియందు జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము అను త్రిపుటీలేశము ఉండును. ఇది నిర్వికల్పసమాధికి అంగభూతము. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ రూపములచే సాధ్య మగునది సవికల్పక సమాధి యని భావము. అమనస్క (నిర్వికల్ప) సమాధి, జ్ఞాతృజ్ఞేయాది వర్జితము, లయ, విక్షేపరహిత మగుట వలన, ప్రశాంతస్థితి యని భావము. ('అయం సవికల్పకః సమాధిః సమనస్కో జ్ఞాతృ జ్ఞేయ విభాగోల్లేఖ లేశ సహితో౽౦గ మిత్యర్థః. ఏతైరంగైః సాధ్యం నిర్వికల్పక సమాధిరూపం అంగినం, యోగమాహ- అమనస్క సమాధిస్త్వితి. సర్వచిన్తావివర్జితమ్. జ్ఞాతృజ్ఞేయ విభాగోల్లేఖః, తద్వివర్జితం లయవిక్షేపరహితతయా ప్రశాన్తావస్థ మిత్యర్థః').

వా ర్తి క ము

**చిత్తే నిశ్చలతాం యాతే ప్రాణో భవతి నిశ్చలః ।**
**చిత్తస్య నిశ్చలత్వాయ యోగం సధ్యాన మభ్యసేత్॥౩౦**

పీ యూ ష వ ర్షి ణి

చిత్తనిశ్చలత్వము యొక్క ఫలము చెప్పబడుచున్నది-

చిత్తము నిశ్చలము కాగా, ప్రాణము నిశ్చల మగును. చిత్తము యొక్క నిశ్చలత్వమునకై ధ్యానసహితమైన యోగ సాధన చేయవలయును. అనగా, ధ్యానముతో గూడిన సమాధిని అభ్యసింపవలయునని భావము.

చిత్తనిశ్చలత్వము ప్రాణనిశ్చలత్వమునకు హేతువు. అష్టాంగయోగసాధనము చిత్తనైశ్చల్యమునకు హేతువు. కావున, ప్రయత్నపూర్వకముగా అష్టాంగయోగసాధన చేయవలయును. ఆసాధనక్రమమును సూచించుటకై ధ్యానమాత్రము గ్రహింపబడినదని తెలియదగును.

### వార్తికము

**ఆకుంచన మపానస్య ప్రాణస్య చ నిరోధనమ్ ।**
**లంబికోపరి జిహ్వాయాః స్థాపనం యోగసాధనమ్ ॥ 32**

### పీయూషవర్షిణి

మరియొక యోగసాధనమును చెప్పుచున్నారు. అపానవాయువును పైకి లాగుట ('గుదద్వారస్య సంకోచనేన వాయో రూర్ధ్వస్రోతఃప్రవర్తనం ఆకుంచనమ్'). ప్రాణవాయువును కుంభకముతో నిరోధించుట ('కుంభకేన ప్రాణస్య శరీరాన్తర్నిరోధనమ్'), నాలుకను కొండనాలుకపై నుంచుట చిత్తవృత్తినిరోధనమునకు ఉత్కృష్టమైన సాధనము ('లంబికా-తాలుమూలే స్తనాకారో మాంసఖండః, తదుపరి జిహ్వాయాః స్థాపనం బలాన్నిరోధ ఇత్యేతత్, యోగస్య చిత్తవృత్తినిరోధలక్షణస్య సాధన ముత్కృష్టో హేతు రిత్యర్థః').

### వార్తికము

**చిత్తే నిశ్చలతాం యాతే ప్రాణే మధ్యపథం గతే ।**
**చిహ్నాన్యేతాని జాయన్తే పంచభూతజయాత్పృథక్ ॥ 33**

## పీ యూ ష వ ర్షి ణి

ఇపుడు, చిత్తమును, ప్రాణమును అష్టాంగయోగ సాధనచే వశ మొనర్చుకొనిన యోగియొక్క చిహ్నములను చెప్పుచున్నారు.

చిత్తము నిశ్చలస్థితిని పొందినపుడు, ప్రాణము సుషుమ్నా మార్గమును జేరినపుడు, పంచభూతజయము కలుగును. దానివలన, భిన్నభిన్నములైన యీ చిహ్నములు ఉదయించును.

పాదాది జానుపర్యంతము పృథ్వీస్థానము; జాన్వాది నాభిపర్యంతము ఉదకస్థానము; నాభి మొదలుకొని కంఠ పర్యంతము అగ్నిస్థానము; కంఠము మొదలుకొని భ్రూమధ్యము వఱకు వాయుస్థానము; భ్రూమధ్యమునుండి బ్రహ్మరంధ్రపర్యంతము ఆకాశస్థానము. ధారణాభ్యాస క్రమముచేత ఆ యా స్థానములయందు పంచభూతజయము వలన చెప్పబోవు చిహ్నములు యోగియందు గన్పట్టును.

### వా ర్తి క ము

**మల మూత్ర కఫాల్పత్వ మారోగ్యం లఘుతా తనోః ।**
**సుగన్ధ స్స్వర్ణవర్ణత్వం ప్రథమం యోగలక్షణమ్ ॥ ౩౮**

### పీ యూ ష వ ర్షి ణి

మల, మూత్ర, కఫములు తగ్గిపోవుట, ఆరోగ్యము శరీర లాఘవము, సుగంధము, బంగారుఛాయ మొట్టమొదటి యోగలక్షణము.

పృథివి యను ప్రథమ భూమికాజయము వలన కల యోగలక్షణము లివి యని భావము. ఈరీతిగనే, అనంతర భూమికాజయము లనియు తెలియనగును. శ్వేతాశ్వతరీయ మంత్రోపనిషత్తు "యుంజానః ప్రథమం మనః" యని యోగము నుద్దేశించి యిట్లు చెప్పుచున్నది.

"పృథ్వ్యప్యతేజోఽనిల ఖే సముత్థితే పంచాత్మకే
యోగగుణే ప్రవృత్తే। న తస్య రోగో న జరా న మృత్యుః
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్॥
లఘుత్వ మారోగ్య మలోలుపత్వం వర్ణప్రసాదం
స్వరసౌష్ఠవం చ। గన్ధ శ్శుభో మూత్రపురీష మల్పం
యోగప్రవృత్తిం ప్రథమాం వదన్తి॥"

(శ్వేతాశ్వ. ౨-౧౨-౧౩)

వార్తికము

కంటకాగ్రే ష్వసంగత్వం జలపంకే ష్వమజ్జనమ్ ।
క్షుత్తృడాది సహిష్ణుత్వం ద్వితీయం యోగలక్షణమ్ ॥ ౩౫

పీయూషవర్షిణీ

కంటకాగ్రములు గ్రుచ్చుకొనకుండుట, నీటిలోను, బురదలోను మునుగక తేలియుండుట, ఆకలిదప్పికలను సహించుట ద్వితీయ యోగలక్షణము. ఇవి జలతత్త్వ విజయ సూచకములైన లక్షణములు.

వా ర్తి క ము

బహ్వన్నపానభోక్తృత్వ మాతపాగ్నిసహిష్ణుతా ।
దర్శనం శ్రవణం దూరా త్తృతీయం యోగలక్షణమ్ ॥ ౩౬

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు అగ్నితత్త్వజయద్యోతకమైన మూడవ యోగ లక్షణము చెప్పబడుచున్నది.

అధిక భోజన, పానసామర్థ్యము, అతపాగ్నిని సహించుట, దూరదర్శనము, దూరశ్రవణము తృతీయ యోగలక్షణము.

వా ర్తి క ము

మండూకప్లవనం భూమౌ మర్కటప్లవనం ద్రుమే ।
ఆకాశగమనం చేతి చతుర్థం యోగలక్షణమ్ ॥ ౩౭

పీ యూ ష వ ర్షి ణీ

వాయుజయ లక్షణములు చెప్పబడుచున్నవి.

భూమిమీద కప్పవలె ఎగురుట, చెట్టుమీద కోతి వలె ఎగురుట, ఆకాశగమనము నాల్గవ యోగలక్షణము.

వా ర్తి క ము

జ్ఞానం త్రికాలవిషయ మైశ్వర్య మణిమాదికమ్ ।
అనన్త శక్తిమత్త్వం చ పంచమం యోగలక్షణమ్ ॥ ౩౮

పీయూషవర్షిణి

ఇపుడు, ఆకాశజయసూచక లక్షణములు చెప్పబడుచున్నవి.

భూత, భవిష్యత్, వర్తమానకాలములకు సంబంధించిన విషయజ్ఞానము, అణిమాది అష్టైశ్వర్యసిద్ధి, అపారమైన శక్తి కలిగియుండుట మైనవ యోగలక్షణము.

వార్తికము

**ప్రాణే సుషుమ్నాం సంప్రాప్తే నాదోఽస్త్రశ్యాయతేఽష్టధా**
**ఘంటా దుందుభి శంఖాబ్ధి వీణా వేణ్వాదితాళవత్ ॥ ३८**

పీయూషవర్షిణి

ఇంతవరకు పంచభూత, తత్త్వాసజయము వలన కలుగు లక్షణములు చెప్పబడినవి. ఇపుడు సుషుమ్నయందు ప్రాణనిరోధముచేత మనస్సు వశీకృతమైనపుడు కలుగు లక్షణములు చెప్పబడుచున్నవి.

సుషుమ్నానాడియందు ప్రాణము ప్రవేశించినపుడు, ఘంటా, దుందుభి (భేరీ) శంఖ, సముద్ర, వీణా, వేణు, మృదంగ, మంజీర నాదములవంటి నాదములు అష్టవిధములుగా శరీరములోపల వినబడును ("వేణ్వాదీత్యాది పదాత్ మృదంగాది గృహ్యతే. ఏతేషాం ధ్వనిసదృశా నాదాః శ్రుతి గోచరా భవన్తీత్యర్థః").

వార్తికము

**తనూనపాత్తటిత్తారా తారేశ తపనోపమమ్ ।**
**బ్రహ్మనాడీ గతే ప్రాణే బింబరూపం ప్రకాశతే ॥ ४०**

ఈవిధముగా సాధనాక్రమము వలన యోగలక్షణములు సిద్ధించగా, అనగా సుషుమ్నయందు ధారణా యోగము సిద్ధించగా, ప్రత్యగ్రూపుడైన పరమేశ్వరుడు ఆవిర్భవించునని చెప్పబడుచున్నది.

ప్రాణము బ్రహ్మనాడిని (సుషుమ్నను) జేరినపుడు అగ్ని, విద్యుత్తు, నక్షత్రములు, చంద్రుడు, సూర్యుడు మున్నగువారి వలె బింబరూపము (పరమేశ్వర చైతన్యము) భాసించును ('బింబరూపం పరమేశ్వరచైతన్యం క్రమేణ అగ్న్యాదిభాసవత్ అవభాసత ఇత్యర్థః').

వా ర్తి క ము

శ్వాసాశ్చరన్తి యావన్తో మనుష్యస్య దినం ప్రతి।
తావన్తి యోజనాన్యర్కః శ్వాసే శ్వాసే ప్రధావతి॥ ౪౧

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు ప్రణవాభివ్యక్తి ప్రకారము చెప్పబడుచున్నది.

ప్రతి దినము మానవుని శ్వాసలు ఎన్ని జరుగునో, అన్ని యోజనముల దూరము ప్రతి శ్వాసయందు సూర్యుడు పరుగిడుచుండు నని భావము. ఇచట సూర్యుడనగా ఆత్మయని యర్థము. ప్రతి శ్వాసయందు సర్వనాడులలో ఆత్మసంచార ముండునని కొందఱి మతము.

వా ర్తి క ము

ఏకవింశతిసాహస్రం షట్ఛతం శ్వాససంఖ్యయా।
సోఽహమిత్యుచ్చరత్యాత్మా ప్రత్యహం మంత్ర
మాయుషే॥ ౪౨

పీయూషవర్షిణి

మనుష్యుగా ప్రతి దినము చేయు శ్వాస సంఖ్యను చెప్పుచున్నారు.

ఆత్మ, ఇరువదియొక్క-వేల యాఱువందల శ్వాసలు చెప్పిన 'హంసః సోఽహం' అను మంత్రమును (అజపా గాయత్రిని) ఆయుర్వృద్ధి కొఱకు జపించును ('ఆసూర్యోదయాత్ సూర్యోదయపర్యన్తం అహోరాత్రం యావత్తావత్ షట్ఛతాధికైకవింశతి సహస్ర సంఖ్యం శ్వాసోచ్ఛ్వాస మాచరన్ 'హంసః సోఽహ' మితి మన్త్ర ముచ్చరతి స్వాభావత ఏవ').

వార్తికము

సకారం చ హకారం చ లోపయిత్వా ప్రయోజయేత్ ।
సన్ధిం వై పూర్వరూపాఖ్యం తతోఽసౌ ప్రణవో భవేత్ ॥

పీయూషవర్షిణి

'సోఽహం' మంత్రమునందలి సకార, హకారములు లోపించగా, పూర్వరూపసంధి చేసినప్పుడు, ప్రణవము (ఓమ్) అగును. అనగా 'ఓ, అం'లకు పూర్వరూపము వచ్చినప్పుడు, 'ఓ' యగును. దానికి బిందువు చేర్చగా, 'ఓమ్' అని ప్రణవ రూపము నిష్పన్న మగునని భావము. ('సకారే హకారే చ లుప్తే ఓకారః, అకారః, బిన్దుశ్చావశిష్యతే, తత్ర పూర్వరూపాఖ్యం సన్ధిం ప్రయోజయేత్, అకార మోకారాత్మ న్యేకీకుర్యాత్, బిన్దుం చోకారేణ యోజయే దిత్యర్థః').

వా ర్తి క ము

అకారశ్చాప్యుకారశ్చ మకారో బిన్దు నాదకౌ ॥
పంచాక్షరా ణ్యమూన్యాహుః ప్రణవస్థాని పండితాః ॥ ౪౪

పీ యూ ష వ ర్షి ణీ

ప్రణవచింతనమునకై ప్రణవ మను పేరు గల ఓంకారము నొక్క యవయవ (వర్ణ) విభజన చేయు చున్నారు.

అకార, ఉకార, మకారములు, మఱియు బిందు, నాదములు- ఈ పంచాక్షరములు ప్రణవము (ఓమ్) నందు గలవని ఆత్మవిద్యాకుశలురైనవారు చెప్పుదురు.

అ, ఉ లను కలపిన 'ఓ' యగును. 'ఓ' కారముపైన 'మ' కారమును చేర్చగా 'ఓమ్' రూపము నిష్పన్న మగును. ఈ 'మ' కారము (మ్) స్వరహీనము గాన, పరబిందువుతో కలుపబడెను. అపుడు 'ఓమ్' అను రూపము నిష్పన్న మగును. ఇది, ఘోషవర్ణమైన ప్రాణముతో ఏకీకృతము, మూలాధారమునుండి యుత్థితమైన నాదముచేత, ప్రాణ, ఉష్మ వర్ణములు సంచరించునట్టి నాడీగతమైన సుషిరము (రంధ్రము) నందు అభివ్యక్తమైన దానిచేత అభివ్యంజిత మగునని నాదావసానము చెప్పబడినది. ఈవిధముగా, ప్రణవస్థములైన ప్రణవశబ్దవాచ్య పిండస్థములైన యీ పంచాక్షరములు, అనగా అకార, ఉకార, మకార, బిందు, నాదములు ప్రణవావయవములని ఆత్మతత్త్వవిదులు చెప్పిరని భావము.

(అశ్చ ఉశ్చ ఓ, ఏతదుపరి మకారే యోజితే ఓమ్. అయం చ మకారః స్వరహీనత్వాత్ పరేణ బిన్దునా యోజ్యః తదా ఓమితి రూపం నిష్పద్యతే. ఏతచ్చ ఘోషవతా ప్రాణేన ఏకీకారేణ నాదేన మూలాధారా దుత్థితేన ప్రాణోష్మ సంచార నాడీగత సుషిరాభివ్యక్తేన అభివ్యజ్యత ఇతి నాదావసాన ఉచ్యతే. ఏవం ప్రణవస్థాని ప్రణవశబ్దవాచ్య పిండస్థానీయాని పంచాక్షరాణి, అకార ఉకారో మకారో బిందుశ్చేతి చత్వారి, నాదశ్చ తేషాం సామాన్యాత్మకః పంచమ మక్షరమ్, ఇత్యేవం పంచాక్షరాణ్యాహుః పండితాః ఆత్మ విద్యాసు కుశలా ఇత్యర్థః").

వా ర్తి క ము

బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చాపీశ్వరశ్చ సదాశివః ।
తేష్వక్షరేషు తిష్ఠన్తి షట్త్రింశత్తత్త్వసంయుతాః ॥ ౪౫

పీ యూ ష ప ర్షి ణి

ప్రణవమునందలి యైదు అక్షరములకు క్రమముగా తదధిష్ఠాన దైవతములను చెప్పుచున్నారు.

ముప్పది యాఱు తత్త్వములతో గూడిన బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు ఈ యక్షరములయందు అధిష్ఠానదేవతలుగా నుందురు.

షట్ త్రింశత్ తత్త్వములు ప్రణవాంతర్గతములే; ప్రణవము కంటె బాహ్యములు కావని స్ఫురింపజేయుచు ప్రణవము యొక్క పూర్ణాత్మత్వమును 'షట్ త్రింశం త్త త్త్వ

సంయుతాః' అను శబ్దముచే ధ్వనింపజేయుచున్నారు. వాచక శబ్దములచేత వాచ్యమంతయు గ్రస్తమై భాసించును ('సర్వం హి వాచ్యం వాచకైః గ్రస్త మవభాసతే'). సమస్త వాచక శబ్దములు ప్రణవాక్షరముచేత గ్రహింపబడును. ఏలన, ప్రణవము సర్వశబ్ద సామాన్యాత్మకముగా సర్వశబ్దముల యందు వ్యాపకమై యుండును.

"తద్యథా శంకునా సర్వాణి పర్ణాని సన్తృణ్ణాన్యేవ మోంకారేణ సర్వా వాక్ సన్తృణ్ణోంకార ఏవేదగ్ం సర్వమ్" (ఛాందో- ౨-౨౩-౪.)

"ఓమిత్యేతదక్షర మిదగ్ం సర్వమ్" (మాండూక్య. ౧-౩)

"సర్వం హ్యేతద్ బ్రహ్మ" (శ్వేతాశ్వ. ౬-౨౩)

అనుచు శ్రుతులు ఓంకారమునకు, బ్రహ్మకు అభేద ప్రతిపాదనము చేయుచున్నవి. కావున, ప్రణవము పూర్ణాద్వితీయ బ్రహ్మాత్మక మని స్పష్ట మగుటవలన, ప్రణవము ఆవిధముగ నుపాస్య మని భావము.

వా ర్తి క ము

**గురుప్రసాదా ల్లభతే యోగ మష్టాంగలక్షణమ్ ।**
**శివప్రసాదా ల్లభతే యోగసిద్ధిం చ శాశ్వతీమ్ ॥ ౪౬**

పీ యూ ష వ ర్షి ణీ

"యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥"

అను శ్రుతి నాశ్రయించి సర్వసిద్ధులు గురుదేవతోపాసనా ధీనము లని, తత్కర్తవ్యతను సూచించుచు చెప్పుచున్నారు.

గుర్వనుగ్రహమువలన అష్టాంగలక్షణమైన యోగము లభించును. అనగా, సమనస్కయోగము లభించునని భావము. శివానుగ్రహము వలన శాశ్వతమైన యోగసిద్ధి (అమనస్కయోగము) లభించు నని భావము. అనగా, ఆత్మతత్త్వావిర్భావము కలుగునని తాత్పర్యము ('యోగసిద్ధి రాత్మతత్త్వావిర్భావః').

వా ర్తి క ము

సచ్చిదానందరూపాయ బిన్దునాదాన్తరాత్మనే।
ఆదిమధ్యాన్తశూన్యాయ గురూణాం గురవే నమః॥ ౪౩

పీ యూ ష ప ఙ్క్తి కి

వ్యాఖ్యానాంతమునందు మంగళాచరణము చేయుచు, పూర్వప్రతిపాదిత ప్రణవార్థమును అభివ్యక్తము చేయుచున్నారు.

సచ్చిదానందరూపుడు, బిందునాదములయందు ఆత్మస్వరూపముతో నున్నవాడు, ఆదిమధ్యాంత రహితుడు, గురువులకు గురువు నయిన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

'సచ్చిదానంద రూపాయ' అని స్వరూపలక్షణము చెప్పబడినది. 'బిన్దునాదాంతరాత్మనే' యని ఉపలక్షణము

(తటస్థ లక్షణము) చెప్పబడినది. సచ్చిదానందములు అకార, ఉకార, మకారాత్మకములు; ప్రణవబ్రహ్మస్వరూపము నిత్యము, కూటస్థము; బిందునాదములు అనగా రూప నామములు ఆవిర్భావ తిరోభావధర్మములు కలవి ('సచ్చిదానన్దా అకారోకార మకారాత్మకాః ప్రణవబ్రహ్మ స్వరూపం నిత్యకూటస్థం చ బిన్దునాదా తు రూపనామనీ ఆవిర్భావ తిరోభావధర్మకౌ స్తః'). ఉత్పత్తి, స్థితి, లయములకు ఆధారభూతమైన వస్తువును ప్రతిపాదించుటవలన ప్రణవ బ్రహ్మయొక్క ఉపలక్షణము- తటస్థ లక్షణము. ('ఉత్పత్తి స్థితి లయాధారం వస్తు గమయత ఇతి ప్రణవబ్రహ్మోప లక్షణ మితి'). నామరూపాత్మక నాదబిందువుల యధిష్ఠానము నకు అన్యాశ్రయత్వమును పరిహరించుటకై 'ఆదిమధ్యాన్త శూన్యాయ' యని చెప్పబడినది. 'స పూర్వేషా మపి గురుః కాలేనానవచ్ఛేదాత్' అను వచనానుసారము శ్రీదక్షిణామూర్తి 'గురూణాం గురవే' యని సంకీర్తింపబడిరి. సాక్షాత్తు సదాశివ స్వరూపుడైన శ్రీదక్షిణామూర్తి సంసారోచ్ఛేద దక్షుడు.

"బహవో దక్షిణామూర్తి ప్రసాదేవ జన్తవః।
అనాయాసేన సంసారా ద్విముక్తాః పరమర్షయః॥"
(సూత సం. 3-౭-౨౯)

యనుచు సూతసంహితావచనము శ్రీదక్షిణామూర్తి మహిమాతిశయమును గానము చేసినది. తాదృశ

సమహిమోపేతుడైన శ్రీ దక్షిణామూర్తి పరమేశ్వరునకు నమస్కారము.

వార్తికము

**ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।
ప్రబన్ధే మానసోల్లాసే నవమోల్లాస సంగ్రహః ॥**

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
నవమోల్లాస సంగ్రహము
సంపూర్ణము.



సర్వాత్మత్వమితి స్ఫుటీకృత మిదం యస్మా దముష్మిం స్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననా ధ్యానాచ్చ సంకీర్తనాత్।
సర్వాత్మత్వ మహావిభూతిసహితం స్యా దీశ్వరత్వం స్వత
స్సిద్ధ్యే త్తత్పున రష్టధా పరిణతం చైశ్వర్యమవ్యాహతమ్॥౧౦

పీ యూ ష వ ర్షి ణి

ఇపుడు ఈ స్తోత్ర పాఠాదులయందు ప్రవర్తించునట్టి పురుషధౌరేయులకు తప్పక గలుగునట్టి భావి ఫలమును సంకీర్తించుచు స్తోత్రము నుపసంహారము చేయుచున్నారు.

పైన చెప్పిన రీతిగ, ఈ స్తోత్రమునందు "ఇదం సర్వం యదయ మాత్మా" (బృ. ౪-౫-౭) ఇత్యాది శ్రుతి ప్రసిద్ధమైన యీ సర్వాత్మత్వము, అనగా ప్రత్యగాత్మ స్వరూపము స్పష్టముగా నిరూపింపబడినది. ఆ కారణముచేత ఈ దక్షిణామూర్తి స్తోత్రమును శ్రవణము చేయుటవలనను, అనగా ఆచార్యునివలన యథాశాస్త్రీయముగా శ్రవణము చేయుటవలనను, వినిన యర్థమును యుక్తిపురఃసరముగా చింతన చేయుట వలనను, ధ్యానమువలనను, అనగా శ్రవణ మననములచేత నిర్ణీతమైన తత్త్వమును 'సోఽహం సర్వాత్మా పరమేశ్వరోఽస్మి' యని విజాతీయ ప్రత్యయ (జ్ఞాన) తిరస్కారము చేత, ఏకమైన సజాతీయ ప్రత్యయమును విషయముగా జేసికొనుట వలనను, సంకీర్తనము వలనను, త్రివిధ పరిచ్ఛేదశూన్యమైన సర్వాత్మత్వ మను మహా

విభూతిసహితమైన యీశ్వరత్వము, అనగా శ్రుతిప్రసిద్ధమైన సత్యజ్ఞానానందలక్షణ పరమేశ్వరత్వము స్వయముగనే సిద్ధించును. మఱియు, మాయాపరిణామరూపమైన అణిమాది అష్టైశ్వర్య సిద్ధియు నప్రతిహతముగ సిద్ధించును. "స ఏకధా భవతి త్రిధాభవతి" (ఛాం.౭-౨౬) "స యది పితృలోకకామో భవతి సంకల్పా దేవాస్య పితర స్సముపతిష్ఠన్తే" (ఛాం.౮-౨) ఇత్యాది శ్రుతులచే ప్రతిపాదింపబడిన సర్వసిద్ధులు లభించు నని భావము.



## శ్రీ సురేశ్వరాచార్య కృత

# మానసోల్లాసః

## దశమోల్లాసః

### అవతారిక

శ్రీ సురేశ్వరులు సాధననిరూపణానంతరము ఫల నిరూపణము చేయుటకై దశమ శ్లోకమునకు వార్తికము నారంభించు చున్నారు.

### వార్తికము

**పరిచ్ఛిన్న మహంభావం పరిత్యజ్యానుషంగికమ్ ।**
**పూర్ణాహంభావలాభోఽస్య ఫల ముచ్యతే ॥ ౧**

### పీయూషవర్షిణి

ఆనుషంగికమైన ('ఆనుషంగికం దేహాద్యభిమానానుషంగా దాగతమ్'), పరిచ్ఛిన్నమైన అహంభావమును (అహంతను) పరిత్యజించి, పూర్ణాహంతను పొందుట యీ స్తోత్రమునకు ఫలమని చెప్పబడును. పూర్ణాహంతాస్వరూప ప్రాప్తికై పరిచ్ఛిన్నమైన అహంభావమును పరిత్యజించి ప్రత్యగ్బ్రహ్మైక్య భావమును కలుగజేయుటయే యీ స్తోత్రము యొక్క పరమ తాత్పర్యము.

వార్తికము

పుత్ర పౌత్ర గృహ క్షేత్ర ధన ధాన్య సమృద్ధయః ॥
అర్వాచీనాశ్చ సిద్ధ్యన్తి స్వర్గ పాతాళ భూమిషు ॥ ౨

పీయూషవర్షిణి

ఇచట పద్యవ్యాంశ మిది—

ఈ స్తోత్రమువలన సమస్త అభిలషితార్థములు లభించును. అయినను, బుద్ధిమంతులైనవారు అత్యల్పమైన, నశ్వరమైన లాభసంపాదనకై యీ స్తోత్రమును వినియోగింపరాదు; మహాఫలమైన పరమేశ్వరపదప్రాప్తి కొఱకే వినియోగింపవలయును. స్తోత్రమహిమ చేతనే అనేకమైన ఆనుషంగిక ఫలములు ప్రాసంగికముగా లభించునని చెప్పబడుచున్నది.

స్వర్గ, పాతాళ, భూలోకాదులయందు అర్వాచీనములైన (అత్యల్పములైన) పుత్ర, పౌత్ర, గృహ, క్షేత్ర, ధన ధాన్యాది సమృద్ధులు గూడ, పారమార్థిక ఫలముతో బాటు ఈ స్తోత్రపఠనము వలన సిద్ధించును.

వార్తికము

పాఠే ప్రవర్తమానస్య శీతాదిపరిహారవత్ ।
ప్రాసంగికాశ్చ సిద్ధ్యన్తి స్తోత్రేణానేన సర్వదా ॥ 3

పీయూషవర్షిణి

ఈ స్తోత్రము వలన అసంకల్పితములైనను, అవాంతర ఫలములు లభించునని చెప్పబడుచున్నది.

పంట చేయువానికి ఖాద్యపదార్థము సిద్ధమగుటతో పాటు, చీకటి తొలగుట, శీతాపనయము (చలిపోవుట) యను ఫలములు కలుగు చందమున, ఈ స్తోత్రమువలన ప్రాసంగికము లైన ఫలములు గూడ సిద్ధించును.

వార్త్తికము

**ఐశ్వర్య మీశ్వరత్వం హి తస్య నాస్తి పృథక్ స్థితిః।**
**పురుషే ధావమానే హి ఛాయా త మనుధావతి॥ ४**

పీయూషవర్షిణి

సాధారణముగా తాత్పర్యము చెప్పి, స్తోత్రము నందలి 'స్యాదీశ్వరత్వమ్' అను వాక్యముచే చెప్పబడిన ఈశ్వరత్వమును వ్యాఖ్యానించుచున్నారు.

ఐశ్వర్యము ఈశ్వరస్వరూపము గాన, దానికంటె, భిన్న సత్త లేదు. మనుష్యుడు పరుగిడుచుండగా, నతని ఛాయయును నతని వెంట పరుగిడుచుండును. మనుష్యుని ఛాయ మనుష్యుని, విడనట్లు, ఐశ్వర్యము (ఈశ్వరస్వరూపము) ఈశ్వరుని కంటె వేఱుగా నుండదని భావము.

వార్త్తికము

**అనన్తశక్తి రైశ్వర్యం నిష్యన్దా శ్చాణిమాదయః।**
**స్వస్యేశ్వరత్వే సంసిద్ధే సిద్ధ్యన్తి స్వయమేవ హి॥ ౫**

పీయూషవర్షిణి

ఛాయవలె సదా వీడని యా యైశ్వర్యస్వరూప మేమి? యనెడి యాకాంక్ష కలుగగా, చెప్పబడుచున్నది.

ఐశ్వర్యము (ఈశ్వర స్వరూపము) అనంతశక్తి కాగా, అణిమాదిసిద్ధులు తన్నిష్యందములు. కావున యీశ్వరత్వము సిద్ధించినపుడు, స్వయముగనే (అప్రయత్నముగనే) ఆ యణిమాది సిద్ధులు సిద్ధించును.

వాచామగోచరము, అనతిశయము, సహజము నయిన సామర్థ్యము ఐశ్వర్య మనబడును ('వాచామగోచర మనతిశయం సహజం సామర్థ్యం తదైశ్వర్య మిత్యర్థః'.) అణిమాది సిద్ధులకు 'ఐశ్వర్య' మను ప్రసిద్ధి కలదు కదా! అట్టితఱి, అనంతశక్తియే యైశ్వర్య మని యిట్లు చెప్పనగును? అనిన, 'నిష్యన్దాశ్చాణిమాదయః' యని చెప్పబడినది. అనగా, అణిమాదిసిద్ధులు పరిచ్ఛిన్నము లగుటవలన, నితరులయందు తరతమభావముతో నుండుటవలన, నవి యీశ్వరశక్తి నిష్యందములు మాత్రమే (ఉదక బిందువులు మాత్రమే) యని భావము. "ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రా ముపజీవన్తి" (బృ. ఉ-3·3-౨) యను శ్రుతి పూర్వోక్తార్థ మునే ప్రతిపాదించుచున్నది. కావున, ఈశ్వరత్వప్రాప్తి కొఱకే వినియోగింప నగును గాని, అణిమాదిసిద్ధి సంపాదన నిమిత్తము వినియోగింపరాదు.

వార్తికము

**యదీయైశ్వర్యవిప్రుడ్భి ర్బ్రహ్మా విష్ణు శివాదయః ।**
**ఐశ్వర్యవన్తో భాసన్తే స ఏవాత్మా సదాశివః ॥ ౬**

## పీ యూ ష వ ర్షి ణి

బ్రహ్మాద్యైశ్వర్యము సైతము పారమైశ్వర బిందువు (లేశము) మాత్రమే యని చెప్పబడుచున్నది.

పరమేశ్వరుని యైశ్వర్యలేశముల చేతనే, బ్రహ్మ, విష్ణు, శివాదులు ఐశ్వర్యవంతులై భాసించుచున్నారు. ఆ సదాశివుడు ఆత్మయే యని తెలియవలయును.

బ్రహ్మాది ఐశ్వర్య భేదములు సదాశివ విభూతులు మాత్రమే. పూర్ణాహంతను పొందిన జ్ఞాని సాక్షాత్తు సదాశివుడే. కావున, సదాశివుడే యాత్మ యనియు, ఆత్మయే సదాశివుడనియు గ్రహింపనగును. ('సదాశివ ఏవాత్మా, ఆత్మైవ సదాశివ ఇత్యర్థః').

### వా ర్తి క ము

పుష్పమానయతా గన్ధో వినేచ్ఛా మనుభూయతే ।
పూర్ణాహంభావయుక్తేన పరిచ్ఛిన్నా విభూతయః ॥ ౩

### పీ యూ ష వ ర్షి ణి

బ్రహ్మాది ఐశ్వర్యము సైతము స్వభావ మహిమ చేతనే విద్వాంసుడు పొందునని దృష్టాంతపూర్వకముగా చెప్పబడుచున్నది.

సుగంధపూర్ణమైన పుష్పమును చేతబూని, తెచ్చువాడు అప్రయత్నముగనే పరిమళమును అనుభవించును. ఆరీతిగనే, పూర్ణాహంతాయుక్తుడైన (నిర్వికల్ప, అపరిచ్ఛిన్న ఆత్మ

భావనలు స్ఫురించిన) నిద్రాంశముగ పరిచ్ఛిన్నమైన విభాగములను సంకల్పరహితముగనే పొందును. కావున, ప్రత్యగాత్మయగు సదాశివరూపమునందే భావన చేయవలెను గాని, బ్రహ్మాదులయందు కాదని స్తోత్రఫల స్తుతి తాత్పర్యము ('తస్మాత్ప్రత్యగాత్మని సదాశివరూప ఏవ సంభావనం కార్యం న బ్రహ్మాదిష్వితి స్థితం స్తోత్రఫలస్తుతేః తాత్పర్యమ్').

వార్తికము

**అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా ।**
**ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం వశిత్వం చాష్టసిద్ధయః ॥ ౮**

పీయూషవర్షిణి

ఇప్పుడు, అణిమాది ఐశ్వర్యములను వేరు వేరుగా నిరూపించుచు 'అష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్' అను వాక్యమును వ్యాఖ్యానించుచున్నారు.

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము- ఇవి అణిమాది అష్టసిద్ధులు.

వార్తికము

**అత్యన్త మణుషు ప్రాణిష్వాత్మత్వేన ప్రవేశనమ్ ।**
**అణిమాసంజ్ఞ మైశ్వర్యం వ్యాప్తస్య పరమాత్మనః ॥ ౯**

పీయూషవర్షిణి

ఇపుడు 'అణిమ' యను పేరు గల ఐశ్వర్యమును వివరించుచున్నారు.

మిక్కిలి చిన్న ప్రాణులయందు (పుత్తికాది ప్రాణిషు-చెదపురుగులయందు) సర్వవ్యాపకుడైన పరమాత్మ ప్రవేశించుట 'అణిమ' యను పేరుతో నొప్పారునట్టి ఐశ్వర్యముని (సిద్ధి యని) చెప్పబడును.

వా ర్తి క ము

**బ్రహ్మాండాది శివాన్తాయాః షట్త్రింశ త్తత్త్వసంహతేః ।**
**బహిశ్చ వ్యాప్యవృత్తిత్వ మైశ్వర్యం మహిమాహ్వయమ్॥౧౦**

పీ యూ ష వ ర్షి ణీ

'మహిమ' యనునట్టి యైశ్వర్యమును వివరించు చున్నారు.

బ్రహ్మండము మొదలుకొని శివుని వఱకు (ఇచట, విరాట్ నందు అభివ్యక్తమైన ఆత్మ, శివుడని గ్రహింపనగును. "శివో విరాజ్యభివ్యభివ్యక్తః పురుషః") గల ముప్పది యాఱు తత్త్వముల సంఘాతమునకు బాహ్యముగ వ్యాపించియుండుట (వ్యాప్యవృత్తిత్వమ్) 'మహిమ' యను పేరు గల ఐశ్వర్యమని చెప్పబడును.

వా ర్తి క ము

**మహామేరుసమాంగస్య సముద్ధరణకర్మణి ।**
**లాఘవే తూలతుల్యత్వం లఘిమానం విదుర్బుధాః ॥ ౧౧**

పీ యూ ష వ ర్షి ణీ

ఇపుడు 'లఘిమ' యను నైశ్వర్యమును గుఱించి వివరించు చున్నారు.

మహామేరుపర్వతసమానమైన యవయవములు గల యోగిని పైకి లేవనెత్తినపుడు, లాఘవములో (తేలికగ నుండుటయందు) దూదిపింజవలె నుండుటను విద్వాంసులు 'లఘిమ' యని తెలియుదురు ('ఇచ్ఛయా౽తిస్థూలతా మాపన్న స్యాఙ్గైః సముద్ధరణే తూలతుల్యత్వం లఘిమేత్యర్థః').

వా ర్తి క ము

**పరమాణుసమాంగస్య సముద్ధరణ కర్మణి ।**
**గౌరవే మేరుతుల్యత్వం గరిమాణం విదుర్బుధాః ॥ ౧౨**

పీ యూ ష వ ర్షి ణి

'గరిమ' యను పేరుతో ప్రసిద్ధమైన ఐశ్వర్యస్వరూపమును వివరించుచున్నారు.

పరమాణు సమానమైన అతి సూక్ష్మావయవములు గల (కేవల శల్యావశిష్టుడై యున్న) యోగిని పైకి లేవనెత్తినపుడు భారమునందు మేరుపర్వతము వలె భారయుక్తుడై యుండుటను గరిమాసిద్ధి యని విబుధులు తెలిసికొందురు.

వా ర్తి క ము

**పాతాళవాసినః పుంసో బ్రహ్మలోకావలోకనమ్ ।**
**ప్రాప్తి ర్నామ మహైశ్వర్యం సుదుష్ప్రాప మయోగినామ్ ॥**

పీ యూ ష వ ర్షి ణి

'ప్రాప్తి' యను పేరు గల యైశ్వర్యమును వివరించుచున్నారు.

పాతాళలోకవాసి యగు యోగి, బ్రహ్మలోకమును దర్శించుట 'ప్రాప్తి' యను గొప్ప ఐశ్వర్యము. ఈ ఐశ్వర్య సిద్ధి అష్టాంగయోగసాధన లేనివారికి దుష్ప్రాపము; పొందుటకు వీలులేనిదని భావము.

వా ర్తి క ము

**ఆకాశగమనాదీనా మన్యాసాం సిద్ధిసంపదామ్ ।**
**స్వేచ్ఛామాత్రేణ సంసిద్ధిః ప్రాకామ్య మభిధీయతే ॥ ౧౪**

పీ యూ ష వ ర్షి ణీ

ఆకాశగమనాది యితర సిద్ధిసంపదలు సంకల్పమాత్రము చేతనే, అన్యనిరపేక్షముగా సిద్ధించుట 'ప్రాకామ్య' సంసిద్ధి యనబడును.

వా ర్తి క ము

**స్వశరీరప్రకాశేన సర్వార్థానాం ప్రకాశనమ్ ।**
**ప్రాకాశ్య మిద మైశ్వర్య మితి కేచిత్ప్రచక్షతే ॥ ౧౫**

పీ యూ ష వ ర్షి ణీ

కొందరు యోగులు ప్రాకామ్యమునకు బదులు 'ప్రాకాశ్య' మను సిద్ధిని చెప్పుదురు. ఇపుడు ప్రాకాశ్య సిద్ధిని వివరించుచున్నారు.

కొందఱు యోగులు స్వశరీరప్రకాశము (జ్ఞానము) చేత సర్వవిషయప్రకాశనము (జ్ఞానము) అను నైశ్వర్యమును 'ప్రాకాశ్య' సిద్ధి యని చెప్పుదురు. శరీరప్రకాశము (జ్ఞానము)

వలన సమస్త బ్రహ్మాండజ్ఞానము కలిగియుండుట యని భావము.

వార్తికము

స్వేచ్ఛామాత్రేణ లోకానాం సృష్టిస్థిత్యన్తకర్తృతా ।
సూర్యాదీనాం నియోక్తృత్వ మీశిత్వ మభిధీయతే ॥ ౧౬

పీయూషపఙ్క్తిః

ఇపుడు, ఈశిత్వసిద్ధిస్వరూపమును వివరించుచున్నారు.

స్వేచ్ఛామాత్రము చేత, అనగా ఉపాదానాది సాధన నిరపేక్షముగా లోకముల సృష్టి, స్థితి, లయకర్తృత్వము, సూర్య, చంద్రాదులను వారి వారి కార్యములయందు నియోగించుట 'ఈశిత్వ' మని చెప్పబడును.

'జగద్వ్యాపారవర్జితమ్' (బ్రహ్మసూత్ర. ౪-౪-౧౭) అను న్యాయముచేత విద్వాంసునకు లోకవిషయమున స్వాతంత్ర్యము నివారింపబడినది. అయినను, విశ్వామిత్రాది మహర్షులు బ్రహ్మాండమునందు ఉన్న వాపీ, కూప, తటాక, నగరీ, వన, గిరి, విహారాది స్థల సృష్ట్యాదులు చేసినట్లు యోగి యీశిత్వసిద్ధితో లోకసృష్ట్యాదులను చేయునని తెలియనగును. ('జగద్వ్యాపారవర్జిత మితి న్యాయేన యద్యపి విదుషో లోకవిషయే స్వాతంత్ర్యం వారితమ్, తథాఽపి విశ్వామిత్రాదివత్ బ్రహ్మాండస్థితావేవ వాపీ, కూప, తటాక, నగరీ, వన, గిరి, విహారస్థలసృష్ట్యాద్యభిప్రాయ మేతద్ద్రష్టవ్యమ్').

వా ర్తి క ము

సలోకపాలా స్సర్వేఽపి లోకా స్స్వవశవర్తినః ।
తదైశ్వర్యం వశిత్వాఖ్యం సులభం శివయోగినామ్ ॥ ౧౭

పీ యూ ష వ ర్షి ణీ

వశిత్వసిద్ధిని గుఱించి చెప్పుచున్నారు.

లోకపాలక సహితముగా సమస్తలోకములు తమ వశవర్తులై యుండుట 'వశిత్వ' మను పేరు గల ఐశ్వర్యము. ఈ వశిత్వసిద్ధి శివయోగులకు మాత్రమే సులభముగా సిద్ధించును; అన్యులకు దుర్లభము.

పాశుపతవ్రతదీక్షితులై సిద్ధిని పొందినవారు శివయోగి నామముతో వ్యవహరింపబడుదురు. వీరు పరమహంసలై యుందురు. ఈ పరమహంసలు చివఱకు శివయోగులై శివ స్వరూపు లగుదురని శివాగమసంప్రదాయము.

వా ర్తి క ము

యస్త్వేవం బ్రాహ్మణో వేత్తి తస్య దేవా వశే స్థితాః ।
పునః క్ష్మాపతి వ్యాఘ్ర వ్యాళ స్త్రీపురుషాదయః ॥ ౧౮

పీ యూ ష వ ర్షి ణీ

శివయోగులకు వశిత్వసిద్ధి సులభ మనుటయందు ప్రమాణభూతమైన శ్రుతి నుదాహరించుచు వివరించు చున్నారు.

ఈవిధముగా తెలిసికొనిన బ్రహ్మనిష్ఠునకు దేవత లందఱు వశులై యుందురు. ఇక, భూభర్త (రాజు), సింహము, సర్పము, స్త్రీపురుషుల విషయము వేఱుగ చెప్పనేల? భూతకోటి యంతయు నా బ్రహ్మవేత్తకు వశమగునని భావము. "యస్త్వేవం బ్రాహ్మణో విద్యాత్. తస్య దేవా అసన్వశే" యను తైత్తిరీయారణ్యక శ్రుతి (3-13) తాత్పర్యము ఇచట చెప్పబడినది.

వా ర్తి క ము

సర్వాత్మభావసామ్రాజ్య నిరస్తరితచేతసామ్ ।
పరిపక్వసమాధీనాం కిం కిం నామ న సిద్ధ్యతి ॥ ౧౯

పీ యూ ష వ ర్షి ణి

పూర్వము పేర్కొనిన అణిమాదిసిద్ధులు లభించుటయే కాక, సార్వాత్మ్యభావ మహిమాతిశయము వలన వాంఛితార్థము లన్నియు లభించునని చెప్పుచున్నారు.

సర్వాత్మభావ సామ్రాజ్యమునందు అవిచ్ఛిన్నమైన చిత్తవృత్తి గలవారు, పరిపక్వమనస్కులైన యోగులకు లభింపనిదేమి యుండును? అభిలషితములైన సమస్త పదార్థములు లభించునని భావము.

వా ర్తి క ము

స్తోత్రమేతత్ప్రతే ద్ధీమాన్ సర్వాత్మత్వం చ భావయేత్ ।
అర్వాచీనే స్పృహాం ముక్త్వా ఫలే స్వర్గాదిసంభవే ॥ ౨౦

## పీ యూ ష వ ర్షి ణి

ఈ దక్షిణామూర్తిస్తోత్రమునకు ఇంత ఫలాతిశయ మున్నను ఆనుషంగికములైన (గౌణములైన) ఫలములయందు చిత్తమును లగ్నము చేయరాదని యుపదేశించుచున్నారు.

స్వర్గాదిప్రాప్తి రూప క్షుద్ర ఫలములయందు ఇచ్ఛను వీడి, బుద్ధిమంతుడైన ఆత్మానాత్మవివేకము కలవాడు ఈ స్తోత్రమును పఠింపనగును. మఱియు, సార్వాత్మ్యమును భావన చేయనగును.

### వా ర్తి క ము

**స్వర్గాదిరాజ్యం మనుతే న హి పండితః ।**
**తదేవ తస్య సామ్రాజ్యం యత్తు స్వారాజ్య మాత్మని ॥ ౨౧**

### పీ యూ ష వ ర్షి ణీ

సర్వఫలములను పరిత్యజింపవలయు ననుటలో గల హేతువును చెప్పుచున్నారు.

ఆత్మవిదుడైన పండితుడు స్వర్గాదిరాజ్యమును సామ్రాజ్యమని భావింపడు. ఆత్మస్వారాజ్యమే యా జ్ఞానికి సామ్రాజ్యము. ఆత్మస్వారాజ్యము ముందు స్వర్గాదులు ఆత్మవేత్తదృష్టిలో హీనాతిహీనములని భావము.

### వా ర్తి క ము

**సర్వాత్మభావనావన్తం సేవన్తే సర్వసిద్ధయః ।**
**తస్మా దాత్మని సామ్రాజ్యం కుర్యా న్నియతమానసః ॥ ౨౨**

### పీయూషపత్త్రిక

ఆత్మవేత్త, స్వర్గాదిరాజ్యమును సామ్రాజ్యమని యోగి భావింపడని, చెప్పుచున్నారు.

సర్వసిద్ధులు సార్వాత్మ్యభావము గల బ్రహ్మవేత్తను సేవించుచుందురు. కావున, చిత్తైకాగ్ర్యము కలవాడు ప్రత్యగాత్మయందు పరమాత్మసామ్రాజ్యస్థాపనము చేసికొనుట యవశ్య కర్తవ్యము. సామ్రాజ్య మనగా, యోగి యొక్క యిచ్ఛాశక్తిస్ఫురణమే గాని [illegible]యును ('యోగిన ఇచ్ఛాస్ఫురణ మేవాత్ర సామ్రాజ్యపదేనోచ్యతే').

### వార్తికము

యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥ ౨౩

### పీయూషపత్త్రిక

శ్రీ దక్షిణామూర్తియందు, గురువునందు, ఆత్మయందు భక్తి గలవానికి మాత్రమే ఈ స్తోత్రమునందు అధికారము కలదనియు, ఇతరులకు లేదనియు చెప్పుచున్నారు.

ఏ ముముక్షువునకు స్వయంప్రకాశమానుడైన శ్రీ దక్షిణామూర్తియందు పరా (అహైతుకీ) భక్తి యుండునో,

## వార్తికము

ఇతి శ్రీదక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకే ।
ప్రబన్ధే మానసోల్లాసే దశమోల్లాస సంగ్రహః ॥

ఈ విధముగా శ్రీ దక్షిణామూర్తి స్తోత్రార్థ ప్రతిపాదకమైన
మానసోల్లాస మను పేరు గల ప్రబంధము నందలి
దశమోల్లాస సంగ్రహము
సంపూర్ణము.

"అద్వైతైక్యమతిప్రదాయిని విపది యా సంత్రాసవిధ్వంసినీ ।
వాదివ్యూహవిభేదనక్షమఘనే శక్తిః పరా గారుడీ ।
మోహధ్వాన్త నిమర్దినీ సుకృతినాం సద్ధర్మసంవర్ధనీ
సద్విద్యాజననీ సదా విజయతాం శాఙ్కరీ భారతీ ॥"

ఓం తత్ సత్.